# గణపతి

## 1, 2 భాగములు

కళాప్రపూర్ణ
చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే
రచింపఁబడినది.

పబ్లిషర్సు :
వెలగల వీరెడ్డి,
కాలచక్రం ప్రచురణలు.
నత్తారామేశ్వరం.
(వయా) పెనుమంట్ర, పశ్చిమ గోదావరి జిల్లా.

గౌరవ సంపాదకులు :
మహీధర జగన్మోహనరావు

1966 మార్చి ముద్రణ
అవంతీ ప్రెస్, రాజమండ్రి-2.
ప్రతులు:వేయి
వెల:6

# మనవి

1963 నవంబరులో మా ప్రథమ ప్రచురణ "సూక్తిముక్తావళి" తో ఆరంభించి 13 పుస్తకములను ప్రచురించితిమి. కీ.శే. కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారి గ్రంథములు 11 టిని వెలువరచి, ప్రస్తుతము 'గణపతి' పూర్తిగ్రంథము ప్రకటించుచున్నాము. ఇక 1966లో పంతులుగారి లఘుగ్రంథములు మరికొన్నిటినీ, జీవితచరిత్రలనూ వేయ దలపెట్టియున్నాము. చిలకమర్తి వారి గ్రంథములన్నీకూడ విశిష్టత గలట్టివే ఆంధ్రభాషకు, ఆంధ్రదేశమునకు అనన్యసేవ గావించిన ఈ మహనీయుని గ్రంథములు మంచి గ్లేజుకాగితముపై, తప్పులు లేకుండ, మంచిగెటప్ తో ప్రచురించి, తెలుగు దేశములోని గ్రంథాలయములకు వెలలేని భూషణగా యివ్వతలపెట్టిన మాకు గ్రంథాలయాధికారులందరూ తగుప్రోత్సాహ మీయగోరుచున్నాము. విద్యార్థిదశలోనే చిలకమర్తివారి రచనలను చదివినవారు ఉత్తమపౌరులుగా తయారగుదురని నిస్సందేహముగా చెప్పనగును.

అంతేగాదు. 1987లో శ్రీ చిలకమర్తివారి శతవార్షికోత్సవము రానున్నది. అప్పటికి శ్రీవారి గ్రంథములన్నీ వెలువర్చదలచితిమి. వారి గ్రంథములులేని గ్రంథాలయము అసమగ్రమనుట సాహసము గాదు గాన గ్రంథాలయాధికారులు, కార్యకర్తలు, విజ్ఞులు యీ గ్రంథము లన్నీ తెప్పించి, తమ పాఠకుల కందించుటయే పంతులుగారికి మన మొనర్చు గౌరవము కాదగును. విద్యాశాఖాధికారులు ముఖ్యంగా యీ విషయములో చేయదగిన దెంతైన గలదని మా మనవి.

'సూక్తిముక్తావళి' ప్రథమ ముద్రణపు ప్రతులు రెండేండ్లలోనే పూర్తిగా ఖర్చగుటచేత దానిని పునర్ముద్రించ దలపెట్టితిమి. ఆంధ్రపాఠక లోకము, పత్రికాప్రపంచము, పండితవర్యులుకూడ యీ గ్రంథము నెడ మంచి అభిప్రాయము నిచ్చియున్నారు. గతములోని 1250 శ్లోకములకు మరి 750 కూడ చేర్చి, గ్రంథమును మరింత శోభాయమానముగా రెండవ కూర్పులో తెచ్చుచున్నాము. ఇందులకై బహుపరిశ్రమ గావించి, యీ మార్పులు, చేర్పులు గావించిన శ్రీ మహీధర జగన్మోహనరావుగారికి కృతజ్ఞులము. మా గ్రంథమండలికి గౌరవసంపాదకులుగా ఉండి, వారు గావించుచున్న సహకారము అనన్యమైనది. ఒక్కమాటలో చెప్పాలంటే వారి సహకారమే మే మీ సేవలు గావించుటకు ముఖ్యకారణము అని చెప్పిన చాలును.

ఇక యీ నవలను గురించి నాలుగు మాటలు, ఆంధ్రదేశములో గోదావరీతీరస్థమైన కోనసీమ యీ నవలకు ప్రధానరంగము. కోనసీమ బ్రాహ్మణులు విద్యావిజ్ఞానములకు సుప్రసిదులు. కాని యీ గ్రంథములో వర్ణించబడిన గణపతివంశచరిత్ర ఏమాత్రమున్నూ ప్రతిష్టాకరమైనది కాదు. బ్రాహ్మణులలోని అతినికృష్టమైనవిగా దీనిలోని పాత్రలను మనము తీసికోవచ్చును. అట్టిపాత్రలను ప్రవేశపెట్టుటవల్ల గ్రంథకర్త సాధించదలచిన ఆశయమేమి? పాఠకుల మనస్సులలో నవలలోని పాత్రలపట్లనూ మెత్తంగా బ్రాహ్మణులమీదనూ అనాదరమును, ఏహ్యాభావమును కలిగించుటకా? లేక మరొక మహదాశయ మేమైన దీనివల్ల సాధించుటకా?

ఈ ప్రక్రియ తెలుగుభాషలో నూతనమనియే చెప్పదగును. పాశ్చాత్యనవలలో సుప్రసిద్ధమైన "డాన్ క్విక్జోట్" ద్వారా సాధించ దలచిన కవి సాంఘిక పునరుజ్జీవనమునే చిలకమర్తివారు దృష్టియందిడుకొని, గణపతిపాత్రను సృష్టించిరని తోచును. పాతసమాజములోని విలువలు,

యోగ్యతలు మారినప్పుడు కాలానుగుణ్యమైన నూతనమార్పులు సాధించిన వ్యక్తుల, సంఘముల సాంఘికోపయుక్తత నిలచునే గాని లేనిచో క్షీణత సర్వదా తప్పదని వ్యంగముద్వారా యీ నవల సూచించుచున్నదని విజ్ఞుల అభిప్రాయము. 'గణపతి' నవల చదివి, గణపతివలె హాస్యాస్పదులు కాకుండుటకు యత్నించుమనియే కవిగారి సందేశమని ఊహింపవచ్చును.

ఆంధ్రమహాజనులు మా కృషికి దోహద మొనర్పగోరుచు సెలవు దీసికొందును.

సత్తారామేశ్వరం

(వయా) పెనుమంట్ర

పశ్చిమ గోదావరి. ఇట్లు,

వెలగల వీర్రెడ్డి.

10-3-1966

మిత్రులు శ్రీ వెలగల వీర్రెడ్డిగారు దేశభక్తి, భాషానురక్తి గల వారు, 1962 లో తమకున్న భాషాసేవ గావించు ఉద్దేశ్య మున్నదనిన్నీ, అందులోనూ అభ్యుదయ భావవ్యాప్తి గావించుటకై గ్రంథమండలిని నడుపుటకు తమకు చేయూతనిమ్మనీ అడిగినప్పుడు వారితో మాకుగల చిర పరిచయంవల్లనే అందు కంగీకరించాను. కాని యీఉద్దేశ్యం యేడాది వరకు కార్యరూపం ధరించనేలేదు.

1963 లో వారు సాపించబోవు ప్రచురణ సంస్థకు గౌరవసంపాదకులుగా నన్నుండ మని కోరుటయేగాక నేను వ్రాతికేండ్లుగా సేకరిస్తూ వచ్చిన సూక్తులను ప్రచురణకై తమ గ్రంథమండలిలో ప్రథమ కుసుమముగా చేసెదమనిన్నీ, తమకు ఆ అవకాశము నిమ్మనీ కోరిరి. ఆ సూక్తిముక్తావళి గా వెలువడుటయు, సంవత్సరము న్నరలోపే ప్రతులైపోయి, పునర్ముద్రణ గావించుటయు జరిగినది.

దాని తరువాత కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు గారి గ్రంథములను వరుసగా ముద్రించ బూనికొని, అందముగా, నిర్దుష్టముగా ప్రచురించ నారంభించితిమి. గతమున ప్రచురించిన 11 పుస్తకములు గాక యిప్పుడీ సంవత్సరము 'గణపతి' 1, 2 భాగములను కలిపి ఒకే బైండు, లైబ్రరీ ఎడిషనుగా వెలువర్చితిమి. త్వరలోనే మరిన్ని కూడ వెలువడ గలవు.

భాషకు పుష్టిని కూర్చగల మహామహుల రచనలనే ప్రచురించ బూనుకొని యున్ని "కాలచక్రం ప్రచురణలు" ప్రజలయు, భాషాభిమానులయు సహాయ సహకారములు పొందగలదని ఆశించుచు సెలవు దీసి కొందును.

10-3-1966,

రాజమండ్రి

# విషయసూచిక

# 1 వ భాగము

## మొదటి ప్రకరణము

"శుక్లాంభరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం

ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే"

అని విఘ్నేశ్వర దేవతానీకమైన స్తుతిశ్లోక మొకటి కలదు. "తెల్లని వస్త్రములు ధరించువాఁడు, సర్వవ్యాపకుడు చంద్రునివలె ధవళమైనవాఁడు, నాలుగు భుజములుగలవాడు, ప్రసన్నమైన మొగముగలవాఁడు నగు విఘ్నేశ్వరుని సర్వ విఘ్న శాంతికొరకు ధ్యానించుచున్నాఁడ" నని యాశ్లోకమున కరము. సర్వతోముఖ పాండిత్యముగల యొకానొక బుద్ధిమంతుఁడు చమత్కారముగ నీశ్లోకము గాడిద నుద్దేశించి చెప్పఁబడిన దని విపరీతార్థము గల్పించి చెప్పెను. అది యెట్లనఁగా శుక్లాంబరధరం అనఁగా ధవళవస్త్రములు ధరించునది, చాకలివాఁ డుదికిన తెల్లనివస్త్రములు మోయునది గావున నీ శబ్దము గాడిదకే యర్థ మగుచున్నదని చెప్పెను. విష్ణుశబ్దమునకు సర్వవ్యాపకత్వ మర్థ మున్నది గదా. గాడిద యెక్కడ్ఁ చూచిన నక్కడే కనఁబడు చుండును. కావున నిక్కడ విష్ణుశబ్దమునకు గాడిదయే యర్థ మని వాక్రుచ్చెను. శశివర్ణ మనఁగా చంద్రునివలె ధవళమైనది, గాడిద తెల్లగా నుండును గావున నీ యర్థము నిర్వివాద మయ్యెను. చతుర్భుజ మనఁగా నాలుగు భుజములు గలది, గాడిదకు నాలుగు భుజము లుండుటవలనఁ జతుర్భుజశబ్దము సార్థక మనియెను. అవి భుజములు కావు; పాదము లని చదువరు లెవ్వరైనను సందియపడుదు రేమో, "నిరంకుశాః కవయః" యను నార్యోక్తి జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు. కవులు నిరంకుశులు, వారు పాదములు భుజములు చేయఁగలరు. భుజములు పాదములు చేయఁగలరు. ప్రసన్నవదన మనగా ప్రసన్నమైన ముఖము గలది. ప్రసన్నమైన మనస్సుతో చూచిన యెడల దాని మొగము ప్రసన్న మైయుండును. కావున నదియు నిర్వివాదమే. ఇటువంటి గాడిదను సర్వవిఘ్నోపశాంతి కొఱకు ధ్యానించుచున్నాఁడ నని యీ శ్లోకార్థమైనట్లు తన నిరుపమాన పాండిత్య ప్రకర్షము చేత నా విద్యాంసుఁడు విపరీతార్థము జెప్పి సమర్థించెను, గణపతి యనఁగా విఘ్నేశ్వరుఁడు; మహేశ్వరునియొద్ద పరమభక్తు లగు ప్రమథు లను దివ్యులు కొందరు గలరు. ఆ ప్రమథుల కే ప్రమథగణ మని పేరు. మహేశ్వరుఁడు నిర్హేతుక జాయమాన కటాక్షము చేతనో లేక నిరుద్యోగియైన తన కుమారుని నేదేని నొక యధికారమునం దుంచవలయునను నిచ్చ చేతనో, నాయకుఁడు లేనియెడల బ్రమథులు కట్టుతప్పి చెడిపోవుదు రను భయముచేతనో యా ప్రమథ గణమునకు వినాయకుని నాయకుని జేసెను, ఆ గణమునకధిపతి యగుటచేత వినాయకునకు గణపతి యను పేరు వచ్చెను. గణ పతి యనఁగా విఘ్నేశ్వరుఁ డగుటచేత విఘ్నేశ్వరు నుద్దేశించి చెప్పఁబడిన పూర్వోదాహృతశ్లోకముయెక్క విపరీతార్థము నీ గ్రంథ కథానాయకుఁడైన మా గణపతి కన్వయింపఁజేయ వలదని కోరుటకై యాశ్లోక ముదహరించితిని. ఆ గణపతి ప్రమథగణపతి గదా, మా గణపతి యే గణమున కధిపతి యని మీ రడుగవచ్చును. అది నేను చెప్పుట కష్టము. మీరే యూహించుకొనవచ్చును. తల్లిదండ్రు లితనికి గణపతి నామ మేల పెట్టిరో

నాకు తెలియదు, కాని గణపతి నామ లక్షణము లనెకము లితనియందు, కాని గణపతియందుండు లక్షణము లనేకము లీతనియందు గలవు. ఉండ్రములమీఁద నతని కెంత యిష్టము గలదో వర్ణించుటకు సపాదలక్షగ్రంథముగల మహాభారతము రచించిన వేదవ్యాసుడు దిగి రావలయును గాని సాధారణకవులు సామాన్య వచన గ్రంథ ప్రణేతలు పనికిరారని కంఠోక్తిగాఁ జెప్పగలను. అది మొదటి సామ్యలక్షణము. పానకము, వడపప్పు, కొబ్బరికాయలు మా గణపతికి కావలసినన్ని దొరకవు గాని దొరికినపక్షమున దక్కిన ప్రజ్ఞావిషయమున కాకపోయినను భోజనవిషయమున మహాగణాధిపతిని మా గణపతి యవలీలగ జయింపఁగలడు. ఇది రెండవ లక్షణము, మహాగణపతిది గుజ్జురూపమే యని శపథముఁ జేసి చెప్పగలను, ఇది మూడవ లక్షణము. ఆ విఘ్నేశ్వరుని దేనుఁగు మొగము, మా గణపతిది యేనుగు మొగమువంటి బుంగ మొగము, ఇది నాల్గవ లక్షణము. సామ్యములైన లక్షణములు గణపతుల కిద్దఱకు మూఁడు కలవు గాని మా గణపతి యా గణపతికంటె నెన్నో విషయములయందు ఘనుఁ డని చెప్పవచ్చును. బొజ్జ విషయములో మా గణపతి యగ్రతాంబూలామున కర్హుడని పండితు లెందరో సెలవిచ్చియున్నారు. లంబోదర శబ్దము విఘ్నేశ్వరునకు నేతిబీరకాయవలె సార్థకము గాదనియు మా గణపతియందు లంబోదరత్వము సార్థకమైన దనియు నా దృఢవిశ్వాసము; విఘ్నేశ్వరుఁ డేకదంతుడు, మా గణపతి ముప్పదిరెండు దంతములు గలవాఁడు. సాలీపులాక న్యాయముగఁ బైనుదహరింపబడిన కొన్ని యతిశయలక్షణములు జూపఁబడియె. మహాగణపతికి సమానములైన లక్షణములు కొన్ని, యతనికంటె నతిశయములైన లక్షణములు యుండుటచేత మొత్తముమీఁద గణపతి శబ్దము మా కథానాయకునియందు కొంతవఱకు సార్థకమైన దని మీకిప్పుడు నమ్మిక కలిగియుండవచ్చును. జగదారాధ్యుఁడైన వినాయకునియందు గల లక్షణంబులె తమ ప్రియపుత్రునియందుఁ గలుగునని నమ్మి తలిదండ్రులా నామ మతని కిచ్చి యుందురాయని మమ్మడుగ వచ్చును. దాని కుత్తరముఁ జెప్పుట మిక్కిలి కష్టము, తల్లిదండ్రులు బిడ్డల కొకప్పుడు తమ యిష్టదైవతముల పేర్లు పెట్టవచ్చును. ఆ దైవతముల యుందున్న గుణములు బిడ్డలయందు పొడగట్టవచ్చును. పొడగట్టక పోవచ్చును. రాముని నామము ధరించిన వారందఱు బితృవాక్య పరిపాలకులై యేకపత్నీ వ్రతస్థులైరా? తలిదండ్రులను నిరంతరము గొట్టి తిట్టునట్టి కష్టచరిత్రుఁడుగూడ రాముఁ డను పేరం బఱగుచుండును. అట్టి మూర్ఖుఁడు సాపాటు రాముడగును గాని గుణములలో దశరథరాముఁ డగునా? నోరుఁ విప్పునపు డెల్ల నబద్ధములే చెప్పువాఁడు హరిశ్చంద్రు డనుపేరఁ బరగవచ్చును. లక్ష్మీప్రసాదుఁడను నామధేయము గలవాఁడు నిరుపేద గావచ్చును. తలిదండ్రులు వెట్టెయ్య యని పేరు పెట్టుకొన్న బాలుడు మేధావంతుడై తన ప్రతిభాప్రభావముచేత జగంబును వెలయింపవచ్చును. తలిదండ్రు లొక యుద్దేశముతో బేరుపెట్టవచ్చును, కుమారుని యుత్తరచరిత్ర మా యుదేశమునకు వైరుధ్యమును జూపవచ్చును. గణపతి తలిదండ్రులు తమ కుమారున కిష్టదేవత పేరే పెట్టియుండవచ్చును, లేదా వినాయక చతుర్థినాఁ డతఁడు జన్మించి యుండుటచే నా నామము గలిగి యుండవచ్చును. కాదేని వారి వృద్ధ ప్రపితామహుఁడు యా పేరువాఁడై యుండనోపు. అదియును గానిపక్షమున బుట్టినప్పుడు బుల్లిబొజ్జ, బుంగమొగము, బుఱ్ఱముక్కు, గుజ్జురూపముఁ జూచి తమ భక్తికిఁ దమ తపః ప్రభావమునకు మెచ్చి యదితి కశ్యపుల గర్భమున శ్రీమన్నారాయుణుఁడు వామనరూపము ధరించి జన్మించినట్లు తమ్ము ధన్యులఁ జేయుటకు దమపేరు మహీతలమున వెలయించుటకుఁ దమ వంశము పావనముఁ జేయుటకు గణపతి తమ గర్భవాసమున జన్మించియుండునని నమ్మి

మాతాపితృ లానామమిచ్చి యుండవచ్చు. ఒక్కవిషయమున దక్క యితఁడన్నివిషయముల గణపతికిఁ దుల్యు డనవచ్చును. మహాగణపతి విద్యల కధిపతి, మన గణపతి కదొక్కటే కొఱత. ఇట్లు నుటచేత నితఁడు చదువు రానివాఁడని తలంపవద్దు. ఆ కొరత దీర్చుకొనుటకై యతఁ డుపాధ్యాయత్వముఁ జేసి కొందరు బాలుర బాగుచేసెను. తాను గ్రంథములు చదువుకొనుటకు విద్య రాదు. కాని యొకరికి చెప్పుట కతనియొద్ద నెంత విద్యయైన గలదు. కాని యెకరికి చెప్పుట కతనియొద్ద నెంత విద్యయైన గలదు. ఏవంగుణ విశిష్టుఁడైన గణపతియొక్క చరిత్రమునం దుపోద్ఘాతము వ్రాయఁబడినది. ఈ యుపోద్ఘాతము చదువగానె వాని చరిత్రము నామూలాగ్రముగ జదువవలయునని మీ మనస్సులు, వినవలయునని మీ చెవులు నువ్విళ్ళూరుచుండ వచ్చును. అందుచేత నామధేయ ప్రకరణమును విడిచి వంశరూపధేయాది ప్రకరణములయందు బ్రవేశింతము. గణపతి చరిత్రము మిక్కిలి గొప్పది. ఇది చదువరుల యదృష్టముచేత మాకు లభించినది. వాల్మీకి కిట్టి చరిత్ర దొరికిన పక్షమున రామాయణమును మాని యత డా కథయే వ్రాసి యుండును. వేదవ్యాసున కిట్టిది లభించిన పక్షమున కష్టసాధ్యములైన పదునెనిమి పురాణములను, మహాభారతమును రచియించుట మాని తన యశస్సు కల్పాంతస్థాయి యగునట్టు లా చరిత్రమునే రచియించి కృతార్థుఁడై యుండును. ఇంకఁ గాళిదాస భవభూతి ప్రముఖుల మాట చెప్పనేల! ఇటువంటి చిత్రకథ శ్రవణగోచరము గాకపోవుటచేతనే బాణుడు కాదంబరీ హర్షచరిత్రలను విధిలేక వ్రాసియుండును. మన పూర్వజన్మ పుణ్యముచేత లభించిన యీ యద్భుత చరిత్రమును గణపతి ప్రతిష్ఠకుఁ దగినట్లు రచియింపలేకపోయినను నేదోవిధముగ యథాశక్తి సహగమనమువలె రచియింపఁ దలచుకొంటిని.

# రెండవ ప్రకరణము

ఆహాహా! మన దేశమునందు జీవచరిత్రములు లేని లోప మిప్పుడు కనఁబడు చున్నది. చరిత్రరచనమునందు మన పూర్వులకు శ్రద్ధ యెంతమాత్రము లేకపోవుటచే నొక్కమహాపురుషుని చరిత్రయైన జదివెడు భాగ్యము మన కబ్బినది కాదు. రాజరాజనరేంద్ర ప్రముఖులగు మహారాజుల యొక్కయు నన్నయభట్టారక తిక్కనసోమయాజి ప్రముఖ మహాకవుల యొక్కయు చరిత్రములు చేకూరనందుకు మన మంత విచారించవలసిన పనిలేదు. కాని గణపతియొక్క చరిత్రము సంపూర్ణముగ లభియింపనందుకు మనము కడుంగడు విచారింపవలయును. ఆ విచారములోనే గుడ్డిలో మెల్ల యనునట్టు కొంత చరిత్రము మన కసంపూర్తిగనైన లభించినందుకు సంతోషింపవలయు; సంగ్రహముగనైన నీ చరిత్రము నాకెట్లు లభించినదో చెప్పెద వినుండు. ఒకనాఁడు నేనొక మిత్రునింటికి విందారగింపఁ బోతిని. ఆ మిత్రులయింట వివాహము జరుగుచుండెను. ఆ విందు నిమిత్తము మిత్రులనేకులు వచ్చియుండిరి. ఇప్పటివలె చీట్లు పంపి భోజనమునకు పిలిచెడు నాచార మప్పుడు లేదు. పెందలకడ భోజనము పెట్టు నాచారమంతకంటె లేదు. విస్తళ్ళు వేయునప్పటికి రెండుజాముల రాత్రి యయ్యెను. వడ్డించు నప్పటికి మఱినాలుగు గడియలు ప్రొద్దుపోయెను. భోజనము చేసి లేచునప్పటికి కొక్కురో కో యని కోఁడికూసెను. విస్తళ్లు వేయకమునుపు, విస్తళ్లముందుకి గూర్చుండిన తరువాతను, భోజనము సేయుచు నెడనెడ వంటకములు వచ్చులోపలను నేను నాలుగు కునుకులు కునికితిని. ఆ నిద్రలో నాకొక స్వప్నము వచ్చెను. ఆ స్వప్నములో విలక్షణమైన యొక విగ్రహము కనబడెను. కర్కోటకుఁడు కఱచిన తరువాత మారురూపము దాల్చిన నలుడా? యితఁడని యా విగ్రహమును జూచి నేను వితర్కించుకొంటిని. వామనరూపుఁడా యని మఱికొంతసే పనుకొంటిని. అప్పటికి నాకు దోచిన కొన్ని కారణములచేత నే ననుకొన్న రెండు రూపములు కావని నిశ్చయించుకొనియుంటి నని భావించి భయపడితిని. ఆ పురుషుడు నా భయము జూచి నవ్వి "భయపడకు, నేను నీకు హాని సేయుదలఁచి రాలే" దని మీఁద చేయివైచి తట్టి వెండియు నిట్లనియె. "అయ్యా! నేను గణపతిని; కాని పార్వతీపరమేశ్వరుల కుమారుఁడైన వినాయ కుఁడనుగాను, నా చరిత్రము మిక్కిలి రమణీయమైనది. ఇది మీ రాంధ్రభాషలో రచింపవలయునని నాకోరిక. నా చరిత్రము మిక్కిలి లోకాపకారము. ఇది మీరు తప్ప మఱి యెవ్వరు వ్రాయజాలరు. సాహిత్యవిద్యా చతుర్ముఖులైన విద్వాంసులు లోకమున ననేకులు కలరు. తర్కవ్యాకరణశాస్త్రపారంగతులగు పండితులుఁ బెక్కండ్రు కలరు. కాని వారిచేత నా చరిత్రము వ్రాయించుకొనవలయు నని నా కిష్టములేదు. వారు నా చరిత్ర వ్రాయఁదగరు. వారెంత సేపు భావాతీతములైన యుత్ప్రేక్షలతో నతిశయోక్తులతోఁ గాలక్షేపము సేయుదురు. వారిదృష్టికి వెన్నెలలు చందమామలు తామరపువ్వులు కలువపువ్వులు హంసలు చిలుకలు తోటలు కోటలు మేడలు మిద్దెలు మలయమారుతములు విరహతాపములు మకరంద ప్రవాహములు మొదలయినవే వచ్చును కాని నిగర్వమైన నా చరిత్రము వారికి నచ్చదు. అందుచేత గీర్వాణవిద్వాంసుల గీర్వాణముఁ జూచిన నాకు దయలేదు. ఇప్పుడు నా చరిత్రము మీకు చెప్పెదను. విని వ్రాయకపోయిన పక్షమున మీరు కాశీలో గోహత్య జేసి నట్లె. ప్రయాగలో బ్రహ్మహత్యసల్పినట్లే. కురుక్షేత్రములోఁ గుక్కను తిన్నట్లే. ఇంతకు మీరు వ్రాయని పక్షమున నేను

దయ్యమునై మిమ్మును మి వంశము వారిని బదునాలుగు తరములవరకు బట్టుకొని పికికొని తినియెదను; జాగ్రత. మీరు వ్రాసిన తరువాత నాచరిత్రము పఠియించిన వారికి పంచమహా పాతకము లడఁగును. పఠియింపని వారు చదపురుగులై పుట్టి మఱియొక జన్మమునఁ బుస్తకముఁ దిని వేయుదురు.

అని చెప్పి తన వృత్తాంతము సంగ్రహముగ నాకెఱిఁగించెను. నాలుగు కునికిపాటులలో నాలుగుపావులు చెప్పి సంగ్రహమైన యీ కథ ముగించి నీ కేమైన సందేహములున్న నడుగుమని మఱి మఱి యడిగెను. అడుగుటకు నేను ప్రయత్నములచేసి నోరు తెరవఁబోవుచుండ వడ్డన బ్రాహ్మణుఁడు నాచేతిమీఁద వేడిచారు పోసెను. నేను విస్తరి ముందరఁ గూర్చుండి చారెంతసేపటికి రాకపోవుటచే గోడకు జేరఁబడి దొన్నెలోఁ జేయిపెట్టుకొని కునుకుచు స్వప్నసుఖమనుభవించుచుండఁగా మోట బ్రాహ్మణుడు నా చేయిగాల్చెను. అందుచేత నాకు మెలకువ వచ్చెను. మరలమజ్జిగ వచ్చునప్పటికిఁ గొంతయాలస్యమైనది; కాని చేతి మంటచే నిద్ర పట్టినదికాదు. మరల నిద్రపట్టిన పక్షమున గణపతి నా కలలో మరలఁ గనఁబడి నా సందియములఁ దొలగించి యుండును. మఱియొకసారి యడుగుదమని తలంచితిని గాని నాటికి నేటికి మరల నతఁడు స్వప్నమునఁ గనబడలేదు. భోజనానంతరమున నేను నా గృహమంబున కరిగి మంచముపైఁ బండుకొంటిని. కాని నిద్రపట్టినదికాదు. భుజించిన వంటకములు త్రేన్పు రాఁదొఁడగెను. గణపతి చరిత్రము స్మృతిపథమున నిలువఁజొచ్చెను. అతని మూర్తి నాకన్నుల యెదుట నిలిచినట్లే యుండెను. ఇది నిజముగా స్వప్నమైయుండునా నామనోభ్రమయా యని నేను కొంతసేపు వితర్కించితిని. నిశ్చయముగ స్వప్నమే యని సిద్ధాంతము చేసితిని. కలలోని వృత్తాంతమును నమ్మి గణపతి చరిత్రమును నేను వ్రాయవలసి యుండునాయని నాలో నేనాలోచించుకొంటిని. వ్రాయుటయే సర్వోత్తమమని నిశ్చయించితిని. వ్రాయకపోయిన పక్షమున నతఁడు పిశాచమై పీడించునను భయమున నే నిది రచియింప సమకట్టలేదుసుడీ. ఎందుచేత నన, నేను దయ్యములు లేవని వాదించు వారలలో నొకఁడను. అట్లయిన నేల వ్రాసితినందురేమో; స్వప్నమం దొక పురుషుఁడు కనఁబడుటయుఁ దన చరిత్రము సంక్షేపముగఁ జెప్పుటయు నది వ్రాయమని కోరుటయు నది యెంతో చిత్రముగ నుండుటయు మొదటికారణము. ఆంధ్రభాషాభిమానము రెండవ కారణము. భారత భాగవత రామాయణాది పురాణములు విని విని చెవులు తడకలు కట్టినవారికి వినోద మేదైన గల్పింపవలయు నననది మూఁడవ కారణము. ఆంగ్లేయ భాషాభివృద్ధి యగుచున్న యీ దినములలో స్వప్నములలో మనుష్యులగపడుట గ్రంథములు వ్రాయమనుట చదువరు లనేకులు నమ్మకపోవచ్చును. నమ్మకపోయిన నా కేమిభయము. ఇది యబద్ధము కాదు గదా! మహాకవియగు తిక్కన సోమయాజికి నతని జనకుఁడగు కొమ్మనదండనాథుడును హరిహర నాథుఁడును స్వప్నమున సాక్షాత్కరించి మహాభారత రచనకుఁ బురికొల్పలేదా, కృష్ణదేవరాయల వారికి శ్రీకాకుళమున నాంధ్రనాయకస్వామి కలలో సాక్షాత్కరించి విష్ణుజిత్తీయ మను నామాంతరముగల యాముక్తమాల్యదను రచియించి తన కంకిత మిమ్మని కోర లేదా, తెలుగుకవులు కావ్యరచనకు ముందు కలలు గనుట సాంప్రదాయ సిదము. కాబట్టి మా కలలో నంత వైపరీత్య మేమియులేదు. కలమాటఁ గట్టిపెట్టి కథాకథనములోకి దిగియెద.

ఆంధ్రకవులు తమకావ్య ముఖములకు మనోహర తిలకంబులై యుండునట్లు గృతిపతుల యొక్కయుఁ గథానాయకులయొక్కయు వంశముల వర్ణించుట సుప్రసిద్ధము. నేనును నాలుగు పద్యము లల్లనేర్చి కొందఱిచేతఁ గాక పోయిన గొందఱిచేత నైనను కవి ననిపించుకొనుటచేఁ గవుల సాంప్రదాయ మనుసరింపవలయు నను దృఢసంకల్పము నాకుఁ గలిగినది. అందుచేత నీ కథానాయకుని వంశము ముం దభివర్ణించెద. మా కథానాయకు నది లోకము తగులఁ బెట్టు సూర్యవంశముగాదు. దొంగపోటుగ రాత్రులు తిరుగు మచ్చగల చంద్రవంశము గాదు. ఈ వంశమునకు బ్రహ్మదేవుఁడే మూలపురుషుఁ డగుటచేత నిది పవిత్రమైన బ్రహ్మవంశము. ఆ బ్రహ్మవంశములో నొక్కశాఖ పప్పుభొట్లవా రనుపేరఁ బరగజొచ్చె. ఇది కేవల పౌరుషనామము కాని యూరక పెట్టుకొన్న పేరుకాదు. మా గణపతి పూర్వులలో నొకఁడు పందెమువేసి మూఁడు తవ్వల కందిపప్పు వండించుకొని తానొక్కఁడే భక్షించి మూడు వరహాలు బహుమానముగ గ్రహించుటం జేసి నాటనుండియు వాని యింటిపేరు పప్పుభొట్లవా రని ప్రసిద్ధికెక్కెను. గోదావరీ తీరమున మందపల్లి యను నొక గ్రామము కలదు. ఇక్కడ శనైశ్చరుఁడు శివప్రతిష్టఁ జేసెను. శనికి మందుఁడను నామాంతరము గలదు. కావున శని ప్రతిష్టితుఁడై యీశ్వరుఁ డచ్చోట మందేశ్వరుఁడని వ్యవహరింపఁబడుచుండును. ఈ మందేశ్వరస్వామివలన నీ గ్రామము గోదావరీమండలముననే గాక కృష్ణా విశాఖపుర మండలములయందుఁ గూడ మిగులు ప్రసిద్ధికెక్కెను. శనిపీడ గలవారీగ్రామమునకుఁ బోయి బ్రాహ్మణులకు వలసిన తిల దానములిచ్చి తైలాభిషేకము మందేశ్వరునకుఁ జేసిన పక్షమున శనిదోషంబు శమియించు నని సలపురాణజ్ఞులు చెప్పుదురు. ఆస్తికబుద్ధిగల మనవా రందఱు శనిగ్రహావిష్ణులైనప్పుడచ్చటకుఁ బోయి కొంత ధనము వ్యయముజేసి శనివిముక్తులగుచుందురు. అనేక మహర్షులు దేవతలు బ్రహ్మస్థలముల యందు మహేశ్వరప్రతిష్టలు చేసిరి. కాని శనైశ్చరుడు ప్రతిష్టఁజేయుట తరచుగ వినము. సేతువుదగ్గర రఘురాముని చేతఁ, బ్రతిష్టింపఁబడిన మహేశ్వరుఁడు, రాజమహేంద్రవరమున మార్కండేయుని చేతఁ బ్రతిష్టింపబడిన మహేశ్వరుడు, మఱియు నగస్త్యాది మహర్షులచేతఁ బ్రతిష్టింపబడిన మహేశ్వరుడు శనైశ్చరుని చేత నేల బ్రతిష్టింపఁబడె నని నాకు వలెనే మీకును సంశయము దోపకపోదు. మృత్యుంజయుడైన సదాశివునకు గూడ శనిగానివలన భయము జనించి యుండుననియు నతఁడు తన్ను బ్రతిష్టింపఁ గోరినపుడు భయపడి వలదనఁజాలక యియ్యకొనియెననియు నాకుం దోచుచున్నది. అంతకన్న శంకరుడు శనైశ్చరప్రతిష్ట నంగీకరించుటకు మఱియొక కారణ మగపడదు. ఆ మందపల్లియె మన కథానాయకుని పూర్వుల నివాసస్థానము. ఆ గ్రామమున మన గణపతి యిల్లిదియని యుద్దేశించి చెప్పుటకు వీలులేదు. అతని సంతతివా రుండిన పక్షమున మాపెద్దల స్థల మిదియని యిల్లిది యని చెప్పుకొందురు. పప్పుభొట్లవారి వంశము బ్రహ్మచర్య దీక్షితుఁడై జీవనము వెళ్ళబుచ్చిన మన గణపతితో సమాప్తమైనందున గణపతి కక్క సెల్లెండ్రైనను లేమి ధౌహిత్రుఁడుగూడ లేకపోవుటచేతను పప్పుభొట్ల వంశస్థులకు పరంపరగా నివాసమైన నివేశనస్థలమునిర్దేశించుట కవకాశము లేకపోయినది. అట్లు నిర్దేశింపఁగలిగిన పక్షమున మందపల్లి వెళ్ళిన దీర్ఘవాసు లందఱు మందేశ్వర స్వామివారి యాలయము జొచ్చి తరించినట్లే గణపతివారి గృహముకూడ ప్రవేశించి చూచి తరించుచుందురు గదా. ఆ యదృష్ట మాంధ్రదేశమునకు లేదు. గతించినవారికి విచారించిన ఫలమేమి? ఆ గ్రామమందున్న పాడు దిబ్బలలో నేదో యొక దిబ్బ పూర్వము గణపతి యిల్లయి యుండవచ్చును. కాదేని నేడు సకలసంపదలు కలిగి కలకలలాడుచున్న యిండ్లలో

నొకటి మన కథానాయకునిదై యుండవచ్చును. గణపతికిఁ బూర్వు లెడు పురుషాంతరములవారు మందపల్లిలో నివసించిరి. అంతకుముందు వారి పూర్వుల నివాసస్థానము నక్కపల్లి. ఈ గ్రామము తూర్పునాడున నున్నది. నక్కపల్లినుండి గణపతి పూర్వులు మందపల్లికి వచ్చుటకు గొప్ప కారణము గలదు. గణపతి కెనిమిదవ పూర్వపురుషుఁడు నక్కపల్లిలోఁ గాపురము చేయుచుండ యొకానొక దినమున భార్యమీఁద మిక్కిలి కోపగించిన వాడై కోపమాపుకొనలేక జందెములు త్రెంపివేసి చెరువు గట్టుననున్న రావిచెట్టు కడకుఁ బోయి ముండనము జేయించుకొని సన్యసించెను. సన్యాస మిప్పించుట కెవరైన గురువు కావలయునని శాస్త్రములో నున్నది గదా! కోపమే పరమగురువై యీతనికి సన్యాస మిప్పించుటచేత నీతని సన్యాస మశాస్త్రీయమని వైరాగ్య భావముచేత సంప్రాప్తమైనది కాదని గ్రామ మందలి బ్రాహ్మణులా యపూర్వ స్వాములవారిని వెలివేసి భిక్షలు చేయుట మానిరి. ఒకరు భిక్షలు చేసెడిదేమి? నాయిల్లే మఠము. నాభార్యయే నాకు శిష్యురాలు. నా బిడ్డలేముఖ్యశిష్యులని యా ధూర్తస్వామి కడుపుమంట కాగలేక మూఁడవనాఁడె స్వగృహంబున కరిగి భార్యను బ్రతిమాలి యొడంబఱచి సన్యాసమునకు సన్యాసమిప్పించి కోమటి పేరి శెట్టి దగ్గర జందెములు వెలకుఁగొని మెడలోవేసికొని రెండు మాసములలోఁ బిల్లజుట్టుఁ బెంచికొని మరల గృహస్థుఁడయ్యెను. ఊరివా రందఱుఁ గట్టుగట్టి ఆ కుటుంబమున కంతకు నాంక్షజేసి బాధించుటచే నక్కడ బాధపడలేక కుటుంబసహితముగా బహు గ్రామములు తిరిగి తిరిగి యెట్టకేలకు మందపల్లి జేరెను.

# మూడవ ప్రకరణము

గణపతి పూర్వులకు స్థిరాస్తి కొంత కలదు. కాని యది లోకులందఱకుఁ గల స్థిరాస్తి కాదు. లోకములో స్థిరాస్తి యనగా భూములు మాన్యములు మొదలగునవి. పప్పుభొట్ల వారికిఁగల భూములు రుద్రభూములు, మాన్యములు సామాన్యములు. ఇంక గృహవిషయము విచారించితిమా యెప్పు డెక్కడ నివాసముగ నున్న నదియె వారి గృహము. అది మొదట వారి గృహము కాకపోయినను గ్రమక్రమముగఁ జిరకాల నివాసము చేత నది వారిదెయగుచు వచ్చెను. గృహయజమానులు వచ్చి వీరిని లేచి పొమ్మన్న పక్షమున వీరెప్పుడు లేచువారు కారు. బలవంతముగ వారిని బంపివేయుట మనుష్య మాత్రునకు సాధ్యము కాదు. అందుచేత మందపల్లిలో వారున్న యిల్లు భుజబలముచేత సంపాదింపఁ బడిన దని చెప్పవచ్చును. గణపతి పూర్వులు లోక కుటుంబులు. వారి గ్రామమంతయు వారి స్వగృహముగానే వారి చేత భావింపఁబడుచుండును. ఎవరిపొలముగట్టుమీఁద మామిడిచెట్టున్నను కొబ్బరిచెట్టున్నను దాని కాయలు పప్పుభొట్ల వారివె. ఎవరిదొడ్లలో మంచిపాదులు పెట్టుకొన్నను వాని కాయలు పప్పుభొట్లవారివె. వారు చండశాసను లగుటచేత నిది యేమనుటకు వీలులేదు. ఇన్నిమాట లెందుకు? గణపతి పూర్వులు పురుష వృషభులు. అచ్చుబోసి విడచిన యాబోతులు సకల క్షేత్రములలో నెట్లు స్వేచ్ఛావిహారము సలుప వచ్చునో, పప్పుభొట్ల వారుగూడ నట్లె సకలగృహారామ క్షేత్రములలో విహారము చేయవచ్చును. కాని ప్రజల కాఁబోతులమీద మిక్కిలి భక్తియుండుటచే నవి తమచేలు మేయుట యిష్టము. పప్పుభొట్లవారియెడ భయము గలుగుటచే వారు తమసొత్తు హరించుట మనసులో నిష్టము లేకపోయినను భుజబలమున, వాగ్బలమున వారిని గెలువలేక మందపల్లి నివాసులూరకుండ వలసినవారైరి. మొత్తముమీద మందపల్లి గ్రామవాసులు భయభక్తులు గలవారని ప్రతిష్ట సంపాదించిరి. వారికి స్థిరాస్థి కొంత కలదని యీ ప్రకర ణారంభమున నుదాహరింపఁ బడినది. అది పితృపితామహార్జితమైన యాస్థి. అది దొంగ లపహరించుటకు వీలులేనిది. కావలసినంత శరీరపుష్టి చేయునట్టిది. ఎన్నితరములనుండి యనుభవించినను విఱుగు తఱుగు లేనిదగుటచే నక్షయము. అక్షయమనుటచేతను ముచ్చ లపహరించుటకు వీలులేని దగుటచేతను శరీరపుష్టి చేయునదనుటచేతను భర్తృహరియొక్క వెట్టిమాటలు చదువుకొన్న వారు కొందఱు "హర్తకుఁగాదుగోచర" మను పద్యము జ్ఞప్తికిఁ దెచ్చుకొని యా స్థిరాస్థి విద్యయేమో యనుకొని భ్రమపడుదురుకాఁబోలు, అట్టి భ్రమలో బడవద్దు. పప్పుభొట్ల వారి పితృపితామహులు సంపాదించినది విద్యాధనము కాదు. అది వేదోక్తమైనది. అందుచేత శ్లాఘాపాత్ర మైనది. "బ్రాహ్మణస్య ధనం భిక్ష" మని మీ రెప్పుడును వినలేదా? శాస్త్రములు శిష్టాచారమును ననుసరించి వీలగు నంత వఱకు నడచుటయే వారికిఁ బరమధర్మ మగుటచే నితర బ్రాహ్మణుల వలె మ్లేచ్ఛభాషలు నేర్చికొని యుద్యోగములు సేయుట, కాఁపు వృత్తియగు వ్యవసాయము జేయుట మొదలగు నశాస్త్రీయ వ్యాపారములయందు వారు దిగక యక్షయపాత్రమునే వారు నమ్ముకొనిరి. భూములు సంపాదించిన పక్షమున నవి కొడుకులో మనుమలో యన్యాక్రాంతమును జేయ వచ్చును. ధనమార్జించిన పక్షమున నదియుఁ బుత్రపౌత్రులు పాడుచేయవచ్చును. లేదా చోరగ్రస్తము కావచ్చును. అక్షయపాత్ర పైవిధముగ నన్యాక్రాంతము చేయుటకు వీలులేనిదని చిరకాలము దీర్ఘాలోచనముఁ జేసిన మూలపురుషుఁడెవ్వఁడో తన వంశమువారికి స్థిరమై యుండునట్టి వృత్తినేర్పరచవలయునని

యావృత్తి స్వీకరించెను. నాగలి పెట్టి నెల దున్నకుండ విత్తనములు చల్లకుండ వాన కురిసినది లె దన్న బెంగ లేకుండ మిడతలదండు మొదలగునవి వచ్చి పడునన్న విషాదములేకుండా నిద్రలేనట్లు రాత్రులు కాపు గాయకుండఁ బెట్టుబడి యక్కరలేకుండ దంపుకొన వలసిన యవసరము లేకుండ గాదులలోఁ బోసి కష్టపడి నిలువఁ జేసికొన వలసిన యగత్యము లేకుండ వారి కుటుంబమునకే దినమునకుఁ గావలసిన బియ్యు మాదినమున నక్షయపాత్ర ప్రసాదించుచుండెను. వేదశాస్త్రసమ్మతమైన యట్టివృత్తి నవలంబించి వారెన్నో తరములు సుఖజీవనముచేసిరి. గణపతి పూర్వులలో నతని పితృపితామహుల చరిత్రము దక్క దక్కినవారి చరిత్రములు లభించినవి కావు. అతని పితామహుని పేరు పాపయ్య, పప్పుభొట్లవారు వైదికు లగుటచేత సాంగవేదా ధ్యయనము వారి కవశ్య కర్తవ్యమయినను వారు యజుస్సా మాథర్వణ వేదమును విడిచి ఋగ్వేదమునం దెనిమిదవ యష్ఠమును విడిచి తొమ్మిదవ యష్ఠమును మాత్రము విడువక ప్రాణపదముగ నెంచుకొని పారాయణముఁ జేయుచు వచ్చిరి. ఆ యష్ఠములో మన పాపయ్యకుఁగల ప్రజ్ఞ యసాధారణము. పదము క్రమము జట చెప్పఁగలడని చెప్పనే యక్కఱలేదు. ఆ యష్ఠములో నతడు ఘనాపాఠీ యని బిరుదుపొందెను. ఆరంభించినాఁడంటే గుక్క తిరగకుండ నోరు తడబడకుండ గొంతెండి పోకుండ గంటలకొలది కాలము పారాయణము జేయఁగలడు. అందఱుఁ జదివిన వేదమే పాడినదేపాడరా యన్నట్లు తాను జదివిన పక్షమున నందు గౌరవములేదని పప్పుభొట్ల వారీ యష్ఠమును ప్రత్యేకముగ వల్లించిరి. వంశ క్రమాగతమైన విద్యయగుటచేతను విశేషించి బుద్ధిజాతి మిక్కిలి గొప్పదగుట చేతను పాపయ్య కొన్ని కొన్ని క్రొత్త పనసలు కనిపెట్టి పూర్వులందరికంటె గొప్పవాఁడనిపించుకొనెను. పాపయ్యకు దక్కిన వేదాధ్యయనమన్నఁ దలనొప్పి. స్వాధ్యాయ మతని చెవిని బడినప్పుడు "ఈ బ్రాహ్మణులు చెవి గోసిన మేకల వలె యఱచు చున్నారు. వీళ్ళ గొంతులు కోయ" యని విసుఁగుకొనుచుండును. సామగాన మతని చెవిని బడినప్పుడు "వీళ్ళపాట తగులఁబెట్ట, ఏడిచినట్లె యున్నదిరా" అని తిట్టుచుండును. అతని వేదమున కొక్కటే స్వరము. కాని యిన్ని స్వరములు లేవు. అందుచేత నతనికిఁ దక్కిన స్వరములు సామము, నసహ్యములు, బ్రాహ్మణు లందరు యజన యాజనాధ్యయనాధ్యాపక ప్రతిగ్రహ షట్కర్మ నిరతులైనను నియోగులు మొదలగువారు యజ్ఞము చేయుటయె గాని చేయించుట మానిరి. వేదాధ్యయన మాచరించుటయె గాని యధ్యాపకత్వము మానిరి. దాన మిచ్చుటయె కాని పుచ్చుకొనుట మానుకొనిరి. వైదికు లీ షట్కర్మలు గూడదని శంక దెచ్చుకొని షట్కర్మలలోఁ గొన్ని కర్మలు దాముకూడ విడిచి కొన్నిటిని మాత్రమే గ్రహించెను. ఎన్నివిడిచి యెన్నిగ్రహించె నని మీ రడుగవచ్చును. అయిదింటిని విడిచి యాఱవది యగు దాన ప్రతిగ్రహము మాత్రము గ్రహించెను. ఆఱింటిలో మూఁడు కర్మలను విడిచిమూడింటిని స్వీకరించుటకు నియోగులకెంత యధికారముకలదొ ఐదింటిని విడిచి యొక్కటి స్వీకరించుటకు మా పాపయ్యకు నంత యధికారమె కలదు. ఇట్లనుటచేతఁ దక్కిన పంచకర్మల నత డెన్నఁ డాచరింపలేదని మీ రనఁగూడదు. అతఁడు కొన్ని దానము లప్పుడప్పుడు చేయుచువచ్చెను. అందుముఖ్యమైనవి రెండు కలవు. పితృదేవతలకు పిండప్రదాన మొకటి. తన మిత్రుల కప్పుడప్పుడు డిచ్చు పొగచుట్టలదానము రెండవది. యజ్ఞములు చేయలేదని లోకమున నతనికి నిష్కారణముగ నప్రతిష్ట సంభవించినది. కాని నిష్పక్షపాతముగ నతనిచరిత్ర వ్రాయుదుమేని నతఁ డొక యజ్ఞముఁజేసినాఁడని వ్రాయక తప్పదు. ఆయజ్ఞము నిమిత్తమతఁ డెవ్వరిని బాధింపలేదు. పందిళ్ళు పాకలు వేయలేదు. విశ్వప్రయత్నములు చేయలేదు. యధావిధిగ నతఁడె

రెండవ కంటెవాఁ డెఱుఁగకుండ జెసెను. అది యెట్లు చెసెనందురొవినుడు: ఆతఁడిరువదియేండ్లు వయస్సుగలవాడై నప్పుడు తల్లి రాత్రిరొట్టె కాల్చుకొనవలయునని మినుపపప్పుచేటలోఁబోసి వాకిటిలో నెండఁబెట్టుకొనెను. ఒక మేఁక యెక్కడనుండియో వచ్చి యాపప్పు దినుచుండెను. చత్వారముచేతఁ తల్లికది కనంబడలేదు. పాపయ్య వీధిలోనుండి వచ్చి యదిచూచి మేఁకను గొట్టుటకు మంచికట్ట దొరకకపోవుటచే సత్తువకొలఁది నొక్కతన్నుఁ దన్నెను. ఆ మేఁక పదిగజముల దూరమునఁబడి యొక్క యఱపఱచి వెంటనె చచ్చెను. ఆ వార్తవిని మేఁక యజమానుఁడగు గొల్లవాఁడు తన చుట్టములగుంపుతో వచ్చి యింటిమీఁదబడి మేఁకకు జరిగినంతపని పాపయ్యకు చేయవలయు నని సంకల్పించెను. కాని నలువురు జేరి మేఁకకు నాలుగు రూపాయలు వెలగట్టి చెరిసగము జేయుదుమని తునితగవుజేసి పాపయ్యచేత రెండు రూపాయలు వానికిప్పించి పంపిరి. యజ్ఞములోగూడ మేఁకలను జంపుటయె ప్రధానముగనుక పాపయ్యకు యజ్ఞఫలము చేకూరినదని చెప్పవచ్చును. లోకుల నందఱుఁ బీడించి ధనము సంపాదించి పందిళ్ళు పాకలు వేయించి యన్నము దినకుండ మలమలమాడి కుమ్మరులచేత, మేఁకలను జంపించి కుండలములు వేసి కొన్నవానికి యజ్ఞఫలము దక్కి పాపయ్యకు దక్కకపోవునా? బ్రహ్మయు ఋత్విక్కులు నుద్గాతయు హోతయు నధ్వర్యుడు మొదలగువారక్కఱలేకుండ మంత్రములతో పనిలేకుండనతఁడు గాంధర్వవివాహమువలె యట్టహాసము చేయక రహస్యముగ యజ్ఞము చేయుటచే లోకులతనిని హీనునిగఁ జూచుచున్నారు. తక్కువ వర్ణమువారైన కుమ్మరుల చేత ముక్కు చెవులుమూసి బాధపెట్టి చంపించుటకంటె స్వచ్ఛమైన బ్రాహ్మణుఁడు స్వయముగఁ జంపుటవలన మేఁకకు సద్యోమోక్షముసంప్రాప్తమైయుండునని యొక్కఁడైన నాలోచింపడుగదా. లోకములో న్యాయములేదు. ప్రస్తుతము లోకులేమనుకొన్నను పాపయ్యకు భవిష్యత్కాలమునైన రావలసిన కీర్తి రాకపోదు. ‘విద్యావిత్తకరీ’ యని యొక లోకోక్తిగలదు. పాపయ్య నేర్చుకొన్న తొమ్మిదవ యర్థముగూడ నొకానొక విద్యలోఁ చేరినదే కావునదానివలన నతఁడుధనసంపాదనమప్పుడప్పుడు చేయుచుండెను. పచ్చని తోరణము గట్టుకొని యెవరు వివాహము చేసుకొన్నను పాపయ్య నాఁడొక యవధాని బిరుదమో దీక్షితబిరుదమో సోమయాజి బిరుదమో వహించి యచ్చోటికిఁబోయి సంస్కారులతోఁబాటు తన్నుఁగూడ సత్కరింపవలసినదని కోరుచుండును. అట్లు వారు సత్కరింపనిచోఁ జిన్ననాటనుండియు ముష్టిజీవనమున కలవడి యుండుటచేత ముష్టియుద్ధము ప్రారంభించి పురోహితులను గన్యాప్రదాతను వధూవరులను తద్బంధుగణమును దన నవమార్థముతోఁ గొంతవరకు దీవించి తోరణములు తెంపి పెండ్లి పందిరి యుద్ధభూమిగ మార్చి తన పంతము నెగ్గించుకొని సంభావన దండిగ లంకించుకొని వచ్చును. అందుచేత నతనికి బండబూతుల పాపయ్య యనియు, పిడిగుద్దుల పాపయ్య యనియు రెండు పౌరుషనామములు కలిగినవి. అధికారుల యిండ్లచుట్టుఁ దిరిగి వారి సేవకుల నాశ్రయించి పండ్లు పంచదార చిలుకలు మొదలగు సూడిద లంపి యధికారుల యనుగ్రహమునకుఁ బాత్రులై కొందరీ కలియుగమున బిరుదుల కనర్హు లయ్యు సంపాదించుచుందురు, పాపయ్య సంపాదించిన బిరుదము లట్టివికావు. బిరుదుల నిమిత్త మఁత డొకరి నెన్నఁడాశ్రయింపలేదు. అతని కంఠశక్తియు భుజశక్తియు నతనికి బిరుదులు సంపాదించిపెట్టినవి. కాని యధికారుల కటాక్ష వీక్షణముచేతఁ ప్రసాదింపఁబడినవి కావు. పాపయ్యకుఁ దొమ్మిదవయర్థము నేర్పిన గురు వెవ్వరైయుందురని మీకు సందియము తోఁచవచ్చును. అతనికి గురువే లేడు. గురుకుల వాసము

లెకయె శుశ్రూషాపిడ లెకయె యెందఱు బహువిద్యలలొ నధికప్రౌఢులైరని మనము వినుచుండుట లేదు. తన విద్యావిషయమున మన పాపయ్యయు నట్టి పట్టికలో జేరఁదగినవాఁడెసుఁడీ. ఇట్లనిన మీరు నమ్మక నవ్వ మొదలు పెట్టెదరు. వాల్మీకి ఛందో వ్యాకరణాది లక్షణ జ్ఞానము గురుబోధలేకయే సముపార్జించె నన్న మీ రహహా యని నవ్వి యానందింతురు. భాగవత ప్రణేత యగు పోతరాజు సహజ పాండిత్యము గలవాఁడని చెప్పినంత మాత్రముననె విశ్వసింతురు. సహజ పాండిత్య మొకరిసొమ్మా? ఈ విద్య యావిద్య యనకుండ సకలవిద్యలలో వారి వారి పూర్వజన్మవశముననో యదృష్టవశముననో సహజ పాండిత్య ముదయించుచుండును. కాఁబట్టి పక్షపాతము మాని పాపయ్యకు గూడ విద్యలో నట్టి ప్రతిభా విశేషము గలదని నమ్ముఁడు. అతని పుణ్యమేమో కాని పాపయ్యకు బాల్యము నుండియు నద్వైతసిద్ధి సహజముగానె గలిగినది. ఎంతెంతో శ్రమపడి యెంద రెందరో గురువులకు శుశ్రూషఁ జేసి శంకరభాష్య సమేతముగ దశోపనిషత్తులు భగవద్గీతయు బ్రహ్మసూత్రములు వల్లించిన మహానుభావులకె స్థిరమైనయద్వైతభావము సార్థక మందైనఁ గలుగుట మిక్కిలి కష్టము. అట్టియెడ నూనూగుమీసాలు మొలకలెత్తక మునుపె యుపనయనమైన గాక మునుపె గోగణము విడిచి యంగవస్త్రమును గట్టక మునుపె మాటలైనను సరిగరాకమునుపె స్వవస్తు పరవస్తు భేదజ్ఞానము నశించి పరవస్తువు లన్నియుఁ దన వస్తువులే యని నద్వైతభావము గలుగుట యెంత గొప్పమాట! అది యెంతవానికి లభియించును! పూర్వయుగములలో నట్టిబుద్ధి యనేకుల కుదయించి యుండవచ్చును, కాని కలియుగములో నది మందపల్లి నివాసుడగు పప్పుభొట్ల పాపయ్యకే సిద్ధించినది, నాణెములు కాని చెంబులు కాని వెండిగిన్నెలు కాని వస్త్రములు కాని తినియెడు పదార్థములు కాని యతని కంటఁబడెనా యెప్పుడో యవి యతనిచేత బడినవే. నీ వీ వస్తువు దీసితివా యని యెవరైన నడిగిన పక్షమున నతఁడు స్పష్టముగ లేదని చెప్పుచుండును. లేదనుటలో నతఁ డబద్ధమాడెనని యెవ్వరు దలంపఁ గూడదు. "గజం మిధ్య పలాయనం మిధ్య" యన్నట్లు వస్తువులేదు. దొంగతనము లేదని యభిప్రాయమై యుండవచ్చును. లోకులు కాకులవంటివారు కదా! పాపము ! పాపయ్య లేమిచేతనో యద్వైతభావము చేతనో హస్తచాపల్యము చేతనో చిరతరాభ్యాసము చేతనో హస్తలాఘవముఁ జూపు నభిలాష చేతనో గ్రామములలో నున్న కొన్ని యిండ్లలో జొరబడి కొన్ని వస్తువులను గ్రహించినాఁడనుకొనుఁడు. గ్రామవాసులు తమ పుట్టియంతయు మునిగిపోయినట్లు పెద్దగోలచేసి యతని నల్లరిపెట్ట దొడఁగిరి. పరుల వస్తు వేమిటి మన వస్తు వేమిటను భావము పాపయ్య కున్నట్లు వస్తువులు మన యింట నుండిననేమి పాపయ్య యింట నుండిన నేమి యను భావము గ్రామవాసులలో నొక్కరికైన లేకపోయెగదా! అందుచేత వీరు పాపయ్యతో బోల్పఁ దగరు. అట్టి యద్వితీయ భావ మతని కుండుటచేతనే పాపయ్య చరిత్ర మక్షరరూపముగ నాంధ్రదేశమున ప్రచార మగుచున్నది. అట్టిభావము శూన్య మగుటచేతనే మందపల్లి గ్రామవాసులలో ఘనులగు తర్కవ్యాకరణ జ్యోతిశ్శాస్త్ర పండితులున్నను వారి చరిత్రములు లిఖింపఁ బడుచున్నవా? గ్రామస్తులు చేసిన యల్లరి వలన వివాహయోగ్య వయస్కుఁడైన పాపయ్యకుఁ బిల్ల నిచ్చుట కెవ్వరు రారైరి. తన కుమారునకు వివాహము కాలేదని విచారించి విచారించి తల్లి కాలధర్మము నొందెను. ఆధీనము తప్పిన యాడుపడుచులు గాని మఱి యే యాడుదిక్కుగాని లేకపోవుటచే నతఁ డప్పు డప్పుడు వంట జేసికొనవలసి వచ్చెను. బ్రాహ్మణార్థముల వలన నతఁడు పొట్టబోసికొనఁ గలఁడు. కాని యందు మూఁడు నాలుగు చిక్కులు సంభవించినవి. మున్నూట యఱువది దినములు భోక్తయై

యుండుటకు గ్రామమున మూడువందల యఱువది శ్రాద్ధములు లేవు. ఆ కాలమున మందపల్లిలోనున్న బ్రాహ్మణ గృహములే నలుబది యేఁబది, ఇంటికి రెండాబ్దికములకన్న నెక్కువగా నుండవు. అదియును గాక ప్రతివారు పాపయ్యనే పిలువరుద కదా? పిలువఁ దలంచుకొన్నవారు గూడ నితఁడు కలహప్రియుఁడని యెంచి పిలుచుట మానిరి. వస్త్రమీయ లేదనియొ దక్షిణ స్వల్పముగా నిచ్చినారనియొ నతఁడు గృహ యజమానితోఁ దరుచుగాఁ దగవులాడుచుండును. ఇతఁడు కంఠమెత్తి కేక లారంభించెనా భూదేవతలెగాక శ్రాద్ధమునకు వచ్చిన విశ్వదేవతలు పితృదేవతలు గూడ గడగడ వణఁకి పారిపోవుదురని గ్రామస్థుల యభిప్రాయము. అది యటుండ నిమంత్రితుఁడై పాపయ్య శ్రాద్ధ భోజనముఁ జేసి వెళ్ళునపుడు గృహయజమానుల కన్నుబ్రామి యేదో వీలు చూచుకొని గిన్నెయొ పంచ పాత్రయె పట్టుకొని పోవును. శ్రాద్ధభోక్తల కుదకుంభదానముఁ చేయవలయుననని శాస్త్రమందుండినను సాధారణముగ నట్లెవ్వరుఁ జేయలేకపోవుటచే పితృకర్మలు చేయువారి కుదకుంభ దాన ఫలముం గల్పింపవలయునని పాపయ్య యేవో పాత్రలు పట్టుకొని పోవుచుండు నని పౌరబ్రాహ్మణులు తెలిసికొనలేక యతనిని భోక్తగఁ బిలుచుట మానుకొనిరి. పిలువకబోవుట కిదియె ప్రధాన కారణమని చెప్పవచ్చును. ఉపకారణము గూడ మరియొక టున్నది. అది చెప్పకపోవుట దోషము కావునఁ జెప్పఁబడుచున్నది. పాపయ్య గంభీరకాయుఁడు. ఆకారమునకు దగిన యాకలి. యాకలికి దగిన భోజన సౌష్టవము నతనియందుఁ గలవు. అగ్నిహోత్రమునందు సర్వము హుతమైనట్లె యతని జఠరాగ్నియం దేది వేసినను వెంటనే హుతమైపోవును. అదృష్టవశమున నట్టి గాఢ జీర్ణశక్తి యతనికిఁ గలిగినందుకు సంతసింపక గ్రామవాసులలోఁ కొందఱు విరోధముచేత గొంద ఱసూయచేతను "ప్రతి మనుష్యునకు గర్భమందే జీర్ణకోశముండును; గాని పాపయ్యకు జీర్ణకోశము శరీర మంతట గల" దని పరిహాసాస్పదముగఁ బలుకజొచ్చిరి: కొందఱు దయ్యపుతిండియనిరి. అభాగ్యుల కాకలియెక్కువయని మఱికొంద రనిరి. చాటుచాటుననె గాని యతని యెదుటఁ బడి యెవ్వ రెట్టి మాట లనలేదుసుఁడీ. అతఁడు భోక్తగా వెళ్ళిన గృహమున శ్రాద్ధమునకు ముఖ్యమని పనసకాయ కూర వండిన పక్షమున వండిన కూరంతయు బాపయ్యయె భక్షించును. అతనిని బిలిచినప్పుడు గృహ యజమానులు గారెలు నరిసెలు సంతర్పణమునకు వండుకొన్నట్లు వండుకొనవలయును గాని సూక్ష్మముగఁ జేసికొనుటకు వీలులేదు. పైతృకములయందు సుష్టుగా భోజనము చేయువారిని బిలిచి పెట్టుట యెవరో కొందరికి సంతోషమైనను జన సామాన్యము కట్లుండదుగదా? పాపయ్యకు శ్రాద్ధభోజన మరుదగుట కది యెక హేతువయ్యెను. పాపయ్యయొక్క జీర్ణశక్తిని విస్పష్టముగఁ దెలియజేయుట కతని బాల్యమునఁ దండ్రి జీవించి యున్నపుడు జరిగిన యొక వృత్తాంత మిందు దెలుపుట సముచితము. భావికాలమున నేదో విషయమున మహా ప్రజ్ఞావంతులగు వారియం దా లక్షణాంకురములు బాల్యమునందె పొడచూపుచుండును. పాండవ సింహమని చెప్పదగిన భీమసేనుడు దుర్వార భుజబలశోభితు డని యెల్లవా రెఱుగుదురు కదా! ఆ మహాబల సంపత్తి యతని బాల్యమునందే గోచరమయ్యెను. కుంతీదేవి భీమసేనుఁడు పుట్టిన పదియవనాఁడు శుద్ధిస్నానముఁ జేసి కొడుకు నొడిలో వైచికొని దేవతా దర్శనమునకుఁ బోవుచుండెను. అప్పుడొక బెబ్బులి యామెందఱిమెను. పాండురాజు పులి నొక యమ్మున గూల వేసెను. కాని యా లోపున నామె భయపడి విసవిస పరుగిడ నారంభించెను. ఒడిలోనున్న భీమసేనుఁడు నేలఁబడియెను. నెత్తురుఁ గుడ్డగుటచే బిడ్డ యా దెబ్బకు మృతినొందెనేమో యని కుంతీదేవి తత్తరపడియెను. కాని

బాలుని దెహము కందలెదు. నలగలెదు. అతని శరిర సంపర్కము గలిగినంత మెర యా జాతినెల పిండి పిండి యయ్యెను. అతనియందు వలెనే పాపయ్యయందుగూడ బాల్యమున నతని జఠరాగ్ని శక్తి ద్యోతకమయ్యెను. దృష్టిదోషము తగులునని తండ్రి యితరుల కది వెల్లడింపలేదు. పాపయ్య పదియాఱేండ్ల ప్రాయము వాఁడైనపుడు తండ్రి కుమారుని వెంటబెట్టుకొని కోనసీమలోఁ బ్రయాణము సేయుచుండెను. చలిదికూడు లేక పాపయ్య యెక్క యడుగైన నడువఁజాలఁడు. అందుచేఁ దండ్రి ఆనాఁడొక యూర నొక యింటి కరిగి "అమ్మ! మా కుఱ్ఱవానికి రవంత చలిదియన్నము దొరకునా" యని యడిగెను. కుఱ్ఱవాఁడు చలిదియన్నము గోరుచున్నాఁ డనఁగానే సాధారణముగ లేదనువారుండరు. పాపయ్య పదియాఱేండ్ల వయసువాఁడైనను నప్పటికే తండ్రివలె చెయ్యెత్తు మనుష్యుఁడయ్యెను. అయినను జనకుని దృష్టి కతడు కుఱ్ఱవాఁడెకదా! కుఱ్ఱవాఁ డనుటచేత గృహ యజమానులు వచ్చినవాఁడు పదియేండ్లవాఁడో యైదేండ్లవాఁడో యను కొని "అయ్యో నాయనా! పిల్లవానికి పట్టెడు చలిదియన్నము బెట్టమా? అదిగో చద్దివణ్ణాలగది, పెట్టుగుని తినుమనుఁడు. లేదా మీరు పెట్టవచ్చు" నని యా గదిఁ జూపిరి. ఆజానుబాహుఁడైన తన కుమారునిఁ జూచినపక్షమున వారు చలిది యన్నముఁ బెట్టరేమో యను భయమున నతఁడు మొదట వానిని వీధిలోనెయుంచి వెళ్ళి గదిచూచి వచ్చిన తరువాత నింటిలోని యాడువాండ్రు పనుల సందడి నున్నప్పుడు దొడ్డి దారిని తన బిడ్డనుఁ దీసికొనిపోయి యా గదిలోఁ బ్రవేశపెట్టి యన్నము బెట్టుకొని తినుమని చెప్పెను. ఆ గదిలో మానెడు బియ్యపన్న ముండెను. దానికి సరిపడిన యూరుగాయలు పచ్చళ్ళు నుండెను. తవ్వెడు గేదె పెరుగుండెను. రమారమి గిద్దెడు పేరిన నేయి యుండెను. పాపయ్య యాయన్నమంతయు వడ్డించుకొని యూరుగాయలు పచ్చళ్ళు నేయి పెరుగు మిగులకుండ సుష్టుగాఁ దిని యెప్పటియట్ల దొడ్డిదారిని వెలుపలకు వచ్చెను. భోజనము సమాప్తమైన తరువాతఁ దండ్రి యా యింటి యాఁడువాండ్రకడకుఁ బోయి "అమ్మా! మీ దయవలన మా వాఁడు చలిది యన్నము దిన్నాఁడు. నేను సెలవు పుచ్చుకొని వెళ్ళుచున్నా" నని చెప్పి వెళ్ళి పోయెను. ఆ యింట నైదారుగురు చిన్నబిడ్డలుండిరి. ఆ బిడ్డలందఱకు సరిపోవునని వారా యన్న మక్కడ దాచిరి. పాపయ్య తిని వెళ్ళిన గడియ సేపటి కా యిల్లాలు చలిది యన్నముఁ బిల్లలకు పెట్టనెంచి యాటలు మానిపించి వాళ్ళందరి నక్కడకుఁ బిలిచి కంచములుపెట్టి యన్నపాత్రఁ జూచునప్పటి కందులో నొక మెతుకైన లేదు. ఆ యిల్లాలు తెల్లబోయెను. కుక్క తినిపోయెనేమో యని మొదట నుకొనెను. కాని నూరుఁగాయలు పచ్చళ్ళుగూడ లేకపోవుటచే నట్లనుకొనుటకు వీలులేకపోయెను. ఇంటిలోనున్న యాఁడువాండ్రంద ఱక్కడఁ జేరి కొంతసేపు మీమాంసచేసి తుదకు బ్రాహ్మణకుమారుఁడే తినియుండునని నిశ్చయించి కుఱ్ఱవాఁడు మానెడు బియ్యపన్నముఁ దిన్నందుకు మనసులో మిక్కిలి యాశ్చర్యము నొందియు, బ్రాహ్మణునకుఁ బెట్టిన తిండికి కంటగించుకొనుట దోషమని నోరు మూసికొని యూరకుండిరి. పాపయ్య చరిత్రముగూడ భీమసేనుని చరిత్రము వంటిదే, ఆఁకలిలో నిద్దఱు వృకోదరులే. ఇద్దఱు మహాకోపసులే. అయినను వేదవ్యాసునివంటి మహాత్ముఁడు తన రచనా చమత్కృతి నంతయు జూపి వర్ణించుటచే భీమసేనుఁడు వంద్యుఁ డయ్యెను. అట్టి మహాకవి యాడుకొనక పోఁబట్టి పాపయ్య నింద్యుఁ డయ్యెను. ఇట్టి యితిహాసము లనేకములు కలవు. కాని గ్రంథవిస్తరభీతిచే నవి స్పృశియింపక కథలోని ముఖ్యాంశమే వర్ణింపఁబడును. 'తల్లి చచ్చిన జిహ్వచచ్చు' నను నార్యోక్తి పాపయ్యకడ నిశ్చయమైనది. సరిగా నతనికన్న మమరలేదు. వండుకొను కష్ట మటుండగా ముమ్మారు మూడు

మానికెల బియ్య మతనికి గావలెను. అతండులములు, వానికి గావలసిన రసవరములు సంపాదించుట స్వగ్రామమున దుస్సాధ్యమయ్యెను. అదియునుంగాక వివాహముఁ జేసికొని వంశము నిలుపుకొన వలయునని గట్టిసంకల్ప మతనికిఁ గలిగెను; అతనికి విద్యఁజూచి పిల్లనిత్తురా? ధనముజూచి యిత్తురా? మళ్ళు మాన్యములు జూచి యిత్తురా? వరదిట్టము కావలసినంత యున్నది. కలియుగములో వరుని దార్ఢ్యము, సాంప్రదాయముఁ జూచు వారెవ్వరు? ఎల్ల పేదవాండ్ర విషయములో నయినట్లె పాపయ్య విషయమున వివాహము ద్రవ్యైక సాధ్యమయినది. ద్రవ్యము స్వగ్రామమున సంపాదించుటకు దగిన యనువులు లేవు. కాఁబట్టి దేశాంతరములకుఁ బోవలయునని పాపయ్యకు దృఢసంకల్పము గలిగెను. ఏ దేశమునకు బోవలయు నని యతఁడు మనస్సులో మీమాంసఁ జేసెను. కాశికిఁ బోవలయునని కొంతకాల మతఁడు తలంచెను. కాశిలోని సత్రములలో యధేచ్ఛముగ భోజనము జరుగును. కాని వివాహము నిమిత్తము కావలసిన ధన మచ్చుట దొరకదని యతని కెవ్వరోచెప్పి మహాపట్టణమందు దెనుఁగు బ్రాహ్మణులమీద నాదర మెక్కువగల దక్కడికిఁ బొమ్మని హితోపదేశము జేసిరి. ఆ మాట యతనికి నచ్చెను. తోడనే పునహాకు బ్రయాణమయ్యెను. అతని యింట లోకమంతటట గల పంచభూతములే గాని యితరమైన యాస్తి యేమియునులేదు. పాత్రలు మృణ్మయపాత్రలు త్రాగుటకొక యిత్తడిచెంబు మాత్రమున్నవి. కట్టుకొనుటకు మూఁడు నాలు గంగవస్త్రములు కలవు. ఎన్నో తరములనుండి వంశపారంపర్యముగ వచ్చుచున్న యక్షయపాత్ర యుండవలయును గదా. అది యేమైనదని మీకు సందియము దోఁచవచ్చును. పాపయ్య బద్ధకముచేత నక్షయపాత్ర వ్యాపారము మానికొనెను. వ్యాపారము మానికొన్నను జాలకాలము నాఁటనుండి యచ్చివచ్చినపాత్ర దాచకూడదాయని మీకు సందేహము దోచవచ్చునేమో; అది తల యుత్తరించుకొని పోవు సమయమున కుపయోగింపబడెను. చీట్లపేకలో వచ్చిన దండుగ నిచ్చుకొనుట కాపాత్ర నుపయోగింపఁ బడెను. అది యొక్కటియే గాదు, అప్పుడప్పుడు హస్తలాఘవముచే నతని వశమగుచుండిన రాగి కంచు చెంబులు పంచపాత్రలు మొదలగునవి గూడ తన్నిమిత్తము వినియోగింపఁబడెను. పెట్టెలు లేవా యని మీ రడగవచ్చును. పెట్టెలలో దాఁచవలసిన వస్తువులు లేనప్పుడు పెట్టెలెందుకు? అందుచేత నతనికి సర్దుకోవలసిన సామగ్రులు లేకపోయెను. చిరకాలమునుండి బూజు పట్టుచున్న కృష్ణాజినమును దర్భాసనమును దీసి పాపయ్య బూజు దులిపి యెండలో వేసి దర్భాసనమును కృష్ణాజినములో వేసి కట్టి యొకనాఁడు తెల్లవారుజామున నా కృష్ణాజినమును భుజముమీఁద వేసికొని యిత్తడి చెంబు మూతికి గట్టిన యంగవస్త్రమును నడుమునకు గట్టుకొని ప్రాతధోవతిగట్టుకొని తలకొక ప్రాతయుత్తరీయమును జుట్టుకొని పునహాకుఁ బయన మయ్యెను. మార్గమధ్యమున నతఁడు గావించిన విచిత్రవివాదములు, హస్తలాఘవములు, లీలలు వర్ణింపఁ దొడఁగిన పక్షమునఁ బాఠకులకు విసుగుపుట్టునను భయమున నవి యెల్ల మానవలసివచ్చెను. బ్రాహ్మణుడెంత పేదవాఁ డైనను జేత నొక కాసుసయితము లేకుండ సేతుహిమాచల పర్యంతమగు దేశమంతయు దిరిగిరావచ్చును. ప్రతి పట్టణమున నున్న సత్రములు కొన్ని సత్రములలో నొక పూట మాత్రమే భోజనముఁ బెట్టుదురు. కొన్ని సత్రములలో రెండు పూటలు నిరుప్రొద్దు భోజనము పెట్టుదురు. కొన్ని చోట్ల భోజనముకాక కానియొ రెండుకానులో దక్షిణ గూడ నిచ్చెదరు. దక్షిణదేశమున కొన్ని సత్రములలో బాటసారు లగు వితంతువులు రాత్రి రొట్టె కాల్చుకొనుటకు పిండి గూడ నొసంగుదురు. సత్రములమాట యటుండఁగా బ్రాహ్మణుల కన్నము లేదను బ్రాహ్మణ గృహస్థులు

సాధారణముగ నుండరు. కాబట్టి పాపయ్య చిల్లిగవ్వ చెతలెకుండ సుఖముగ వెళ్ళఁగలిగెను. ప్రాతఃకాలమునందు లేచి జాము ప్రొద్దెక్కు వఱ కతఁడు నడచి యొకగ్రామముః జేరి యచ్చట సత్రమున్న సత్రమును లేనిచో సామాన్య గృహస్థుల యిండ్ల భుజించి సుఖముగనిద్రించి మరల జాముప్రొద్దువేళ బయలుదేరి నడచి యేయూరికడ సాయంకాల మగునో యచ్చట బసజేసి యెవరి యింటనో భుజించి మరల వేకువను లేచి పయనము సేయుచుండును. ఈ విధముగ నతఁడు నాలుగు మాసము లగునప్పటికి సుఖముగ శ్రీమంతులగు పీష్వాలకు మున్ను రాజ ధాని యైన పునహాకుఁ జేరెను. పునహాలోఁ పూర్వకాలమున బాజీరాయఁడు మొదలగు పీష్వాలు రాజ్యధురంధరులై యున్న కాలమున బ్రాహ్మణపూజ విశేషముగ జరుగుచుండెను. అందు వేదాధ్యయన సంపన్నులకు జరిగెడుపూజ మిక్కిలి మెండు. భరతఖండ మంతటిలోను కృష్ణా గోదావరీ తీరవాసులగు బ్రాహ్మణులు మిక్కిలి గంభీరముగ నుదాత్తానుదాత్త స్వరితస్వరములు తప్పకుండ నపశబ్దము రాకుండ స్వచ్ఛముగ మనోహరముగ వేదము చదువఁ గలరని మహారాష్ట్ర దేశమున గొప్పవాడుక గలదు. ఆ ప్రఖ్యాతి కాంధ్రబ్రాహ్మణులనుటకు సందియములేదు. హిందూదేశమున ననేకభాషలున్నను నందులో ననేకములు సంస్కృతములే మాతృకగ గ్రహించినను నాంధ్రభాషవలె నవి సర్వవిషయముల సంస్కృతము ననుసరింపలేక పోయినవి. అక్షరముల దగ్గఱనుండి తెలుఁగుభాష సంస్కృతము ననుసరించిన కారణమున నాంధ్రులు సంస్కృత శబ్దములను స్వచ్ఛముగ నిర్దుష్టముగ నుచ్చరింపఁగలరు. తక్కినవా రట్లుచ్చరింపలేరు. వంగదేశీయుఁడు వేద మనఁబోయి బేదమనును. సద్గుణ మనఁబోయి షద్గుణమనును. ఓఢ్రదేశీయుఁడు జనకుఁ డనుటకు జొనొకొ యనును. ఇట్లే ఘూర్జర మహారాష్ట్ర ద్రావిడకర్ణాటాదిభాషలు సంపూర్ణ భాషలుగామి నాయాదేశస్థుల నాలుకలు సంస్కృతోచ్చారణమునకు సరిగా నలవడి యుండలేదు. సంస్కృతోచ్చారణమున కాంధ్రులే దక్షులు. ఆ కారణంబున శ్రీమంతులగు పీష్వాలు వారినిం బట్టి మహారాష్ట్రులందఱు త్రిలింగదేశ బ్రాహ్మణుల నోటనుండి వేదమును వినవలయుననియు శ్రౌతస్మార్తాది కర్మలను జరిపించుకొనవలయుననియుఁ గుతూహలము గలిగియుండి యట్టివారు లభించినప్పుడు వారిని రావించి సకలవిధముల సమ్మానించి సకల పూజల సత్కరించి పంపుచుందురు. అందుచేత నాంధ్ర బ్రాహ్మణులలో స్వాధ్యాయవేత్తలు శ్రౌతస్మార్త ప్రయోగదక్షులు, శ్రీమంతుల కాలమునను శ్రీమంతుల రాజ్యమస్తమించిన వెనుకను గూడ పునహాసతారాలకుఁ బోవుచుందురు. అట్టి వేదవేత్తలు గర్భిష్ఠులుఁ బోవుచోటికి పొట్టకోసి కంచుకాగడాల వెదకినను నొక్కయక్షర ముక్కయైన గనబడని పాపయ్య యేమి చేయవలయునని వెళ్ళియుండెనోగదాయని యెల్లవారికి సందియము దోఁచక మానదు. ఘూర్జరులు మహారాష్ట్రులు మిక్కిలి దాతలనియు, గోదావరీతీర బ్రాహ్మణుడు వివాహార్థము యాచించినతోడనె రూకల వర్షము గురియుననియు నందువలన సులభముగ వివాహము జేసికొనవచ్చు ననియు నితరులవలన విని యతఁడు నమ్మెను. అదియునుగాక యాదేశమున శ్రాద్ధభోక్తకు నయుతము రూపాయకు తక్కువ దక్షిణనియ్యరనియు నందుచేత బ్రాహ్మణార్థములు చేసియె గోనెసంచెడు రూపాయలు సంపాదింప వచ్చుననియు నతని కాశపుట్టి వెళ్లెను. ఎట్టెటో యతఁడు పునహా జేరెను. చేరి సత్రములలో భోజన మారంభించెను. ఆవగాయ మాగాయ మొద లగునూరుగాయలను గోంగూరపచ్చడి తోటకూర బచ్చలకూర మొదలగు పులుసులు బెల్లపుటరిసెలు మినుపగారెలు పీశె బూరెలు గుమ్మడికాయ ధప్పళము మొదలగు తెనుఁగు వంటకములకు రుచిపడిన పాపయ్య

నాలుకకు మహారాష్ట్ర దెశపు రొట్టెలు పలుచని పప్పులు కారములెని పచ్చళ్ళు మొదట నచ్చినవికావు. పచ్చిమిరపకాయ కారమునకతఁడు మొగము వాచి స్వయముగఁ జేసికొని మహాపదార్థముగ దాచికొని భోజనమునకు వెళ్ళినప్పుడు పొట్లముగట్టి తీసికొనిపోయి పంక్తిలోనున్న మహారాష్ట్రులు నివ్వెరపడి చూచి యితఁడు బ్రహ్మరాక్షసుడని తలంచునట్లది కలుపుకొని తినుచుండును. కొన్నినెల లగునప్పటి కతఁడు మహారాష్ట్ర భోజనమున కలవడెను. అలవాటు పడిన తరువాత మహారాష్ట్రులెవ్వరతని కందలేదు. పునహా వెళ్ళినతరువాత రెండు మూడు మాసముల కతఁడు వివాహము నిమిత్తము యోచన నారంభించెను. చదువు సంధ్యలురాని శుంఠయగుటచే రెండణాలు నాలుగు డబ్బులు రెండుడబ్బులు చేతులోఁ బెట్టినవారేకాని రూపాయ లిచ్చినవా రెవ్వరులేరు. దమ్మిడీకాసులెకాని పెద్దకాసు లతని చేత పడలేదు. ఆ కారణమున తానువిన్నట్లు మహారాష్ట్రులు గొప్పదాతలు కారని నమ్మిక తోఁచెను. ఎందుచేతనో మహారాష్ట్రులమీఁద నతనికి గొంత యనిష్టము గలిగెను. "మహారాష్ట్రులు మగవాండ్రు నాడువాండ్రు నను భేదము లేకుండ నందఱు వితంతువులె. మహారాష్ట్రుల కాచార వ్యవహార ములు లేవు. వీళ్ళు వట్టి శూద్రులు, పంక్తిబాహ్యు" లని చాటునఁ దనమిత్రులతోఁ జెప్పుచుండెను. ఏల యని వారడిగిన నతఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చును. "వితంతువులెగాని మనదేశములో రొట్టెలు తినరు. ఈ దేశములో మగవాండ్రుగూడ రొట్టెలు తిందురు. కాన వారు గూడ వితంతువులే, భోజనకాలమందు మహారాష్ట్రులలో దృష్టిదోషములేదు. మనదేశములో వేదపండితుఁ డన్నమాట యక్కఱలేదు. ఎటువంటి బ్రాహ్మణుఁ డైనను శూద్రుఁడు రవంత తొంగిచూచినప్పటికి బ్రాహ్మణుఁ డన్నము వదలి పెట్టి లేచి వెళ్ళును. ఈ పాపిష్టి దేశములో బ్రాహ్మణుఁడు భోజనము చేయుచుండఁగా శూద్రుఁడు చూచుటయెగాక ఆ గది లోనె తానొక విస్తరి వేసికొని వేరు పంక్తిలో బ్రాహ్మణుని కెదురుగఁ గూరుచుండి శూద్రుఁడు భోజనముచేయును. ఈ దేశములో వట్టి మాలకూడు. అటువంటి పాడుదేశములో నీ వెందుకున్నా వందురేమొ కాలము తప్పి వచ్చినప్పుడు వసుదేవుఁడు గాడిదకాళ్ళు పట్టుకొన్నాడు. పొట్ట గడవక వీళ్ళనాశ్రయించవలసివచ్చినది. అదిగాక మరాటివాండ్రు పుల్లాకులలోఁ దినునట్టివాండ్రు; ఎట్లందురా? మనవలె వా రాకులలో భోజనము సేయరు. పళ్ళెములలోను గిన్నెలలోను తిందురు. అవి కడిగి దాఁచికొందురు. కాని పాఱవేయరు. తిని పాఱవేసినవి పుల్లాకులు కావా?" రహస్యములో నిటువంటి సంభాషణలు సేయుచున్నను బహిరంగముగఁ బాపయ్య వారిని వేవిధములుగ ధనమునిమిత్తము స్తోత్రములు చేసినను మనోరథము సిద్ధించలేదు. వివాహమునకు సొమ్ము ప్రోగుపడు నట్లు కనంబడలేదు. యాచనవల్ల దొరికినది సంభావనవల్ల నార్జించినది బ్రాహ్మణార్థములవల్ల చేఁజిక్కినది పాపయ్య పొగచుట్టలకుఁ దమలపాకులకు వక్కలకునడుమనడుమ నంగళ్ళకుఁబోయి కొని తిను లడ్డు బందరుఫేణి మొదలగు మధురాహారములకు సరిపోయెను. కాని మిగులుటలేదు. ఇంతదూరమువచ్చి వివాహము జేసికొనకుండ మరల స్వదేశమునకుఁ బోవుట యప్రతిష్ఠ యని యతఁడు భావించి తనవంటివారికి సొమ్ము చేతినిండ సమకూర్చునట్టి వృత్తినేదేని నవలంబింపవలయు నని సంకల్పించుకొనెను. అట్లు చేయుటలో నతఁ డొక క్రొత్తవృత్తి నారంభింపఁదలంచెను. ఒక నెల దినములు విచారించి యతడొక నిశ్చయమునకు వచ్చెను. ఆవృత్తి యాంధ్రుల కాశ్చర్యముగలిగించునట్టిది. మహారాష్ట్రులు మెచ్చునట్టిది. ఆపత్సమయమున నక్కఱకు వచ్చునట్టిది. ఎప్పటి కప్పుడు చేతిలో రొక్కము పడునట్టిది. అందఱకుఁ దనతోఁ బని

గలిగించునది. ఏనుఁగు పాడివలె తరుగనిది. విరుగనిది. అట్టి యపూర్వమైన వృత్తి యెదందురా వినుఁడు. ఆంధ్రబ్రాహ్మణులు ముఖ్యముగ గౌతమీ కృష్ణవేణీ తీరవాసులు, నందు ముఖ్యముగ రామచిలుకలవలె గోఁజవంకవలె నర్థము దెలియకుండ నొకరు చెప్పినదాని బండవల్లెవేసి స్వాధ్యాయము చెప్పుటకును శ్రౌతస్మార్త కర్మలు నిరాఘాటముగఁ జేయించుటకును కావ్యనాటకాలంకార గ్రంథములు తర్క వ్యాకరణ జ్యోతిష వేదాంతాది శాస్త్రములు నేర్చి పాఠము చెప్పుటకును గొన్ని క్రతువులు చేయుటకును మాత్రమే బహుసమర్థులనియుఁ దదితర వ్యాపారములకు వారనర్హులనియు దేశమున నొక గొప్ప యప్రతిష్ట కలదు. పాపయ్య యవలంబించిన వృత్తి యాంధ్రులకు సంభవించిన యా గొప్ప యప్రతిష్టను దొలఁగించునదికూడ నయ్యెను. ఆవృత్తి కధమపక్షమునలుగురైన నుండవలయును. గాఁబట్టి పాపయ్య తాను వెళ్ళినకొలఁది దినములకె తనవలెనే గంపంత యాశ పెట్టుకొని తన వలెనే భగ్నమనోరథులై యిందందు తిరుగులాడుచున్న మఱి మువ్వురను శిష్యులుగ స్వీకరించెను. ఆ నలుగురుఁ గలిసి తాము ప్రత్యేకముగ యజ్ఞములు చేయలేకపోయినను కోటియజ్ఞఫలప్రదమైన వ్యాపార మారంభించిరి. "అనాథప్రేత సంస్కారరేణ కోటియజ్ఞ ఫలం లభేత్" అని యార్యోక్తి కలదు. దిక్కులేని శవములను గాల్చుటచేత కోటియజ్ఞ ఫలము లభించునని యా వాక్యమున కర్థము. అది పుణ్యజనోచితమైన వృత్తియని పాపయ్య దానీ నుపక్రమించెను. మొట్ట మొదట నతఁడు ధరలు చవుకగానే యుంచెను. కాని పనితగిలిన కొలఁది ధరలు హెచ్చింపవలసి వచ్చెను. అటువంటివృత్తి నవలంబించుటకు బురికొల్పిన యతని నిపుణత, బుద్ధిఁ జూచి యోర్వలేకను నాంధ్ర బ్రాహ్మణులు తక్కిన వ్యాపారములకు సమర్థులుకారని లోకమున నున్న యప్రతిష్ఠను దొలఁగించుటకుఁ దగినట్లు కృతజ్ఞులు కాకను దెలివిమాలినవాండ్రు కొందఱు పాపయ్య పరోక్షమునను నెట్టయెదుటను నిందించి కొన్ని ప్రశ్నలడుగుచు వచ్చిరి. అందుగొన్ని ప్రశ్నలివి. "నీ వీ వృత్తినేల యవలంబించితివి? పుణ్య మందువా, సొమ్ము దీసికొనకుండ శవదహనము జేసిన పక్షమున నది పుణ్యము. దిక్కులేని శవములుఁ గాల్చుట పుణ్యము. నీవు మోయుశవములు వెనుకదిక్కుగలవె. అవి యనాథ ప్రేతలుగావు. ఆంధ్రులకు నీమూలమునఁ దలవంపులు వచ్చుటలేదా?" అటువంటి వెఱ్ఱివెఱ్ఱి ప్రశ్నలకుఁ దగినట్లు నతఁడీ క్రిందివిధమున సమాధాన మిచ్చెను. "బ్రతికియున్న వారికి దిక్కుండును కాని పీనుఁగులకు దిక్కెక్కడుండును. కాబట్టి శవము లన్నియు ననాథప్రేతలే. వారికిమోసెడు వారే దిక్కు. మేమే వారికి గతి. ఇది గౌరవమైనవృత్తి. నీళ్ళు మోసి వంటలుచేసి గోడలు పెట్టి యిండ్లు నేసి మనుష్యులెట్లు సంపాదించుచున్నారో నేను గూడ భుజములు కాయలు కాయునట్లు శవములను మోసిమోసి కష్టపడి చమట యోడ్చి సంపాదించుచున్నాను. నాసొమ్ములో గ్రుడ్డిగవ్వయైన నన్యాయార్జితము లేదు. అంతయు న్యాయార్జితమె. నాలుగు మాటలు చెప్పి నాలుగు గడియలలో నాలుగువందలో నాలుగువేలో గడించు ప్లీడరు డబ్బుకంటె నానా కశ్మలవస్తువుల నమ్మి సొమ్మార్జించు వర్తకుని డబ్బుకంటె పండినను మండినను దప్పక సొమ్ము పుచ్చుకొను సర్కారు సొమ్ముకంటె వడ్డి వ్యాపారముజేసి మళ్ళు మాన్యములు కొంపలు గొడ్లు దయలేక యమ్మించి లక్షాధికారులగువారి సొమ్ముకంటె నా సొమ్ము న్యాయమైనది. నాకొక్క గవ్వ నెవ్వరు నుచితముగ నీయనక్కరలేదు. నే నొకరిదగ్గరికివెళ్ళి చేయి జాచి యాచింపను. ఒకనియింటికి వెళ్ళి నింద్రుఁడవని చంద్రుఁడవని వానిని భూషించి వాని సమయగుదాక కని పెట్టుకొని యుండి పీకి పీడబెట్టి విసిగించి తిట్లుతిని నాలుగు డబ్బులు సంపాదించి సంతోషించు యాచకుని వృత్తికంటె నావృత్తి ఘనమైనది. వేదముఁ జదువుకొనలేదని

శాస్త్రముఁ జదువుకొనలె దని నన్ను మీరు నిందించుచున్నారు. వెదము చదువుకొన్న వారి వృత్తి యేమిటి? ముష్టి. శాస్త్రమునేర్చి కొన్న వారి వృత్తి యేమిటి? ముష్టి. చదువుకొని ముష్టి యెత్తుటకంటె చదువుకొనక పీనుఁగుల మోయుట మంచిది. ఆ ముష్టి విద్యలు నాకక్కఱలేదు. ఒకరింటికి వెళ్ళనక్కఱలేదు. నా యింటి కందఱును వత్తురు. అందఱకు నాతో పనిగలదు. నేను కాలుమీఁద కాలువేసుకొని యింట్లో కూర్చుండి నప్పటికి నాయింటి కందఱువత్తురు. నావృత్తి వరహాలచెట్టు. ఎప్పటికప్పుడె పంట. ఇది నెల జీతముల వృత్తికాదు. అది వట్టిపాడువృత్తి. ముప్పది దినములు రాత్రియు బగలు పనిజేసి పదో యిరువదోరూపాయలను సంపాదించుట యేమి ప్రయోజకత్వమ? నన్నాక్షేపించువారిలోఁ గొందఱు యాచకులె. కొందరుపెద్దలు సంపాదించిపెట్టిన భూములమీఁద జీవించువారు. అటువంటి వారందఱు మనోవృత్తి ముండలు. తనభుజశక్తి మీఁద సంపా దింపలేనివాఁడు, పిత్రార్జితము నమ్ముకొని కాలక్షేపము సేయువారు, వట్టి యప్రయోజకులు. నేను గట్టిప్రయోజకుఁడను, నాభుజశక్తివల్ల జీవనముచేయుచున్నాడను. పల్లకి మోయుట యెటువంటిదో కటుకు మోయుట యటు వంటిదె. పెండ్లి పల్లకి మోతకు డబ్బుపుచ్చుకొనుట న్యాయమై దీనిమోతకు డబ్బు పుచ్చుకొనుట యన్యాయమగునా? నా వలన మీకు తలవంపులు వచ్చుచున్నవా? తెనుఁగువాళ్ళు మరెందుకుఁ బనికిరారన్న యపకీర్తిఁ దొలఁగించి యేపనిలోఁ బెట్టినను సరె తెనుఁగువారు సమర్థులేయని లోకములో వెల్లడిఁ జేసినాను. అందుకైన నామీద మీకు విశ్వాసము లేదే! ఛీ! మీతో మాట్లాడఁ గూడదు. పొండి" అని యెదుటివాఁడు మరల నోరెత్తలేనట్టు యుక్తులు చెప్పి తన యుక్తులు చాలనప్పుడు తన తొమ్మిదవ యర్థము పారాయణముఁ జేసి "శేషం కోపేన పూరయేత్" అను మాట సార్థకముజేయుచుండెను. పాపయ్య యే సుదినమున నే మంచి ముహూర్తమునఁ దనవృత్తి నారంభించెనో కాని యది దిన దిన ప్రవర్థమాన మయ్యెను. పునహ్ పెద్దపట్టణ మగుటచేఁ బ్రతిదినమతఁడు రెండు మూఁడు పర్యాయములు రుద్రభూమికి బోవలసిన పని గలుగుచుండెను. మశూచి విశూచి వచ్చిన కాలములో నతఁడు భూతగణపరివృతుఁడైన సాక్షాత్ రుద్రుఁడు వలె శిష్యసమేతుడై తరుచు శ్మశానములలోనే యుండుచు వచ్చెను. పని తొందరచే నొకానొకదిన మతఁడు భోజనముఁ జేయక పోవుటయుఁ దన పాలములోనికే యన్నము దెప్పించు కొని తిను వంటకాపువలె శ్మశానమునకే పది రొట్టెలు తెప్పించుకొని యెట్లో తీరికఁ జేసికొని యారొట్టెలు నోటిలో వేసికొని మరలఁ బనిచేయ తటస్థించుచుండును. మూరెడేసి పొడుగు పొగచుట్టలు నోట వెలుఁగుచున్న సమయములో పాపయ్యను శిష్యులను రాత్రులు దూరమునుండి చూచువారు కొఱవిదెయ్యములు శ్మశానములో విహరించు చున్నవని పలుమాఱు భయపడి పరుగులెత్తుచు వచ్చిరి. అన్నివృత్తులలో ధర్మమున్నట్లె పాపయ్యవృత్తిలోఁగూడ కొంత ధర్మముండెను. పేదపీనుఁగుల నప్పుడప్పుడు మూల్యము గొనకుండ నతఁడు తీసికొని వెళ్ళుట కలదు. తన యనిష్టుల కడను ధనవంతుల యొద్దను నెక్కువధనము గ్రహించుట కలదు. ఒకరి కడ నెక్కువ, యొకరికడ తక్కువ యేల తీసికొందువని యెవరైన నడిగినప్పు డది వ్యాపారము; సమయము కొలఁది బేరము ధాన్యాదులధర నేఁడు పుట్టి యిరువది; యెల్లుండి ముప్పది యుండగూడదా" యని వారి వాదములు ఖండించుచుండును. శవమునకు నాలుగు వరహాలు నెనిమిది వరహాలు పదివరహాలు పుచ్చుకొనుటయెగాని, తక్కువ లెక్కలేదు. మఱియు వరహాల లెక్కయెగాని చిల్లర లెక్కలేదు. లోభత్వము చేతను ధనహీనతచేతను గొందఱు ప్రేతబంధువులు సహాయము చేయుమని వేడినప్పు "ఈసారి గాదు మరియొక సారి చూడవచ్చును లెండి" యని

బదులు చెప్పుచుండును. అనవుడు వారది యమంగళముగనెంచి ఛి యిదియేమయ్యా! ఈ సారికె మే మింత ఘోరదుఃఖ మనుభవించుచుండ మఱి యొకసారి యిటువంటిది రావలయు నను చున్నావా?" యని వారు దూషణపూర్వకముగ నడుగుటయు నతఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చును. "ఏమంత ఓగాయిత్యము, ఈ పోయిన వాఁడొక్కఁడు తప్ప మీ యింట మఱియెవ్వరు జావరా. ఉట్టిఁ గట్టుకొని యూరేగుదురా? చిరకాల జీవులా యేమిటి? దేహములుకాని యివి లోహములు కావుగదా "జాతస్యమరణం ధృవం" అను మాట వినలేదా? ఎప్పటికైన మీరందఱు నాచేతిలోఁ బడువారె." అతనితో వాదముఁ జేయుట కార్యభంగముఁ జేసికొనుట యని యెవ్వరు మాటలాడేవారుకారు. ఈ శవదహనమునకుఁ దోడుగ నేకమహా పిండ భక్షణ మతనికి విశేషధనమును గూర్చెను. బ్రాహ్మణుఁడు మృతినొంది నప్పుడు ముప్పది రెండు చిన్న చిన్న యన్నపిండములు నేతిలోముంచి బ్రాహ్మణునిచేతఁ దినిపింపవలయునని ధర్మశాస్త్రముగలదు. అదె యేక వాహమందురు. అవితినుట మిక్కిలి తప్పు. గొప్ప యమంగళము, అందుచేత నవి తినుట కొప్పుకొనరు. అందుచేత నెల్లవారు నవి యగ్ని హోత్రమున హుతము సేయుదురు. ఎక్కడో దేశాన కొక్కఁడు మహాశూరుఁడు బయలుదేఱి పిండమునకొక్కొక్క వరహాపుచ్చుకొని యవి తిని పదిమంది తిట్టి కొట్టుదురను భయమున నెవరికి గనఁ బడకుండ రాత్రివఱ కేదో గదిలోఁ గూర్చుండి పాఱిపోవుచుండును, ఆ పిండములు బ్రాహ్మణులు తిన్నపక్షమునఁ దమ పితృ దేవతలు తప్పక మోక్షపదమున బ్రాపింతురని మహారాష్ట్ర బ్రాహ్మణులకు నమ్మిక గలదు. అందు గౌతమీ గృష్ణవేణీతీర బ్రాహ్మణులు అన్నచో వేరు కొరతలేక తమపెద్దల నిమిత్తము వైకుంఠద్వారములు తెఱచి యుండునని వారి దృఢవిశ్వాసము. అట్టివా రెవ్వ రిదివఱకు వారికి దొరకక పోవుటచే నేక వాహపిండము లగ్నిహోత్రము పాలగు చుండెడివి. పాపయ్య వెళ్ళిన తరువాత నట్టి కొరత తీరిపోయినది. వైకుంఠ కైలాసలోకముల ద్వారములు ముద్దలు మ్రింగుటకు తెరవఁబడిన పాపయ్య నోరువలెనే యెల్లప్పుడు తెఱవఁబడి యుండును, అగ్ని హోత్రునినోట కరక్కాయ గొట్టి పాపయ్య ముప్పది రెండు ముద్దలు నేతిలో ముంచిన ముద్దకు రెండు వరహాలు మూడువరహాలు సమయముకొలదిఁ లాగివేయుచుండును. సర్వభక్షకుఁడైన యగ్నిహోత్రునకైనను నెయ్యిసరిగా జీర్ణముకాక యజీర్ణము చేసియుండెను. కాని పాపయ్య యెన్నఁడు నజీర్ణ మెఱుగడు. పూర్వపువారు భయముచే రహస్యముగ దినుచు వచ్చిరి. పాపయ్య కట్టి భయములేదు. కావున నతఁడు బహిరంగముగఁ దినుచు వచ్చెను. పాపయ్య నమ్మినదానిని సరిగ నాచరించునట్టి మహాశూరుఁ డని చెపుట కేమి సందియము కలదు? ఈ విధముగ నిర్భయముగ రెండుపనులు నిటీవల ననేకులు చేసిరి. కాని వారందఱు పాపయ్య శిష్యులే. అట్టివారందఱుఁ బాపయ్య పేరు చెప్పి దీపము బెట్టి మొక్కుకొనవలెను. అది యతఁడు పెట్టిన భిక్షమె. పై రెండు వృత్తులవల్ల పాపయ్య నెలకువందల కొలది రూపాయ లార్జించెను. కాని యది యంతయు నిలిచినది కాదు. ఎంతచెట్టు కంతగాలి, అర్థప్రాణములు కవలపిల్లలు. అడుగడుగునఁ బ్రాణమున కెన్ని గండము లున్నవో యర్థమున కన్నిగండములె యున్నవి. పాపయ్య గొప్పదాత. అది వఱకు బ్రాహ్మణులు బ్రాహ్మణులకేగాని దాన మియ్యరని గొప్ప యప్రతిష్ట గలదు. ఆయప్రతిష్ట పాపయ్య తొలగించి శూద్రులకుఁ గూడ దానము లియ్యఁ జొచ్చెను. మగవారికి దానము లిచ్చుట మనలో బూర్వాచారము. ఆ యాచారమును మార్పుచేయఁదలఁచి యతఁ డాఁడువండ్రకె దానము లీయఁజొచ్చెను. కుంటివాండ్రకు గుడ్డివాండ్ర కేదేనివిదల్చుట యతని కిష్టములేదు. వారేదో ఘోరపాపముఁ జేయబట్టి భగవంతుడు వారిని దండించుటకై

యంగవైకల్యము వారికి బ్రాప్తింపఁ జెయుటచె నట్టివారిని మనము డబ్బిచ్చి పోషించిన పక్షమున రాజద్రోహులను రక్షించిన వారిపై రాజునకుఁ గోపము వచ్చినట్లె యీశ్వరద్రోహులను రక్షించిన పక్షమున నీశ్వరునకు మనపైఁ గోపము వచ్చి మహానరకమున ద్రోయునని యతఁడు నమ్మి యటువంటివారి కేమియు సాయము చేయక రూపరేఖా విలాసములు గలిగి ప్రాయము గలిగి హొయలు గలవారికె నేవైన గుప్తదానములు చేయుచుండును. పాత్రదాన ప్రవీణుడైన పాపయ్య కతమున నెందఱో చాకలి సానులు, మంగలి మగువలు, గమళ్ళ గరితలు, నీడిగ యెమ్మెకత్తెలు సాలిజవరాండ్రు గొల్ల గుబ్బెతలు బాగుపడిరి. ఈ దానములు లేని పక్షమున బాపయ్య బంగారుగోడలుకట్టి యుండును. కాని లక్ష్మి పక్షపాత మనస్కురాలు; అందుచేత మగవాని యండనుండక తనజాతి యాఁడువాండ్ర గడకు బోయెను. అదిగాక పాము కన్న గ్రుడ్లన్నియు బ్రతుకునా? పులికిఁ బుట్టిన పిల్లలన్నియు బ్రతుకునా? నల్లేరు చెట్లన్నియు నెదిగి వృక్షము లగునా? అట్లయినచో జగము లాగునా? ప్రతివాఁడు సంపాదించిన దంతయు నిలువచేసిన పక్షమున జ్యేష్ఠాదేవికి నిలువనీడయుండునా? పాపయ్య కిప్పటి కేబది సంవత్సరములు వచ్చినవి. పునహాకు వచ్చి యిరువదిసంవత్సరము లైనది. పోయినవి పోగా నతనియొద్ద మూడు వేలరూపాయలు నిలిచినవి. అప్పుడప్పుడొక మారువాడీయెద్ద కొంత సొమ్మతడు నిలువచేసి యుండుటచే నీమాత్రమైన గనబడినది. ఆ సొమ్ముగూడ నెన్నో సారులు తీసికొనుటకితడు ప్రయత్నించి మారువాడిని గట్టిగా నడిగెను. కాని "బ్రాహ్మణుఁడు దిక్కు లేనివాఁడు ఏ పడుపుకత్తె యింటనో యే శ్మశానములోనో యాకస్మికముగ జచ్చిపోగలడు. అప్పుడీ సొమ్మంతయు మనకే దక్కగలదు. వీని కిప్పు డెందు కిచ్చి చేతఁజిక్కినది పోగొట్టుకొనవలయు" నని యా మారువాడీ తలంచి పాపయ్య వచ్చినపుడెల్ల యేదో వంక జెప్పి పంపివేయు చుండును. ఎట్లైన నేమి, మారువాడీ మనోరథము భగ్నమైనది. మారువాడీ మశూచికమువచ్చి మృతినొందెను. అతని కొడుకు పాపయ్య సొమ్మిచ్చి వేయ దలచెను. పాపయ్య కప్పుడు పెండ్లిమాట జ్ఞప్తికి వచ్చెను. మూలస్థానములో నొకపిల్ల యున్నదని యతనికిఁ దెలిసి తన కిమ్మని యా పిల్ల తండ్రికి వర్తమానమంపెను. ఆ వర్తమానము తెలిసిన తరువాత బాలిక తండ్రి యగు అన్నంభొట్ల అన్నప్పగారు పిల్లకు బండ్రెండు సంవత్సరములు వయస్సు కావున పండ్రెండువందల రూపాయ లీయవలసినదనియు మూడువందలరూపాయలు నగలు పెట్టవలసిన దనియు నుభయమంగళసూత్రములు బెండ్లికొడుకె చేయించుకొని యుభయులఖర్చులు బెండ్లికొడుకు పెట్టుకొని మందపల్లిలో గాని వేంకటేశ్వరులవాడపల్లిలో గాని పెండ్లి చేసికొనవచ్చుననియు నతనికి వర్తమాన మంపించెను. అది విని కళ్యాణకాలము తనకు నేఁటి కాసన్నమైన దని పాపయ్య సంతసించి యా పద్ధతి కొడంబడి మారువాడీ యొద్దనుండి రాజమహేంద్రవరములో నున్న నారాయణకర్నుగాని మీఁదికి మూఁ డువేల రూపాయలకు దర్శనహుండిపుచ్చుకొని పునహానగరము విడిచి బయలుదేఱెను. అతఁడా నగరము విడిచినపు డెందఱు స్త్రీలు కంటఁ దడిబెట్టిరని చెప్పను! చాపచుట్టలు గిరవాటు వేసినట్లు తమయూరి శవములను మోయువారు లేరనియు నవరళముగ నేక వాహపిండములు గుటుకుగుటుకున మ్రింగి తమ పెద్దలకు వైకుంఠ ద్వార సోపానము లెక్కించువారు లేరనియు నగరవాసు లెంతో విచారించిరి. పాపయ్య పునహాను విడుచుచున్నాఁడు గావున నతని విషయమై యిక్కడనె యొకమాట చెప్పవలయును. అందఱు తమతమ వృత్తులలో నిగ్రహానుగ్రహ సమర్థులైనట్లె పాపయ్యయుఁ దనవృత్తిలో నట్టివాఁడు. అనుగ్రహించెనా యథాశక్తిగా శవ మూరక మోయును. కోపించెనా దండించును. ఇందుకొక

తార్కాణము గలదు. ఒకనాఁ డొకపేటలో నొకయింట నైదేండ్లపసిబిడ్డ మృతినొందెను. గృహయజమానునికడ రెండువరహాలు పుచ్చుకొని యాబిడ్డను మూటఁగట్టి రాత్రియగుటచే నది తన విరోధియైన యొక మహారాష్ట్రుని వీధియరుఁగుమీదఁ బెట్టి పాఱిపోయెను. మఱునాఁడా గృహస్థులు లేచి యది యేదో యనుకొని విప్పిచూచి భయపడి కళవళపడి యమంగళముగ భావించి పాపయ్యను బిలిపించి తీసివేయమని ప్రార్థించిరి. పాపయ్య తన ప్రాతకసి తీరునట్లు పాతిక రూపాయలక్కడ పెట్టించి యా పీడానివారణముఁ జేసెను. ఇఁక విన ననేకోదాహరణములుగలవు. గ్రంథవిస్తర భీతిచే మానవలసి వచ్చె. పాపయ్య రాజమహేంద్రవరములో హుండీమార్చుకొని మందపల్లి వెళ్ళి యిల్లు కట్టుకొని మూలస్థానమునుండి అన్నంభొట్ల అన్నప్పగారిని సకుటుంబముగ రావించి పండ్రెండువందలు వారి కిచ్చి మూడువందలు నగలుపెట్టి సంబంధము గుదిర్చినవానికి నూరురూపాయలు రుసుమిచ్చి యన్నప్పగారి కుమార్తెయైన పిచ్చమ్మను వివాహమాడెను.

# నాలుగవ ప్రకరణము

వివాహ సంబంధములైన వేడుకలు విశేషముగా వర్ణింపఁ దలచుకొనలేదు. అయినను ముఖ్యమైన వొకటి రెండు కలవు. పప్పుభొట్లవారితో నన్నంభొట్లవారు వియ్యమంది నప్పుడు వారికుభయులకు ననాదిబంధువులైన నేతివారు దయచేసి వారితోఁ గలసి మెలసి వివాహమున కెంతో శోభదెచ్చిరి. నేతివారుగాక ముఖ్యముగ నన్నంభొట్ల వారికి బంధుమిత్రులైన కందావారు చెమ్మకాయలవారు బీరకాయలవారు చేమకూరవారు వంకాయలవారు మిరియాలవారు దోసకాయలవారు దయచేసి రేయింబవళ్ళు విరిగి ముక్కలగునట్లు పనిచేసి మెప్పువడసిరి. ఉప్పువారు మొదటినుండియు నచ్చటనే యుండిరి. కానివారి కన్నంభొట్లవారితో నంత యైకమత్యములేదు. ఉప్పు వారికిని మనపప్పువారికిని నతికినట్లంన్నంభొట్లవారితో నతకదు. ఉప్పువారికిఁ బంధుమిత్రులకుఁ గూడ నెక్కువ కలయిక నుండెను. గొల్లప్రోలునుండి చల్లావారు మొదట నేకారణముచేతనో రాక కడపట విచ్చేసిరి. కడపట విచ్చేసినను మొదటినుండియు నన్నంభొట్లవారి కాప్తులగుట చేత వారి సమాగమెంతో రసవంతముగ నుండెను. ఉభయులకర్చులు పాపయ్యయె వహించుటచేత నన్నప్పగారు పుచ్చుకొన్న పంద్రెండువందల రూపాయలలో జిల్లిగవ్వయైన వ్యయము కాలేదు. కాక కాక యైన వివాహమగుటచేఁ బాపయ్య యధిక శోభస్కరముగ వివాహము జేసికొనఁదలచిఁ యైదుదినంబులుం బల్లకినెక్కి యూరేగెను. పాపయ్య దీర్ఘకాయుఁ డగుటచే బల్లకిలోఁ గూర్చుండినప్పుడు చిన్న చిక్కు సంభవించెను. అతని తలకు దండియు దండిపైఁ బఱచెడు పింజరియుఁ దగులుచుండుటచే నతఁడే పెండ్లికూఁతురు భావము వహించి తలవంచుకొనవలసినవాఁ డయ్యెను. అందుచేతఁ బల్లకిలోనున్న సమయములో నతనిని జూచినవారు మెడగుళ్లు వంగినవని కొందఱు, గూనివచ్చినదని కొందఱు, కాదు కాదఱువదియపడిలోఁ జిన్నపిల్లను వివాహమాడినందుకు సిగ్గుపడి తలవంచుకొన్నాఁడని కొందరు దోచిన విధముగననిరి. దీర్ఘకాయమునకుఁ దోడుగ నతఁడు లావుగలవాఁ డగుటచేతను, గూనంత బొజ్జగలవాఁ డగుట చేతను, దండాడింపు సమయమునఁ బెద్దచిక్కు సంభవించెను. వచ్చిన బంధువులలో మిత్రులలో బరిచితులలో నతని నెత్తుకొని దండాడింపు చేయఁగలవారు లేకపోయిరి. పాపము నేఁటికాలమునకుఁ బాపయ్య వొక యింటివాఁ డగుచున్నాఁడుగదా, యతని ముచ్చట మాత్రము తీరవలదా యని యొక బంధువుఁడు సాహసించి పెండ్లికుమారు నెత్తుకొని రెండు గంతులు వేయునప్పటికి నూనెసిద్దివలెనున్న పాపయ్యబొజ్జ జారిపోవ లక్క గుమ్మడికాయవలె నతఁడు క్రింద గుభాలునఁ గూలెను. చట్ట నొప్పిపెట్టెను. పిమ్మట నతఁ డొకయరుఁగుమీద గూర్చుండి పెండ్లికుమార్తె మీఁద బగ్గుండ జల్లి యా యుత్సవ మైన దనిపించెను. ఇంక భోగము మేళమునుగురించి రెండుమూఁడు మాటలు చెప్పవలెను. పాపయ్య జన్మముచేత శుద్ధవైదికుఁడైనను జాలకాలము పునహానగరములో నివసించిన నాగరకుఁడగుటచే గొప్పరసికులలో జేరినవాఁడు కావున శృంగార దేవతలగు వేశ్యలులేని పెండ్లి పెండ్లికాదని యభిప్రాయపడి వెలయాండ్రకుఁ బ్రసిద్ధికెక్కిన పసలపూడి మండపేట మొదలగు గ్రామములకుఁ బ్రత్యేకముగ మనుష్యులనంపి మేళములకై ప్రయత్నించెను. అది వివాహకార్తియగుటచే మేళము లన్నియు నందందు గుదిరి యుండుటచేఁ దగిన మేళము దొరకలేదు. మేళముండితీరవలయునని పాపయ్య పట్టు పట్టెను. అందుచేత నతనిమిత్రుఁడొకమేళము దీసుకొనివచ్చెను. ఆవేశ్యపేరు

చంద్రవదన. చిన్నప్పుడది మిక్కిలి చక్కనిదె కాని మశూచికపు మచ్చలు మొగమునుండుటచేతను కుడికాలుకొంచెము వంకరగనుండుటచేతను దానినెవ్వరు మేళమునకుఁ బిలుచుటలేదు. దానివెనుక తాళహంగు చేయునది పాటకత్తెయే కాని కొంచెము నత్తియగుటచే దానిపాట శోభించుటకు వీలులేక పోయెను. కుంటిదైననుసరే గ్రుడ్డిదైననుసరే నత్తిదైననుసరే నంగిదైననుసరే వేశ్య వివాహ కాలమునఁ బెండ్లి పందిరి నలంకరించవలయు నని పాపయ్య ధృడసంకల్పముఁ జేసుకొని యుండుటచే నమావాస్యనాఁటి చంద్రబింబమువంటి మొగము గల యాచంద్రవదననను బిలిపించి పాపయ్య మేజువాణి చేయించెను. వచ్చినబంధువులు దోషైక ద్రుక్కులు గాక గుణగ్రహణపారీణు లగుటచే మోరుచేతుల దాని యభినయమునకు సత్తిదాని గానవైఖరికిని మహానందభరితులై రాత్రి ప్రొద్దుపోవు వఱకు నుదయమున రెండు జాముల వరకుఁ మేజువాణిఁ జేయించుచుండిరి.

శుద్ధవైదికులగుటచే రసికత నెఱుంగక యిట్లువారు సంతసించిరని కొందరు పడుచువాండ్రన సాహసించిరి. కాని యా మాటలు మీరు నమ్మగూడదు. వారల్ప సంతోషు లనియు గుణమెంతవరకు నున్న నంతవఱకు గ్రహించి యానందించువారనియుఁ దలంపవలయును. వివాహము ముగిసెను, వివాహమైనందుకు మనపాపయ్య మిక్కిలి సంతసించెను. కానియతని మనస్సులో నొకవిచారముండెను. అత్తవారింటికి మనుగుడుపునకుఁ బోవుట మొదలగు ముచ్చటలు తీరుట కవకాశము లేక పోయినందున నది గొప్ప కొరఁతగా నతఁ డెన్నుకొనుచు వచ్చెను. అత్తమామలు వివాహమైన తరువాతగూడ గొంతకాలము మందపల్లెలోనె యుండి యల్లుడు తమయింటఁ జేయవలసిన మనుగడుపు తామే యల్లుని యింటఁ జేయఁసాగిరి. చూచువారికిఁ బాపయ్య మామగారై నట్లు నన్నప్పయల్లుఁడైనట్లుండెను. తనకు సరియైన గౌరవము జరగలేదని యల్లుడు బెట్టుజేయుట కవకాశము లేక పోయెను. కాని యన్నప్ప నడుమ నడుమ కొంతబెట్టుసరిచేసి యన్నముమాని యింటికి రాక తగవులాడఁజొచ్చెను. పాపయ్యమామగారిని బ్రతిమాలి యింటికి తీసికొని రావలసి వచ్చెను. అన్నప్ప వివాహమైన వెంటనే మూలస్థానము వెళ్ళఁదలఁచెను, కాని పదియాఱు దినముల పండుగైన తరువాత వెళ్ళుటమంచిదని యాగెను. ఆ పండుగ ముగిసిన తరువాత నన్నప్ప భార్యకు బెండ్లి బడలిక వలనఁ గొంచెము జబ్బుచేసెను. అది నివారణ మగునప్పటి కన్నప్పకే కొంచె మనారోగ్యము కలిగెను. అన్నప్ప తుదకు నెమ్మదిగా నున్న తరువాత బయలుదేరి పోవలయునని పంచాంగము జూడఁగా నొకనాఁడు వారము మంచిది కాకపోయెను. మరి యొకనాఁడు తిథి మంచిది కాకపోయెను. వేరొకనాఁడు నక్షత్రము మంచిది కాకపోయెను. ఇవి యన్నియు గుదిరి యెకనాఁడు బయలుదేరఁగా పిల్లి యెదురుగా వచ్చినందున నాదినమునకుఁ బ్రయాణ మాగిపోవలసి వచ్చెను. తిథివార నక్షత్రములు మరల గుదురునప్పటి కొక్క మాసము దినములు పట్టెను. అప్పుడన్నప్ప బయలుదేఱి వీధిలోనికి రాఁగానే యతని నిమిత్తమే కనిపెట్టుకొని యున్నట్లు చేతనొక పిడకయు బిడకమీఁద నిప్పును బెట్టుకొని వితంతు వెదురుగా వచ్చెను. క్రొత్త పెండ్లికూఁతుర్ని దీసికొని యట్టి దుశ్శకున సమయమున బయలుదేరుట యెంతమాత్రము సముచితముకాదని యన్నప్ప గిరుక్కున వెనుకకు మరలి తరువాత రెండుమూఁడు ముహూర్తములు ప్రయాణము నిమిత్తము పెట్టించెను. ఒంటిబ్రాహ్మణుఁ డొకసారి తెలికలి వాఁడొకసారి యెదురుగావచ్చి ప్రయాణమునిలిపిరి. వెయ్యేల, మందపల్లిలోనున్న వారంద రేదోవిధముగ నన్నప్ప ప్రయా ణమున కాటంకమే గలిగించిరి. మూల స్థానమునకు వెళ్ళి

స్వగృహమున గాపురము జెసినయెడల దనసొమ్ము కర్చుపడునను భయమున నన్నప్ప యెదొ వంక బెట్టి మందపల్లిని విడువక యల్లుని యింటనే తిష్టవేసుకొని తేరకూడుతినుచున్నాడని గ్రామస్తులు కొందఱు చాటుచాటున ననుకొనుచున్నట్లు విని యతఁడు తీవ్రకోపముదాల్చి మందపల్లివాసు లందఱుఁ దుంటరులని నీచులని తిట్టి "ఛీ! యీ గ్రామమం దొక్క నిమిషమై నుండగూడ" దని యల్లునిమీఁద గూడ గేకలు వైచి కూఁతును గొడుకును భార్యను దీసుకొని బయలు దేరెను. ఆ ముహూర్త బలిమి యెట్టిదియోగాని వారు పొలిమేర దాటి యైన వెళ్ళకమునుపే గొప్ప మబ్బు పట్టి యురుములతో మెరుపులతో నేనుఁగు తొండములావు ధారలతో గొప్ప వర్షము కురిసెను. అన్నప్ప సకుటుంబముగ నిలువున నీరై తడిసి మోపెడై దైవప్రాతికూల్యమున కేమియుఁ జేయఁజాలక విధిలేక మరల జామాతృగృహము జేరవలసినవాఁ డయ్యెను. అల్లుడు పదియవ గ్రహమని లోకమున నున్నసామెత యీ విషయమునఁ దారుమారై మామగారే పదియవగ్రహమైనట్లు లోకులకుఁ దోఁచెను. స్వగృహమున నున్నపు డన్నప్పకు పాతయుసిరిక పచ్చడియొ కాల్చినమిరపకాయయొ గంజియొ చింతపండు పచ్చడియొ నన్నమున కాధారముగ నుండినఁ జాలును. తత్త్వము మారిపోవుటచేతనో మఱి యేకారణముచేతనో యల్లుని యింట నున్నంతకాల మన్నప్పకు బాతబియ్య పన్నము పప్పు నధమపక్ష మొకకూర పచ్చిపులుసు మొదలగునవి కావలసివచ్చెను. నడుమనడుమ మినపసున్ని, యరిసెలు, వేపుడుబియ్యము నటుకులు మొదలగు నుపాహారములు కావలసి వచ్చెను. గాదిక్రింది పందికొక్కువలె మామగారు తనయింటఁ జేరి దోచుకొని తినుచున్నాడనియుఁ బూర్వము పునహానగరములో సంపాదించిన ధనము పెండ్లికుమార్తె యోలినిమిత్తమైననేమి, పెండ్లికర్చుల నిమిత్తమైన నేమి నవ్వాలి ఖర్చులకైన నేమి మొత్తముమీఁద నన్నప్పగారి నిమిత్తమే వ్యయమైనదని పాపయ్యకు విచారము పుట్టెను. చూచిచూచి మామగారిని వెళ్ళగొట్టలేడు. వివాహమైన తరువాత పాపయ్యను కలిసికొన్నవారందఱు మామగారి యద్భుత ప్రజ్ఞావిశేషంబు లప్పడప్పుడు కైవారములు చేయుచుండుట చేత నన్నప్ప కాగ్రహము దెప్పించుటకిష్టములేదు. అన్నప్ప తనంతట తానువెళ్ళునట్లు కనఁబడలేదు. వివాహమై యప్పటి కారుమాసము లయ్యెను. అత్తగారి కుటుంబ భరణమునకైన వ్యయ మటుండఁగా మామగారప్పు డప్పుడు చేఁబదులు పుచ్చుకొన్న దేఁబదిరూపాయ లయ్యెను. మందపల్లి నీళ్ళు తనకి వేఁడి చేసినవని యన్నప్ప వారమున కొకసారి యావు నేతితో మంగలిచేత దల యంటించుకొని తలయంటుకూలియు నేతివెలయు నల్లునకె గట్టుచుండెను. భార్యవచ్చిన దన్న సంతోషముపోయి పాపయ్యకు మామగారి రూపమున శని దాపురమయ్యెనని విచారము పుట్టెను. శనిగ్రహపీడ వదలించు కొనుటకై దేశమందలి యెల్లవారు మందపల్లి బోవుచుండఁగా మందపల్లిలోనే యున్న పాపయ్యకు శనిగ్రహపీడ వదలక పోయెను. ఇది తిలదానముతో వదలెడి శనిగాదు; తైలాభిషేకముతో వదలెడి శనిగాదని పాపయ్య మునసబు కరణాల తోను గ్రామములోని తక్కిన పెద్దమనుష్యులతోడను నాలోచనలు చేయసాగెను. ఎవరికి దోఁచినట్లు వారు సలహాచెప్పిరి. నాయింటనుండిమీరు లేచిపోవలసినదని స్పష్టముగఁ జెప్పుటయె మంచిదని మునసబు సలహా జెప్పెను. ఉప్పు పప్పు బియ్యము మొదలగు పదార్థములు లింటలేకుండఁ జేసినీవు పది దినములే గ్రామమైన వెళ్ళవలసినదని కరణము హితోపదేశముచేసెను. ఆ రెండుపదేశములు బాపయ్య కంత రుచింపలేదు. ఇకఁ గొంతకాల మోపిక పట్టవలయునని యతఁడు నిశ్చయించుకొని పిల్లిమీఁదఁబెట్టి యెలుకమీదబెట్టి సూటిపోటిమాటలు మామగారి కర్థమగు నట్లనఁజొచ్చెను. పిచ్చుకమీఁద బెట్టి పీటమీఁదఁబెట్టి

యన్నప్ప యల్లుడన్న మాటలకు దగినట్లు ప్రత్యుత్తరము జెప్పసాగెను. ఎట్టకెలకు పాపయ్య కొపిక క్షీణించెను. ఒక నాఁటి రాత్రి భోజనానంతరమున నూతి నరసింహ మనెడు మిత్రుని బిలిచికొనివచ్చి మామగారిని వెళ్ళిపొమ్మని యతనిచేత వర్తమాన మంపెను. నరసింహ మెంతో మృదువుగాను యుక్తియుక్తముగాను పాపయ్య యభిప్రాయమన్నప్పగారితో జెప్పెను. కాని యా పలుకులు వినగానే యన్నప్పకు వచ్చిన కోప మింతని వర్ణింప నలవిగాదు. గూర్చుండినవాఁ డువ్వెత్తుగలేచి యిల్లెగిరిపోవునట్లు బెద్దబెద్ద కేకలు వేయుచుఁ గొండ ముచ్చువలె గంతులువేయుచుఁ జేతులు బారలు జాపుకొని యాడుచుఁ దనకోపములోఁ గొంతభాగము నీవిధముగ వాక్యరూపమున వెళ్ళబుచ్చెను. "పునహా సతారాలలోజేరి పీనుగులు మోసుకొనునట్టివానికి మాణిక్యమువంటిపిల్లను దీసికొని వచ్చి కట్టబెట్టుట నాదే బుద్ధితక్కువ. తనవంశ మెక్కడ నిలువకపోవునో యని భయముచేత నాపిల్ల నిమ్మని యెందరిచేతనో నాకు వర్తమానమంపి నాకాళ్ళు, కడుపు బట్టుకొని బ్రతిమాలుటచేత బ్రాహ్మణవంశ మొకటి నిలువబెట్టిన పుణ్యము, బ్రతిష్టయుఁ గలుగునని పిల్లనిచ్చితిని. లేనియెడల నఋవదియేండ్ల వానికి నేను నాపిల్లనిత్తునా? పెద్దవాఁడైనప్పటికి సాంప్రదాయము కలవాఁడు పరువుగలవాఁడు గదా యనుకొంటిని గాని పరువుమర్యాదలు లేని వంటపూటివెధవ యనుకొనలేదు. ఇది యేమి పాడుగ్రామమొ కాని యా దరిద్రగొట్టు గ్రామమునుండి యెన్నిసారులు పయనమై పోవఁదలచినను దుశ్శకునములె. ఊరునిండా మాయపిల్లులు, మాయముండలు. ఇంటిలోనుండి వీధిలోని కడుగు బెట్టితిమా యెదురుగా నొకముండ సిద్ధము. తొంగి చూచితిమా యెక పిల్లి సిద్ధము. శని గాని ప్రతిష్ఠగల గ్రామములో నింతకంటె నెక్కువుండునా! ఛీ! నాగౌరవము గంగపాలు చేసినావు. నాపరువు బండలు చేసినావు. నేనెంతో గౌరవముఁగ గాలక్షేపము సేయుచున్నాను. అత్తమామలకు నాలుగుదినములు పట్టెడన్నమైనను బెట్టలేక లేవఁగొట్టిన నీ పరువు మీఁద నిప్పులు పోయ, నీదిగూడ నొకబ్రతుకట్రా. ఇరుపార్శ్వముల నన్నదమ్ములుగాని యక్క సెల్లెండ్రుకాని చుట్టములుఁ బక్కములుగాని లేని సన్యాసి ముండాకొడుకు; వీఁడు దిక్కుమాలిన పాడకట్టు; గంజికాచి పోసెడు దిక్కైనలేదు; పెండ్లియైన మరునాటి నుంచియు సోలెడుబియ్యము తానే పొయ్యిమీఁదఁ బెట్టుకొని చేతులు గాల్చుకొని నిత్యవిధిలాగున వండుకొని తినవలె పాపమని జాలిపడి ఉపకారబుద్ధిచేత నేను పదిదినములు పనులు చెరుపుకొని గంపంత కమాటము వదలుకొని రెండుపూటలు నాభార్యచేతనే మడికట్టించి యీవల చెంబావలఁ బెట్టియెఋఁగని నాకూతురుచేత పయిపని చేయించి వేడిచేసి నాకళ్ళుమసకలు గ్రమ్మినప్పటికి నాలోనేనే యోర్చుకొని నేను కూలివానివలె రాత్రింపవలు చాకిరీ చేయగా నా చాకిరీ విషమమైనది. ఛీ, నీకొంపలో నేనొక్కగడియ యుండను. ఓసీ! ప్రయాణమ్మై మూఁట గట్టవే. పిల్లను పిల్లవానిని లేపవే, ఈ రాత్రి నీకొంపలో నుంటివనా ఛండాలుఁడే సరి"

అని లోనికివెళ్ళి నిద్రపోవుచున్నపిల్లలను లేపి తనబట్టలు కొన్ని, పాపయ్య బట్టలుకొన్ని, తన చెంబులు కొన్ని, పాపయ్య చెంబులు కొన్నికలిపి మూటగట్టుకొని యామూట నెత్తిని బెట్టుకొని యాలుబిడ్డలను వెంటబెట్టుకొని "నాకంఠములోఁ బ్రాణముండగాఁ నేనీకొంపలో దిరిగి యడుగుపెట్టను. ఇంతయవమానము జేసిన తరువాత నే నీ గ్రామము మరల రాఁగలనా? నేను కూటికి మొగము వాచలేదు. గుడ్డకు మొగమువాచలేదు. అల్లుఁడు పదియవగ్రహ మన్నమాట నాకిప్పుడర్థమైనది. నేటితో నాకు నాపిల్లకు ఋణముదీరిన" దని గుమ్మము దిగెను. ఆపలుకులకు మిక్కిలి కవలి పాపయ్య పునహానుండి తెచ్చిన దుడ్డుకఱ్ఱతో రెండుదెబ్బలు దీయఁదలఁచెను. కాని

నూతి నరసింహ మతనిని వారించి మెల్లగా నన్నప్పతో నిట్లనియె అన్నప్పగారూ! మిరు కొంచెము శాంతించవలెను. మీ యల్లుఁడు విశేషముగ ధనమున్న సంసారికాఁడు గనుకను నతని క్షేమము గూడ మీరు చూడవలయును గనుకను రెండు సంసారములు నతటు భరింపలేడు గష్టనిష్టురములు చెప్పుకొనుటకు మీరుతప్ప యతనికి మఱెవ్వరు లేరు గనుకను నేను మీ యుభయులకు గావలసిన వాఁడను గనుకను నాచేత రహస్యముగఁ దనసాధక బాధకములు వర్తమాన మంపినాఁడు. దీనికి మీరింత కోపపడవలసిన పనిలేదు. ఈ రాత్రియె వెళ్ళవలసిన యవసరము లేదు. స్థిమితముమీఁదఁ వెళ్లవచ్చును. అర్ధరాత్రమువేళఁ జిన్నపిల్లలను దీసికొని మీరెక్కడకు వెళ్ళగలరు? కాబట్టి యీరాత్రి యిక్కడ పండుకొని రేపుభోజనముచేసి వెళ్లవచ్చును నిలువుడి." అని వేడుకొనుటయూ నన్నప్ప దెబ్బతిన్న త్రాఁచువలె నాగ్రహము రెట్టింప "నీ రాత్రిగాదు కదా గడియ యిక్కడుండను. అన్నంభొట్లవా రంటే యొక్క మాట మీఁదనె నిలఁబడగలవారు. ఇతని యింటిలో నిద్ర పోవుటకంటె శ్మశానములో నిద్రపోవుట మంచిది. నన్ను పలకరించవద్దు. నా నోరు మంచిదికాదు. మీయిద్దఱిపరువు సమానము గనుక మీకు కలిసినది, నాకుమీతో గలియదు. ఈ యాఱుమాసములు విధిలేక ముండ్లమీఁదు న్నట్టున్నాను. వెనుకదిక్కు లేనివారి నొక్కనిని విడిచి వెళ్ళినానను నింద నానెత్తిమీఁద లేకుండ మీ నోటితో మీరే వెళ్ళు మని చెప్పినారు కావున నింద నామీఁద లేకుండ సరిపోయింది. నన్ను మీరాపవద్దు, ఇదిగో వెళ్ళుచున్నాను" అని విసవిస నడువసాగెను. నిద్రామధ్యమున మేలుకొలుపఁ బడుటచేఁ గొడుకుఁ గూతురుఁ గన్నులు నలుపుకొనుచు వెంటఁ జనిరి. బిడ్డలవెనుక భార్య యరిగెను. అట్లువారు పయనమై రెండవ వీధికరిగి యొక్క యరుగుమీఁద బండుకొని తెల్లవారుజామున లేచి మరల పయనమై రేవుదాటి స్వగ్రామము జేరిరి. నాఁడు మొదలుకొని పాపయ్యకు మామగారికి నోటిమాటయు గంటిచూపును లేవు. ఉత్తర ప్రత్యుత్తరము లంతకుముందే లేవు. పాపయ్య మామగారి పోక శనిగ్రహవిమోచన మట్లు తలంచి తల తడిమి చూచుకొనెను. వివాహమైన రెండు సంవత్సరములకు భార్యయుక్తవయస్కురాలైనదని పాపయ్యకు వర్తమానము తెలిసెను. కాని మామగారు శుభలేకవ్రాయలేదు. పాపయ్య స్వయముగావెళ్ళి నిజస్థితిఁ గనుగొని యా వార్త నిజమయ్యేనేని పునస్సంధానము చేయవలసిన దని యడుగఁ దలఁచెను. కాని యల్లు డదివఱకు చేసిన మహాప రాధమును మరువఁదలఁచినను మామగారికి మరపు రాకుండుటచేత నతఁడు తన్నింటికి రానిచ్చునా, తనకు బట్టెడన్నము బెట్టునా, సొమ్ము కర్చుపెట్టియతఁడు పునస్సంధానముజేయునా యని సందేహము దోఁచెను. అందుచేత నతఁడుస్వయముగా వెళ్ళుటకంటె రాయబార మంపుట మంచిదని చెరువు సీతారామయ్య యను బంధువును మామకడ కంపెను. అతఁడు మూలస్థానము వెళ్ళి యన్నప్పగారిని గలిసికొని కూఁతురు రజస్వలయైనమాట సత్యమని యతనినోటనె విని పునస్సంధానము మాట తలపెట్టెను. అల్లునిమాటఁ దలపెట్టగానె యన్నప్ప నిప్పులుత్రొక్కిన కోఁతివలె చిందులు త్రొక్కి బిగ్గరగ నఱచుచు నిట్లనియె. "పాపయ్య కిప్పుడేను మామగారి నైనాను గాఁబోలు, నాకిప్పుడాయన యల్లుడైనాఁడు గాఁబోలు, చీఁకటిలో జాము రాత్రివేళ నన్ను తనయింటనుండి యాలుబిడ్డలతోగూఁడ లేవగొట్టినమాట తాను మఱచినను నేను మరువలేదు. నాడొక్కలో శూలించుచున్నది. అది జన్మజన్మములకైనను నాకు మఱపురాదు. నేను మధ్య వాళ్ళమాట నమ్మి నిష్కారణముగా నాపిల్లగొంతుక కోసినాను. అటువంటి మగనితో నాపిల్ల కాపురము చేయుట కంటె నాకు రెండవ మగపిల్లవాఁడు లాగున నాబంతి నింత యన్నము దిని యిచ్చుటనె

యుండగలదు. అత్తలెదు. ఆఁడబిడ్డలెదు, ఏకాకి ముండాకొడుకు వాఁడు. కాలు నొచ్చును, చెయి నొచ్చును, పిలిచినా పలుకువారులేరు; పట్టెడన్నము కంచములో బెట్టువారు లేరు; నారాయణ నారాయణా యీ పిల్లమాటే తలఁచుకొని నేను బెంగపెట్టుకొన్నాను. ఇన్నిమాటలెందుకు? నేను పునస్సంధానముజేయఁ దలంచుకొనలేదు." అనవుడు సీతారామయ్య శాంతివచనముల నతని బతిమాలి కట్టకడపట నిట్లనియె "మహర్షులవంటి మహానుభావులు సయితము మనుష్యులు చేసిన పాపముల పరిహారము నిమిత్తము ప్రాయశ్చిత్తము విధించిరి. ప్రాయశ్చిత్తము లేనిదోషము లేదు. పొరబాటు లెవరివల్ల వచ్చినను, వచ్చినవె. అందుచేత పాపయ్యకుఁ గూడ నేదో ప్రాయశ్చిత్తము విధించండి. అనగా మీకాళ్ళు పట్టుకొని మిమ్ములను బతిమాలు మని చెప్పండి. ఏదోవిధముగ మనలో మనము సర్దుకొని పిల్లకాపురము పొత్తుచేయవలెను. కాని చెడగొట్టుట మంచిదికాదు." అని పలుక నన్నప్ప తల పైకెత్తి కొంచమాలోచించి "సరే; పెద్దలు చెప్పినారు గనుక మీ మాటప్రకారము నేను నడచుకోదలచుకొన్నాను. ఏదోప్రాయశ్చిత్తము విధించుమన్నారు; గనుక మూఁడువందల రూపాయలు మూటగట్టి నాచేతికిచ్చిన పక్షమున మును పైన దేమిటో యైనదని వెనుకటిదంతయు మఱచి కార్యము చేసెదను. లేదా నాపిల్ల విధవాడ పడుచువలె నాయింటనెయుండును. ఈమాటలె పాపయ్యకు జెప్పండి; మూటలెగాని యిఁక మారుమాట లక్కఱలేదు. ఇన్నిమాటలులేవు నాతో" నని కంఠోక్తిగఁ బలికెను.

ఆ సందేశమును సీతారామయ్య యథోక్తముగఁ బాపయ్య కెఱిగించెను. మూఁడువందలరూపాయ లిచ్చుట యతని కిష్టములేదు. చేతులార పిల్లను వదలుకొనుట కంత కన్న నిష్టములేదు. కొన్ని దినములు వితర్కించి వితర్కించి యెట్టకేలకు మిత్రుల ప్రోత్సాహమున మూఁడు వందలరూపాయలలు మూటగట్టి సీతారామయ్య చేతనే పంపెను. వెండిబంగారములు బరిశుద్ధ పదార్థములె కావున స్వీకతించినవారి మనస్సులు గూడ పరిశుద్ధములు చేయును. రజతదర్శనము చేత నన్నప్ప కోపమంతయు నుపశమించెను. వివాహము పెండ్లి కొడుకువారియింట జరిగినప్పుడు పునస్సంధానముగూడా నచ్చట జరుపవలెనని యన్నప్ప నియమముఁ జేసికొని సకుటుంబముగ మరల మందపల్లి వెళ్ళెను. బ్రహ్మచర్యమువదలి భార్యతో నేకమైనం జాలునని పాపయ్యవారిని సగౌరవముగ నెదుర్కొని తీసికొనివచ్చెను. ముహూర్తమేర్పడెను. పునస్సంధానమయ్యెను. క్రొత్తపిల్ల యగుటచేత సిగ్గుపడుననియు మగనిదగ్గఱ బెదురు తీరలేదనియు వంట నేర్పవలసియున్న దనియుజెప్పి యన్నప్ప గర్భాదానమైన యాఱుమాసములవఱకు మందపల్లిలో నుండెను. మామగారి కోపపు వేఁడిమి మున్నూరురూపాయలను గ్రక్కించినందున నీసారి పాపయ్య నోరెత్తి పలుకలేదు. అత్తగారి యిష్టప్రకారము మామగారి యిష్టప్రకారము నడచుకొనెను. అంతలోనన్నప్పగారి పూర్వజన్మసుకృతము చేతనో ఈజన్మసుకృతము చేతనో పిచ్చమ్మకు నెలతప్పెను. వేవిళ్ళు ప్రారంభమయ్యెను. వేవిళ్ళబాధ పడుచు నిజముగ నొకపట్టెడన్నమైననుదినక మంచము మీఁదనుండి సరిగ లేవకయున్న కూతు నొక్కరితఁ సత్తాడు బిడ్డలులేని యత్తవారియింట విడిచిపెట్టి యెంతనిర్దయులైన తలిదండ్రులైనను వెళ్ళఁజాలనప్పుడు తన పుత్రికయె తనపాలిటి భాగ్యదేవతయని కల్పవృక్షమని భావించుకొనుచు బ్రియపుత్రికనెడబాసి యుండుటకన్న లోకనిందకైన నోర్చి దానిదగ్గఱనె యుండుట మంచి దనుకొనుచున్న గారాబు తలిదండ్రులు విడిచి రాగలరా? రమ్మని జాతిగుండెవాఁడైన ననఁగలడా? అక్కడ నుండబట్టి తన కెన్నోపనులు చెడిపోవుచున్నవనియు దనకు వెళ్ళకతీరదనియు జెప్పి యన్నప్ప రెండు మూడుసారులు

పయనమయ్యెను. కాని యీసారి యల్లుడెబతిమాలి యాయననాపెను. అల్లుని మాట నన్నప్ప తీసివేయలేక యాగెను. పిచ్చమ్మకు తొమ్మిది నెలలు నిండెను. పదియవ మాసమున మూడుదినములు కష్టపడి యామె సుఖముగఁ బ్రసవించెను. మగశిశువు గలిగెను. ఏఁడవనాఁ డాశిశువు పోరుపెట్టెను. పిచ్చమ్మతల్లి కన్నప్ప గారి తండ్రి గంగయ్య కలలోఁ గనఁబడి తనపేరు పెట్టుమని కోరెను. అట్లె చేయుదుమని యింటిల్లిపాది మ్రొక్కుకొనిన తోడనే శిశువు పోరుమానెను. పదునొకండవనాఁడు పురిటిశుద్ధి కాఁగానె బారసాల యయ్యెను. బాలునకు గంగాధరుఁ డని పేరుపెట్టిరి. చంటిపిల్ల తల్లిని విడిచిపెట్టిపోవుటకు మనసొప్పక విధిలేక యన్నప్ప యల్లుఁడును, మఱికొందఱును బతిమాలిన పిదప మనుమనికి నాలుగు మాసములు వచ్చువఱకు నుండదలఁచెను. తరువాత నాఱవమాసమున నన్నప్రాశనము కాఁగానె యాముచ్చటఁ జూచి వెళ్ళదలచెను, అన్నప్రాశమైన తరువాత ప్రయాణమునకు మంచిముహూర్త మన్నప్ప వెదకిపెట్టెను. ఆముహూర్తపటుత్వ మెట్టిదో కాని యాసమయమున కన్నప్పగారి ప్రయాణ మాగిపోయి పాపయ్య కూర్ధ్వలోక ప్రయాణము సంప్రాప్తమయ్యెను. గొప్ప జ్యోతిష్కుఁడు పెట్టిన ముహూర్తమగుటచే నప్పుడెవరికో యొకరికి ప్రయాణముకాక తప్పినదికాదు. పాపయ్య యదివరకు మూఁడు నాలుగు దినములనుండి వరుసగ శ్రాద్ధభోక్తయై పెసరపప్పు గారె లరిసెలుఁ దినియెను. వారక మగుటచే నమితభోజనము సరిపడకపోయెను. ఆ దినములలో మందపల్లిలో మరిడీజాడ్యములు బయలుదేరెను. పాపయ్య దానివాతఁబడెను. లోకమునకు విశ్వాసములేదు. కోటి యనాథప్రేతలను గట్టిపుల్లల వలె కాల్చిన పాపయ్యను ముట్టిచేయుట కెవ్వరు రారైరి. ఎట్టకేలకు మామగారును మఱియొకరును సాయముపట్టి యెట్టెటో సంస్కారము జేసిరి. అన్నప్ప మందపల్లి విడిచి పెట్టి వెళ్ళుటకు శాశ్వతముగ వీలు లేకపోయెను.

# ఐదవ ప్రకరణము

మనుష్యులు గతింప వచ్చును; కాని వారు సంపాదించిన యశస్సు వారి యనంతరమునఁ జాలకాలము నిలుచును. పాపయ్య కాలధర్మము నొందినాఁడు. కాని యతఁడార్జించిన ధనము చాలవఱకు వ్యయమైనను యశస్సు తరుగలేదు. వేదశాస్త్రంబులు చదువుకొననివారు జదువుట వ్రాయుటచేతగానివారు హాయిగా శవములు మోసికొని బ్రతుకవచ్చుననియు ధన మార్జింప వచ్చుననియు నాంధ్ర ప్రపంచమునకు బోధించిన ప్రథమాచార్యుఁ డతఁడే కదా. స్వదేశమున నన్నవస్త్రములు దొరకనప్పుడు విదేశములకు వెళ్ళి ప్రఖ్యాత పురుషులు కావచ్చునని తెనుఁగునాఁడు వారికి నేర్పిన పరమ గురువతఁడే కదా! ఏఁబది సంవత్సరముల వరకు స్వకాయకష్టపడి ధన మార్జించి తాను సంపాదించిన విత్తము విదేశములలో వ్యయముఁ జేయక స్వదేశాభిమానముఁ గలిగి వార్ధక దశయందు స్వస్థలమునకువచ్చి స్వగ్రామాభిమానముఁ బూని మందపల్లిలోనే నివసించి తాను జన్మించిన చోటనే మృతినొందిన దేశాభిమాని యితఁడే కదా! అందుచేతఁ నతఁడాంధ్రుల కందఱకుఁ గాకపోయినను నతని యభిప్రాయముతో నేకీభవించు వారికైనను మాననీయుఁడు. ఈతని మార్గ మనుసరించి యీనాఁడు సయిత మాంధ్రులనేకులు విదేశములోనె గాక స్వదేశములో గూడ నౌకరి నాశ్రయించవలసిన పనిలేని యావృత్తి నవలంబించి జీవయాత్రను జరుపుచున్నారు. పాపయ్య యొక్క యుత్తరక్రియలు నెరవేర్చిన తరువాత నన్నప్పకూఁతురు దగ్గఱచేరి యామెకు సంభవించిన దురవస్థకు మఱియొకసారి విలపించి యిట్లనియె. “అమ్మాయీ! నీమగనియొద్ద గొప్పగానో కొంచెముగానో ద్రవ్యమున్నట్లు విన్నాను. అతఁ డది యితరులకు బదులిచ్చి యున్నాఁడు. దస్తావేజులమీద నిచ్చినాఁడో నోట్లమీఁద నిచ్చినాఁడో తెలియదు. కాగితములు ముందుగఁ జూడనీ. ఊరకుంటిమా కాలదోషము పట్టగలదు. అటుతరువాత మనము చేయవలసిన పనిలేదు. చీమతలకాయంత సందు దొరకెనా యప్పు పుచ్చుకున్న వాండ్రెగబెట్టుటకె ప్రయత్నము సేయుదురు. లోకులు దుర్మార్గులు అందులో నీయూరివారు మరియు దుర్మార్గులు. అందుచేత సందువాపెట్టి తాళముచేయి నాచేతికిమ్ము; కాగితములు చూచి యవసరమైనపని చేసెదను.” అని బుజ్జగించి పలుకుటయు దుస్సహమైన నవవైధవ్య దుఃఖమున మఱుగుచున్న పిచ్చమ్మ తన ప్రాణములు దాఁచిన పెట్టెతాళమిచ్చినదో యన్నట్లు సందువాపెట్టె తాళముచేయి దండ్రిచేతి కిచ్చెను. ఆతఁడు మెల్లగా నందులోనున్న నోటులన్నియుఁ దీసిచూడఁగా మొత్తము పదియేనువందల రూపాయలుండెను. ఆకాగితములు తీసికొని వెంటనే యతఁడు బాకీదార్ల వద్దకు వెళ్ళి యానోట్లు తిరిగి తనపేర వ్రాయమని కోరెను. భార్యయుండగఁ గుమారుఁ డుండ మీపేర నేల వ్రాయవలయునని యందుఁ గొందరడిగిరి. అట్టియనవసర ప్రశ్నముల కన్నప్ప యిట్లుత్తరము చెప్పెను. “అయ్యా! మీరనుమానించవద్దు. నా బిడ్డసొమ్ము నాకక్కఱలేదు. మగపిల్లలకంటె నాకాఁడుపిల్లల మీఁదనె ప్రేమ యెక్కువ. నా సొమ్ముదానికి పెట్టదలఁచుకొన్నాను. కానియెడల నీపదియేనువందల రూపాయలేమూలలకు సరిపోవును. పిల్లవానికి వడుగు గావలెను; చదువు సంధ్యలు చెప్పించవలెను. బట్టలు పాతలు గావలెను. సంసార మనఁగా సముద్రము. మీకు తెలియని దేమున్నది. అదిగాక యీ వ్యవహారములో నేదైన నొకటి కోర్టుకెక్కెనా నాకూఁతు రాఁడదిగదా. అది కోర్టుకు రాఁగూడదు కదా? పిల్లవాడు కోర్టుకు వెళ్ళు టంతకంటే వీలులేదుగదా? నేనే కోర్టుకువెళ్ళి యావత్తు గ్రంధము

జరిపించవలసిన వాడను. గనుక నాపేరనె కాగితము లున్నపక్షమున నెంతొ విలుగనుండును. నామాట వింటిరా మీకేదో కొంత సదుపాయము జేసెదను. ఆమాట నోట రాఁగానే కొందఱు బాకీదారులు వడ్డీమాను మనిరి. కొంద రసలులోఁ గొంత తగ్గించు మనిరి. కొందరు కొన్నిశంకలు బయలుదేరఁ

పిల్లవాఁడు చిన్నవాఁడు కదా అతఁడు పెద్దవాఁడైన తరువాత వెనుకటి కాగితములను బట్టి మామీఁద వేజ్యం వేసి మాకొంప లమ్మించును. అప్పుడు మీరును మీ మనుమఁడును సుఖముగ నుందురు, నడుమ మేము చెడిపోవుదుము. దీనికేమి చెప్పుదురని వారు స్పష్టముగ నడిగిరి. సమయోచితి బుద్ధికి బృహస్పతి యని చెప్పఁ దగిన యన్నప్ప దానిఁకి దగినయుత్తర మీయలేకపోవునా? పాపయ్య పేర నున్న నోట్లు మీ యెదుట జించివైచెదను. క్రొత్తగా మీరు నాయొద్ద బదులు పుచ్చుకొన్నట్లు నోట్లువ్రాసి యియ్య వచ్చును. మీరు నాకు వడ్డీ యియ్య నక్కఱలేదని పలికెను. ఈ యేర్పాటు బాకీదార్లకునచ్చెను. అందరును దిరిగి యన్నప్ప పేర నోట్లువ్రాసి యిచ్చిరి. ఇటువంటి విషయములలో నన్నప్ప మాట దప్పనివాడు. కావునఁ దనయల్లుని పేరనున్న వెనుకటి నోట్లు వానియెదుటనె ముక్క ముక్కలుగఁ జించిపారవైచెను. తాను వ్యవహారములో జేసినమార్పు కూతురి కెఱిఁగింపలేదు. ఎందుల కెఱిగింపలేదని యడుగుదురేమో, మగని పేరు చెప్పిన మాత్రమునను వానికాగితముల విషయమెత్తిన మాత్రమునను వాని సొమ్ముమాట సంస్మరించిన మాత్రమునను సముద్రమువలె దుఃఖము పొరలి పొరలిరాఁగా బిడ్డ బెంగఁ బెట్టుకొనునని చెప్పక యుండవచ్చును. లోకులు కాకులన్న మాట నిజము. కూఁతురు మనుమఁడు కోర్టులెక్కవలసిన యవసరం లేకుండ నొక్క బాకీదారుని యింటికివెళ్ళి యడుగవలసిన యవసరం లేకుండగా గాలదోష మెప్పుడు పట్టునోయని కాగితములు చూచుకొన వలసిన యవసరం లేకుండ నన్నప్ప కూతురుసొమ్ము తనసొమ్ముగ మనుమని వ్యవహారము తనవ్యవహారముగఁ జూచుకొనుచుండఁ గిట్టని వాండ్రు కొందఱు లేనిపోని నిందలతనపై వైచిరి. ఎవరేమకొన్న నతనికేమి? అతడు చేయఁదలచుకొన్న పని సూటిఁగ జేసెను. దూషణ భూషణ తిరస్కారంబులు దేహంబునకు గానిపరమాత్మకు లేవన్న మాట యన్నప్పకు సార్థకముగఁ దెలియును. బంధువులు గ్రామస్థులు బిల్లవాని కేమైన గొంత యాస్తి గలదాయని యన్నప్ప నడిగినప్పు డతఁడిట్లు చెప్పు చుండెను. "పాపయ్య పునహాసతారాలు వెళ్ళి యేదోమాట సంపాదించి తెచ్చినాడన్న పేరేగాని ప్రాణము బోవునప్పటికి పట్టుమని పదిరూపాయలు లేవు. దినవారములకర్చు నేనే పెట్టితిని. పిల్లవాఁడు మీ గ్రామస్థుడగుటచేతను, పాపయ్య మిమ్మునే నమ్ముకొని యుండుటచేతను మీరే వీరిని గాపాడవలెను".

ఇట్లనుటలో చిన్నప్ప యసత్యమాడెనని మనము తలంపఁగూడదు. పాపయ్య పోవునప్పటి కింటిలో రొక్కము పది రూపాయాలైన లేనిమాట నిజమే. ఉన్నసొమ్ము బదులిచ్చి యుండుటచే నన్నప్ప దినవారములకు కర్చుపెట్టిన మాట నిజమే. దినవారములు నలువది రూపాయలలో దేల్చెను. పాపయ్య కుటుంబమును గ్రామస్థులు పోషింపవలసిన మాట నిజమే. ఏలయన మనపాపయ్య భార్యపేరగాని కుమారుని పేరగాని చిల్లిగవ్వలేదు.

అల్లుఁడు పోయిన తరువాత నన్నప్ప యాఱు మాసముల కాలము మందపల్లిలో నుండి పిమ్మట మూలస్థానము వెళ్ళవలసిన పనియున్నదని ప్రయాణము లారంభించెను. అల్లుఁడున్నప్పుడతనికి మంచి తిథిగాని ముహూర్తముగాని శకునముగాని దొరకుటయె

దుర్లభమయ్యెను. ఈసారి ప్రయాణయోగ్యములైన మంచితిథు లనేకములు లభించెను. తన్ను విడిచి వెళ్ళవద్దని కూతురు బహువిధముల బతిమాలెను. పరమార్థముల నెఱిగి పనిచేయువారికడ స్త్రీల దీనాలాపములు పనిచేయునా? దీనురాలైన బిడ్డలను విడిచివెళ్లుట న్యాయముకాదని గ్రామస్థులు మందలించినప్పు డన్నప్ప వారి కిట్లనియె. "అయ్యా! మీకేమి? పై నుండి యెన్నిమాటలైన జెప్పవచ్చును. మునుపు పాపయ్య సంపాదించి తెచ్చిపట్టుచుండెడివాడు గనుక నేనెన్ని దినము లున్నప్పటికి విచారము లేకపోయెను. క్రొత్తడబ్బు వచ్చునట్టి విధములేదు. నా కుటుంబముతో నేనిక్కడఁ గూర్చుండి తిన మొదలు పెట్టితినా వాళ్ళ కొంపగూడ పోవును. నేను నాయింటికి వెళ్ళి నాపొట్ట నేను పోసికొంటినా నాబిడ్డకు భారముండదు. దాని గంజియది త్రాగి దాని యిల్లది దిద్దుకొనుచుండెనా నేనప్పుడప్పుడు వచ్చి చూచిపోవుచుందును. ఇలా నాబిడ్డ క్షేమము కొఱకు చేయుచున్న పనిగాని మఱియొకటి గాదు. "ఆ యుత్తరము విని నమ్మినవారు నమ్మిరి. నవ్వినవారు నవ్విరి. విచారించిన వారు విచారించిరి. ఎన్ని విధములఁ దాను బ్రతిమాలినను వినక తండ్రి వెళ్లిపోవుటకై సంకల్పించుకొని యున్నాఁడని దృఢవిశ్వాసము దోఁచిన తరువాత నొకనాటిరాత్రి పిచ్చమ్మ తండ్రినిఁ బిలిచి దగ్గఱఁ గూర్చుండి పిల్లవాని నతని యొడిలో బెట్టి పొరలి పొరలి వచ్చు దుఃఖమాపుకొనలేక కొంతసేపేడ్చి గద్గదస్వరముతో నిట్లడిగెను. "నాన్నా! మీ యల్లుడు పోయి యిప్పటి కెనిమిది మాసములైనను నేను నోరెత్తి మాటలాడలేదు. ఏమున్నదో యేమి లేదో నే నెఱుఁగను. అర్థప్రాణములు నీచేతనే బెట్టితిని. నిన్నే నమ్ముకొంటిని. లోకులు కొందఱు మనకు సొమ్మియ్యవలెనని చెప్పితివిగాదా. ఆ సొమ్మేమైనది? పుట్టెడు దుఃఖముతో నున్నదానను నేనేమొగము పెట్టుకొని నిన్ను వ్యవహారము విషయమై యడుగనని నీవే నాకప్పగింతు వని యింతకాల మూరకొంటిని. నీదారిని నీవు వెళ్ళుచున్నావు. నాగతియేమిగా"నని అడుగుటయు నన్నప్ప హిమవత్పర్వతమువంటి ధైర్యహీనుఁడు గాక నిబ్బరమైన మనస్సుతో నిట్లనియను. "అమ్మాయీ! నీ భర్త మృతినొందు నప్పటికి నీకు నాలుగైదువందల రూపాయలు లోకులవల్ల రావలెను. ఎక్కువవడ్డీ కాసపడి పాపయ్య పైమీఁద బట్టలులేని ఫకీరు కప్పిచ్చెను. ఆ సొమ్ము చెట్టెక్కెను. ఒకఁడైనను నియ్యలేదు. నేను నానాకష్టములుబడి రేయింబవళ్ళు తడిమన్ను పొడిమన్నగునట్లు వాళ్ళ యిండ్లచుట్టుదిరిగి రెండువందల రూపాయలు వసూలుచేసినాను. ఆసొమ్ము మన మీయెనిమిది మాసములనుండి తినివేసినాము. నీగతి యేమందువా? ఇల్లు తనఖాబెట్టి నూరు రూపాయ లెవరివద్దనైన బదు లిప్పించెదను. ఆ సొమ్ముతో మీరిద్దఱే గనుక నొక సంవత్సరము కాపురము చేసితిరా తరువాత దేవుడున్నాఁడు. ఈ లోపుగ నేను కాలు చెయ్యి గూడదీసుకొని నీయప్పు నేనే తీర్చి నీకేదో యుపాధి గల్పించెదను. నిన్ను నేను వదలిపెట్టి యూరకుందునా? నాకవతల వ్యవహారమొకటి మించిపోవుచున్నది. గనుక నన్ను వెళ్ళనీ. నీ భర్త పోవుచు నిన్ను నీ బిడ్డను నా మెడకు గుదికట్టవలె గట్టిపోయినాడు." అని పలుకఁ దనపని వట్టిదయ్యెనని తెలిసికొని పిచ్చమ్మ కొంతసేపు వలవలయేడ్చి కొంత దుఃఖోప శమనమైన తరువాత "సరే; యిల్లు తనఖాపెట్టి రూపాయలుతెచ్చి యిచ్చి వెళ్ళు. తరువాత దైవమే యున్నాఁడని తన బిడ్డను దీసికొని గదిలోనికి వెళ్ళిపోయెను. ఆ మరునాఁ డన్నప్ప మనుమనిపక్షమున గుమార్తెను సంరక్షకురాలుగా నేర్పరచి యామెచేతనే నిశానిబెట్టించి నూరురూపాయ లిప్పించి తన బత్తెఖర్చుక్రింద రెండు రూపాయలుమాత్రమందులోనుంచి తీసి రెండుదినముల తరువాత మందపల్లి విడిచి మూలస్థానమునకు సకుటుంబముగఁ బోయెను. తరువాత మాసికములు పెట్టుటకుగాని తదితర కార్యక్రమములకుగాని యన్నప్పమందపల్లివచ్చుట కెంతమాత్రము దీరిక

లేకపోయినది. పిల్లవానికి జబ్బుచేసినదని పిచ్చమ్మ వర్తమానము పంపినప్పుడైనను వచ్చి చూచిపోవుటకు సయిత మన్నప్ప కవకాశము గలిగినదికాదు. బహు కార్యాభారము పైన వేసికొన్నవారికి బంధుసమాగమము దుర్లభముకదా. పాపయ్యయొక్క సంవత్సరీకమున కైనను మామగారు రాఁజాలకపోయెను. మందపల్లిలోనున్న కాలమున నల్లునికి ప్రతి మాసిక మాసికమునకు మిక్కిలి శ్రద్ధతో నన్నప్ప నెతిగారెలు గారపుగారెలు కరకరలాడునట్లు మఱియొక వెపు రానిచ్చి వండవలసినదని వంటలకువచ్చినవారితో జెప్పుచుండుటచేత గారెలమీఁద ప్రేమచేతనైన సంవత్స రీకమునకుఁ దప్పక వచ్చునని యెఱిగినవా రనేకులనుకొనిరి. కాని కావలసినప్పుడెల్ల గారెలువండుకొని తినుటకు దగిన యేర్పాటు పాపయ్యవలన శాశ్వతముగ జరిగినందున నతఁడు రాలేదు. సంవత్సర మిట్టె తిరిగివచ్చెను. నూరు రూపాయలు గవ్వలవలె కర్చయ్యెను. అందుచేత మరల నూరురూపాయలు పిచ్చమ్మ బదులు పుచ్చుకొనియెను. నాలుగు సంవత్సరములగునప్పటికి యిల్లమ్మి వేయవలసివచ్చెను.

# ఆఱవ ప్రకరణము

కూతురు గృహ మమ్ముకొనవలసినప్పుడైన నామెనొక సారి చూచుట కన్నప్పకుఁ దీరిక లేకపోయెను. కాపుర ముండుటకు మందపల్లిలో వారికి మరొకయిల్లు దొరకనందున గంగాధరుని దోడ్కొని పిమ్మట యేనుగుల మహలు గ్రామమునకుఁ బోయెను. మందపల్లి కేనుగులమహలు మిక్కిలి సమీపమున నున్నది. గోదావరి సప్తశాఖలలో నొకటియగు కౌశికి యను పాయ యేనుఁగుల మహలునకు మందపల్లికి నడుమ ప్రవహించు చుండెను. గోదావరిపాయ యను గొప్ప పేరేగాని యదియొక గొప్పకాలువవలె నుండును. మహైశ్వర్యసమన్విత మగు నొక గొప్పకుటుంబము వివాదములు పెరిగి రెండు కుటుంబములుగ భిన్నమైన వెనుక విభక్తకుటుంబ ములు తొల్లింటి సంపదను గౌరవమును గోల్పోయి లోకము లోని సామాన్య సంసారములవలె నుండు పగిది రాజమహేంద్ర వరము కడ విశాలమైన యఖండగౌతమి యను పేరువడసి నేల పైఁ జరచిన గొప్ప నీటి రేకువలె నొప్పుచుండు గోదావరి ధవళేశ్వరమునొద్ద నేడు పాయలుగ జీలిపోయినందున నా పాయలు వైశాల్యమునఁగాని జలసంపదయందుగాని గాంభీర్యమునఁ గాని యఖండ గౌతమిని బోలక సామాన్యనదులట్లు న్నవి. కొన్ని నామావశిష్టము లైనవి. కొన్ని యంతర్వా హినులైన వని చెప్పుదురు. కొన్ని స్వల్పములై గోస్తనీనది మొదలగు చిన్న యేళ్ళవలెఁ బాఱుచుండును. కౌశికి ఇట్టి వానిలోఁ జేరి పంటదినములలో బుష్కలముగ ధాన్యమున్న కతనఁ గడుపునిండ దిని దేహపుష్టి గలిగి ధాన్యమైపోయిన తరువాత పుష్టి లేక బడుగువ లెనుండు పేద రయితువలే వర్ష కాలమున వరద పొడిచి నపుడు కొంచెము విజృంభించి గాంభీర్యము గలిగి దుస్తరమై యుండి శీతకాలమందుఁ గాలినడ కను దాటుట కనువై యుండు వేసంగి యందు నీ రేలేక తిప్పలు బయల్పడి యుండును. వాన కారున నేరు పొడిచి నప్పుడు మంద పల్లి యేనుగుల మహలు లన్నవి వేర్వేరు గ్రామములుగఁ దోఁచును, కాని వేసవి కాలమున నొక్కటే గ్రామమని భావింపవలసియుండును. గంగాధరుఁడు సలభాండ విసర్జము జేసి మందపల్లి విడచి యేనుగులమహలు చేరునప్పటికి రమా రమి యేఁడు సంవత్సరముల యీడుగలవాడై యేనుఁగు గున్నవలెనుండెను. ఏనుగుల మహలునకు రాకమునుపె గంగాధరున కుపనయనముఁ జేయవలయునని పిచ్చమ్మకు సంకల్పము కలిగెను.

బ్రాహ్మణకుమారునకు గర్భాష్టమునం దుపనయనము జేయవలయునని ధర్మశాస్త్రమునం దుండుటచేత నామెకుమారున కేడవయేఁట నుపనయనముఁ జేయఁదలంచెనని చదువరులూహింప వచ్చును. ఆ యూహ సరికాదు. గర్భాష్టమ మేమొ ధర్మశాస్త్రమేమొ పిచ్చమ్మకుఁ దెలియదు. ఉపనయన సంకల్పమున కొక్కటే కారణము గలదు. పేదతనము ప్రధానకారణము. అన్నవస్త్రములకు వారికి మిక్కుటమైన యిబ్బంది కలిగెను. గంగాధరుడు వయసున బిల్లవాడెకాని భోజనవిషయముఁ బెద్దవాఁడని చెప్పవచ్చును. ముమ్మారు మూఁడుసోలల బియ్యమతని కొకవిధముగ సరిపోవుచుండును. తల్లి వితంతువగుటచే మధ్యాహ్న మొకసోలడు బియ్యపన్నము మాత్రమె తిని రాత్రి యుపవసించు చుండును. మొత్తముమీఁద గావలసిన శేరుబియ్యమైన వచ్చెడిదారిలేదు. ఉపనయనము చేసెడు పక్షమున రెండుగ్రామములలో బ్రాహ్మణార్థములు చేయవచ్చును; పొత్తరలు పట్టవచ్చును. ద్వాదశీ

బ్రాహ్మణుఁడుగ నమావాస్య బ్రాహ్మఁణుడుగ నుండవచ్చును; సంభావనకు వెళ్ళవచ్చును. కుమారుఁ డీవిధముగఁ దనపొట్టఁదాను బోసికొనుచున్న పక్షమున పిచ్చమ్మ తానెవరింటనైన చేరి వుదరపోషణముఁ జేసికొన వచ్చు నని యుపనయనముఁ దలపెట్టెను. ఉపనయనము జూచుటకు గాకపోయినను పీటలమీఁద గూర్చుండి జందెము వేయుట కైన నెవరు లేరు గావున నందులకైన నొక్కసారి రావలసినదని పిచ్చమ్మ తండ్రికి వర్తమాన మంపెను. కాని యన్నప్పకు వేదాంతము ముదురుటచే పిల్లవానికిఁ దండ్రిలేని కారణమున జందెమెవడు వేసినది కూలికేయని తలంచి మఱియొకరిచేత నది చేయించ వలసినదనియు దనకుఁ దీరికలేదనియు వర్తమాన మంపెను. పాపము పిచ్చమ్మ యెవ్వరినో బ్రతిమాలి జందెము వేయించి యుపనయనము మైనదనిపించెను. ఏ మంచిమూహూర్తమందు భిక్షాందేహి యనుమాట గంగాధరుని నోట వచ్చెనో కాని జన్మాంతమువఱకు నించుమించుగ నతఁడు దానిని వదలి పెట్టక యేదో విధముగ స్మరించుచు వచ్చెను. అదియె యతనికి తారక మంత్రమయ్యెను. ఉపనయనమైన యొకమాసమున కతఁడు ముందుగా యాయవారమారంభించెను. ఆ గ్రామములో సరిగా వారి సంసారమునకుఁ గావలసిన బియ్యము దొరుకుట దుర్లభమైనందున మధ్యాహ్నము మాధుకరము జేయుచుండెను. శ్రాద్ధభోక్తగా వెళ్ళిన నాఁడు మాత్రము మాధుకరము మానుచుందును. భగవంతుఁడు నిర్హేతుక జాయామాన కటాక్షముచేతఁ గొందఱకు బాల్యమునందె యీఁడునకుఁ దగినప్రజ్ఞ లిచ్చుచుండును. ఈశ్వరానుగ్రహముచేత భగవానుఁడగు శంకరాచార్యుడేడవ యేటనే సాంగవేదాధ్యయన సంపన్నుఁ డయ్యెనట. ఒకఁ డెనిమిదవ యేటనే కవిత్వముఁ జెప్పును. పూర్వజన్మ సుకృతముచేత గంగాధరునకుఁగూడ నట్టి యద్భుతప్రజ్ఞ చిన్న నాఁటనె కలిగెను. అది భోజన విషయమున ప్రజ్ఞ. అతని భోజన మీడునకుఁ దగినది కాకపోవుటచేఁ తల్లిదృష్టిదోషము తగులు నను భయమున గొంతకాలము తరచుగ బ్రాహ్మణార్థములకు బోనీయక మాధుకరవృత్తిచేత సంపాదించిన యన్న మతనికి బెట్టుచు నది మూఁడుపూటలకు సరిపోక యాయవారమెత్తి తెచ్చిన బియ్యము వండిపెట్టుచు గాలక్షేపము సేయుచుండెను. తల్లిప్రాణ మగుటచే బిడ్డ దృష్టి తగిలిన యెక్కడ చెడిపోవునో యని కడు భయపడుచు బ్రాహ్మణార్థముల కతడు పోయివచ్చిన తరువాత మిరపకాయలు దిగదుడిచి పొయిలోఁబోసియుఁ గచ్చిక లాముదములో ముంచి దీపము వెలిగించి చుట్టుద్రిప్పి వీధిలో బారవైచియు నుప్పు దిగదుడిచి నూతిలోఁ బారవైచియు బిచ్చమ్మ బహు విధముల దనయున కంగరక్షణ చేయుచుండును. ఇంటికి జుట్టములు వచ్చినపుడు పిచ్చమ్మ కుమారుని వారి పంక్తికెన్నఁడు రానీయదు. గంగాధరున కన్నాదరువులు విశేషమక్కఱలేదు, తఱవాణిలోని యన్న మూరఁగాయ గాని నీరుల్లి పాయగాని నంజుకొనుచు నది యెంతో యాప్యాయముగ దినును. తరవాణికుండ యతనిపాలిఁటి కమృతభాండమె. పెద్దవాఁడైన తరవాఁతఁగూడ గంగాధరుడు చిరకాల సహవాసముచేత గాబోలు తల్లినైన విడువగలెగెను కాని, యుల్లిని తరవాణికుండను విడువలేకపోయెను. వెయ్యేల? యది యతనికిల వేల్పు, ఈ నాఁటివారు ప్రాతఃకాలమునను పగలు మూఁడవజామునను కాఫీ కానీ టీ కాని త్రాగకపోయినయెడల నెట్లు తల నొప్పులచేత బాధపడి కూర్చుండినచోట నుండి లేవలేక పోవుదురో యానాఁడు గంగాధరుడు గూడ నట్లే యుదయమున తరవాణిఁ ద్రాఁగక యది కలిసిన యన్నము కొంచెము తినక యిల్లు వెడలఁడు. పలు పిండివంటలతో శుభకార్యముల యందును కుడుములు మొదలగు వానితో శ్రాద్ధముల యందును షడ్రసోపేతముగ భుజియించి వచ్చిన తరువాత సయితము గంగాధరుడుఁ

డొకనిద్దుర దిసి సత్తుతపిలెడు తరువాణి త్రాగినగాని యతని ప్రాణము తెప్పరిల్లదు. ఎండబడి వచ్చెనా యతని కదే శరణ్యము. తరవాణి యంతచే టలవాటైనప్పుడు గంగాధరుడు శ్రాద్దభోక్తగ వెళ్ళిననాఁడు సయితము ముందుగా నది కొంచెము పుచ్చుకొని వెళ్లునా యని మీకు సందేహము గలుగవచ్చును. అట్టి సందేహములకు బనిలేదు, శ్రాద్ధము చెడదా యందురేమో; శ్రాద్ధము చెడనీ పితృదేవతలు చెడనీ గంగాధరుఁడు చెడఁడు. అదియునుగాక "అన్నము పరబ్రహ్మస్వరూపము, అది చేసినదోషములే" దని యార్యులు వక్కాణించు ధర్మోక్తులు పండితుల నోట వ్యర్థముగ వచ్చుచుండును గాని యనుభవసిద్ధిఁ గలవు. గంగాధరుఁడా వాక్యములయందు దృఢ విశ్వాసము గలిగి యన్న మెప్పుడు తిన్న నెన్నిమారులుతిన్న నెంతతిన్న నెక్కడతిన్న తప్పులేదని నమ్మి నమ్మినట్లు నడచుచుండును. వివాహాదికార్యములలో నతఁడెక్కడికైన సంభావనలకు వెళ్ళినప్పుడు పదిమందిని జట్టుఁ జేర్చుకొని యతఁడు తరవాణి మీద యుపన్యాస మిచ్చునపుడు విని తీరవలయును. మతిలేని బ్రహ్మదేవుఁ డోర్వలేక యతనిని నిరక్షరకుక్షిని జేసెఁగాని నిజముగ నతనికి విద్యా పరిచయమున్న పురాణమె వ్రాసియుండును. వానింగూర్చి యతడు పెద్దవాఁ డైనతరువాత నప్పుడప్పుడు చేసిన యుపన్యాసములలోని సారాంశములు కొన్ని యాక్రింద నుదహరింపబడుచున్నవి.

"దేవతల కమృతము మనుష్యులకు తరవాణి బ్రహ్మదేవుడు విధించినాడు. అమృతము మీఁద విసుగెత్తి దేవతలు తరవాణి కొఱకు తపస్సు జేసినారు. కాని యిది వారికి దొరకలేదు. గ్రుక్కెడు తరువాణి త్రాగెనా చంద్రుని కళంకమిన్నాళ్ళుండునా? దినమునకు ముమ్మారు మూఁడు సత్తుగిన్నెల చొప్పున తరవాణి మండలము సేవించెనా సాంబమూర్తి కంఠములోని నలుపు హరించిపోదా? ఇది రెండు చుక్కలు నోటిలోఁ బడెనా శివునకు విసముఁదిన్న వెగటు నశింపదా? ఈ తరవాణి త్రాగియె భీముఁడు దుర్యోధనుని తొడలు విరుగఁ గొట్టెను. అర్జునుఁడు శత్రువులను జావఁగొట్టెను. వానరులు వారధిగట్టిరి, ఆంజనేయులు సము ద్రము దాటెను. లక్ష్మణస్వామి మూర్ఛపోయినపు డాంజనేయులు వెట్టిపడి సంజీవిఁ దెచ్చెను. కాని వుప్పుకలపిన పుల్లని తరవాణి గిద్దెడు నోటిలోబోసిన యొక పచ్చియుల్లిపాయ నంజుకొనబెట్టినచో గిరుక్కున లేచి కూర్చుండకపోయెనా? తెలివితేటలు లేవు. తరవాణికుండ నూరావుల పాడిపెట్టు, ఆవులకు గడికావలె, గాదము కావలె ఒకపూట దూడ కుడుచుకొని పోవుట, మఱియొకపూట తన్నీవేయుట మొదలగు చిక్కులు గలవు. తరవాణికుండ కట్టి చిక్కులు లేవు అదిలేని కొంప కొంపగాదు. రోగములువచ్చి నపుడు పాడుకషాయములు రుచిలేని యరఖులు త్రాగి గిజగిజ తన్నుకొనుటకంటే మాత్రవేసికొని తవ్వెడేసి తరవాణి త్రాగితే యెక్కడ జబ్బక్కడ యెగిరిపోవును. తరవాణి త్రాగుమని చెప్పని వైద్యుడు వైద్యుడా? కుడితి పశువుల కెంతబలమొ మనుష్యులకు తరవాణి యంతబలము."

ఇట్లు పలుమా రుపన్యాసములు చేయుటతో దనివిఁ జెందక తరవాణికుండలు కొందరి యిండ్లలో బోధచేసి పెట్టించెను. మిక్కిలి రుచిగానున్న వస్తువు దిన్నప్పు డెవరైన "వహవా! యిది యమృతము లాగున్నదిరా" యని మెచ్చి రేని గంగాధరుఁడు వెంటనే కోపపడి "ఛీ! అమృతము లాగున్నదనుచున్నావా? తరవాణిలాగున్నదని చెప్పు" మని చీవాట్లు పెట్టుచుండును. అట్టివాండ్రు చిన్నవాండ్రైన యెడల నట్టిమాటలిక నెన్నఁ డనవలదని బుగ్గలు నులిమి యొకటి రెండు చెంపకాయలు గొట్టుచుండును. ఇట్లు యాయవర మాధుకర వృత్తులచేతను

బ్రాహ్మణార్థములచేతను గంగాధరుఁడు తనపొట్ట బోసికొని మాతృసం రక్షణముఁ జేయుచుండెను. అట్లు కొంతకాలము నడచెను. గంగాధరునకు మిక్కిలి ప్రియమైన యుల్లిపాయ యొక్క వాసనవలె యతనికీర్తి యెంత కప్పిపుచ్చినను దాగక నలుదెసల వ్యాపించెను. తలుపులు వేసికొని తెల్లవారు జామునసె యెవ్వరు జూడకుండ నతఁడు తరవాణి యన్నము మిక్కిలి రహస్యముగఁ దినుచున్నను లోకులెట్లో యా విషయము గ్రహించిరి. నాలుగుగోడలనడుమ జరిగిన యారహస్య వృత్తాంతము బయట పడుటచే లోకు లనుకొనునట్లు గోడలకు చెవులే గాక నాలుకకూడ నున్నదేమో యని సందేహింపవలసి యున్నది. బ్రాహ్మణార్థములకు వెళ్లినప్పు డపరాహ్ణము తిరిగెనేని తక్కిన బ్రాహ్మణు లాఁకలిచేత గిలగిల లాడుచుండగా గంగాధరుఁ డాకలిదప్పికలు లేక ఱాయివలె గూర్చుండుటచేతను వానినో రప్పుడప్పుడు ఉల్లిపాయ కంపు గొట్టుచుండుటచేతను నతఁడు తరవాణితో నభిషేకము జేసి చల్దికూఁడు నైవేద్యము పెట్టి యాత్మారాముని సేవించి యుండునని గ్రామవాసు లూహించి యొకటి రెండు సారులతనిని బిలిచి యడిగి దూషించి యతనిని బ్రాహ్మణార్థములకుఁ బిలుచుట మానిరి. కొంద ఱాతనికి వెలియని తమయిండ్ల శుభ కార్యములకు సయితము రానీయక పోయిరి. కొందఱు మాధుకరము పెట్టుట మానిరి. యాయవరము నందు సయిత మక్షయపాత్ర మునుపటివలె నిండుటలేదు. ఈకారణము చేత గంగాధరుఁ డేనుగుల మహలునుండి రంగస్థలము మార్పఁదలఁచెను. దీర్ఘాలోచనమీఁద గోదావరీ మండలమునకుఁ బ్రధాన నగరమైన కాకినాడ తన ప్రజ్ఞాప్రదర్శనమున కుత్తమరంగమని తోచెను. తోచుటయు తడవుగ నది తల్లితోఁ జెప్పి మరునాడు పయనమైపోయెను. పోయి యక్కడ మొదట రెండుదినములు సత్రములో దాను భోజనముజేసి తల్లి నత్తిసరుపెట్టుకొమ్మని చెప్పి పట్టణమంతయుఁ దిరిగి స్థితిగతులు పరిశీలించి కాకినాడలో నాకాలమున జనులు నీరు దొరకక విశేషమిబ్బంది పడుచుండుటచే వారిబ్బంది తీర్చుటకై తన జన్మము వినియోగింపఁ దలచెను. అతని నిర్ధారణము తల్లికూడ నంగీకరించినందున మరునాడె కావడిబద్దయు రెండుమట్లు గొని తెచ్చి మొదట నొకరిద్దరి వాడుకలు సంపాదించి నీళ్ళుమోయ నారంభించెను. అతని చాకచక్యము కార్యశూరత మొదలైనవి చూచి పట్టణ మందనేకులు వానిని నీళ్ళు పోయమని కోరిరి. దినమునకు ముప్పదికావిళ్ళైనను గంగాధరుఁడు మోసెననుట యతిశయోక్తిగాదు. కాకులు కూసినవేళ లేచి సూర్యాస్తమయ మగువఱకు నించుమించుగ నతడు కావిడి దింప డనుట నిశ్చయము. కొంతపైకము చేత జిక్కువఱకు నతఁడు సత్రము లోనే కాపురముండి పిమ్మట నొకచిన్న యిల్లద్దెకు పుచ్చుకొనెను. గంగాధరుని పేరు పట్టణమంతయు వ్యాపించెను. కలక్టరు కచేరీలోని గుమాస్తాలు మొదలగు వారు తమలోఁ దమరు సరససల్లాపములు చేసికొను నప్పుడు మనకన్న గంగాధరుడు మిక్కిలి యదృష్టంతుఁడు. చదువు రాక యతఁడు నెలకు ముప్పది రూపాయలు సంపాదించుచుండఁగా మన మెన్నో పరీక్షలలోఁ గృతార్థులమై పదియేను రూపాయలు తెచ్చికొనుట దుర్ఘటముగ నున్నదని చమత్కారముగఁ బలుకుచుందురు. తనచేత నీళ్ళు పోయించుకొనువారు నెలకొక్కఁనాడు రెండుపూటలఁ దనకు భోజనము పెట్టవలసినదని గంగాధరుడు నియమ మేర్పఱచి యట్లొప్పుకొన్నవారికె నీళ్ళు పోయుచుఁ దనతిండికి దడవుకొన నక్కఱలేకుండ హాయిగఁ గాలక్షేపము సేయు చుండెను. ఎవరిపంచనైన సోలెడు బియ్యము కాచుకొని దల్లిందినను మనక ప్రత్యేకముగ నొక చిన్నయిల్లు గంగాధరుఁ డేల బాడుగకు పుచ్చుకొనవలయు నని మీకు సందేహము తోఁచవచ్చును. అందుకు ముఖ్యకారణ మిది. తనపాలిటి కల్పవృక్షమై కామధేనువై

చింతామణియై ఈ కన్న తల్లివలె తన్ను చిన్ననాఁట నుండియు గాపాడుచుండిన తరవాణి కుండను బ్రతిష్టించుటకుఁ వీలున్నను దనగుట్టు దాగదనియు నెఱిగి యతఁడు ప్రత్యేకముగ నిల్లు పుచ్చుకొనియెను. నెలకు ముప్పదిరూపాయిలు సంపాదించుచున్నాఁడు గనుక గంగాధరుఁడు కావలసినంతధనము కూడబెట్టునని మీలో ననేకులు తలంపవచ్చును. కాని యట్లుతలంపఁగూడదు. ఎంతచెట్టు కంత గాలి యన్నమాట జ్ఞాపక ముంచుకొనుఁడు. అతఁడు నలమహారాజంతవాడై ధర్మరాజంతవాడై ధనము గడ్డిపఱకగఁ జూడ నారంభించెను. జూదమనందు మంచిపందెములు పెట్టుటకు నలమహారాజువలె రాజ్యముకాని ధర్మరాజువలె భార్యగాని గంగాధరుఁనకు లేకపోయినను, యధాశక్తిగ నతఁడు కష్టపడి సంపాదించిన విత్తమెప్పటి కప్పుడు పాచిద్రవ్యము లేకుండ నొడ్డుచుఁ దరుచుగ నోడిపోవును. అప్పుడప్పుడు డప్పులపాలగుచు సొమ్ముదాచవలసిన బాధ లేకుండఁ గాలము గడుపుచుండెను. ఎప్పుడైనఁ నతడు గెలిచినా యా సొమ్మదివఱకు చేసిన ఋణము దీర్చుట క్రింద పోవును. అప్పుతీరగా నించుక మిగిలెనా యది సింహాచలయాత్ర క్రిందసరిపోవును. చిత్తజల్లు సింహాచలమని యాయూర నొక వేశ్యాంగన కలదు. దాని వయస్సు గంగాధరుని వయస్సుకంటె రెట్టింపు గలదు. కాకినాడ పురవాసులలో ననేకు లదివఱకు సింహాచలసేవ చేసి చేసి విసిగి యితర దేవతా ప్రభావములు విని వారి సేవలకై పోయియుండుటచే నప్పుడు సింహాచలము పూజా నమస్కారములు లేక పాడు దేవాలయములో బూజు పట్టియున్న దేవతావిగ్రహము వలెనే యుత్సవములు లేక నల్లమందు కైనను సరిగా వచ్చుబడిలేక ప్రాతగుల్ల లొక్కొకటే యమ్ముకొని జీవనము చేయుచుండగా దాని పాలిటి దైవమువలె గంగాధరుఁడు వెళ్ళి యాదుకొని యప్పుడప్పుడు కొంత హిరణ్యము సమర్పించుచు దిక్కుమాలిన కుటుంబము నకుఁ దగిన సొమ్మతనకి భగవంతుఁ డీయలేదు. కాని యిచ్చిన పక్షమున నతఁడు గూడ దానికొక గొప్పమేడ మేటిసాహుకారులు తమ ప్రియురాండ్రకు గట్టించిన విధముగఁ గట్టించి యుండును, కోరినంత ధనమీయ లేకపోయినను గంగాధరుడుఁ సింహాచలమునకు శక్తివంచనలేక యుపచారములు చేయఁ దలఁచి తల దువ్వుట, తలయంటి నీళ్ళుపోయుట, గారెలు, బూరెలు మొదలగు పిండివంటలు స్వయముగా వండిపెట్టుట గుడ్డలుదుకుట, యంట్లుతోముట మొదలగు కార్యములు శంకాతంకములు లేక చేసి దానిమెప్పువడసి ధన్యుఁడగుచుండును. అతని యుదారభావమును దీని బట్టియే మీరు గ్రహింపవచ్చును. దానగ్రజన్ముఁడైన బ్రాహ్మణుఁడని గర్వింపక సందేహింపక యది నీచకులజు రాలని యేవగింపక యీాపని యాపని యనక శంకింపక యట్టి యుపచారము చేసినవాడు సామాన్యుడా? కాకినాడలోనున్న కాలమున గంగాధరుఁడు కనబఱచిన ప్రజ్ఞనుగూర్చి యొకటిరెండు మాటలు చెప్పవలసియున్నవి. గంగను మోయుటచేత గంగాధరుఁడు సాక్షాత్తు గంగాధరుఁ డయ్యెనుననుట కల్పనాగౌరవముకాదు. శివుఁడు తలపై నిడుకొని గంగను మోసెను. మన గంగాధరుఁడు కావడిలో నిడుకొని గంగను మోసెను. ఆ గంగాధరుడు శూలము ధరించుటచేత శూలియయ్యెను. ఈ గంగాధరుఁడు కడుపు మానమెఱుఁగక తినినందున సంభవించిన పరిణామశూల గలఁవాడగుటచే శూలియయ్యెను. ఆ గంగాధరుఁడు శిరమున నర్ధచంద్రరేఖ ధరించెను. ఈ గంగాధరునకుఁగూడ శిరస్సునగాక పోయినమానె మెడమీదనర్ధచంద్రప్రయోగములు చాలసారులు జరిగెను. గంగాధరుఁడనేక లక్షణములలో శివునకు సమానుఁ డగుటయేగాక నొక విషయమున నారాయణుఁ డంతవాడని చెప్పవచ్చును. క్షీరసాగరమందు శేషశాయియై నిరంతరమువసించుటచేత నారాయణుఁడను

పేరు గలిగెను. నారమనఁగా జలము. ఆయనమనఁగా స్థానము. నారాయణుఁ డనగా జలమె స్థానముగా గలవాడు. గంగాధరుఁడుగూడ తరుచుగా జలగ్రహణార్థము చెరువులలో నుండుటచే నారాయణుఁ డని చెప్పుట తప్పుగాదు. ఒక్క నారాయణుని తోడనెగాదు, గంగాధరు ననేక దేవతలతోఁ బోల్చవచ్చును. గంగాధరుఁడు పాకశాసనుఁడు. పాఁకుడను రాక్షసుని శాసించుటచేత నీ పాకశాసన శబ్దము లోకమున దేవేంద్రుని యందు వర్తించుచున్నది. పాకమనఁగా వంటను శాసించుటచేట గంగాధరుని యందుఁగూడ నీశబ్దము సార్థకమని చెప్పవచ్చును. గంగాధరుఁడు వంట చేయునని యదివఱ కెక్కడను జెప్పియుండకపోవుటచే నితని యందాశబ్ద మెట్లు సార్థక మగునని మీ రనుమానింపలదు. ఒకఁడు తర్కవ్యాకరణములను రెండు శాస్త్రముల యందు నిర్దుష్ట పాండిత్యముగలిగి యుండియు నేదో యకటే యభిమానవిద్యగ స్వీకరించి యం దెక్కువ కృషిచేసి యుండవచ్చు. అట్లే గంగాధరుఁడు పాకశాస్త్ర మందును జలవాహన శాస్త్రమందునుగూడ నధికపరిచితుఁడై జలవాహన శాస్త్రమందె యధికాభిమానముగలిగి విశేషాభ్యాసము చేసెనని గ్రహింపవలయునేకాని పాక శాస్త్రమందు బరిచితి లేదని గ్రహింపఁగూడదు. ఈ కారణమున గంగాధరునఁకు బాకశాస్త్రమందుఁ బరిచితి గలదని మీ రొప్పుకొనక పోవుదురేని సింహాచలమునకిష్టమైన పిండివంట వండి పెట్టుచుండెడివాఁ డని యిదివర కుదాహరింపఁ బడుటచేత మీరీవాద మంగీకరింపవచ్చును. ఒక సంవత్సరము శ్రావణ మాసములో నీయింటిమీఁద కాకి యాయింటిమీఁద వ్రాలకుండ నాకసము చిల్లిపడునట్లు వాన కురియుచుండఁగా గంగాధరుఁడు జడివానలకు లెక్కపెట్టని దున్నపోతువలె నించుకేనియుఁ జలింపక నెప్పటి చాకచక్యముతో నీళ్ళు మోయుచుండుటఁజూచి చ్ఛందశ్శాస్త్రము నూతనముగ నేర్చికొని పద్యములు చెప్పవలయునని యుబలాటము బడుచున్న యొక బాలకవి గంగాధరుని ప్రజ్ఞ నొక విషయముగఁ బుచ్చుకొని కొన్ని పద్యములు రచించెను. ఆ పద్యములు లభింపలేదు. కాని వాని యందలి భావము మాత్రము మాకు లభించినందున క్షీరమును విడిచి దాని సారమైన మీగడముద్ద నిచ్చి నట్లు తత్సార మిందుఁబొందుపఱుపఁబడుచున్నది. "ఓగంగాధరా! నీప్రజ్ఞ వర్ణించుట కాదిశేషువునకు వేయినాలుకలు చాలవు. నీవు కావిడిబద్ద పట్టుకొన్నప్పుడు గాండీవము ధరిం చిన యర్జునుఁడు జ్ఞప్తికి వచ్చును. పచ్చడిచేయుటకు నీవు బండ పుచ్చుకొన్నప్పుడు నాగలిధరించిన బలరాముడు జ్ఞప్తికి వచ్చును. వడ్డించుటకు పళ్ళెము పుచ్చుకొన్నప్పుడు సుదర్శనచక్రము ధరించిన హరి మనంబునం దట్టును. నీపాకము నలపాక భీమపాకముల మించును. నీవు చిమ్మిలిముద్దలు మ్రింగుచున్నపుడు చూచినవారు పూర్వకాలము శంకరుఁడు కాలకూట విషపుముద్ద నిట్లె మ్రింగెనని సముద్ర మథన వృత్తాంతము జ్ఞప్తికి దెచ్చుకొని సంతసించు చుందురు. నీకీర్తి బుఱ్ఱ గుంజువలె ముంజవలె సున్నమువలె చల్లవలె విభూతివలె మరబియ్యపన్నమువలె ముసలివాని తలవలె నెంతో తెల్లనై దిక్కులయందు వ్యాపించియున్నది. ఆ కృతిపతికిని కృతికర్తకు నాకవిత్వమునకు 'తగు దాసరికి మెడపూసలకు' నన్నట్లు సరిపోయెను."

# ఏడవ ప్రకరణము

భగీరథుఁడు మహాప్రయత్నము జేసి కష్టపడి గంగను భూమికిఁ దెచ్చి జగజ్జనులకు మహోపకారము చేసిన తెఱగున గంగాధరుఁడు కష్టపడి గంగను దెచ్చి కాకినాడ పురవాసుల కిచ్చి వారికి మహోపకారము జేయుచు గాలముఁ గడుపుచుండఁగా నొక వైపరీత్యము జరిగెను. అది కాకినాడ పురవాసులు చేసికొన్న దురదృష్టము వలన సంభవించినది. ఆపట్టణమందొక గొప్పవైశ్యునియింట వివాహము జరిగెను. విజయ నగరమునుండి మగపెండ్లివారు తరలివచ్చిరి. కన్యాప్రదాత లక్షాధిపతి, వరుని తండ్రియు నట్టివాడె. సుముహూర్త సమయమున వందల కొలది జామారులు శాలువలు పెద్దకాసులు పిల్లకాసులు కన్యా ప్రదాత సభలో వెదజల్లెను. కుండలములు ధరించినవారికి రుద్రాక్షలు దాల్చినవారికి పిండికట్టుపెట్టినవారికి పిల్లజుట్లవారికి దర్భాసనాల వారికి సిఫారసులు దెచ్చికొన్నవారికిని నివిశేషముగ ముట్టెను. అందు గంగాధరున కొక్కటియు ముట్టలేదు. అతని కెవ్వరు సిఫారసు చేయలేదు. అందుచేతఁ గాకినాడ పురవాసు లందరు గృతఘ్నులని యతఁడెంచుకొనెను. చెంబు చేతితో నెత్తి కాకినాడలో దాహము పుచ్చుకొన్న వారిలో ననేకులు గంగాధరునిపేరు తలంచుకొనవలసినదేకదా. వేదశాస్త్రములు రాక వెర్రికుక్కలవలె వీధులవెంటఁ దిరుగ బండవాండ్ర కెందఱకు మొగమాటమి చేత సిఫారసులచేత బండితసంభావనలు జామారులు ముట్టలేదు? అదివఱకు వెంకన్న సుబ్బిగాడు గంగన్న యను పేర్లుగల నిరక్షరకుక్షులు నీళ్ళ బ్రాహ్మణులు వంటబ్రాహ్మణులు నాఁ డాహితాగ్నులై వెంకటావధానులు, సుబ్బన్న దీక్షితులు, గంగప్ప సోమయాజులు నను బిరుదులు ధరించిరి. ఎన్నో దర్భాసనముల బూజు దులుపఁబడెను. ఎన్నో జారీ చెంబులెట్టుగాఁ దోమబడి హస్తముల యందమరెను. ఎన్నో చినిఁగిన శాలువలు బుజముల నలంకరించెను. ఒక కోమటి యందుకొన్న వెలయాలి చెల్లెలి నుంచుకొన్న నొక వంట బ్రాహ్మణుని కా కోమటి సిఫారసు జేసి పండితుఁ డని పిల్లకాసిప్పించెను. ఆబ్రాహ్మణుఁడు గూడ శాలు వెక్కడో యెరువు దెచ్చికొని తలకుఁ జుట్టుకొని యాపూటకు గరిటె యావలఁ బారవైచి గంటము దాఁటియాకు చేతఁ బుచ్చుకొని గొప్ప పండితునివలె కనఁబడెను. గంగాధరున కట్టి యుపాయము చెప్పువా రెవ్వరు లేకపోయిరి. అతనికి స్వయముగ నుపాయము తోఁచలేదు. తోఁడి వంటబ్రాహ్మణునకుఁ బిల్లకాసు దొరకుటయెగాక పండితుడని గౌరవము గూడ సభలోనఁ గలిగినందున గంగధరుని కడుపులో మంట హెచ్చెను. మనంబున మత్సరము వృద్ధిఁ బొందెను. పురవాసులపై నలుక రెట్టింపయ్యెను. ఆనాఁటి కెట్లో కోపము లోలోపల జీర్ణముఁ జేసికొని యతఁ డింటికిఁబోయి సదస్యము నాఁడెక్కువ సంభావన దెచ్చుకొనుట కుపాయము వెదకుఁచు దనచేత నీళ్ళుమోయించుకొను నొకరిద్దరు పెదమనుష్యుల యెద్దకు వెళ్ళి సిఫార సిమ్మని యడిగెను. "నీవుఘనాపాఠివా? షోడశ కర్మాధికారివా? మహాపండితుడవా? ఏమని నీకు నేను సిఫారసు నియ్యఁగలను? నీళ్ళ బ్రాహ్మణునకు సిఫారసిచ్చిన పక్షమున నాగౌరవ ముండునా?" అని యొకఁడు బదులు చెప్పెను. "నేను పెండ్లివారి నెఱుఁగ" నని మఱియొకఁడు త్తరముఁ జెప్పెను. ఆ పలుకులు వినఁగానె గంగా ధరున కెంతకోపము వచ్చినదని చెప్పను? "ఛీ! మీకు విశ్వాసము లేదు. ఇకమీద మీ యిండ్లలో నీళ్ళు మోసితినా కాశీలో గోహత్య జేసినట్లె" యని మహాకోపముతో వారియిండ్లు వెడలివచ్చి "యొక నిర్భాగ్యుఁడు నాకు సిఫారసు చేయుటెందుకు? దేవుఁడిచ్చిన కాళ్ళు చేతులు నుండఁగా

నౌకరి నాశ్రయింపనేల" యని మఱెవ్వరిని సిఫార సడుగక స్వయం సహాయమె మంచిదని తత్ప్రయత్నముఁ జేయుచుండెను. సదస్యమునాడు బ్రాహ్మణసంతర్పణ మైనతరువాత సంభావన సాయంకాల మీయఁదలఁచి పెండ్లివారు భోజనానంతరమున బ్రాహ్మణులు నందఱ నొకదొడ్డిలోఁ బెట్టిరి. రెండువేల బ్రాహ్మణ్యము చేరెను. ప్రతివాఁడు ముందుగా సంభావన గ్రహింపవలయునని యొండొరులఁ ద్రోసికొనుచు ద్రొక్కికొనుచు విసనగఱ్ఱలతోఁ గొట్టుకునుచుఁ దిట్టికొనుచు బ్రాహ్మణులాకాశము పగులుతున్నట్లురచుచుండిరి. సంభావనలిచ్చుటకు మొదలు పెట్టునప్పటికి సాయంకాల మయ్యెను. గంగాధరుఁడు దృఢదీర్ఘ కాయుఁడగుటచేఁ దనకంటె ముందున్నవారి నెందఱినో వెనుకకు లాగివైచి ముందుకు వెళ్ళిపడి తన సంభావనకుఁ చేయిచాచెను. పెండ్లివారు వివాహ మైనవారికి రూపాయి చొప్పున బ్రహ్మచారుల కర్ధరూపాయి చొప్పునను నీయఁదలఁచిరి. పాపము ! గంగాధరుఁడు ముప్పదియేండ్ల వయసువాఁడై చిన్న తాడిచెట్టంత పొడుగున్నను వివాహితుఁడు కాకపోవుటచే నేఁ డెనిమిది సంవత్సరముల వయసు గలిగి యతని మోకాలంత పొడుగై నలేని చిన్న బ్రహ్మచారులకు ముట్టినంత సొమ్మేముట్టెను. గంగాధరునివంటి ప్రజ్ఞాశాలికి మహాభిమానికి నిదియొక గొప్ప యవమానముకాదా? కన్యా ప్రధాన కాలమున జరిగిన యవమానమున కిది తోడై యతని మనస్సు మఱింత మండింపఁ జేసెను. వివాహము కాని వెలితి యప్పుడతనికిఁ గనఁబడెను. క్రతువులను జేసిన సోమయాజు లగ్నిగోత్రము నిమిత్తము వివాహము చేసికొన వలసి వచ్చినట్లు సంభావనల నిమిత్తము గంగాధరుడు వివాహము జేసికొన వలయునని యప్పుడు నిశ్చయించుకొనెను. సింహాచల మతనికి భార్యయై యుండినను భార్య యున్నదని చెప్పుకొనుటకు వొంటిపోగు జందెము దీసి నాలుగుజందెములు వేసికొనుటకు వీలులేదుకదా. పెండ్లి వా రర్ధరూపాయ చేతిలోఁ బెట్టగానే విధిలేక యది పుచ్చుకొని గంగాధరుడు మనస్సులో నున్న మంటయొుక్క పొగ యేమో యన్నట్లు కనుబొమలు బిరుసులై విజృంభింప ధుమధుమ లాడుచు నా వలకు బోయెను. ఆ దినమున సింహాచలము రెండురూపాయలు తెమ్మని యాజ్ఞాపించెను. పెండ్లివారు గొప్పవారు కదా రెండేసి రూపాయలిత్తురని యతఁడు నిశ్చయించుకొని వెళ్ళెను. కాని చేతిలోఁబడిన దర్ధరూపాయి మాత్రమే యయ్యెను. రెండురూపాయలు దీసికొనివెళ్లక పోయినచో సింహాచలము చీపురుగట్టపూజఁ జేయును. అదీ మనసుపడి యొక వర్తకుని యొద్ద గులాబీరంగు పట్టురవికెల గుడ్డ వెలకుఁ దీసికొనిపోయెను. ఆ సొమ్ము మరునాఁ డుదయమున నిచ్చితీరవలె. ఈయని యెడల దనకుఁ గాని దానికిఁ గాని మాట దక్కదు. పాపము! గంగాధరునకు గొప్పచిక్కు సంభవించెను. ఇదియా గొప్ప చిక్కని చదువరులు నవ్వుదురు గాబోలు. ఎవరిమట్టుకు వచ్చిన గాని వారికి తెలియదు. మీ కిటువంటిచిక్కు సంభవించునపుడు గాని మీకు తెలియదు. ఈ విషద్రోగమునకు మంచిమందేది యని గంగాధరుఁడు కొండొక సేపాలోచించి యిట్లునిశ్చయించెను. "నేనిప్పుడె బజారునకు వెళ్ళి కోమటి కోటయ్యవద్ద సీమనూలుజందెములజతకొని మెడలోవైచుకొని సంబావననిచ్చునట్టి దొడ్డికి వెనుకవైపునున్న గోడ యెక్కి దొడ్డిలో దుమికి రెండవసారి సంభావనకు వెళ్లెదను. మొుగ మానవాలు తెలియకుండ విభూతి పాముకొని యెదను, దీనితో మరియొక రూపాయ చేతఁబడును. పైమాట చూచుకొనవచ్చు" నని నిశ్చయించుకొన్నట్లు వెంటనే జరిగించెను. పదివందల రూపాయలు కర్చుపెట్టినను లభించుటకు దుర్లభమైన పెద్దజందెము గంగాధరునకు క్షణములో మంత్రములతోఁ బనిలేక నాలుగుడబ్బులతో లభించెను. అతని బుద్ధికుశలతకు చదువరులు సంతోషింతురని మా యభిప్రాయము. నూతన యజ్ఞోపవీతధారణమైన వెనుక

విభూతి పాముకొని క్రొత్తపలుపు మెడనిడ్డ దున్నపోతువలె వెలయుచు నతఁడు దొడ్డి వెనుకకుఁబోయి వానదెబ్బచేత మదురూడి పోయిన భాగమున మెల్లఁగా గోడ యెక్కెను. ఈశ్వరుఁడు తోడపడకపోయిన తరువాత మానవప్రయత్న మేమి సాగును? గంగాధరుఁడు దృఢశరీరము గలవాఁ డగుటచే నతని శరీరభారమున గోడ విరిగిపడెను. గోడలో గంగాధరుఁడు గూలెను. కుడిచెయ్యి విరిగెను. పడగానే కొంచముసేపు స్మృతిదప్పెను. వీధివైపునకుఁ బడినందున దారిబోవువా రెవరో చూచి గంగాధరుఁ డని తెలుసుకొని యొక బండిమీఁదఁ బడవైచి యింటికిఁ దీసికొనిపోయిరి. కొన్ని దినము లతఁడు మంచముమీద నుండి లేవనేలేదు. ఆసుపత్రికి వెళ్ళి వైద్యము జేయించుకొమ్మని కొంద రతనికి సలహా యిచ్చిరి. కాని యాసుపత్రి వైద్యులను దొరతనమువా రభిమానముచేత నిలుపుచున్నారు. కాని వారికి వైద్య మేమియుఁ దెలియదని మొదటనుండియు నతని నమ్మిక యగుటచే నతఁడా పొంతఁ బోవక కుమ్మరగురవయ్యను బిలిపించి ఏఁబదిరూపాయలిచ్చుట కొప్పుకొని చేయి వానిచేత తోమించుకొన నారంభించెను. చెయ్యి యెకవిధముగ స్వాధీన మగునప్పటి కారుమాసములు పట్టెను. ఆ యారుమాసములు తల్లి యన్నము దినిపించెను. ఏడవమాసమున నతని కన్నము దినుటకు మాత్రము చేయి స్వాధీనమయ్యెను. కావడి మోయుటకు బిందె లెత్తుటకు నది స్వాధీనము గాకపోయెను. కాఁబట్టి కాకినాడ పురజనుల భాగ్యదోషమున గంగాధరుఁడు పూర్వపు వృత్తి వదలవలసి వచ్చెను. తల్లి యక్కడక్కడ పనిచేసి యీ యాఱుమాసములతనిని బోషించెను. పైగా నూరురూపాయ లప్పయ్యెను. చిరకాల మన్నవస్త్రము లిచ్చి సకలసౌఖ్యము లిచ్చి పోషించిన కావడిబద్దను మట్లను మూలఁ బాఱవైవలసి వచ్చినప్పుడు సంపూర్ణ శస్త్ర సన్యాసము జేయు మహావీరుఁడు వలెను గదాగాండీవములు జమ్మిచెట్టుమీఁద దాఁచిన భీమార్జునుల వలెను గంగాధరుఁడు కన్నులనుండి జొటజొట బాష్పములు దొఱఁగ నేడ్చి యటమీఁద నుదరపోషణ మెట్లని విచారింపఁ జొచ్చెను. అతని చేయి విరిగిన దినములలోనె మాతామహుఁడైన యన్నప్ప యవతారముఁ జాలించెను. తండ్రి తన్నథో గతిపాలుచేసినను సహజమైన పితృ ప్రేమచేఁ బిచ్చెమ్మ కొంత వగచి యొకసారి తల్లిని జూడఁదలఁచెను. కాని కుమారున కన్నము దినిపించువారు లేకపోవుటచేతను విశేషించి గంగాధరుఁడు వెళ్ళఁదలఁచినందుకు మిక్కిలి దూషించుటచేతను మానుకొనియెను. గంగాధరుని భవిష్యద్వృత్తిని గూర్చి తల్లికి గూడ మనోవ్యథ కలిగెను. అందఱికంటె సింహాచలమున కెక్కువ విషాద ముదయించెను. గంగాధరుఁడు పరిత్యజించిన పక్షమునఁ గాకినాడ పట్టణములో దాని మొగముఁ జూచువారు లేరు. కావున దాని విచారమున కంతములేదు. నారు వోసిన దేవుడు నీరు పోయకమానఁడని గంగాధరునకు గట్టినమ్మకము కలదు. అతని విశ్వాస ప్రకారమె యతని కదృష్టము కలిసి వచ్చెను. కాకినాడలో నదివఱకు నగ్నిప్రచ్ఛాదనములు, తిలదానములు పట్టుచుండిన బ్రాహ్మణు డొకడు మృతినొందెను. ఆ స్థానమాక్రమించుటకుఁదగినవా రెవ్వరని పురవాసు లాలో చించుచుండ నంతలో గంగాధరుఁడు దానందుకుఁ దగిన వాడననిచెప్పి గ్రామపురోహితులను సభాపతులను నాశ్రయించెను. వచ్చిన దానిలోఁ గొంతభాగము వారి కిచ్చునట్లు గంగాధరు డొడంబడినందున వారా పదవి కితనినె పట్టాభిషిక్తుని జేసి యెఱిగినచోట్ల "నితఁడు మనల నందఱ నమ్ముకొన్నాఁడు గనుక నితనికే యియ్యవలయు" ననిచెప్పి యెఱుఁగనిచోట్ల నితడి పిల్లలు కలవాడు, బహుకుటుంబీకుఁడు పెద్దమనుష్యుఁ డని చెప్పి యెట్లో వా రీయఁదలంచుకొన్న దానికన్న నధికముగ నిప్పించి యుపకారముగ జేయఁజొచ్చిరి. అట్లు వచ్చిన ధన మతఁడు నాలుగు భాగములుగ విభజించెను.

''శరీర మాద్యం ఖలు ధర్మసాధన'' మన్నారు గనుక నొక భాగము తన సంరక్షణము నిమిత్తము, రెండవభాగము తనకు దానము లిప్పించిన పురోహితుల నిమిత్తము, మూడవభాగము తనకు బాహ్యప్రాణమైన సింహాచలము నిమిత్తము, నాల్గవ భాగము నిరుపేదయైన తన్ను నలచక్రవర్తి యంత వానిని జేసిన జూదము నిమిత్తము నతండు వినియోగించు చుండెను. ఈ వృత్తి యవలంబించిన తరువాత నెప్పటి కప్పుడు కావలసినన్ని ధాన్యము, లెక్కలేనన్ని పీటలు, నెంచరాని చెంబులు తినుటకు వీలులేనన్ని యరటికాయలు కందదుంపలు మొదలగు కూరలు విశేషించి యెన్నోమంచములు నెన్నో పరుపులు నెప్పటి కప్పుడు రొక్కము, కావలసినన్ని బియ్యము మొదలగునవి చేకూరఁ జొచ్చెను. ఎప్పటి కప్పుడే వస్తువులతో నిల్లు నిండి చాలకపోయెను. విశూచి మశూచి మొదలగు జాడ్యములు ప్రబలినపుడు మంచములు మొదలగునవి స్థలము చాలమి, యింటికి పట్టుకొని వెళ్ళుటకు వీలులేక, యప్పటి కప్పుడె బేరములిచ్చి యమ్మివేయుచుండును, కూరలు కావలసినవారికి తల్లి దానము చేయఁజొచ్చెను. పూర్వము తాను తల్లియు జాపలమీదనే బండుకొనుచు వచ్చిరి. ఇప్పుడు తల్లికి మంచము పరుపు, తనకు మంచము పరుపు, సింహాచలముయొక్క గృహమున మూడు మంచములు మూఁడు పరుపులు, తనస్థితి కొంచెము స్థిరమైనతరువాత గంగాధరుఁడు కొంచెము త్రాడుబారి పురోహితుల కీయవలసినభాగము క్రమక్రమముగ నేదోవంక బెట్టి యెగబెట్టఁజొచ్చె. అందుచేత కొంచెము డబ్బుచేత నిలువజొచ్చెను. అదివరకునల్లమందుకైన సరిగాడబ్బు లేని తల్లి బియ్యము పప్పులు మొదలగునవి యిరుగుపొరుగువారికమ్మి కొంతసొమ్ము చేసికొనియెను. అతని జాతకమావిధముగ మహోచ్చదశ గలిగి పెళ్ళున వెలుగుచున్న కాలములో నతని కొక గొప్ప విపత్తు సంభవించెను. ఇంచుమించుగా గాకినాడ వచ్చినది మొదలుకొని యతని యర్ధదేహమైయుండిన సింహాచలము కాలధర్మము నొందెను. సింహాచలము పెద్దదగుటచేత దాని మరణ మంత లోకవిరుద్ధముగ లేకపోయినను గంగాధరుఁడు చిరకాల సహవాసము చేత మిక్కిలివగచి పదిదినములన్నము దినక యేమియుం దోఁచక పిచ్చివానివలె దిరిగి మిత్రుల యూరడింపుల వలనను మరికొందరు చేసిన జ్ఞానోప దేశము వలనను ధైర్యముఁ దెచ్చికొని కొంత దుఃఖోపశమనముఁ జేసికొనియెను, కాని సింహాచలము మీఁదఁ దనకు గల యనురాగాతిశయముఁ దెలియఁజేయుటకు దాని పేరుగ నొక్క పిల్లయైనను లేకపోయెను గదా యని పలుమాఱు విచారించెను. అయినను విచారించినఁ గార్యము లేదని గ్రహించి దాని కుత్తరగతులు కలిగింపవలెనని రమారమి యేఁబదిరూపాయలు కర్చుజేసి దాని కులమువాం డ్రందఱు మెచ్చున ట్లుత్తరక్రియలు చేయించి సంతర్పణ చేయించెను. జ్ఞానము వచ్చినతరువాత నతనికిఁ గలిగిన గొప్పకష్ట మిదియె. సింహాచలము బ్రతికియున్నపుడు మూఁడునాలుగు దినముల కొకసారి గంగాధరుఁడు దానికి నల్లమందుఁ గొనితెచ్చి యిచ్చుచుండువాఁడు, గావున నది మృతినొందిన తరువాత నాఱుమసముల వరకు నల్లమందు దుకాణము కనఁబడినపుడెల్ల నతఁడు పట్టరాని దుఃఖము గలిగి యే గోడకో జేరబడి కొంతసేపేడ్చి పోవుచుండును. దైవవశమున సింహాచలము తోడ స్నేహబంధము విడిపోయిన తరువాత గంగాధరుడు నిస్పృహుఁడై మఱి యొకతె సహవాస మపేక్షింపక వివాహముఁ జేసికొనవలయునని దీక్షగలిగి ధనము నిలువఁ జేయదలంచెను. కాని జూదపుపాక వానిప్రయత్నమునకు విఘ్నము గలిగించుచు వచ్చెను. అక్కడకు వెళ్ళకుండవలయు నని యప్పు డప్పు డతఁడు నిశ్చయము జేసికొను చుండును. కాని యభ్యాసముచేత ప్రయత్నము లేకయే కాళ్ళు వాని నక్కడకీడ్చుకొని

పోవఁజొచ్చెను. జూదపుబాక జగన్నాయకపురములొ సముద్రపు టొడ్డున నొక మూలగ నుండెను. గంగాధరుఁడు పనిలేనప్పుడు పట్టపగలును; పగలు పనియున్నపుడు తప్పక రాత్రివేళను భాగ్యవంతుని నిర్భాగ్యుని, నిర్భాగ్యుని భాగ్యవంతుని క్షణ కాలములో జేయగల యాద్యూత గృహమునకుఁ పరమభక్తుఁడు దేవాలయమున కరిగిన ట్లరగి యోపిక యున్నంత సమర్పించి వచ్చుచుండును. అతఁడు తీరికగనున్న కాలము సింహాచలము గృహమునకు ద్యూతగృహ్యమునకు సమానముగ విభజించెను. ఇప్పుదు సింహాచలయాత్ర కట్టుబడి పోవుటచే తత్కాలముఁగూడ ద్యూతగృహమునకె వినియోగింపఁ జొచ్చెను.

ఇట్లుండఁ బూర్వము తెనాలి రామలింగము యొక్క పిల్లికి పాలు చూడగనె భయము గలిగినట్లు జూదపుబాక పేరు చెప్పఁగానె గంగాధరున కడలు పుట్టించునట్టి వైపరీత్యమొకటి జరిగెను. ఒక యమావాస్య నాటిరాత్రి యేడెనమండుగురు జూదగాండ్రు మైమరపించు సంతోషముతో జూదమాడ నారంభించిరి. పొరుగూరి నుండి వచ్చిన యొక కాఁపువాఁడు నాటిరాత్రి లక్ష్మీకటాక్ష సంపన్నుఁడై యైదువందల రూపాయలు గెలుచు కొనెను. ఓడి పోయినందువలన గలిగిన పరాభవమునకుఁ దోడై ధన నష్టము జూదగాండ్రకు మేరలేని మత్సరము గలిగించెను. ఆ కాఁపువాడు గెలిచిన విత్తము మూటఁగట్టుకొని స్వగ్రామమునకుఁ బోవ సమకట్టెను. మరల జూదమాడ వలసి దని తక్కిన జూదరులు వానిని బలవంతము పెట్టిరి. ఎంత నిర్బంధించినను వాడుఁ పందెము వేయనని బిఱ్ఱబిగిసి కూర్చుండెను. గంగాధరుఁడుఁ గూడ కాఁపు వానిని జూచి "నీకిది న్యాయము కాదు. అందరిసొమ్ము నీవు గెలుచుకొని మూట గట్టుకొని పోవుట మంచిదికాదు. తెల్లవారినదాక నీ వాడి యప్పటి కెంత సొమ్ముండునొ యది పట్టుకొని పోవుట ధర్మ" మని హితోపదేశముఁ జేసెను. కాపువాడు గంగాధరుని మాటా లెక్క సేయఁ డయ్యె. ఇద్దఱు ముగ్గురు జూదగాండ్రావలకుఁ బోయి యేమో గుసగుస లాడి తిరిగి పాకలోనికి వచ్చిరి. కాఁపువాఁడు మూట పట్టుకొని లేచెను. అప్పు డిద్దఱు జూదగాండ్రు వానిని రెండు తన్నులు తన్ని నేలఁ బడవైచి నోట గుడ్డలు గ్రుక్కి చెప్పుల కాళ్ళతో గొంతుమీఁద ద్రొక్కి గడియలోఁ జంపిరి. అట్లు చేయుదు మని వారు గంగాధరునితో నాలోచింపలేదు. అంత పని జరుగునని యత డెన్నఁడు దలంపలేదు. అతఁ డాజానుబాహుడైనను మున్నెప్పుఁడు గ్రౌర్యమెఱుఁగని బ్రాహ్మణుఁ డగుటచే నతని కాళ్ళు గడగడ వడఁకెను. మేన ముచ్చెమటలుఁ బోసెను. అయ్యో! అయ్యో ! ! యను నవ్యక్త ధ్వని తప్ప యతనినోట మారుమాట రాదయ్యెను. తక్కిన జూదగాండ్రు కాఁపువాని శవమునకు రాళ్ళుకట్టి సముద్రములో బాఱవేయ వలయునని బండల నిమిత్తము వెదకు చుండగా నంతలో దొంగ లాంతరు చేతఁ బుచ్చుకొని జూదపు బాకలోఁ దమ కేర్పడిన మామూలు వసూలు చేసుకొనుటకై ముగ్గురు పోలీసువాండ్రక్కడకు వచ్చిరి. అందులో నొకడు హేడ్డు. తక్కినవాం డ్రిద్దఱు సామాన్య భటులు. ముందుగా వారు పాకలో బ్రవేశించఁ జూదగాండ్రకు నాయకుఁడైన వెంకటస్వామి లేఁడని యొకడుత్తరము జెప్పెను. ఆ పండుకొన్నవారెవరని యొక డడిగెను. రెండవవాఁడు మరికొంత ముందుకు బోయి చూచి "వాఁడు పండుకొనలేదు, చచ్చిపడి యున్నాఁ" డని హేడ్డుతో బదులు చెప్పెను. "ఓరీ తుంటరులారా! కూనీ చేసినారా ? ఇప్పుడు మిమ్మందఱను బట్టుకొని స్టేషనుకుఁ దీసికొని పోదును. నిలువుఁడు నిలువు" డని హేడ్డధికారముఁ జేసెను. రాళ్ళ నిమిత్తము వెళ్ళిన వెంకటస్వామియు మఱియొకడును వారి రాక జూచి పిక్కల బలమును శరణుజొచ్చి తిరిగి చూడక యొక్క పరుగున నిల్లుజేరిరి. గంగాధరుఁడు తక్క తక్కినవారంద ఱా నరహత్యలో నేదో

కొంతభాగము కలవారె. పోలీసువారిని జూడఁగానె గంగాధరుని మీఁది ప్రాణములు మీఁదికి పోయెను. హేడ్డు కోర చూపులు చూచి "యిప్పుడు మిమ్మందరను అరెస్టు చేసి నాము, పాక వదలి వెళ్ళవద్ద"ని హుంకరించి పలికెను. రాజభటులను బ్రసన్నుల జేసికొనుటలో నాటితేటిన జూదరులిద్దఱు ముగ్గురందులో నుండిరి. అందొకడు హేడ్డు నావలకు బిలిచి రెండు జేతులు బట్టుకొని యిట్లనియెను. "అయ్యా ! మీరిందులో మమ్మీలాగున శ్రమ పెట్టఁ గూడదు. ఏఁడాదికి మీకు ముప్పదిరూపాయలు మీ కానిస్టేబులు లందఱికి నేబది రూపాయలు, మీ యినస్పెక్టరుగారికి ప్రత్యేకముగా నూరు రూపాయలు, మామూళ్ళిచ్చుచున్నాము. అవిగాక మీపై యుద్యోగస్తులు వచ్చినా రన్నపుడు కోళ్ళు, కోడిగ్రుడ్లు, రెండు మూడుసారులు మేఁకలు, పాలు పెరుగు మీకిచ్చినాము. చిక్కువచ్చినపుడు కాపాడకపోయిన మేమేమి కావలసినది? అతనిని మేము చంపలేదు. వాఁడు జూద మాడుటకు వచ్చిన మాట నిజము. అతనికి రాఁగానే గుండెలలో నొప్పివచినది. జాముసేపు గిజగిజ తన్నుకొని చచ్చినాఁడు. ఇదిగో యైదువందల రూపాయల మూట; అది తమరు పుచ్చుకొని యనుగ్రహించి మమ్మొక దరికి జేర్పవలయును." ఆ మూట చూడఁగానే యతఁడు కూనీమాట మఱచెను. "ఏడిచినట్లెయున్నది, గుండెలలో నొప్పివచ్చి యితఁడు పోయినమాట నిజమైయుండవచ్చును. కాని త్వరగా నేదియొ యొకటి తేల్చుకొండి. రెండుజాములు దాటిపోయినది. మీరు మంచివాళ్ళన్నమాట నాకు తెలియును గనుక వదలివైచినాము. మఱియొకరైతే యీపాటికి మిమ్మందరను స్టేషనులో బెట్టియుందును. ఇఁక మేమిక్కడ నుండగూడదు. మీ పని మీరు చేసికొనుఁ"డని భటుల నిద్దరను వెంటబెట్టుకొని యతఁడు పాపము మూట గట్టుకొన్నట్లె యైదువందల రూపాయలు మూటగట్టుకొని భటులకు జెరియొక పాతికరూపాయ లిచ్చి తన జాతకము మిక్కిలి గొప్పదనియుఁ దనయట్టి యదృష్టవంతుఁడు లేఁడ నియు నెంచికొనుచు నింటికిఁ బోయెను. రాజభటు లరిగిన తరువాత కొందరు జూదరు లా శవమునకు రాళ్ళుగట్టి సముద్రములో పారవైచిరి. అదియెల్ల గంగాధరుఁడు చూచుచు నూరకుండెను. ఆ కార్యము వలదన్న పక్షమున వారు తన్ను గూడ చంపుదురేమో యని శంకించి నోరు మూసికొని యూరకుండెను. శవమును బాఱవైచి జూదగాం డ్రొకఁడు పోయిన దెస కొకఁడు పోవక జారిరి. అందఱు వెళ్ళినతరువాత గంగాధరుఁడు మిక్కిలి భయపడుచు మాటిమాటికి వెనుకకు ముందునకు జూచుకొనుచు నులికిపడుచు జగన్నాయకపురము దాటి కాకినాడ వెళ్ళి యొక యరుగుమీదఁ బండుకొని నిద్రపట్టక కాఁపువాని విగ్రహమె మాటిమాటికిఁ గన్నులముందర గనబడ వెరగందుచు లేచి కూర్చుండి తెల్లవారునప్పుడేటికిఁబోయి స్నానముచేసి యా దిన మన్నము దినక యే పనియుఁ జేయజాలక జబ్బుగానున్నదని ముసుగు పెట్టుకొని పండుకొని "యిక ముందెన్నడు జూదమాడకూడదు. నాయెత్తు ధనముపోసినను జూదపు బాకలోనికి వెళ్ళఁగూడదు, నేటితో నాకు బుద్ధివచ్చిన" దని నిర్ధారణము జేసికొనియెను. చేసికొనుటయేగాదు ఆనిర్ధారణము ప్రకారము యావజ్జీవము నడచుకొనియెను. ఎప్పుడైన జూదముమీద ధ్యానము పారెనా నాటిరేయి దారుణకర్మ యతనికి జ్ఞాపకమువచ్చి యా సంకల్పము మరల్చుచుండును. సింహాచలము మృతినొందుట చేతను జూదముమీఁద వైరాగ్యము పొడముటచేతను వివాహము గురిచేసుకొనుటచేతను గంగాధరుఁడు కొంతసొమ్ము నిలవఁజేసెను. అతని యిల్లు ధనధాన్య సమృద్ధిగలదై వెలయుచుండెను. పలుమారు చూచి మందపల్లి నివాసుఁడైన కోట కోనప్ప యను బ్రాహ్మణుఁడు పిచ్చమ్మ బ్రతిమాలినమీదట రెండు సంవత్సరముల వయస్సుగల తన కూతురిని నాలుగు వందల రూపాయలు పుచ్చుకొని

గంగాధరున కియ నిశ్చయించెను. అప్పుడు గంగాధరునకు నలుబది సంవత్సరములు వయస్సు. ముక్కుపచ్చలారని చిన్నబిడ్డను నలుబదియేండ్ల వాని కిచ్చి పెండ్లి చేయుచున్నావాయని కొనప్పను కొందరడుగ నత డిట్లనియెను. దైవానుగ్రహము కావలెను కాని చిన్నయేమిటి పెద్దయేమిటి,మొన్న నీ మధ్య పదియేండ్లపిల్లను పదియాఱేండ్ల పిల్లవానికిచ్చి లక్షాధిపతియైన యొక బ్రాహ్మణుడు వివాహము జేసినాఁడు. మూఁడు నెలలు తిరగకుండఁగనే పిల్లవాఁడు పోయినాఁడు. మా పినతండ్రిగా రరువదియేండ్లు వచ్చిన తరువాత పెండ్లి జేసికొని నలుగురు కొడుకులను కన్నాఁడు. అదృష్టము ప్రధానము కాని వయస్సుకాదు. అది యదృష్టవంతురాలైన పక్షమున మందేశ్వర స్వామివారి యనుగ్రహముచేతనైనను దానికడుపున నాలుగు కాయలు కాయకపోవు. ఇంతకు గంగాధరునియొక్క వంశము నిలబెట్టి పున్నెము గట్టుకొనవలెనని మంచి యుద్దేశముతో పిల్లనిచ్చుచున్నాను. కాని యెల్లవారివలె నేను కేవలము డబ్బే ప్రధానముఁ జేసికొని పిల్ల నిచ్చుచున్న యాశాపాతకుడను కాను. భాగ్యవంతునకు భూములున్న వానికి బ్రతిమాలి యెవరో యొకరు కాళ్ళు కడిగి వరదక్షిణనిచ్చి కన్యాదానము జేయుదురు. ఇటువంటి వానికి పిల్లనిచ్చుటయే యిచ్చుట. పిల్లమీద నాలుగువందలు పుచ్చుకొన్నప్పటికి మా కవి పెండ్లి కర్చులక్రింద సరిపోవును. అందులో మిగులునదిలేదు. మేము తిన్నదిలేదు. వట్టి యల్లరేకాని నాకిందులో లాభములేదు. ఒకవేళ పుచ్చుకొనుట దోషమైనప్పటికి వంశము నిలిపిన పున్నె మెక్కడిపోవును. వరుఁడా దిట్టమైనవాడు. కావలసినవాఁడు. మా పెద్దలు వాళ్ళ పెద్దలు గలసి యొక కుటుంబము లాగున నుండెడివారు. పెండ్లి కుమారునకు ముక్కు వంకర కన్ను వంకరలేవు. అన్నోదకము లిచ్చి యాలు బిడ్డలను బోషింపగల సమరుఁడు. సాంప్రదాయము మాట మనము వేరే నెంచుకొన నక్కఱలేదు. కాదాయెనంటె నీళ్ళుమోసి నాఁడా? దానికేమి, డబ్బులేనప్పు డేపనియైన జేయవచ్చును, అందుచేత నేను గంగాధరునకు నాబిడ్డను తప్పక యిచ్చెదను.

అనుకొన్నట్లు వివాహము జరిగెను. వివాహములో బెండ్లికూఁతురు మారము పెట్టి యరఁటిపండ్లు దిన్నందున జలుబుచేసి జ్వరమువచ్చి బాలపాపచిన్నె గనఁబడెను. కాని యగ్గిపెట్టెలు బొగచుట్టలు గంగాధరునియెద్ద నెప్పుడు సిద్ధముగ నుండుటచే నతఁడు బ్రహ్మాస్త్రమువలె పొగచుట్టదెబ్బ ప్రయోగించి భార్యను బ్రతికించు కొనియెను. పొగచుట్ట కాల్చుట దోసము కాదనియు నొకా నొకప్పు డది మహోప కారక మనియు దానివలన నెన్నో ప్రయోజనములు కల వనియు నప్పుడు గంగాధరుడు తన చుట్టుజేరిన బంధుగణము నకు జెప్పి చక్కని లంకాకుచుట్టలు హోమము జేసినపక్షమున దేవతలు సయితము దానివాసనలకు సొక్కి మనము చెప్పినట్లు విందురని యుపన్యసించి దాని రుచి దాని వాసన దానిషోకు నెఱుగని పరమ శుంఠలు గొందఱు వైదికులు తప్పందురు. కాని దాని సారస్య మెఱిఁగిన వారు దానిని మెచ్చుకొని యుందుదురని వక్కాణించి యదివర కలవాటు లేని వారందఱు నింకమీఁదనైన యలవాటు చేసికొని సౌఖ్యమనుభవించ వలసినదని హెచ్చరించి కట్టకడపట నిట్లనియెను. "నాకే శంకరాచార్య స్వాములవారి యధికార మున్నపక్షమున చుట్టకాల్చని చచ్చువెధవ లందఱిని వెలి వేయక పోదునా? ప్రతిదొడ్డిలోను పొగాకు మొక్కలు నాటించనా? చుట్ట కాల్చినవారి శరీరము వజ్రశరీర మగును. వాని కెప్పుడు రోగమురాదు. లంకపొగాకు కషాయము కాచి మూఁడు పూటలిచ్చిన పక్షమున యజ్ఞములు చేసిన సోమయాజులు వారికి శాస్త్రులువారికి ఛాందసము వదలిపోవును."

పెండ్లి సలక్షణముగ జరిగెను. పరిణయా నంతరమున గంగాధరుఁడు కాకినాడకు బోయి యెప్పటియట్ల తన వృత్తి యందుండెను. కాలక్రమమున సింగమ్మ బాలారిష్ట దోషములు గడచి పదమూఁడవ యేట రజస్వ లయ్యెను. ఏబదిమూఁడవ యేట గంగాధరునకుఁ పునస్సంధాన మయ్యెను. అప్పటికి అతని దురదృష్టవశమున దగ్గు సంభవించెను. కాని శరీరము దృఢముగానె యుండెను. గంగాధరుఁడు పునస్సంధాన మైన తరువాత మామగారి ప్రేరణముచేత గాకినాడ వదలి మందపల్లిలో నొకయిల్లుగొని యందు బ్రవేశించెను. కాపురమునకు వెళ్ళిన నాలుగేండ్లకు సింగమ్మకు వరప్రసాది యై పప్పుభొట్ల వంశ రత్నాకర పూర్ణచంద్రుడై, యీ కథానాయకుఁడైన గణపతి జన్మించెను.

# ఎనిమిదవ ప్రకరణము

చదువరులారా! మీరెన్నడైన జన్మమధ్యమం దొక పిల్ల పిశాచమును జూచియుందురా? "ఓహోహో ! పిశాచగణములో జేరినవారికె గాని పిశాచములు కనఁబడవు. మేమట్టి పిశాచగణములో జేరిన వారము కాదు కనుక పిల్ల పిశాచమును గాని పెద్ద పిశాచమును గాని జూచి యెఱుఁగ" మని మీరు సంగ్రహముగ నాప్రశ్న కుత్తర మిత్తురు కాబోలు. సరే అట్లయిన క్షమింపుఁడు. పిశాచముల మాట నెత్తదలఁచు కొనలేదు. పోనీ మఱియొక మాట కుత్తరమిండు. మీరెన్నడైన నొక కొండ ముచ్చును జూచియుందురా? చూచియుందురా యని నేను వేరే వేరే యడుగనక్కఱలేదని దలంచెదను. ఏలయన, గొండముచ్చు దర్శనము జేయనివా రెవ్వరుందురు? పండితరాయలని ఢిల్లీశ్వరునిచేత బిరుదు పొందిన జగన్నాధ పండితుడు చెప్పినట్లు మహోన్నత వృక్షశాఖలు పీఠములుగ కిచకిచలు సరససల్లాపములు బరుకులు కరపులు బంధు సత్కారముగఁ దోటలలో దొడ్లలో గొలువు దీర్చియుండు నీ కిష్కింధా పురాగ్రహా రీకుల మొగము లెవ్వ రెఱుంగరు? మానవజాతికెల్ల మూల పురుషుఁ డని ప్రకృతి శాస్త్రజ్ఞలచే నిర్ణయింపఁబడి కళత్ర వియోగముచే నంతరాయము లేని యలమట నొంది రఘురామునకు సముద్ర బంధన మందును, లంకా విజయము నందును రావణ కుంభకర్ణాది దుష్టరాక్షస సంహార మందును మిక్కిలి తోడ్పడి చాంచల్యమున కెల్ల నిలయమైన యా మర్కటము నొక్కమారు స్మరియింతురేని మీకిహ పరములు రెండును గలవు. ఇహ మెట్లు కలుగును, పరమెట్లు గలుగునని మీకు సందేహము దోఁచ వచ్చును. పరబ్రహ్మ స్వరూఁపుడని ప్రాచీనులచే వర్ణింపబడి శ్రీరాముని సేవకులని దలఁచుకొన్నంత మాత్రమున మీ పాపపుంజము భస్మపటల మగును. ఇదే పరము. ఇహమనేది యన, మర్కట రూపము మనసున నిల్చినంత మాత్రమున మన కథానాయకుని రూపు రేఖా విలాసములు కొంతవఱకు దేటపడవచ్చును. ఒక కొండముచ్చున్నదని కొనుఁడు; తోక లేదను కొనుఁడు. అది మనుష్యాంగన యొడిలో నుండి పాలుద్రావుచున్న దనుకొనుఁడు. అది చెట్టు కొమ్మ మీఁద గాక యొకయింట నొక నులకమంచము కుక్కి మీఁదఁ బండుకొన్న దనుకొనుఁడు; దాని మొగముమీఁద తిరుగలి గంట్లవలె మాశూచకము మచ్చలున్న వనుకొనుఁడు; కుడికన్ను మెల్ల యనుకొనుఁడు; కుడి కంటిలో గొప్ప కందిగింజంత కాయ యనుకొనుఁడు. చేతులు మోరులు దిగినవనుకొనుడు, దొడ్డికాళ్ళను కొనుఁడు. మొదటనే గుజ్జురూప మనుకొనుఁడు, ఆగుజ్జునకు దగిన బొజ్జయున్న దనుకొనుఁడు. శరీరమునిండ రోమకళ యనుకొనుఁడు. మనస్సు మఱియొక పదార్థముమీదికి గాని యాలోచన మీఁదికి గాని చలింపకుండ నిశ్చలముచేసి యొక్కనిముసము మీరు ధ్యానము జేయుచు రేని గణపతి రూపము మీకు భావగోచర మగును.

గణపతి సహజముగానె వికృతరూపుఁడు. మశూచికమా మీద మెరుగులు దిద్దినది. మొదలే కోతి; యామీద దయ్యము పట్టిన దన్నట్లు మొదలే కురూపియైన వానికి మశూచికము వికారములు తెచ్చినపుడు వానియంద మిక వేరెచెప్ప వలయునా? గణపతి పుట్టిన రెండుమూడు మాసములకే గంగాధరుని తల్లియగు పిచ్చమ్మ కాలధర్మము నొందెను. గంగాధరుఁడు తన కుమారుఁడు చెడ్డ నక్షత్రమున జన్మించుటచె తనతల్లి మృతినొందె నని విచారించి నాయనమ్మ

గండమున బుట్టిన వెధవఁ విడని తరచుగాఁ దిట్టుచుండును. ఆ గ్రామమున జ్యోస్యుల జోగావధానులను గొప్పజ్యోతిశ్శాస్త్రజ్ఞ డుండెను. గంగాధరుఁ డాయన యొద్దకుఁ బోయి "అయ్యా! నాకుమారుడు పుట్టిన మూడు నెలలకే మాయమ్మ చచ్చిపోయెను. వీఁడి మూలమున నింకెవరు చచ్చిపోవుదురు యని భయ మగుచున్నది. కాబట్టి వీని జాతకము వ్రాసి మీరెవ రెవరి కేమిగండము లున్నవో యేమి శాంతులు చేయవలెనో చెప్పవలె" నని యడిగెను. అనవుఁడు జోగావధానులు మీ పిల్లవాఁడు జన్మించిన తిథి, వారము, నక్షత్రము చెప్పిన పక్షమున జాతకము వ్రాసెదనని బదులు చెప్పెను. అన గంగాధరుఁడు తలయెత్తిపైకిచూచి కొంచె మాలోచించి వ్రేళ్ళుమడచి లెక్కపెట్టి "అయ్యా ! మావాఁడు పుట్టినరోజు సరిగా జ్ఞాపకము లేదు. ఉండండి. ఆలోచించి చెప్పఁగలను. వెంకన్నపంతులుగారి తల్లిగారి నెలమాసికము రేపనఁగా నా రాత్రి దీపాలవేళ నెట్టినాఁడు. నీ కేలాగున జ్ఞాపకమున్న దందురేమో వినండి. మరునాఁడు బ్రాహ్మణార్థమునకు రమ్మని వెంకన్నపంతులు గారు నన్ను పిలవవచ్చినారు. నా పెండ్లాము నొప్పులు పడుచున్నది. పురుఁడు రాకపోయిన పక్షమున రేపు రాఁగలను. వచ్చిన యెడల రానని చెప్పినాను. ఆయన వెళ్ళిపోయిన గడియలోనే వీఁడు జన్మించినాఁ" డని యతఁ డుత్తరము చెప్పెను. సరే వెంకన్నపంతులు గారెప్పుడు పోయినారో నీ వెఱుఁగుదువా? యని జ్యోతిష్కుఁ డడుగుటయు గంగాధరుడు తమ గ్రామములోని కెవరో తూర్పునుండి గొఱ్ఱెగేదె లమ్మ దెచ్చినారే అప్పుడు; అదెప్పుడో చెప్పగలను. వినండి అమ్మవారి జాతరి యెల్లుం డనగా నేనప్పు డమ్మవారికి బలి నిమిత్తమై మేఁక కోసము తిరుగుచుండఁగా "వెంకన్న పంతులు గారు పోయినారు. మీరు మోతకు రావలసినద" ని నన్ను" నరిసిగాడు పిలిచి తీసికొనిపోయినాడు. మఱొక సంగతి "కంచరి కామాక్షిగారి పశువులపాక కాలిపోయినరోజండి" యని కొన్ని సంగతులు జ్ఞాపకము చేసెను. ఆ సంగతులనుబట్టి గణపతి యొక్క జన్మదినము జోగావధానులుగారికి స్ఫురింపలేదు. గొఱ్ఱెగేదె లెవరు తెచ్చిరో యెప్పుడు తెచ్చిరో యాయనకు జ్ఞాపకము లేదు. ప్రాణము విసికి యెట్టకేల కాయన వెంకన్నపంతులుగా రెప్పుడు పోయినారో యాయన కొడుకు నడిగి తెలిసికొనిరా; దానిని బట్టి నెలమాసిక మెప్పుడైనదో పంచాంగము జూచి మీ పిల్లవాని జాతకము వ్రాసెదను. మూఁడు రూపాయలు మాత్రము తీసికొనిరా యని చెప్పి పంపెను. ఆ సాయంకాలముననె గంగాధరుఁడు మూడురూపాయల ముడుపు చెల్లించి వెంకన్నపంతులు గారి మరణదినము కుమారునడిగి తెలిసికొని వచ్చి చెప్పెను. మరునాడు సాయంకాలమునకె జాతకము వ్రాయఁ బడియెను. జాతకము తాటియాకు మీద వ్రాసి యది గంగాధరునకిచ్చి జోగావధానులు "గంగాధరుఁడూ ! నీవాఁ డఖండ ప్రజ్ఞావంతుఁడై దేశదేశములందు మహాప్రసిద్ధి కెక్కి నీ వంశమున కెంతో పేరుప్రతిష్ఠలు తెచ్చును. ఇంతకు నీయదృష్టము మంచిది. నీ పుణ్యముచేత నీకు సుపుత్రుడు కలిగినాడు. ఇటు వంటి జాతకము నే నెక్కడ చూడలేదు సుమీ, మీయింట నిక నెవరికి గండములు లేవు. ఉన్న గండమేమో ముసలమ్మ మీద కొట్టుకొని పోయినదని స్తుతించి సంతోషపఱచి పంపెను. గంగధరుఁడు తనకొడు కేరాజు నొద్దనైన మంత్రియే యగునో లేక చతుశ్శాస్త్ర పండితుఁడే యగునో ధనము సంపాదించి కోటికి పరుగెత్తునో సర్కారువారియొద్ద గొప్ప యుద్యోగము చేయునో యేదో గొప్ప యైశ్వర్యము కుమారున కున్నదని పలుకుచుఁ దన యింట నెవరికి మఱి గండములు లేవని చెప్పినందుకు మిగుల సంతుష్టి నొందుచు జాతకమున్న తాటియాకు నింటికి బోయి పడమటింటి వసారా చూరులో విభూతిబుట్ట కట్టిన చోటునకు సమీపమున దోసెను. జోగావధానులుగారి జ్యోతిష్యము గణపతి విషయమున మిడతంబొట్టు

శకునము వలె గొంతవరకు నిజమయ్యెను. దేశదేశములయం దతడు ప్రఖ్యాతుఁడగు నను మాట యక్షరాల నిక్కమయ్యెను. ఇఁక మీద గండములు లేవని యాయన చెప్పిన మాటమాత్ర మబద్ధమయ్యెను. వరప్రసాదివలె జనియించిన యీ కుమారుని ముద్దు ముచ్చటలు కన్నులార జూచి యానందించుటకును జాతకములో సూచింప బడిన ప్రకారము కుమారుఁడు ప్రసిద్ధి పురుషుఁడై యుండగా గనుగొను భాగ్యము గంగాధరునకు లభియించినది కాదు. గణపతికి నాలుగేండ్లైన నిండక మునుపే గంగాధరుఁడు మృతి నొందెను. గణపతి కప్పటి కుపనయనము కాకపోవుటచే గంగాధరున కుత్తరక్రియలు బాలకుని మీఁదనె కర్తవ్యము పెట్టి మేనమామ చేసెను. గంగాధరుని యొద్ద నున్నఁ ధన మతఁడుండఁగానే చాల మటుకు వ్యయమయ్యెను. మిగిలిన దతఁడు పోయిన సంవత్సరము లోపుననె కర్చుపడెను. సంసారము మొదటికి వచ్చెను. గణపతి మాతృసమేతముగ మేనమామ యింటనె ప్రవేశించెను. అతని స్థితి కొంచెము బాగుండుటచే నతఁడు మేనల్లుని దోబుట్టువును గొంతకాలము పోషింప గలిగెను. గణపతికి గర్భాష్టమం దుపనయనము జరిగెను. బలిచక్రవర్తిని వంచించుటకై పూర్వకాలమవతరించిన వామనమూర్తియొక్క యవతార మన్నట్లు, కర్కోటకుడు కఱచినపిదప బాహుకుండను పేరుతో ఋతుపర్ణు నాశ్రయించి యున్న సాక్షాన్నల రూపమట్లు చూచువారి కెంతో నవ్వుపుట్టించుచు గణపతి భూమికి జానెడై వడకపెండ్లికొడుకై పీటలమీఁదఁ గూర్చున్నప్పుడు చూచినవారిదె యదృష్టము. గాయత్రీ మంత్ర మతనినోట నుచ్చరింపఁజేయుట పురోహితుని తరమైనది కాదు. గాయత్రీ మంత్రము వచ్చుగాక రాకపోవుగాక మెడలో జందెము పోగులు మాత్రము పడెను. అక్షరాభ్యాస మైదవయేటనే యైనను నుపనయనమైన తరువాతనె గణపతిని బడికి పంపించిరి. చదువు సంధ్యలు రెండును సమానముగానె వచ్చెను. గణపతియొక్క తెలివితేటలకు గాయత్రి మంత్రముపదేశించు నపుడు పురోహితుఁ డెంత సంతోషించెనో యోనమాలు చెప్పునపుడు వ్రాయించునపుడు పంతులుకూడ నంతే సంతోషించెను. గణపతిని బడి కంపుట తల్లికి, మేనమామ నష్టకష్టములలో నొక కష్టమయ్యెను. గణపతి పాఠశాలకు బోవు నప్పుడు జరిగెడు నుత్సవమును భాగవతము, జలక్రీడలు మొదలగు నాటలు జూచుటకు బోయినట్లె పోయి యూరులో ననేకులు తీరుబడి చేసికొని చూచి సంతోషించుచుందురు. గణపతి యాకారము చేతను వయస్సు చేతను మిక్కిలి కుఱ్ఱవాఁడైనను వానిని బడి కొక్కడు తీసికొని పోవజాలఁ డయ్యెను. ఆ పని తల్లికి సాధ్యము కాకపోయెను. పంతులుగారు చింతబరిక పుచ్చుకొని ప్రతి దినము నుదయమును సాయంకాలముననను బొరియలవంటి నలుగురు పిల్లలను వెంటబెట్టుకొని రావలయును. ఆ నలుగురు యజ్ఞపశువును బడద్రోసినట్లు గనపతిని నేలబడద్రోసి కాళ్ళిద్దరు చేతులిద్దరు బట్టుకొని తీసుకొని పోవుచుందురు.

గణపతి సమయోచితముగ వీలువెంబడి తన పాలిటి యమ కింకరులవంటి యానలుగురు పిల్లలను గోళ్ళతో బరికియు గిల్లియు వాడి పండ్లతో గరిచియుఁ గాళ్ళతో దన్నియు నిట్టట్టు విసిరి తలతో గొట్టియు మీఁద నుమిసియు నోటికి వచ్చినట్లు తిట్టియు నూరందరు జేరునట్లు కేకలు వైచియుఁ పూట పూటకొక నాటక మాడుచుండును. పంతులుగారు వజ్రాయుధమువంటి చింతబరికెలతో నెడనెడ వీపుమీద సమయోచితముగ వడ్డించుచుండును. బరకులు కరపులు తన్నులు, గిల్లులు మొదలగు బహుమానములలో గురువు గారికి భాగము లేకపోయినను శరపరంపరలై వెడలు తిట్లలో మాత్ర మాయనకు పెద్దభాగమె వచ్చుచుండును. బడికి వెళ్ళిన తరవాత సయితము గణపతి గురువుగారిని సుఖముగ నుండ నిచ్చువాఁడు కాడు. కన్నుమూసి

తెరచునంతలో నతఁడు మాయమగు చుండును. చుట్టుప్రక్కల వెదకి వెదకి పంతులు కనుగొనలేక విసుగు చుండును. బడిపేరు చెప్పగానె గణపతికి నడుము నొప్పి కాళ్ళతీత కడుపునొప్పి, గుండెపోటు, తలనొప్పి మొదలగు రోగములు పొడచూపుచుండును. ఈ రోగములు నప్పుడప్పుడు పంతులుగారు బెత్తము నుపయోగించి చికిత్సలుచేసి కుదర్చుచుందురు. ఎన్నిమారులు చికిత్సలు చేసినను వాని కారోగము మాత్రము కుదరలేదు. ఎల్లరోగములు చికిత్సలకు సాధ్యమగునా? బడిమాని యేపని చేయమన్నను మన గణపతికి పరమానందము. బడిపేరు చెప్పగానే యతని మొగము వెలవెలబోవును. ఈ మహాపద దప్పించుకొనుటకై యతఁ డెన్నో యుపాయములు పన్నజొచ్చెను. తెల్లవారుచున్న దనఁగానె యతని కెంతోభయము. ఏలయన మేనమామ బడికి పొమ్మనును. అందుచేత నతఁడు దినమంతయు రాత్రిగానె యుండవలయునని కోరుచుండును. పంతులుగారికి రోగము రావలయునని యతఁ డెన్నిమారులో కోరెను. కోరుటయెగాదు, ఒకసారి చీకటితోనే లేచి కాకులు కూయకమున్నె యమ్మవారిగుడికిఁబోయి తలుపు దగ్గఱ నిలిచి "అమ్మవారా తల్లీ మా పంతులుగారికి విశూచి జాడ్యమైన మరి యేరోగమైన దెప్పించి చంపితివా నీకు బలిసిన కోళ్ళను రెంటిని యెత్తుకువచ్చి బలి యిచ్చెదను. లేదా ముష్టియెత్తియైన మంచి మేఁకపోతును బలియిచ్చెద" నని దండముపెట్టి మ్రొక్కుకొనెను. కాని ఆ యమ్మవారి కతఁ డేమి విషము పెట్టెనో కాని యతని మ్రొక్కులు సరకు గొనక పంతులు జోలికి పోక యూరకుండెను. ఎన్నోమారులు చలిది నైవేద్యములు వేఁడి నైవేద్యములు చలిమిడి పానకములు గ్రహించి యొకటి రెండుసారులు గరగలుకూడ గైకొని యాదేవత యవసరము వచ్చినపుడు కృతఘ్నురాలై తన పనిచేయక తనయెడ ననాదరణము చూపినందుకు గణపతి కెంతో కోపము వచ్చినది కాని యమ్మవారగుట చేత తనకేదేని యాపదగలిగించునను భయముచేత నామెను దూషింపక యూరకుండెను. బడికి వెళ్ళవలసి వచ్చినప్పుడు కడుపునొప్పి బాధ నభినయించి యూరక వామురసము శొంఠిరసము ద్రాఁగుచుండును. తలనొప్పి లేకపోయినను రెండు కణతలు పట్టుకొని చాలభాధ నభినయించి కణతలకు శొంఠి గంధము మెత్తును. బడికి బోవకుండుటకై యత డెన్నోసారులు రోగము పేరుచెప్పి మిరియాల రసముగూడ ద్రాగెను. ఒకనాడు గణపతి నడుము నొప్పియని బడిమానగా మేనమామ చిత్రమూలరసము తీయించి పట్టు వేయించెను. దాని మంట కయిన నతఁడు సహించెను కాని బడికి పోవుట కిచ్చగింపఁడయ్యె. ఒకటి రెండుసారు లాదుండగుఁడు గాజు పెంకుతో దన శరీరము గీచికొని కోతిపుండు బ్రహ్మరాక్షసియగునట్లు దానిని గొప్ప పుండు చేసికొని యెన్ని మందులు వైచినను పుండు మానకుండునట్లు ప్రయత్నముచేసి కొన్ని దినములు బడిమానెను. పాఠశాలాపత్తు తప్పించుకొనుటకై యతడు దాఁగని చోటు లేదు. ఎక్కని చెట్టు లేదు, దూరని డొంకలేదు. ఒకనాఁడు పాణకలోఁ గూర్చుండును. ఒకనాఁ డటకమీద నెక్కి కనబడకుండును. పాడుగృహములలోఁ గూర్చుండును. గణపతి బుద్ధి పాదరసమువంటి దగుటచేత బడియాపదఁ దప్పించుకొనుటకై యత డెన్నో ప్రయత్నములు చేసెను. కాని జీవచరిత్రలు సరిగా వ్రాయువారు లేకపోవుటచే నవియెల్ల మనకు దొరికినవికావు. చదువరుల యదృష్టవశమున నటువంటి వొకటి రెండు మాత్రము లభించినవి. అటువంటివి లభించినప్పుడు వ్రాయక పోవుట చరిత్రయెడ మహాదోషము జేయుటయని గ్రంథవిస్తర దోషమునకైన నొడఁబడి వాని నీక్రింద నుదాహరింపవలసివచ్చెను. గణపతి కొకనాఁడు తెల్లవారుజామున నాలుగు గడియల ప్రొద్దుండఁగా మెలకువ వచ్చెను. పెందలకడ మెలఁకువ వచ్చినప్పుడు దైవప్రార్థనము

జేసుకొనవలసినదని తల్లియు మేనమామయు నతనితొ జెప్పుచుందురు. కాని యట్టిపనిఁ జేయుట కతనికెన్నడవకాశము చిక్కలేదు. తెల్లవారుచున్న దనగానే పంతులు గారు, పాఠశాల పంతులుగారి చేతిలో బెత్తము వాని కన్నులకు గట్టినట్లెదుట కనఁబడుచుండును. ఆ యాపద నెట్లు తప్పించుకొన వలయునని యుపాయములు వెదకుటతోడనే కాలము వెళ్ళిపోవుచుండును. ఆ నాఁ డతఁడు తెల్లతల్లవారుచుండఁగా లేచి దొడ్డిదారికి పాఱిపోయి చాకిరేవు కరిగి పెద్ద చాకిబానక్రిందదూరి కూర్చుండెను. నాలుగు గడియలు ప్రొద్దెక్కిన తరువాత చాకలివాఁడు రేవునకుఁ బోయి తన గూననెత్తిచూచునప్పటికి దానియడుగున గణపతి కూర్చుండియుండెను. పంతులు తనజాడ తెలుసుకొని వచ్చెననుకొని గణపతి గూన యెత్తగానె పాఱిపోయెను. తన గూన బగులగొట్టుటకు వీఁడెవఁడో ప్రయత్నము జేయుచున్నాఁడని చాకలి వానిని దరముకొనిపోయెను. లేడివలెఁ పఱుగెత్తుచున్న యా డింబకుని బట్టుకొనలేక మరలి వచ్చెను. మఱియొకనాఁడు బడికి బోవనందుకు మేనమామ కోపించి యీతజువ్వతో నెత్తురు వచ్చునట్లు కొట్టెను. ఆ సాయంకాలము మేనమామ వీధిలోనికి వెళ్ళినతరువాత నేనీ దెబ్బలు తినలేను. చచ్చిపోవుచున్నానని గణపతి తల్లితోఁ చెప్పెను. తల్లి బతిమాలి కోమటింట నటుకులు బెల్లము జీడెలు గొనిపెట్టి యోదార్చెను. గణపతి యవియెల్లభక్షించి మేనమామ నెట్లయిన లొంగదీయవలయునని సంకల్పించి రాత్రియైన తరువాత నిల్లుకదలి వెళ్లుట కతనికి మిక్కిలి భయమగుటచేత తనవంటి దుండగునే మఱియొకనిని సాయము రమ్మని వాని సహాయమున మేనమామ భోజనము చేయుచుండగా దొడ్డిలోనికిఁ బోయి యాపిల్లవాఁడును దానును దోడుపట్టి రాయియొకటి నూతిలోఁ బడ వైచిరి. ఆ చప్పుడేమిటని మేనమామ తల్లినడిగెను. అంతలో గణపతి సహాధ్యాయి యైన బాలుడు వచ్చి మీపిల్లవాడు నూతిలో బడినా డండోయియని కేకవైచి పాఱిపోయిను. మేనమామ భోజనమువదలి అయ్యో! అయ్యో ! యని లేచెను. సింగమ్మ అయ్యో కొడుకో, అయ్యో కొడుకో నేనేమి జేతునురా తండ్రీ యీ దిక్కుమాలిన చదువు నీ ప్రాణము కోసము వచ్చినదిరా తండ్రీ యని గుండెలు బాదుకొనుచు నేడ్చుచు మొత్తుకొనుచు దనయన్న గారిం దిట్టుచు బడిపంతులను దూషించుచు దైవమును దూఱుచు దన యదృష్టమును నిందించు కొనుచు నూతికడకు బోయి నూతి చుట్టు దిరుగు చుండెను. ఆ గోల విని చుట్టుప్రక్కలవా రందరు జేరిరి. మేనమామ తాళ్ళు దాగరలు నిచ్చెనలు మొదలైనవి సిద్ధము చేసి యీతనేర్చిన సాహసుల నిద్దఱను బాలుని వెదకుటకై నూతిలో దింపెను. ఎంత వెదకినను బాలుఁ డగుపడలేదు. ఊబిలో గూరుకు పోయి నాఁడని కొందదు పడగానె చేపలు తినివైచినవని కొందఱు బావిలో బాలుఁడు పడలేదని కొందఱు ననజొచ్చిరి. సింగమ్మ తానుగూడ నూతిలోదిగి చచ్చెదనని నూతియంచుపై గూర్చుండెను. అక్కడ నున్న వారందఱు పట్టుకొని యాత్మహత్య జేసికొన గూడదని మందలించి యిల్లుచేర్చిరి. పిల్లవాఁడేమై యుండునని మేనమామ తలపోయ జొచ్చెను. నిన్ను బెదరించుటకై కుఱ్ఱవాఁ డీయల్లరి చేసియుండును, కానికుఱ్ఱవాడు నూతిలో బడలేదని యక్కడ చేరినవా రతనితోఁ జెప్పిరి. కళేబరము కనఁబడక పోవుటచే సింగమ్మకుగూడ తనకొడుకు బావిలోబడలేదని నమ్మకము కలిగెను. ఆ రాత్రి తల్లియు మేన మామయు నిద్రపోలేదు. రెండుజాములైన తరువాత వారి యింటిపొరుగుననున్న యొకబ్రాహ్మణుడిద్దఱు బాలకుల బట్టి తోడ్కొని వచ్చి యిందులో మీపిల్లవాఁడు, ఈ తోడిదొంగ లిద్దఱు జేసిన దుండగమిది. అంతే కాని నూతిలో బడలేదని చెప్పి వప్పగించెను. తల్లి గణపతిని జూచి "నాయనా! బ్రతికివచ్చితివా" యని కౌఁగిలించుకొని యేడ్చెను. మేనమామ గుండెబాదుకొని యెంత

దుర్మార్గుడవురా ని నిమిత్తము నాప్రాణమెంత యలజడి పడినదిరా? ప్రాణ నష్ట మటుండగా లోకములో నా కెంతో యప్రతిష్ట వచ్చినదని నేనెంతో కుళ్ళి యేడ్చుచున్నాను. సరే; నాయదృష్టము బాగుండబట్టి నీకు నూతిలో బడవలయు నని యిచ్చ లేకపోయిన దని తన చెల్లెలిని నుద్దేశించి "ఓసీ ! సింగమ్మా నీ కొడుకుతో నేను వేగలేను. నా యెముకలు చిట్లము కట్టి పోవుచున్నవి. వీనికోసము నేనెన్నో బాధలు పడియున్నాను. ఇకమీద నేను పడజాలను. అల్లరి పిల్లవాడై నప్పుడు కొట్టవలసి వచ్చును. మంద లించగానె నూతిలోపడి గోతిలోపడి చచ్చిపోవుదు నని బెదరించిన పక్షమున నే నెట్లు వేగ గలను. నేను కొంతకాలము మిమ్ములను సంరక్షించినాను. ఇక మీఁద మీ యిష్టము వచ్చిన చోటికి వెళ్ళి పొండు యని కఠినముగ బలి కెను. ఆ పలుకులు విని సింగమ్మ కంట దడి పెట్టుకొని "అన్నయ్యా! నీవాలాగున నంటే నేనిఁక గంగాప్రవేశము కావలసినదే. పిల్లవాఁడల్లరి చేయునపుడు శిక్షింపవద్దని యెవ్వరన్నారు. నేనుమాత్రము కొట్టనా తిట్టనా? కాకపోయినా వీఁడు బండ వాడగుటచే నాకిన్ని పాట్లు వచ్చిన" వని తనకొడుతో వచ్చిన రెండవ పిల్లవానిని చూచి "యీ దొంగ పిల్లవాఁడే మాపిల్లవాని బుద్ధి విరిచి పాడుచేయుచున్నాఁడు. అంతకు ముందింత పాపము లేదు. వీఁడెవఁడో మాయింటికి మారకుఁడు బయలు దేఱినాఁడు. నూతిలో మా వాఁడు పడనిదె పడినాఁడని కేకవైచి పాఱిపోయినాడు. ఈపాడు పిల్లల మూలమున నేను బ్రతుక లేకున్నాను. మా యింటికి రావద్దంటే మానరు. ఇది నా కర్మ" మని మొత్తుఁకొనెను. అప్పుడు సింగమ్మతో సోదరుఁ డిట్లనియె. "నేఁడు మొదలుకొని నీకొడుకు నా చెప్పుచేతలలో నున్న పక్షమున నాచేతనైనట్లు నేను బాగుచేసెదను. నేను కొట్టినను, తిట్టినను పడవలయును లేదా మీకు, నాకు సరి. ఈ మాటు నీకొడుకు పాఱిపోయినాఁడా కాలికి బొండ వైచెదను." అనవుడు సింగమ్మ "నీయిష్టము వచ్చినట్లు చేయవచ్చు నాయనా ! చదువు రాక పోయినప్పటికి బుద్ధి కొంచెముంటే చాలునని నే నేడ్చుచున్నాను. బుద్దికూడ లేకపోయినది కదా!" యని యేడ్చెను. అక్కడ చేరినవారు తలకొక మాట యని యెవరిదారిని వారు జారిరి. సింగమ్మ కుమారుని పండుకొనబెట్టి తానును కొంతసేపు విల పించెను. ఆమె సోదరుడును తన గదిలోనికిఁ బోయి నిద్రించెను. మరునాటి నుండి గనపతి యెప్పటియట్లె బడి పెద్దపులి యని భావించి యా గుమ్మ మెక్కక పోవుటయేగాక వేళకు భోజనము నకు రాక యెంత వెదకిన గనఁబడక రాత్రులుమాత్ర మింటికి వచ్చుచుండెను. మేనమామ విసిగి బండ చేయించి గణపతి కాలికి దగిలించెను. అతనిం జూచుటకు విద్యార్థులు తీర్థ ప్రజవలె వచ్చిరి. అభిమానధనుఁడైన గణపతి వారిని జూచి మొదట సిగ్గుపడియెను. కాని తరువాత సిగ్గు పడవలసిన యవసరము లేదనుకొని యెప్పటి యట్ల ముచ్చటలాడుచును మనసు గలసిన మిత్రులను బిలిచి యెవరు లేనప్పుడు వారితో "నోరీ ! మా మామ లోపల భోజనము చేయునప్పుడు దొంగతాళము తెచ్చి నా బండదీసి నన్ను వదిలించరా! హాయిగా మనమిద్దఱము తిరగవచ్చును" నని హెచ్చరించు చుండును. అతని యుపదేశ ప్రకార మొక రిద్దరతని కొకటి రెండు సారులు సాయము జేసిరి. ఈసారి యతఁడు సాయంకాల మింటికి రాక స్నేహితుల యిండ్లనె విందు లారగించుచు మేనమామకు నాలుగైదు దినములవఱకు గనఁబడక పోయెను. కనఁబడగానే మేనమామ యల్లునకు మొట్టికాయలు, గుద్దులు, చరపులు, చెంపకాయలు, తొడపాశములు కానుక యిచ్చి యలుకదీర్చి యింటికి దీసికొని వచ్చెను. ఇప్పటికి గణపతికి పదియేండ్లు నిండెను. అప్పుడప్పుడు పంతులు గుంటయోనమాలు వ్రాయించి చెప్పిన చదువుటవలన నైదు బరులు గుణింతములు నేర్చి పుస్తకము పట్టెను. మఱి రెండు

సంవత్సరముల పాటు చదువుకొన్న పక్షమున దన కొడుకు బడిపంతులుపని చెసియైన నింత యన్నము దెచ్చుకొని తినగలఁడని తల్లి దలంచు చుండెను. కాని దానికి దగిన యవకాశములు గణపతికి గలుగవయ్యెను. మిత్రు లెక్కువైరి. వ్యాపారము లధిక మయ్యెను. ఇంట తీరిక నిముసమైన నిలుచుటకు లేకపోయెను. కష్టపడి చీట్ల పేక యాడుట నేర్చుకొనియెను. తురుపులాట దొంగాట పట్లాట మొదలగు వానియందెంతో నేర్పరి యయ్యెను. డబ్బు పెట్టి పేకాడవలయునని యతని కుత్సాహము కలిగెను. కాని పాపము ! దైవ మతనిని భాగ్యవంతుల యింట బుట్టింపక నిఱుపేదల యింట బుట్టించెను. "ధన మూల మిదం జగత్తు" ను మాట మొదటిసారి యతనికిఁ దోచెను. ఆ యాట నారంభించిన తరువాత మేనమామ విభూతిబుట్టలో వైచుచున్న డబ్బులు తల్లి తన వదినెగారు చూడకుండ బియ్యముమ్ముఁకొని యుప్పుబుట్టలోను గూటిలోను దాఁచుకొన్న డబ్బులు మాయమైపోవ జొచ్చెను. మేనమామ కప్పు డప్పుడు మేనల్లుని మీద ననుమానము కలిగి యావిషయము చెల్లెలి కెఱిఁగింప యామె యభిమానము చేతనో నిజముగా నమ్మి యుండుట చేతనో "అన్నయ్యా ! నీ మేనల్లుడు దగఱ మఱియే దుర్గుణ మున్నదన్న నొప్పుకొనవచ్చును. కాని దొంగతన మున్నదని యొప్పుకొనలేను. ఇదివఱ కెన్నడు జూడఁ లేదు. చూడని మాటలు మన మనగూడదు. దుండగుఁ డగుట చేత వీఁడే పాపములకెల్ల భైరవుఁ డని యపవాదము వచ్చు చున్నది. విఘ్నేశ్వరుని చవితినా డక్షతలు నెత్తిమీఁద వైచికొనకుండ ముందుగా జంద్రుఁని జూడవద్దని నేనెన్ని మాట్లు చెప్పినను వినఁడు. విన నందుకు దానిఫల మనుభవించుచున్నాడు. ఇంతకు నేను చేసికొన్నపాపము. లేకలేక వంశాన కొక్కఁడు పుట్టినాడు వానిమీఁద దొంగతనములు వచ్చిపడుచున్నవి. నేనేమి చేయగల" నని యుత్తరము చెప్పెను. "సరే ముందు ముందు నీకే తెలియగల" దని సోదరుఁ డూరకుండెను. తల్లియు మేనమామయు డబ్బులు జాగ్రత్త పెట్టి దాఁచుకొన జొచ్చిరి. అప్పుడు పేకాటకు పైకము దొరకక గణపతి పొరుగిండ్లకుఁ బోయి యథాసందర్భముగ దొరికినంత వఱకు హస్తలాఘవము చేసి యాటలలో పడిన ఋణము దీర్చి కృతకృత్యుఁ డగుచు వచ్చెను. పేకాటలోని స్నేహితులు చాలమంది పొగచుట్టలు కాల్చువారగుటచేత గణపతిగూడ చుట్టలు కాల్చవలయునని సరదా పుట్టెను. ముందుగా సరదా తీర్చుకొనుటకై గోగుపుల్లలు కాల్చెను. తరువాత నచఁటి చొరుగు చుట్టలుచుట్టి కాల్చి కొంతవఱ కుత్సాహము దీర్చికొనియెను. కాని మిత్రులందఱు బొగచుట్టలు కాల్చుచుండగాఁ దానచఁటి చొరుగు చుట్టలు కాల్చుట తన కెంతో యవమానకరముగ నుండెను. అందుచేత నతఁడు బొగచుట్టలే కాల్చవలయునని నిశ్చయించుకొని యనుభవముగల స్నేహితులతో నాలోచించి పాటియాకు మిక్కిలి గాటుగానుండి వికారపెట్టును. కావున గాటు తక్కువగ నున్న లంకాకుచుట్టలు కాల్చుట మంచిదని యొక స్నేహితు నడిగి యొక చుట్ట బుచ్చుకొని కాల్చెను. అది వికారపెట్టెను. వమనమయ్యెను. మిత్రు లతని నొక చాపమీఁద బండుకొనబెట్టి కొంచెము చింతపండు దెచ్చి యతని నోటవైచి యుపచారములు జేసిరి. వికారపెట్టినదికదా, ఇది స్పృశింప గూడదని గణపతి తలంపలేదు. తన సంగడి కాండ్రందఱు వికారము లేకుండ యథేచ్ఛముగ గుప్పుగుప్పన లంకాకు చుట్టలు బాటియాకు చుట్టలు కాల్చి సుఖించుచుండగా వికారపెట్టినదని తన యొంటికి సరిపడదని తా నది కాల్చుట మానిన పక్షమున మిత్రమండలిలో దన కప్రదిష్ట సంభవిల్లునని తన్న ప్రయోజకుడనుకొందురని భయపడి యశఃకాముఁడగుటచే నెట్లైన వీఁడు చుట్టలు కాల్చుటలో దిట్టయని పేరు సంపాదింపవలయునని నిశ్చయించి కుశాగ్రబుద్ధి యగుటచే నట్లు నిరంతరాయముగ చేయుట

కుపాయములు వెదకెను. తదెకధ్యానముతో నున్న యా బుద్ధిమంతుని కొక యుపాయము బొడగట్టెను. వికారపెట్టినప్పుడు మొదటనె పాత యుసిరిక పచ్చడి కాని రెండేండ్లనాటి నిమ్మకాయ ముక్కగాని నార దబ్బకాయ ముక్కకాని పాతచింతకాయ పచ్చడికాని నోటిలో వైచుకొన్న పక్షమున వికారమడఁగునని గ్రహించి చుట్టకాల్చుట నిర్వికారముగ నలవా టగువఱకు నెవరినో యొకరి నడిగి యావస్తువులలో నేదోయొకటి తెచ్చి తాగి కష్టపడి యలవాటు చేసికొని దినమునకు నూరుచుట్టలు కాల్చినను వికారపెట్టనంతటి దిట్టయయి మిత్రవర్గములో నప్రతిష్టపాలు గాకుండ బొట్టివాఁడు గట్టివాడుఁరా యని పేరు వడసెను. గణపతి పూనికవంటి పూనిక దేశములో నెందరికి గలదు? ఎందరో తెలివితక్కువవాండ్రు చుట్టలు వికారపెట్టగానె యొక దండము పెట్టి మానవైచిరి కాని గణపతివలె దాని యంతము కనుగొనువారు కలరా? అందుచేతనె యతని చరిత్రము పురాణ మైనది.

చిన్ననాట నుండియు గుఱ్ఱమెక్కవలయునని గనపతి కుబలాటము గలిగెను. మందపల్లిలోను నేనుగుల మహలులోను గుఱ్ఱములే లేవు. అప్పుడప్పుడు దూరపు టూళ్ళ నుండి గాజుల వర్తకులు గుఱ్ఱములెక్కి తన యూరికి వచ్చినపుడు గణపతి వారికడ కరిగి వారిని బతిమాలి ఆవకాయముక్కయో మాగాయముక్కయో తల్లి జూడకుండ నింటనుండి పట్టుకొని నాలుగు చుట్టముక్కలు కొసరిచ్చి యొకసారి గుఱ్ఱముమీఁద నెక్కించమని వారిని వేడుకొని యెక్కి నాలుగు వీధులు దిరిగి తనకు గలిగిన యశ్వారోహణవైభవము తోడిసంగతికాండ్రకు గలుగనందుకు గర్వపడుచు మార్గమధ్యమున వారు కనఁబడినప్పుడు వెక్కిరించుచు నుబలాటము దీర్చుకొనుచుండును. ఈ యయిశ్వర్య మేడాదికి రెండుమూఁడు సారుల కంటె నెక్కువగ లభించుటలేదు. ఒకరిని యాచించి యెరువు గుఱ్ఱమెక్కి రెండుమూఁడు గడియలు స్వారి వెడలుట గణపతికి లజ్జాకరముగనుండెను. సాధ్యమైనంతవఱకు సొంతవాహనముగాని నిరంతరము గ్రామమునందె యుండు వాహనముగాని సంపాదింప వలయునని యతఁడు సంకల్పించు కొనియెను. ఆశ్వములు మొదలైన వర్థజాధ్యములు, అర్థములేని గణపతివంటి వ్యర్థున కవి యెట్లు సాధ్యమగును? సాధ్యముకానిచో నుబలాటము తీరు టెట్లు? అశ్వారోహణమందలి యాత్సుక్యము దీర్చుకొనుటకై యతఁ డుపాయములు వెదకెను. గుఱ్ఱము లేనప్పుడు దానికి బదులుగా మనుష్యుఁ డెక్కి తిరుగుటకు వీలైనది మఱియొక జంతువు లేదా యని యతం డాలోచించెను. గాడిదె నేల యెక్కగూడదని యతఁడు విమర్శింపఁ దొడఁగెను. గాడిద నెక్కిన పక్షమున గలిగెడు లాభనష్టములేవి యని యత డిట్లు వితర్కించెను. "గుఱ్ఱమువలె దానికిగూడ నాలుగు కాళ్ళున్నవిగదా, మనుష్యులను మోయగలదు గదా, కడుదూరము నడువ గలదు గదా, రూపమున భేదముతప్ప గుణములయందు భేదమేమియు గనఁబడదు. విశేషించి గుఱ్ఱమునకు గుగ్గెళ్ళు దాణా పెట్టవలెను. గాడిదెకు గుగ్గెళ్ళక్కఱలేదు. ఏ బీటిలో వదిలిపెట్టినను నే చేనిలో వదిలిపెట్టినను దా నంతటది మేత తినివచ్చును. గుఱ్ఱమున కొక సాల గావలెను. గాడిదె కక్కఱలేదు. ఏ చెట్టుక్రింద వదిలినను నేబైట దిరిగినను భయములేదు. గుఱ్ఱమును మాలీసు చేయుట కొక కాపరి కావలెను. వానికి జీతమీయవలెను. అందుకు డబ్బు కావలెను. గాడిదె కట్టి కాపరి యక్కఱలేదు. అశ్వమునకు సుళ్లు మొదలైనవి చూడవలెను. మంచి సుళ్లు లేని గుఱ్ఱమైనచో యజమానుని కొంపదీయును. గాడిదెకు సుడి చూడనక్కఱలేదు. గుఱ్ఱములు సొమ్ము కర్చుపెట్టి కొనవలెను. గాడిదను వెలయిచ్చి కొననక్కఱలేదు. చాకలివాండ్రవద్ద కావలసినన్ని యున్నవి. గుఱ్ఱముమీఁద జీను వేయవలయును; కళ్ళెములు కావలెను. గాడిద

కవియెవియు నక్కఱలెదు. దానికి సంరక్షణ మక్కఱలెదు. అంగరక్షల పనిలెదు. వెల యక్కఱలెక సులభసాధ్యమై కొంగు బంగారమువలెనున్న గాడిదెను వదిలి గుఱ్ఱమునకై దేవులాడుట వెఱ్ఱితనము. అందుచేత సర్వవిధముల గాడిదెయే శ్రేష్ఠము. కాదాయనంటె నలుగురు నవ్వుదురు. ఒకరి నవ్వు జోలి నాకెందుకు? నన్ను జూచి నవ్విన పక్షమున వారిని జూచి నేను నవ్వెదను. వారి మొగమాటము నాకేమి? నేను కుక్క నెక్కుదును, గుఱ్ఱము నెక్కుదును, గాడిదెనెక్కుదును" అని పూర్వపక్షములు సిద్ధాంతములు తన మనంబున జేసికొని యెట్టకేలకు గార్ధభవాహన మధిరోహించుట కతడు కృతనిశ్చయుండయ్యెను. తమకు బట్ట లుదుకు చాకలివారి యింటికిఁబోయి నాలుగు చుట్టముక్కలు వానికి దానమిచ్చి వాని గాడిదెను యెరువిమ్మని యడిగెను. ఆమాట వినఁగానె వాడు నవ్వి "బాపనోరు గాడిదె నెక్కకూడదండీ తప్పు తప్ప"ని మందలించెను. చాకలి వెధవవు బ్రాహ్మణునికంటె నీ వెక్కు వెరుగుదువా? అవతవక ప్రసంగములు చేయక తీసికొనిరా. నీవు నీగాడిదె నీయకపోతే మఱియొక గాడిదెను తేగలను. ఊరునిండ కావలసినన్ని గాడిదెలున్నవి. నీ గాడిదెనే యిచ్చి తివా ఆవకాయ, మాగాయ, పచ్చళ్ళు, కూరలు నీకు దెచ్చి పెట్టుచుందును. నేనప్పు డప్పుడు బ్రాహ్మణార్థములు చేయుచుందును. చేసినప్పుడు నావిస్తరిలో వడ్డించిన యరిసెలు, గారెలు యజమానులు జూడకుండ చెంబులలో పెట్టి కాని దొన్నెలలో బెట్టికాని దాచితెచ్చి నీ కిచ్చుచుందును. భోజనమునకు వెళ్ళినప్పుడుగూడ నీలాగే బూరెలు తెచ్చిపెట్టుదును. కావలసినన్ని చుట్టలు నప్పుడప్పుడు డబ్బులు నీకు బహుమాన మిచ్చుచుందును. లేనిపోని శ్రీరంగనీతులు చెప్పక తీసికొనిరా నీ గాడిదెనని తిట్టి యాసగొలిపి వాని నొడంబఱచెను. వాఁడును దన మైలగుడ్డలు మోయునట్టి గాడిదెను తీసికొనివచ్చి యెదుట బెట్టెను. గణపతి కప్పటికి పదునాలుగేండ్ల వయస్సున్నను వయసుకు దగినంత పొడగరి గాకపోవుటచే దానిపై కెక్కలేక చాకలివానిని క్రింద గూర్చుండఁ బెట్టి ముందు వాని భుజముమీఁదనెక్కి పిమ్మట గార్ధభవాహన మధిరోహించెను. కళ్ళెము లేకుండ దానిమీఁద నతడు కూర్చుండుట కిష్టము లేకపోయెను. త్రాటియాకులు గుది కళ్లెముగ నుపయోగింపుమని చాకలివాఁ డుపదేశించెను. "చదువు కొన్న వానికంటె చాకలివాఁడు మేలన్నమాట నిజమైనది. నీ యుపాయమే బాగున్నది. నీవే కట్టి తీసికొనిరా" యని చెప్పి వాఁడు కట్టితెచ్చిన త్రాటియాకుల గుది కళ్ళెముగఁ బెట్టి దానిని చేతఁబట్టుకుని వెనుక నడచుచుఁ జాకలివాఁడు గాడిదెను దోలుచుండ పై యుత్తరీయము కుచ్చువచ్చునట్లు తలకు జుట్టి చుట్ట వెలిగించి నోట బెట్టి గుప్పుగుప్పుమని పొగలెగయ నీత బెత్తముతో గాడిదను నడుమనడుమ గొట్టి యదలించుచు ముందుగా జాకలివాండ్ర యిండ్లదగ్గఱ తరువాత దక్కిన వీధుల వెంబడిని దిరిగెను. ఆ మహోత్సవము జూచుటకు వీధివీధిని బిన్నలు, పెద్దలు స్త్రీలుఁ బురుషులు గుమిగూడిరి. పట్టాభిషేక మహోత్సవ సమయమున బసిడియంబారివైచిన మదపుటేనుఁగు నెక్కి నగరమందు నూరేగు మహారాజుకైనను నైరావతము నెక్కి యమరావతి పురమునందు త్రిమ్మరు దేవేంద్రునికైనను నంతటి సంతోషము నంతటి గర్వము ప్రాభవమునుండదని నిశ్చయముగా జెప్పవచ్చును. గార్ధభవాహనారూఢుఁడైన గణపతి తన్ను ప్రజలు చూడవచ్చినప్పుడు సిగ్గుపడలేదు. చిన్నబోవలేదు. సందియము నందలేదు. జంకలేదు, ముప్పది నలువది మంది చిన్న పిల్లలు గార్ధభమువెనుక జేరి చప్పటలు జరచుచు గేకలు వైచుచు ద్రాటియాకులు, బుట్టలు, చేటలు వాయించుచు నల్లరిజేయసాగిరి. గాడిదె బెదరి పరుగిడజొచ్చెను. ఆతొందరలో నది త్రాటియాకుల కళ్ళెము తెగకొరికెను. గణపతి తన్ను గార్ధభము పడవైచునని ముందుకు జరిగి

వంగి దాని చెవులు గట్టిగా బట్టుకొనెను. చెవులు నొప్పి పెట్టుటచె నది మఱింత పరుగెత్తెను. అదృష్టవశము వలన నప్పుడు గార్ధభ యజమానుఁడగు చాకలివాడు ముందుకు బోయి యాపెను. అందుచే గణపతి నేల గూలుట తప్పెను. ఇంతలో నతని మేనమామ కొందఱు బాలకుల వలన మేనల్లుని ఖరవాహనారూఢ వృత్తాంతము విని కోపోద్రేకమున నొక దుడ్డుకఱ్ఱ చేతబట్టుకొని తిట్టుచు నతని కెదురుగా వచ్చెను. మేనమామను జూడగనే గణపతి వాహనముమీద నిలువలేక గుభాలున దాని మీఁద నుండి నేలకు దుమికి కాలి సత్తువకొలఁది పరుగెత్తెను. గణపతిమీఁద బడవలసిన దుడ్డుకఱ్ఱ తనమీఁద బడునేమో యని చాకలివాఁడు గాడిదె నక్కడ విడిచి పిక్కబలము జూపెను. వెంట నున్న పిల్లలు నానా దిశలకు బరుగెత్తిరి. పాఱిపోవుచున్న మేనల్లుని బట్టుకొనుట యసాధ్యమని మేనమామ వానివెంట నరుగక గణపతిని, గాడిదను, రజకుని నిందించుచు గృహంబున కరిగెను. అనంతరము మూడు దినముల వఱకు గణపతి మేనమామ యొక్క కోప శిఖవేఁడిమి మందగింపనందున ఇంటి కరుగుటకు వీలులేక పోయెను. "ఆ థౌర్భాగ్యుడు నా యింటికి వచ్చెనా కుక్కను కొట్టినట్లు దుడ్డుకఱ్ఱతోఁ గొట్టి చంపెదను. ఈ దుర్మార్గుని మూలమున నాకెన్నో తలవంపులు వచ్చుచున్నవి" యని మేనమామ తన్ను జూడవచ్చిన వారితో ననుచుండినట్లు గణపతికి వినవచ్చెను. మేనమామకు మిత్రులైన వారు కొందఱు గణపతిం గలిసికొని "కుఱ్ఱవాఁడా ! నీకిదేమి వినాశ కాలమురా, ఏనుగు నెక్కినవారున్నారు. గుఱ్ఱము నెక్కినవారున్నారు. కాని బ్రాహ్మణకులములో బుట్టినవాఁడు గాడిద నెక్కగా నెక్కడ జూడలేదు. నీ మూలమున దనకెంతో యప్రతిష్ఠ వచ్చుచున్నదని నీ మేనమామ యేడ్చుచున్నాడు. ఈ పాడుబుద్ధి నీ కెవరైన నేర్పినారా నీకే బుట్టినదా. ఇటువంటి యవకతవక పనులు మాని తిన్నగా నడచుకొంటివా మీమామతోఁ జెప్పి నిన్నింటికి జేర్చెద" మని మందలించిరి. అనవుడు గణపతి నవ్వి వారి కిట్లనియె. "అయ్యా ! గాడిద నెక్కిన దప్పేమున్నది? భాగ్యవంతుడు వరియన్నము దినును. పేదవాడు జొన్నకూడు తినును. అగ్రహారీకు లంటు మామిడి పండ్లు తిందురు. పేదవాఁడు జీడిమామిడిపండ్లు తినును. అలాగే యెక్కువ డబ్బున్న రాజేనుఁ గెక్కును. కొంచెము డబ్బున్న వాఁడు గుఱ్ఱ మెక్కును. గవ్వైన లేనివాఁడు గాడిద నెక్కును. దానికి దీనికి భేదమేమి? గుఱ్ఱము సకిలించును. గాడిద యోండ్రము పెట్టును. దీనికికూడ జీనువైచి కళ్ళెము పెట్టి డెక్కల కినుప నాళములు వేయించి నడక నేర్పించి ముద్దుచేసిన పక్షమున గుఱ్ఱమును మించియె యుండును. పనికి మాలినదని పదిమంది పేరుపెట్టినచో నది పనికిమాలినదె యగును. గాడిదె నెక్కుట వలన గొప్పలాభ మున్నది. అదియేది యనగా, ముందు గాడిదె మీద స్వారీ నేర్చుకొన్న పక్షమున గుఱ్ఱపు స్వారి సులభ మగును. ఇవి యన్నియు నటుండనిండు. గాడిద యెంత గొప్పదో మీ రెఱుఁగుదురా ? శ్రీకృష్ణమూర్తి వారి తండ్రియైన వసుదేవు డంతవాడు తన కాపద వచ్చినప్పుఁడు గాడిద కాళ్ళు పట్టుకొన్నాడా? ఏనుఁగు కాళ్ళు పట్టుకొన్నాడా? గోవు కాళ్లు పట్టుకొన్నాడా? గుఱ్ఱముకాళ్ళు పట్టుకొన్నాఁడా? ఆ మహాపత్సమయమున వసుదేవుఁడు దానికాళ్ళు పట్టుకొనకపోయిన పక్షమున కృష్ణమూర్తి బ్రతుకకనేపోవును. నేను దానిమీద నెక్కి తిని. కాని వసుదేవునిలాగ కాళ్ళు పట్టుకొనలేదు. గాడిద నెక్కుట తప్పని నా మేనమామఁకు దోఁచిన పక్షమున మంచి గుఱ్ఱము నొక దానిని కొని యిమ్మని చెప్పండి. అది యిచ్చెనా గాడిద నెక్కుట మానెదను.

గణపతి పలుకులు విని వారందఱు జిఱునగవు నవ్వి "వీని బ్రతుకు కాల. పొట్టచించి కంచుకాగడాల వెదకినను నొక్క యక్షరమైనను గానరాని వీఁడు తనపనికిఁ గావలసిన పురాణ

సాంప్రదాయములం గూడ నెఱుంగును. వీండు వసుదేవుని సాటువు దెచ్చికొన్నాండు. పొట్టివానికి బుద్దులు పుట్టె డన్నమాట నిజమైనది. వీండు దేవతలకు సైతము పంచాంగము చెప్పంగలవాండు. వీనికి మన ముత్తరము చెప్పలేము పదండి" యని వెడలిపోయిరి. గణపతి యొక్క ఖరవాహనారోహణ వృత్తాంతము విని యది యనార్యకార్య మనియు, నతండు సజ్జనదూరుం డనియు వట్టి నిర్భాగ్యుడనియు మీరు నిశ్చయింతురను సందియము కలుగుచున్నది. అట్లు మీరు తలంచుట న్యాయము కాదు; ఏలయన, నిట్టివా రనేకులు గలరు. ఎవరి మాటయొ యెందుకు. అసాధరణ ప్రతిభా సమేతులగు దేవతలం జూడుండు. దేవతలకెల్ల దొరయై ముజ్జగంబుల యేలికయై కల్పవృక్షము కామధేనువు చింతామణి మొదలగు కామప్రధాన పదార్థముల కొడయండైన నిర్జరేంద్రునకు మేఘములు వాహనములు. నీరు గాలి మెఱుపు పొగ మొదలగు పదార్థములతోం జేయంబడిన మేఘమా యతనికి వాహనముగ నుండవలసినది. తక్కిన వేల్పులం జూడుండు. సకల యాగములకు సకలస్మార్త కర్మలకు నాధారమైన యగ్ని హోత్రునకు వాహనము గొఱ్ఱె. దక్షిణ దిక్కునకు నాయకుడైన యగ్ని హోత్రునకు వాహనము గొఱ్ఱె. దక్షిణ దిక్కునకు నాయకుండై ధర్మాధర్మ విచార నిపుణుండైన యమధర్మరాజునకు వాహనము దున్నపోతు; జలాధినాయకుండైన వరుణుండు మొసలిపై నెక్కును. మహాబలుండై సముద్ర జలముం బై కెగర గొట్టియు మహావృక్షములం గూల్చియు క్షణకాలమున జగన్నిర్మూలనము జేయంగల వాయుదేవుండు లేండిమీంద స్వారిజేయును. "ఆధౌ పూజ్యో గణాధిపః" యన్నట్లు సకల శ్రౌతస్మార్త కర్మలకు ముందు పూజనీయుం డగు గణాధిపతి యెలుక నెక్కి పందికొక్కునెక్కి బయలు దేఱును. ఉమా మహేశ్వరులకు కుమారుండైన గణపతి కింతకంటె వేరు వాహనము లేకపోయెనా? కొంపత్రవ్వునట్టి యెలుకా వాని తురంగము. సకల గృహవర్తి యగు మార్జాల చక్రవర్తి కొక్క కబళముగ నుపయోగపడు నెలుక మీంద నా ప్రమధ గణపతి యెక్కగా మన గణపతి గాడిద మీంద నెక్కుట తప్పా? అతని మాట యటుండనిండు. లక్ష్మీనారాయణుల పుత్రుడయిన గరళ కంఠునివంటి మహాదేవుని జయించిన జోదై చండ శాసనుండయి సకల లోకంబులంగల సకల జంతువులను బూవు టమ్ములతో గొట్టి పడవైచునట్టి మన్మధునకు వాహనమేమో యెఱు@గుదురా? చిలుక. ఆ మన్మధుని తండ్రియగు నారాయణుని తురంగమేమొ యెఱుంగుదురా? బొల్లి గ్రద్ద. ఎక్కడ దిక్కులేనట్లు తండ్రి కొడుకులైన మాధవమన్మధులు రెక్కాడినగాని బ్రతుకలేని దిక్కుమాలిన పక్షులపై నెక్కుచున్నారు. అనంతకోట్యవతారంబులనెత్తి పరాత్పరుండనియుం జరాచరాత్పరుండనియు వ్యాసవసిష్ఠ వామదేవాది మహర్షుల చేతవినుతింపం బడిన శ్రీమన్నారయణుం డెక్కుటకు లోకమున బొల్లిగ్రద్ద తప్ప వేరువస్తువులు లభింపవా? ఇక శివుని మాట తడవబనియేలేదు. ఆయన వెల్ల యెద్దునెక్కి విహారము చేయును. అడ్డమైన గడ్డి కఱచునట్టి పశువు మీదనా శివుడెక్కవలసినది? మహేశ్వరుం డెంతవాండు? లలాట నేత్రజ్వాలన కీలల చేత నిమిషార్థమున విష్ణు పుత్రుండగు దర్పకుని బిడికెడు బూడిద చేసినాండు. క్షీరసాగర మధన కాలమున సముద్ర గర్భమునుండి బొడమి లేచిన హాలాహల విషము సకలలోక భయంకరమై వ్యాపించి బ్రహ్మాండము భస్మీపటలముం జేయునటులుండ ముప్పది మూడు కోట్ల దేవతలు వెఱచి రక్షింపుమని చేతులు మోడ్చి మ్రొక్కి తన్ను వేండ కరుణాళువై వెన్నముద్దవలె యా విషపు ముద్దను మ్రింగి యత్తరి నప్పాలసంద్రమునం బుట్టిన గల్పవృక్షమును నైరావతమును నుచ్చైశ్రవము నింద్రునికిచ్చి లక్ష్మీకౌస్తుభముల విష్ణునకిచ్చి తన లోకాపకార శీలతయు నిస్పృహత్వమును వెల్లడి చేసెను. అట్టి మహనీయు డెద్దెక్కుట

బాగున్నదా? ఈయన కుమారుడగు కుమారస్వామి జగత్రయ కంటకుడగు తారకాసుని శక్తిప్రయోగమున సంహరించి వేల్పుల కృతజ్ఞతకుఁ బాత్రమయ్యెను. ఇతఁడు క్రౌంచ పర్వతము భేదించిన మహా యోధుఁడు. అతఁడు దేనిమీఁద నెక్కునో యెఱుఁగుదురా? నెమలిమీఁద వన్నెల చిన్నెల బండారమే కాని నెమలి గొప్పయేమున్నది? బ్రహ్మదేవుఁడు చతురాననుఁడఁట. సురజ్యేష్టుఁడఁట, హిరణ్యగర్భుఁడఁట, ప్రజాపతియఁట, వాణీ నాథుఁడఁట, సృష్టి కర్తయట. వానచుక్కలు మీఁదఁ బడిన మాత్రాన తోఁక త్రెంచుకొని పాఱిపోవు హంస వీని వాహనమఁట. మహిషాసుర మర్దిని యగు కాత్యాయని సింహ మెక్కును. నిగ్రహానుగ్రహ సమర్థులు, నిరుపమాన మహిమాన్యులు, కళ్యాణ గుణ సంపన్నులు, కామరూపులు, సకలలోక పూజ్యులు, సరధర్మ పరిజ్ఞాతలు నైన దేవతలె గొఱ్ఱెనెక్కి, బఱ్ఱెనెక్కి, యెలుకనెక్కి, యెద్దునెక్కి, గ్రద్దనెక్కి, మఱియు నిచ్చవచ్చిన జంతువులనెక్కి పులుఁగులనెక్కి బెదురులేక బిడియము లేక సిగ్గులేక చింత లేక తిరుగుచుండ నే ప్రజ్ఞలేక మనుష్య మాత్రుడై కించిజ్ఞుడై బాలుఁడైన గణపతి గాడిదనెక్కి దిరుగుట యేమితప్పు? దున్నపోతు యొక్క యతిశయ మేమి? మూషికము యొక్క ముఖ్యతయేమి? గాడిదచేసిన కానిపనియేమి? అభిమానము చేత నెద్దులనుఁ దున్నపోతులను నెక్కినవారిని మహర్షులు పురాణములలో గొనియాడగనే మీరును బళిబళీయని మెచ్చి పూజించుచున్నారు. గణపతి డబ్బులేని పేదబాపనయ్య కొడుకగుటచేత గాడిద నెక్కి నంత మాత్రమున నిర్భాగ్యుఁ డనుటకు సాహసించు చున్నారు. పక్షపాతమె ప్రేమ గలిగించును. పక్షపాతమె యేవ గలిగించును. గుణశూన్యుఁ డైనను మెచ్చి పొగడు వారున్న పక్షమున గుణరత్నాకరుఁ డగును. మెచ్చి కొనియాడు వారు లేనప్పుడు గుణరత్నాకరుఁడు సయితము శుంఠయగును. నోరు గలవాండ్రు గొందఱఁ జేరదీసిన దేవానాం ప్రియుఁడు సతతము మహా పురుషుఁడుగ పరిగణింపఁ బడుచున్నాఁడు. ఆలంబము లేని వాఁడణఁగి పోవుచున్నాఁడు. మా గణపతి యాత్మ గౌరవము గలిగి స్వప్నములోఁ గనఁబడి తన వృత్తాంతముఁ జెప్పబట్టి యది వ్రాయు వారొకరు దొరకబట్టి యీ మాత్రము గ్రంథమైన బయలుదేఱినది. కాని లేకపోయినచో నేమి కావలసినది? అడవిలో బుట్టి అడవిలో బెఱిగి యడవిలో రాలిపోయిన యుమ్మెత్త పువ్వువలె సముద్రములో బుట్టి సముద్రములో బెఱిగి సముద్రములో నణఁగిపోయిన నత్తగుల్లల ప్రోగులలె నితని చరిత్రము లోకమందు ప్రసిద్ధము గాక యుండును గదా. ఎట్లో యొక యట్లు చరిత్ర ప్రసిద్ధమైనది. కాఁబట్టి యతఁడు గార్దభ మెక్కినంత మాత్రమున నింద్యుఁడని మీరు భావింపవలదు.

# తొమ్మిదవ ప్రకరణము

గణపతి యింటికి రాక పరిగృహంబున వసియించుట మాతులునకు మనఃఖేదము గలిగింపకపోయినను దల్లికిఁ దగని తల్లడపాటును గలిగించెను. మధ్యాహ్నము భోజన మైన తరువాత నామె సొదరుఁడు చూడకుండ కొడు కున్నకడకుఁ బోయి వాని బ్రతిమాలియుఁ జీవాట్లు పెట్టియు బెదరించియు నెన్నో విధముల నింటికి రమ్మని యడుగుచు వచ్చెను. నిజముగ మేనమామ దుడ్డుకర్రతో బుర్ర పగులగొట్టునని నమ్మి తెనాలి రామ కృష్ణుని పిల్లి పాలపేరు చెప్పగానె భయబడి పరుగెత్తినట్లు గనపతి యిల్లుపేరు చెప్పగానె యులికిపడి "నేనా యింటికిరాను. నీ యన్నగారు దుడ్డుకర్రతో నన్ను కుక్కను గొట్టినట్లు కొట్టి చంపివైచును. నేను చచ్చిన తరువాత నీవేమి చేయఁగలవు? అన్నము లేక చచ్చిపోయెద గాని దుడ్డుకర్ర దెబ్బతిని చావను. నేను గాడిద నెక్కిన దన కెందుకు? నాజోలికి రానని యాయన గారు వర్తమానము పంపిన పక్షమున నేను వచ్చెదను. లేనిచో రా" నని బదులు చెప్పెను. తల్లి యది విని దిగులు గుండెతో నింటికి జని రెండు దినములు గడచిన తరువాత నొకనాఁడు సోదరుని జూచె యిట్లనియె "నాయనా ! కుఱ్ఱవాఁడింటికి వచ్చుట లేదు. ఎంతో బెదిరిపోయినాడు. వాండ్ల యింటను వీండ్ల యింటను దిరుగుచున్నాఁడు. దొరికిన పూట తినుచున్నాఁడు. లేనిపూట లేదు. చిక్కి శల్యమైనాడు. కన్నులు గుంటలు పట్టినవి. ఇంటిలో నడుగుబెట్టగానె నీవు చంపివైతువని భయము గలిగినది. నీవు రమ్మంటే వాఁడు నిర్భయముగ వచ్చి నీ పంక్తి నింత గంజి యన్నము దిని వెళ్లును. చిన్నప్పటినుండియు నీవే వాఁడు చేసిన తప్పులు భరించి పెంచినావు. చెడ్డ సహవాసములచేత జెడిపోయి నాఁడు. మేనమామవైన నీవే. తండ్రివైన నీవే వెనుకటి లాగుననే యీసారికూడ తప్పులు క్షమించి యింటికిరానీ, ఈ పర్యాయము గాడిద నెక్కకుండ బుద్ధి జెప్పెదను" అనవుడు సోదరీ వచనములకు భద్రాచల మిట్లనియె. "అమ్మాయీ ! గాడిద మీఁద వానిని జూచినప్పుడు నా కోపమాగక కుక్కను గొట్టినట్లు దుడ్డుకఱ్ఱతో గొట్టెదనని నేనన్నమాట నిజమే. దుడ్డుకఱ్ఱకాదు, వాఁడు చేసిన పనికి రోకలితో వాని తల చితుకబొడువవలయునని నాకున్నది. కాని కోపము వచ్చినప్పు డన్నంతమాట చేయగలమా? ఈ దుర్మార్గుని దుండగముల నన్నింటిని నేను కడుపులో బెట్టుకొని భరించలేదా? పేగు తీపిచేత నట్లు భరింపవలసి వచ్చినది. పాలకోసము ఱాయి మోయమన్నాఁడు. మన వంశము దెన్నడులేని పాడుపని జేసి వీఁడప్రతిష్ఠ దెచ్చుచున్నాఁడని నే నేడ్చుచున్నాను. కాని నీకొడుకును జంపవలయునని కాదు. చీలవలయునని కాదు. వచ్చి యెప్పటిలాగున నుండుమని చెప్పు. ఇంకొకసారి యిటువంటి పని జేసెనా తాటికమ్మతో వెన్ను బ్రద్దలు కొట్టెదనని చెప్పు. నీవు చేయుచున్న గారమునుబట్టి వాఁడు చెడిపోవుచున్నాడు. గారము గజ్జెల కేడ్వగా వీఁపు దెబ్బల కేడ్చిన దన్నట్లు దెబ్బలు లేకపోబట్టి వానికా వినాశకాలము వచ్చినది. పరువు మర్యాదలు వాఁడు జంపుకొన్నాడు. తన తండ్రి యెంతవాడో తన తాత యెంతవాడో యివతల నేనెటువంటివాఁడనో వాడెఱుఁగడు. గాడిదనెక్కి కుక్కనెక్కి వాఁడేదో గొప్పవాఁడనైనా ననుకొనుచున్నాడు., నాకవి కిట్టవు. వచ్చి జాగ్రత్తగా నుండుమను" ఆ పలుకులు సింగమ్మకు మేరమీఱిన సంతోషము కలిగించెను. అంతకు ముందు కుమారునకుఁ దనకు శాశ్వత వియోగ మగునని బెంగబెట్టుకొనెను. సోదరుని వాక్యములవలన బెంగ తీఱినందున నాకు యేనుఁగు నెక్కినట్లు సంతసించెను. ఆ పూటనె యామె వెళ్ళి

కొడుకును దొడితెచ్చి యెప్పటివలె నింట నుంచెను. గణపతి రెండుమూఁడు దినముల వఱకు మేనమామ యొద్ద మిక్కిలి భయభక్తులు కలిగి యేజోలికిఁబోక యిల్లుకదలి వెళ్ళక జాగ్రత్తగ నుండెను. కాని వీరణము చప్పుడు వినఁగానె పైత్యపు మేని వానికి శివ మెత్తినట్లు మిత్రులను జూడఁగానె యతనికి ఉత్సాహము మరల నంకురించెను. నాలుగు పొలిమేరలనడుమ నున్న నేల యంతయు నతనికి విహారభూమి యయ్యెను. అన్ని తోట లతనివె. అన్నిదొడ్లతనివె. పండిన మామిడి చెట్ల కడకుఁ బోయి తాళ్ళు రువ్వి పచ్చికాయలు పడగొట్టి సంగడి కాండ్ర చేత నుప్పుకారము దెప్పించి యా కాయలు గరిగమ్మతో గోసి కొనియొ పండ్లతో బీకియొ ముక్కలుచేసి కార మద్దుకొని తిను చుండును. తోటకాపులు దూరమునఁ గానఁబడిన తోడనె వారి యదలింపు మాటలు చెవులఁ బడినతోడనె తానును జెలికాండ్రును లేళ్ళవలె బరుగెత్తి పోవుదురు. నేర్పరులయిన శిష్యుల కాళ్ళకు బందములు వైచి కొబ్బరి చెట్లెక్కించి కాయలు తీసి పగులగొట్టి నీరుద్రావి గుంజు తినుచుండును. నీలాటరేవులలో సాయం కాలమప్పుడు నిలువఁబడి బెడ్డలువిసిరి నీటికుండలు పగుల గొట్టు చుండును. కుండ పగులగానె తూనీఁగలాగు పఱుగెత్తుచుండును. పట్టువడినప్పుడు చెంపకాయలు పుష్కలముగఁ దినుచుండును. ఒకనాఁ డొక జామి తోటలో దోరగా బండిన పండ్లు గణపతియు మిత్రులును శిలావర్షము గురిపించి నేల గూల్చుచుండ నంతలో గాఁపువాఁడు వాండ్ల కెదురుగా రాక వెనుకపాటున వచ్చి యొకచేతితో గణపతిని మఱియొకచేతితో వాని స్నేహితులలో నొకనిని బట్టుకొని బరబర లాగికొని పోయి వారి నిరువుర నొక చెట్టునకు రెక్కలు విఱిచికట్టి చింత బరికెలతో నెత్తురు దొరగునట్లు కొట్టి యెన్నఁడు తోటదరికి రాననిపించి పంపెను. అభిమానవంతుడైన గణపతి యీ పరాభవము తన తోడిదొంగయైన యీ బాలునకు దక్క రెండవవానికి దెలియకుండ జాగ్రత్తపెట్టెను. అట్లుతద్దియు, నుండ్రాళ్ళతద్దియు వచ్చెనా గణపతి సంతోష మింతింత యని వర్ణింపనలవి కాదు. నాటి మధ్యాహ్నమె కొందఱు స్నేహితులను వెంటఁబెట్టుకొని పొదలలోనికి, రుప్పలలోకి, దుబ్బులలోనికి జని రెండు బుట్టలు పల్లేరుకాయలు, కొంత దూలగొండ, పది యీతజువ్వలు, రెండు బుట్టలు బొమ్మరాళ్లు బెడ్డలు దెచ్చి యొకచోట దాఁచును. రాత్రి భోజనములు చేయగానె పండుకొని తోడి బాలకులందఱుఁ దెల్లవారుజామున లేచుచుండ తాను రెండుజాముల రాత్రివేళనె లేచి తల్లిని మేలుకొలిపి తల్లిసాయమున నిరుగుపొరుగువారి యిండ్లకుఁ బోయి యచ్చటి బాలురను లేపి మరల గృహంబున కరిగి చప్పుచప్పున మొగము గడిగికొని యుల్లిపాయల పులుసుతోను నువుపొడుముతోను, పొట్లకాయ పరమాన్నముతోను, గేదె పెరుగుతోను, భోజనముచేసి కొన్ని పల్లేరుగాయలు మూటగట్టుకొని భుజముపై వైచికొని రాళ్ళబుట్ట యొకటి యెడమచంక నిరికించుకొని నోట చుట్టవెలిగించి కుడిచేత నీతజువ్వ పుచ్చుకొని కేకలు వైచుచు వింతవింత పాటలు పాడుచు వీధులవెంటఁ దిరుగును. ద్వాపరయుగమునం దెన్నడో శ్రీకృష్ణుని మీది యాగ్రహముచే దేవేంద్రుడు రాళ్ళవాన గురిపించెనని భాగవతము హరివంశము మొదలగు మహాపురాణములయందు వర్ణింప బడుటయె గాని కలియుగమం దట్టి రాళ్ళవాన నెవ్వరు జూచి యెరుగరు. ద్వాపరమున నిజముగ నట్టివాన గురిసెనో లేదో చెప్ప జాలము గాని మన గణపతి నిజముగ నెన్నో రాళ్ళవానలు గురిపించెను. మగవారు లేక కేవల మాఁడువాండ్రే యున్న యిండ్లమీఁదను నందు ముఖ్యముగ ముసలియవ్వలున్న యిండ్లమీఁదను గణపతి హస్తములు రాళ్లు విసురుటలో భారత రణమందు గౌరవసేనపై నవలీలగ శరపరంపరలు కవదొనలనుండి తీసి యెడమ లేకుండఁ బ్రయోగించిన యర్జునిని హస్తము దలపించును. ఆ విషయమున గణపతి

సవ్యసాచియని చెప్పవచ్చును. తెల్లవారుజామున లెచి చలిదియన్న మారగించి చిన్ని బిన్ని మొదలగు పాటలు పాడుకొనుచుండు నాడపడుచు లున్న చోటికి మెల్లమెల్లఁగ జని యేచాటున నుండియో మూఁటవిప్పి పల్లేరుకాయలు తీసి వాళ్ళ కాళ్ళనడుమ జల్లును పల్లేరుకాయ లా కాలునకు గుచ్చుకొని యా కాలునకు గుచ్చుకొని జవరాండ్రు కళవళము పడి నానాముఖముల బరుగులెత్తుచుందురు. కొందరు తిట్టుచుందురు. కొందఱు తమ మగవాండ్రను బిలిచికొని వచ్చుచుందురు. గణపతి మెఱపుతీగవలె మాయమగును. తన స్నేహితులలో గొందరి వీపులమీద దూలగొండ రాయుచుండును. దురదలెత్తి వారు వీపులు బరికికొని పరుగులెత్తుచున్నప్పుడు మహా నందభరితమై యుండు గణపతి మొగముచూచి తీరవలయును. ఫొటోగ్రాపు లాకాలమందు విరివిగా లేవుగాని యీనాటివలె నవి పుష్కలముగ నుండిన పక్షమున గుణగ్రహణ పారీణుఁడైన యెవఁడైన నతని ప్రతిరూపము దీసియుండిన పక్షమున నట్టి ప్రకృతి యెంత వినోదకరముగ నుండును? ఎంత జగన్మనోహరముగ నుండును? ఎన్ని కోట్ల ప్రతులు కర్చెయుండును? గణపతి యొక్క మూర్తివిశేషము జూచుభాగ్య మాంధ్రమహాజనులకు లేదు. మూర్తియంతయుఁ చూచుభాగ్యము లేకపోయినను దానిండ్లమీఁద రాళ్ళు విసరినప్పుడు, స్త్రీలు కాళ్ళనడుమ పల్లేరుకాయలు చల్లినప్పుడు, సంగడికాండ్ర మేనులకు దూలగొండి రాచినప్పుడు ముసలమ్మలు, యువకులు, స్నేహితులుఁ దన్ను దిట్టుచుండ నత్తరి పండ్లిగిలించి యతఁడు నవ్విన నవ్వెన బ్రతిబింబములో జూచు భాగ్యముండినను మనము ధన్యులమైయుందుము. మందభాగ్యుల కట్టి ధన్యత యేలగలుగు? రూపదర్శనమువలన గలుగు సంతోషము లేకపోయినను శ్రీకృష్ణలీలల కన్నను మిక్కిలి రమణీయములైన గణపతి లీలలలో గొన్నిటిని జదివి యానందించు భాగ్యమబ్బినది కనుక చదువరులు కొంతవఱకదృష్టవంతులె. గణపతికి క్షీరపానమునందు మిక్కిలి యాసక్తి. పాలు కొని త్రాగుట కతనిదగ్గఱ డబ్బులేదు. అనేకోపాయములచే సంగ్రహించిన డబ్బు పొగచుట్టల కైన దిన్నగా సరిపోదు. కొనుటకు డబ్బులేనంత మాత్రముచేత పాలుత్రాగుట మానుకొనునంతటి మూరుడుకాఁడు. కావున గణపతి క్షీరసంపాదనము కొక యుపాయము గనిపెట్టెను. పొలమునుండి సాయంకాల మింటికి తిరిగివచ్చు నావులను, గేదెలను వీధులవెంట దిరుగు మేకలను బట్టుకొని యొకప్పుడు బందమువైచియు మఱొకప్పుడు వేయకయు బాలుపిదికి యతఁడు త్రాఁగుచుండును. ఆవులు తమ తమ గృహంబులకుఁ బోయిన తరువాత యజమానులు పాలు పిదుక దమకింప వని పాలియ్యక పోవుటఁజేసి తమ యావులకు దృష్టి తగిలినదనియు దయ్యములు పట్టినవనియు మనోవేదన జెంది దిగతుడుపులు తీసి సోదెకుఁ బోవుచుందురు. వారి కళవళము వారి చిత్తక్షోభము జూచి యేమియు నెఱుఁగనివాఁడు వోలె నటించుచు దన యఖండ ప్రజ్ఞయెగదా వారిని వ్యాకులపెట్టు చున్నదని సగర్వముగ మనంబున గులుకుచుండును. కావలసిన ఖర్చులు చేసికొనుటకు గణపతి చేతిలో డబ్బు కొంచమైనను లేకపోవుట గొప్పవిచారకారణమయ్యెను. మేనమామ డబ్బులు విభూతి బుట్టలో బెట్టుట మానెను. తల్లి గూళ్ళలో వైచుట మానెను. ఏదో నిరంతరము నమలుచుండవలయును కాని, గణపతి నోరూరకుండదు. కొబ్బరి కురిడీలు, శనగయుండలు, పేలవుండలు, తాటితాండ్ర, తేఁగలు, జీళ్లు, శనగపప్పు మొదలైన వస్తువులూరక యిచ్చువారెవ్వరు లేరు. తోఁటలోనికిబోయి మునుపటి వలె దోచుకొని వచ్చుట కంత వీలులేదు. ఏలయన దోఁటకాఁపు లీబందిపోటు దొంగల విషయమై మిక్కిలి జగరూకులై యుండిరి. సూక్ష్మబుద్ధి గలవాఁడగుటచేత గణపతి యావిషయమై కన్నులు మూసికొని రెండవచింత విడిచి

యొక్క జామాలోచించి యెట్టకేల కొకయుపాయము పన్నెను. డబ్బు కావలసి వచ్చినపుడతఁడు చుట్టుప్రక్కలనున్న చిన్నచిన్న గ్రామములు కరిగి గ్రామమందలి బ్రముఖుల నందఱ జూచి మాతండ్రి చనిపోయినాఁడు. పేదసంసారము. దినవారములు జరిగించుకొనుటకు డబ్బులేదు. మీరందఱు సాయముచేసి యీ బ్రాహ్మణ కర్మ యేలాగైన గడతేర్చి నన్నొకదరికి జేర్చవలయు. శ్రాద్ధకర్మ చేయకపోయిన యెడల బందుగులు వెలిపెట్టుదురు. చనిపోయిన వానికి మంచి గతులు గలగవు. తండ్రి పోయినందుకే నే నేడ్చుచుండగా మీదు మిక్కిలి శ్రాద్ధము పెట్టుటకయిన డబ్బు లేకపోయినదని నేనిట్లు బిచ్చమెత్తవలసి వచ్చినది. తండ్రి దినవారములకూడ డబ్బు లేనంత దురవస్థ నాకు భగవంతుడు తెచ్చిపెట్టినాఁ " డని కన్నుల నీరు పెట్టుకొని రానిదుఃఖము దెచ్చిపెట్టుకొని యేడ్చును. పదునాలుగు సంవత్సరముల పిల్లవాఁడు పితృరుణ విముక్తుడు కాఁదలఁచి యాచించుటయె జాలి గలిగించును. అట్టియెడ నబ్బాలుని కన్నుల బాష్పోద్గమ మయ్యెనా యట్టియెడ నెవని మనసు కరుగదు. ఎవనికపుడు చుమ్మలు చుట్టదు. ఆ యా గ్రామములలోని జనులతని బూటకములు నమ్మి యెవరికిఁ దోచినమట్టుకు వారు సహాయము చేయుచుందురు. ఒక్కొక్కనాఁ డతనికి రెండు మూఁడు రూపాయలు గూడ దొరుకుచు వచ్చినవి. సాధ్యమైనంత వరకతఁడు వెళ్ళినయూరు వెళ్ళకుండ నీవ్యాపారము సాగించు చుండెను. విధిలేకయె మఱచిపోయియె మునుపు జమాబంది యైన గ్రామమె మరల వెళ్ళవలసి వచ్చినపుడు తండ్రి చచ్చి పోయినాఁడన్న మిష సాగదని తల్లి చచ్చిపోయినదని వంక బెట్టును. తల్లి యింటఱాయి లాగున నుండఁగ నామె చనిపోయిన దని చెప్పుటకు నోరెట్లు వచ్చినదని మీరు సంశయింతురు కాఁబోలు. అట్లు సంశయింపవలసిన పనిలేదు. ఏలయన "జాతస్య మరణంధ్రువ" మ్మను మాట మీరు విన్నారుగదా. 'పుట్టిన వాఁడు గిట్టక మానడ' ని దీనియర్థము, ఆ మాటయందు గణపతికి మిక్కిలి విశ్వాసము కలదు. తన తల్లి యెప్పుడో చావక మానదని గణపతి యెఱుఁగును. ఎప్పుడైనను జచ్చిపోవలసినదె కనుక తనకు డబ్బవసర మున్నప్పుడు చచ్చిపోయినదని చెప్పుట చేత నెంతమాత్రము పాపములేదని గణపతి యాశయము. పది సంవత్సరముల తరువాత జరుగఁదలచిన కార్యము పది సంవత్సరములముందు జరిగినదని చెప్పుట తప్పుగా నతఁ డెంచలేదు. ఒకప్పుడు తల్లిమాసికమని బిచ్చమెత్తును. ఒకప్పుడు తండ్రి తద్దినమని యడిగికొనును. ఒకప్పుడు తాను ప్రయాణము చేయుచుండఁగా మార్గమధ్యమున దొంగలు కొట్టి చెంబులు గుడ్డలు బత్తెపుఖర్చు నిమిత్తము దగ్గరనున్న డబ్బు తీసుకున్నారని చెప్పి ముష్టి యెత్తును. కొన్ని గ్రామముల కరిగి యతఁ డీక్రింది విధముగఁ భిక్షాటనము జేసెను. "అయ్యా ! నా తల్లి కెందరో బిడ్డలు చచ్చిన తరవాత నేను పుట్టితిని. నేను పుట్టినపుడు మా తల్లి నన్ను తిరుపతి తీసికొని వెళ్ళవలయునని మ్రొక్కుకొన్నది. పేదవాండ్ర మగుటచేత మ్రొక్కు తీరినదికాదు. ఏడుకొండల వెంకటేశ్వర్లు వడ్డికాసుల వాడన్నమాట మీకు తెలియునుకదా! అతని మ్రొక్కులు, ముడుపులు చెల్లకపోయినయెడల వెండి బెత్తములతోను బసిడి బెత్తములతోను వీపు పగులఁ గొట్టునని మీరంద ఱెఱిగిఁయె యున్నారు. రాత్రులు దెబ్బలు తినలేక నేను మిక్కిలి శ్రమపడుచున్నాను. నాకీశ్రమ మీరు తప్పించవలెను. వెంకటేశ్వరుల వారికిఁ వెండి చెంబొకటి చేయించి నేను ముడుపు చెల్లించవలెను. దాని కేబది రూపాయలు కావలెను. నదగ్గఱ గ్రుడ్డిగవ్వ లేదు. బ్రాహ్మణ బాలకుని యాపద తప్పించవలసిన భారము మీపై నున్నది. ఈ సహాయము జేసిన మీకెంతో పున్నెముండును. వెంకటేశ్వరుల వారిచేత దెబ్బలు తిని చచ్చిపోకుండా నన్ను మీఱందరు గాపాడవలయును. నాకు మీరే తల్లి, మీరే తండ్రి" యని యడుగుటయు వాని

దీనాలాపనముల విని మగవాండ్రు, నాడువాండ్రు జాలినొంది తోఁచినసహాయము చెయుచు వచ్చిరి. ఈ వ్యాపారములో దిరిగిన తరువాత గణపతియెద్దకు ప్రతిదినము కొంచెముగానొ కుప్పగానొ డబ్బు నిలువయుండ జొచ్చెను. కావలసినన్ని పొగచుట్టలు, కావలసినన్ని తమలపాకులు కొనుట కవఁకాశము గలిగెను. అతడు స్నేహితుల కప్పుడప్పు డొకయణా, రెండణాలు బదులియ్యజొచ్చెను. గణపతి భోజనమునందు మహాగణపతీతుల్యుఁ డగుటచే నెంత డబ్బు వచ్చినను వాని యుపాహారములకె సరిపొవుచు వచ్చినది. ఈ విధముగ వ్యాపారము చిరకాలము సాగినదికాదు. ఒక గ్రామవాసులు మఱియొక గ్రామమునకు గార్యాంతముమీఁద వెళ్లుట తటస్థించుచుండును. కావున గణపతియొక్క చేష్టలు క్రమక్రమముగ బయలుపడెను. జనులకు విశ్వాసము తగ్గెను. చుట్టుపట్ల గ్రామములలో నతని మాటకుఁ జెల్లుబడి లేకపోయెను. అందుచే మునుపటివలె నతనిచేతినిండ డబ్బుచిక్కుట కవకాశము గలుగదయ్యెను. మరల నతనికి డబ్బు సందర్భమైన యిబ్బంది తటస్థించెను. ఆ యిబ్బంది గడచుటకై యతఁ డొకనాఁడు దీర్ఘముగా నాలోచించి వైదికులపాలిఁటి కల్పవృక్షమని కామధేనువని చెప్ప దగిన శ్రాద్ధభోజనమె శరణ్యమని నిశ్చయించెను. సామాన్యమైన యాబ్దికమునకు మంత్రితుఁడై పోయిన వానికి నొక్కడబ్బుకంటె నెక్కువ దొరకదు. మాతాపితృభక్తి యత్యధికము గలవారు రెండు డబ్బు లిచ్చుచుందురు. మిక్కిలి భాగ్యవంతులగువారు వస్త్రము లిచ్చి యొక యణాగాని రెండణాలుగాని దక్షిణ నిత్తురు. కడపటివారు మిక్కిలి యరుదుగ నుందురు. అట్టి బ్రాహ్మణార్థములకు బోయినపక్షమున గడుపునిండ భోజనము లభించుటయె తప్ప దక్షిణ బాగుగ దొరకదని షోడశబ్రాహ్మణార్థములు చేసిన పక్షమున జేతినిండ బుష్కలముగ సొమ్ముండునని తద్విషయమై ప్రయత్నించెను. చుట్టుప్రక్కలనే బ్రాహ్మణుఁడు చనిపోయినను బదియొకండవనాఁడును, పద్రెం డవనాఁడును విఘ్నేశ్వర పూజాసమయమున స్థాపింపబడు పసుపు గణపతితో బాటు మూర్తీభవించిన శ్రాద్ధదేవతవలె పితృలోకమునుండి వచ్చిన ప్రేతవలె మన గణపతి వుండితీరవలయును. గణపతి తిండిపోతని చదువరు లిదివఱకె యెఱుఁగుదురు. భోజన విషయమున నతని ప్రజ్ఞ యాకారమునకుఁ దగనిది. అతని విగ్రహము పొట్టిదైనను వాని యాఁకలి మిక్కిలి పొడుగుది. బ్రహ్మదేవుఁ డతని కీయదలఁచిన ప్రజ్ఞయంతయు జీర్ణకోశమునందు పెట్టెను. శ్రాద్ధబోజనముల యం దతఁడు మెక్కునట్టి యరిసెలు, గారెలు, కుడుములు మొదలగునవి పుంజీల లెక్క ప్రకారము చెప్పుకొనుట సుకరముగాని విడిగా లెక్కించుట సుకరము కాదు. బోజనవిషయమున నతఁడు సర్వభక్షకుఁడని చెప్పవలెను. ఇది యిష్ట మది యిష్టములేదన్న మాటలేదు. ఏమియు దొరకనప్పుడు పెసరకాయలు, కందికాయలు, శనగకాయలు, జొన్నచేలలో నూచబియ్యము, తాటిపండు మొదలైనవిగూడ నతఁ డారగించును. శ్రాద్ధభోజనముల వలన నతనికి మరల కొంత డబ్బు దొరకఁ జొచ్చెను. ఆ దినములలో నతని జీవచరిత్రలో నొక్క మార్పు తెచ్చుటకు సమర్థమైన కార్యమొకటి జరిగినది. ఏనుఁగుల మహలునుండి కోమటు లొకరు రాజమహేంద్రవరములో వివాహసంబంధము నిశ్చయించి తరలివెళ్ళిరి. పెండ్లికుమారునకును గణపతికిని మొదటినుండియు జీట్లపేక దగ్గఱ స్నేహమగుటచే నతఁడు ప్రియమిత్రుడైన గణపతిని తన వివాహమునకు రమ్మని పిలిచెను. మిత్రుని యభీష్టసిద్ధి చేయఁదలఁచి మిత్ర విధేయుఁడైన గణపతి వారితో గలిసి వెళ్ళెను. రాజమహేంద్రవరములో నున్న కాలమున గణపతి క్రొత్త ప్రపంచమున నున్నట్లుండెను. ఆ పురవీధులలో నడచునట్టి తన యీఁడు బాలకుల కందరకు గిరజాలుండుట యతఁడు చూచి యా బాలకులవలె తాను గూడ

గిరజాలు నున్నగాదువ్వి చెవుల సందుననుండి వెనుకకు దువ్వి మడిచి యుంగరములుగఁ జుట్టి తిరగవలెనని యతని కుబలాటము గలిగెను. పిల్లజుట్టుపై నతని కెంతో యసహ్యాము కలిగెను. గిరజా లుంచుకొనని వాని బ్రతుఁకెందు కనిపించెను. ఎన్ని జన్మలయందు మంచి తపము చేసిన యదృష్టవంతులకో గాని గిరజా లుంచుకొనునట్టి భాగ్యము కలుగదని యతఁ డనుకొనియెను. అనుకొన్న విషయ మాచరణములో బెట్టుటలో నతఁ డగ్రగణ్యుడని పూర్వచరిత్రము వలన మీరు తెలిసికొని యుండవచ్చును. ఒకనాఁటి రాత్రి యీరీతి ననుకొనెను. మరునాఁ డుదయమున బెందలకడ లేచి భజంత్రీ మేళములోనున్న యొక మంగలిని బిలిచి తన పిల్లజుట్టు గొరిగివైచి గిరజాలు పెట్టుమని కోరెను. వెంటనే మంగలివా@ డతనికోరిక ప్రకారము చేసెను. ఆ మహాకార్యము చేసినందుకు మంగలివాని కొక యణా యిచ్చి తదృణము దీర్చికొని కృతకృత్యుఁ డయ్యెను. అట్టి నూతన వేషముతోనున్న గణపతిని జూచి పెండ్లివారిలో సంతసింపని వారు లేరు. ఏదో ఘనకార్యము చేసినవాడువోలె నన్యులకు దుర్లభమమైన సువర్ణకిరీటము మస్తకమున ధరించిన వాఁడువోలె నాఁటి దినమంతయు గణపతి మిక్కిలి యుత్సాహము గలిగి చూపులలోను, మాటలలోను, నడకలలోను, ముఖవైఖరిలోను గర్వముట్టిపడునట్లు సంచరించెను. పెండ్లివారితో వచ్చిన యువజను లందఱును జతురోక్తులయం దాశక్తిగల కొందరఱు పెద్దలును నాఁటి దినమున వేశ్యల మేళమున కరుగక గణపతి చుట్టుఁ జేరి వారి మాటలు విని వాని చేష్టలు చూచి వినోదము నొందిరి. పెండ్లికొడుకు చేత సిఫారసు చేయించుకొని పెండ్లికి వచ్చిన యాఁడువాండ్ర దగ్గరనుంచి సంపంగ నూనె దెప్పించి లేత మొక్కలకు మంచి యెరువు వైచు కాఁపువాడువలె తన తలకు రాసుకొని వెండ్రుకలు త్వరగా యెదుగు సాధనములేవి యని దన కన్నులకు బండువుగా నుండునట్లు పెద్ద గిరజాలను పెంచుకున్న వారిని పలుమారు గ్రుచ్చి గ్రుచ్చి యడుఁగజొచ్చెను. పరిహాసము చేయుటలో మిక్కిలి ప్రౌఢుఁడైన యొకానొక యువజనుఁడు గణపతిని రహస్యముగా నొకచోటికిఁ దీసికొనిపోయి యతని శిరోజ వృద్ధి యందత్యంతాసక్తిగలవాడు వోలెనతని చెవిలో నిట్లనియెను. "అగరు నూనెతోను, సంపంగి నూనెతోను దలవెంట్రుక లేపుగాఁ బెరుగవు. మంచి వంటయాముదము దెచ్చి నాలుగు దినములు రాచితివా వానచినుకులు పడగానె చికిలింత మొలిచినట్లు వెంట్రుకలు చురుకుగా నెదుగును. నేనట్టి దోహదము చేయబట్టి నా గిరజాలింత సొంపుగా నెదిగినవి. నీ వెంట్రుక లెదుగుట మన సులో నిష్టములేనివారు నేను చెప్పిన దోహదము చేయవద్దని నీకు దుర్భోదనలు చేయవచ్చును. వా రెన్ని చెప్పినను సరె నీ వది వినవద్దు. సరిగా నెను చెప్పినట్టు చేయుము' ఆ యుపదేశముచేసి యతఁ డరిగెను. అది యెవరికిఁ జెప్పక బ్రహ్మోపదేశమువలె మనసులోఁ బెట్టుకొని రాత్రిభోజనాంతరమున నందఱు నిద్రాసక్తులైన సమయమునఁ జాకలివాండ్రు కాగడాల నిమిత్తమయి యుత్తడిసిద్దెలతో దాచుకొన్న యాముదము వారు చూడకుండ దొంగతనముగా రెండుచేతుల నిండబోసికొని తలకు రాసుకొని పెద్దమనుష్యులు కూర్చుండుటకుఁ వైచిన తివాసీమీద కరిగి దిండుమీఁద తలబెట్టుకొని పండుకొనియెను. మరునాఁడు గణపతి కాకులు కూసెడువేళనె లేచి గోదావరికరిగి రాగిడిమట్టితోఁ బలుసారులు తల రుద్దుకొని స్నానముచేసివచ్చి మరల బట్టలు కట్టుకుని కూర్చుండి కనబడిన వారినెల్ల బిలిచి "నా గిరజా లేమైన నెదిగినవేమో చూడు" డని యడిగెను. గణపతియొక్క విచిత్ర చరిత్ర మదివఱకె సువ్యక్తమై యున్నందున వారందఱు నగుమోముతో " నీ వేమి దోహదము చేసితివో కాని మిక్కిలి యేపుగా నీ వెంట్రుకలు పెరుగుచున్నవి. నిన్నటికి

నేఁటికి నెంతో భేదము గనిపించుచున్నది. ఆ విధముగానె దొహదము చెయుచుండుము. నితల జొన్న చేనువలె నెదుగునని చెప్పిరి. అతఁడాముదమె శిరోజవృద్ధికి దివ్యౌషధమని నిశ్చయించి యదియె యుపయోగింపఁ దలఁచెను. చాకలివాం డ్రుదయమున లేచి తివాసులు జభుఖాలు దులుపునప్పుడు దిండుమీఁద మెండుగా నుండిన యాముదపు మరకలు చూచి దానిమీద నాముద మెట్లయ్యెనని యెల్లవారి నడుగఁజొచ్చిరి. అడుగఁబడిన వారందఱు "మే మెఱుఁగము; మే మెరుగ" మని బదులుచెప్పిరి. చాకలివాఁడొకఁడు గణపతి నట్లు ప్రశ్నించుటయు నతఁడు మిక్కిలి కోపించి "ఎవడవురా నీవు తాహతెరుగకుండఁ బెద్దపిన్న తారతమ్యము లేక నన్నిట్టి ప్రశ్న లడుగుచున్నావా? నీ యంతర మేమి? నా యంతర మేమి? నీకు బొత్తిగా భయభక్తులు లేవు. చూడు పెళ్ళివారితో జెప్పి నిన్నేమి చేయింతునో నీవు తుంటరిలా గనపడుచున్నావు. నేనేమి తల కాముదము రాసుకొని దీనిమీఁద పండుకొన్నా ననుకొన్నావా యేమి జాగ్రత్త. బుద్ధి చెప్పించెదను. దొంగవెధవలు మీరే యాముదసిద్దెలు తెచ్చి దిండుమీఁద బెటినారేమో, అది గాకపోతే యాముదపు చేతులతో మీ రిద్దిండు ముట్టుకొని సవరించినా రేమో, లేకపోతే మీరిద్దిందు ముట్టుకొని సవరించినారేమో, లేకపోతే దానిమీఁద నాముదపుమరక లెట్టువచ్చు" నని విడిదియింటఁ బ్రతిధ్వను లగునట్లు గొంతు బొంగురు వోవునట్లు కేకలు వైచెను. ఆ కేకలతో నంద రక్కడకు చేరి చాకలివాండ్రనదల్చి యవ్వలకుఁ బొమ్మని చేసిన సంభాషణమును బట్టి గణపతియే తలవెంట్రుక లెదుగునిమిత్త మెవరో పరిహాసకుఁడు చెప్పినమాటలు విని తల కాముదము రాచికొని యుండునని మనసులో నిశ్చయించుకొని చిరునవ్వులు నవ్వుకొనుచు "గణపతీ! చాకలివాండ్రు బుద్ధిపొరబాటుచేత నిన్నాలాగున ననిరి. నీవంటివాఁ డిటువంటి పని చేయునా? కాని యా దొంగ యెవడో మన మందర మీరాత్రి కలిసి పట్టుకొంద" మని వెడలి పోయిరి. ఆనాఁటి రాత్రిగూడ గణపతి గతరాత్రమునందు వలె శిరస్సునకు తైలమర్దనము నందభిలాషగలవాఁడై రజకులు పండుకొన్న నెలవున కరిగి మెల్లగా నొకసిద్దె వంచెను. చాకలివాండ్రలో నొకఁడు సారా త్రాగివచ్చి పండుకొని సమీపమున బొరలుచు మరల ద్రాగుటకు నొక సీసానిండ సారాతెచ్చి సిద్దెలప్రక్క బెట్టుకొనియెను. గణపతి చీకటిలో నది కనిపెట్టలేదు. ఆ రజకుఁడు గణపతినిజూచి తన సారా దొంగిలించుకొని పోవుట కెవఁడో దొంగ వచ్చెనని భావించి "దొంగ తొత్తుకొడుకా! నా సీసా దొబ్బుకొనిపోవుటకు వచ్చినావా" యని లేచి వెన్నుమీఁద రెండు చరపులు చరిచి తిట్టనారంభించెను. ఆ చరపుల చప్పుడు తోను, దిట్లతోను దక్కిన చాకలివాండ్రు మేల్కాంచి దొంగవచ్చినాఁడనుకొని గణపతిని బట్టుకొనిరి. అతఁడు ప్రతిష్ఠా రక్షణ మందు మిక్కిలి జాగరూకుఁ డగుటచే సుమూహర్త సమయము నను సదస్యమునాడునుఁ దనకు దొరికిన సంభావన డబ్బులు చాకలివాండ్ర చేతులలో బెట్టి తనను నలుగురిలో నగుబాట్లు సేయవలదని చేతులు పట్టుకొని వాండ్రను బ్రతిమాలి యాముదపు మరకలు దిండుమీద చేసినది తానే యని యొప్పుకొని వారి బారినుండి తప్పించుకొని పోయెను. ఈ పరమ రహస్యమును జాకలివాండ్రు తిరుమంత్రమువలె నెవరికిఁ జెప్పకుండ దాఁచదలచిరి కాని వారి కడుపులలో ఇది యిమిడినదికాదు. నోట నువుగింజ నానని తుచ్ఛులనోళ్ళలో రహస్యము దాఁగునా? చాకలివాండ్రు, మంగలివాండ్రతోను మంగలివాండ్రు బాకాలూదు దూదేకుల సాహేబులతోను, వాండ్రు తమయాప్తులతోను జెప్పఁగా బరమరహస్యము సూర్యోదయ మగునప్పటికె గుప్పుమని వెల్లడియయ్యెను. అందఱు గణపతిని జూచి ముసి ముసి నవ్వులు నవ్వువారె. అందఱు నతని తలమీఁద జేయివైచి గిరజా లెదిగినవాయని పరిహాసము చేయువారె. అందరు శిరోజవృద్ధికి

దౌహదములు చెప్పువారె. వెండి, బంగారు దొంగలుపోయి యాముదపు దొంగలు బయలుదెరినా రని యొకఁడు, తల వెంట్రుకలు పెరుగుటకు తగిన దోహదమాముదమే యని యొకఁడు, తైలముకంటె ముట్టికాయలు డిప్పకాయలు వెంట్రుకల వృద్ధికి మంచి యౌషధమని యొకఁడు చమత్కారముగ మాటలాడిరి. గణపతి తక్కిన మాటలకు సరకు చేయలేదు. కాని యాముదపు గొంగలు వచ్చినారన్నపుడు మాత్రము కొంత ప్రసక్తిని గల్పించుకొని యాముదము దొంగిలించునట్టి నిర్భాగ్యు లెవ్వరుండరు. చాకలి వెధవల మాటలు నమ్మి మీరుకూడ గంతులు వైచుచున్నారని ప్రత్యుత్తర మిచ్చెను. "గుమ్మడికాయలు దొంగ" యనగా బుజము తడిమి చూచుకొన్నట్లు పెండ్లికి వచ్చినవారిలో నింతమందియుండగా "ఆముదము దొంగయున్నపుడు నీవే పూసి కొని రానేల" యని మిత్రు లెగతాళిచేయఁ జొచ్చిరి. న్యాయము చెప్పినాను. కాని నాకెందుకని గణపతి ప్రత్యుత్తరము చెప్పి, ఎంద రెన్నివిధము లెగతాళి చేసినను వాని భావము గ్రహింపలేక తనగుట్టు బయటపడలేదని నమ్మి సంచరించెను. రాజమహేంద్రవరమున జనులను జూడఁగా నతనికి మఱియొక యుబలాటము గలిగెను. చెప్పులు మోటవాండ్రు దొడుగుకొన వలసినవె కాని నాగరికులకుఁ దగనివనియు,నాగరికులు పాదము లకు దొడుగుకొనవలసినవి ముచ్చెలో చడావులోగాని చెప్పులు కావనియు నతని మనస్సునకుఁ దట్టెను. తట్టినతోడనే యతఁడు తన పాఁత చెప్పు లమ్మఁజూపెను. ఆ చెప్పు లతని కాలునకేగాని మరియొకరి కాలునకు సరిపడనివగుటచే నవి కొనువారెవ్వరు లేకపోయిరి. సంపాదించిన డబ్బులు చాకలివాండ్రకు లంచమిచ్చుటక్రింద వెచ్చబెట్టబడినందున క్రొత్తజోడు కొనుట కతనికడ డబ్బులేకపోయెను. అదిగాక ముచ్చెలు కొనుట మంచిదా చడావులు కొనుట మంచిదా యను విషయ మతఁడు విచారణ చేయ దొడఁగి సంగడికాండ్రనడుగజొచ్చెను. "మిట్ట ముచ్చెలు నీకాలికెంతో యందముగ నుండును. అవి తొడుగుకొని టక్కు టిక్కుమని నీవు నడిచితివా చూచువారి కెంతో ముచ్చటగ నుండును. కాబట్టి ముచ్చెలే కొనుమని యొకఁడు సలహా చెప్పెను. ఒంటియట్ట చడావు నీ పాదమున కెంతో సొగసుగ నుండును. చడావు తొడిగికొని అవి కిఱ్ఱుకిఱ్ఱుమని చప్పుడు చేయుచుండ నీవు వీధులవెంట నడుచునపు డెల్లరకు ముద్దుగా నుండును. కాబట్టి చడావులే కొనవలసిన దని మరియొకఁ డాలోచనము చెప్పెను. చేతిలో డబ్బు లేకపోయినది కాని గణపతి ముచ్చెలు చడావులు కూడ కొనఁగోరెను. రెండింటిని గొనుమని యడిగిన బాగుండదని తనలో దానె విచారించు కొని పెండ్లి కుమారునికడ కరిగి కొంతసే పామాట లీమాటలాడి యతఁడు గూడ తన గిరిజాల విషయమై కొంత పరామర్శచేసిన పిదప తన మనోరథ మెఱిఁగింప దలఁచి యిట్లనియె "నీ వింత వైభవముగ వివాహము చేసికొను చున్నందుకు నాకేదైన మంచి బహుమానము నీవు చేయవలెను. ఎలాగైనను నీవొక జామారుగుడ్డ నా కీయకపోవు. జామారు నాకక్కరలేదు. ఈ మధ్య షోడశ బ్రాహ్మణార్థములలో నాకేడెనిమిది గుడ్డలు దొరికినవి. బట్టల కరవు లేదు. నాకిప్పుడు కావలసినది మంచి పెద్దాపురపు పైజార్ల జోడు. పొట్టివాడ నగుటచేత మిట్ట పైజార్ల జోడు నా కాలి కందముగా నుండునని మనవాళ్ళు చెప్పినారు. దాని ఖరీ దర్ధరూపాయి. ఏలాగైనను నీవు నాకిది కొనిపెట్టక తప్పదు. ఏమిటి నీ యభిప్రాయము? నాకోరిక తీర్చెదవా లేదా?" అనపుడు పెండ్లికుమారుఁ డిట్లనియె "నాదగ్గఱ డబ్బులులేవు. నాలుక పెరికికొన్నను మాతండ్రి నాచేతికి రాగిడబ్బైన నీయఁడు. సదస్యము నాఁడు నీవు చూచితివిగదా రూపాయ రూపాయ సంభావన వచ్చునని బ్రాహ్మణు లెంతో యాసపడి రాఁగా మా యయ్య బేడ బేడ యిచ్చి సాగనంపినారు. బ్రాహ్మణులు తోరణములు తెంపినారు. ఎంతో గందరగోళమైనది. నీ

సంభావన డబ్బు లెమి చెసికొన్నావు? అవిపెట్టి కొనరాదా" అని యతఁడు పలుక గణపతి "గోదావరిలో స్నానముచేయుచుండగా మూట విడిపోయి సంభావనడబ్బులు పడిపోయినవి. నీవంటివాని నాశ్రయించినందుకు నా కోరిక తీరకపోవలసినదేనా? పోనీ మీ నాన్న చేత బదులిప్పించు. రెండు షోడశబ్రాహ్మణార్థములు చేసి నీ యప్పు తీర్చెద" నని యుత్తరము చెప్ప పెండ్లికుమారుఁడు "మా యయ్య నా సిఫారసుమీద నీ కప్పియ్యఁడు. అట్టియాస బెట్టుకొనకు" మని ప్రత్యుత్తర మిచ్చి పంపెను. గణపతి భగ్నమనోరథుఁడైనను ముచ్చె లెట్లయిన సంపాదించి తీరవలయునని కృతనిశ్చయుఁడై ఉపాయాన్వేషము జేయఁజొచ్చెను. ఉపాయము పొడగట్టెను. అతని యదృష్టవశమున నా సాయంకాలము బంధువైన వైశ్యుఁ డొకడు పదియేండ్ల వయసుఁగల తన కుమారుని వెంటబెట్టుకుని పెండ్లివారిని జూడవచ్చెను. అప్పుడు రెండు గడియలరాత్రి యయ్యెను. ఆతని కుమారుఁడు జరీపని చేసిన ముచ్చెలజోడు తొడుగుకొనివచ్చి యది గుమ్మము ముందరవిడిచి లోనికిఁ బోయెను. అది ముద్దుల మూటగట్టు చున్నట్లు గణపతికిఁ దోచెను. ఎట్లయిన నదిగాని యటువంటిది గాని తన కుండినపక్షమున తన జన్మము ధన్యమగునని యతఁడు భావించెను. కొంచెముసే పిట్టట్టు బచారుచేసి తనపాద మందులోబెట్టి సరిపోవునేమో యని చూచెను. అది సరిగా నతనికి సరిపోయెను. అటువంటిది, మఱియొకటి దొరకనప్పుడిదియె తాను గ్రహింపఁదగునని నిశ్చయించి యటుచూచి చేయిజూచి జోడు తీసి యుత్తరీయమున జుట్టి దొడ్డిదారిని బోయి తన బట్టల మూటలో బెట్టెను. ఆ కోమటియు గుమారుఁడు దాంబూలము పుచ్చుకొని వీథిగుమ్మముకడకుఁ బోయి చూచునప్పటికి జోడు కనఁబడలేదు. జరీపనిచేసిన ముచ్చెలజోడు కావలయునని కొడుకెంతో ముచ్చట పడగా కోమటి యాకాలమున నట్టిజోళ్ళకుఁ బ్రసిద్ధికెక్కిన పెద్దాపురమునం దది పురమాయించి చేయించి తెప్పించెను. ఆ పూటే కొడుకది తొడిగికొనివచ్చెను. కుఱ్ఱవాఁ డేడుపు మొగముపెట్టి యింటికిఁ బోయెను. విడిదిలో జోడు బోయినదని పెండ్లికుమారుని తండ్రి యెంతో నొచ్చుకుని కూడ వచ్చిన వారినందఱనడిగెను. కాని యది బయలుపడలేదు. అక్కడున్న వారందఱు దొంగిలించిన వానిని నోటికి వచ్చినట్లు తిట్టిరి. వారితోపాటు గణపతియు నాలుగు తిట్లు తిట్టెను. గణపతి కార్యవాది కాని ఖడ్గవాది కాఁడు గనుక కార్యసాధనము నిమిత్తమై తిట్లన్నియుఁ బడెను. బెండ్లివారు మూటలు పరీక్ష చేయుదురేమో యని భయపడి గణపతి తనమూట తీసికొనిపోయి వేరొక యింట బెట్టెను. మొత్తము మీఁద దొంగతనము బయలు పడకుండ జాగ్రత్తపడి జోడు సంపాదించెను. గిరజాల యుబలాటము ముచ్చెల యుబలాటము దీరిన పిదప గణపతికి మఱియొక కోరిక పుట్టెను. పుట్టి బుద్ధి యెఱింగిన తరువాత నతఁడు కోటు తొడిగి యెఱుఁగఁడు. చీట్లపేక లోపలి కోటులే కాని శరీరాచ్ఛాదనము చేయు కోటు అతఁడు చూచి యెఱుఁగడు. తల్లి చిన్నప్పుడు ముద్దునిమిత్తము బొందుల చొక్కాలు రెండు కుట్టించెను. కాని యవి చిరిగిపోయెను. కోటు తొడిగిన మనుష్యుఁడతని కెంతో విచిత్రనరుఁడుగ గనఁబడెను. రెండుకోట్ల రూపాయ లున్నను హాయిగా దొడిగికొనుటకు రెండు కోట్లు లేనిపక్షమున వాని జన్మంతయు వ్యర్థము. పశువునకు వానికిని భేదమే లేదని యతని మనంబునకుఁ దోచెను. ఎటులైన నొక కోటు గాని, రెండు కోట్లు గాని కుట్టించుకొనవలయునని తలఁచి చేత డబ్బులేనందు కతఁడు విచారించి గుడ్డలు చేతితో స్పృశించియుఁ గన్నులం జూచియు ధన్యత జెందవలయునని మంచి కోటుగుడ్డ లున్న దుకాణము లన్నింటికి జని యెంత వెలయైన నిచ్చి కొనువానివలె మూటలు విప్పించి గుడ్డల నన్నింటిని బేరమాడి చేతిలో నాణెము చూచి రంగు

వెలియదు కదా? చాలకాలము మన్నునుగదా? యని యడిగి తక్కువ వెలల కడిగి బేరము కుదరక వెడలిపోయినట్లు దుకాణములు విడిచి వెళ్ళెను. ముచ్చెలజోడు సంపాదించిన విధమున నీకోటు గుడలు సంపాదించుట కెంతమాత్రము వీలు చిక్కకపోయెను. ఆ రాత్రి యతని కా విచారము చేత నిద్రయే పట్టలేదు. అప్పు డతఁడు తన మనంబున నిట్లనుకొనెను. "తద్దినములకు షోడశములకు బ్రాహ్మణులకుఁ బనికిమాలిన సైనుగుడ్డ లిచ్చెదరు. కాని శుభ్రమైన కోటుగుడ్డలు రెండు మూఁడు తెచ్చి యిచ్చిన పక్షమున నెంత బాగుండును. తెలివితక్కువ ముండాకొడుకులు స్వయముగ దెలిసికొనలేరు. ఆలోచనలు చెప్పిన వారిమీఁద మూరెడు కోపము. కోటుగుడ్డ లియ్యనిచోటికి బ్రాహ్మణార్థమునకు వెళ్ళవద్దని బ్రాహ్మణార్థములు చేయు కుఱ్ఱవాండ్రందరకును నచ్చచెప్పి కట్టు కట్టించెదను. అప్పుడుకాని వాండ్రరోగము కుదరదు!" అట్లనుకొనుచుండఁగ మెల్లమెల్లగ నిదురపట్టెను.

# పదియవ ప్రకరణము

వివాహానంతరమున గణపతి కోమటులతోఁ గలసి స్వగ్రామము జేరెను. ఇతరుల సొత్తునకుఁ దన సొత్తునకు భేదము లేదను నద్వైతబుద్ధిచేతనైన నేమి, హస్తలాఘవము చేతనైన నేమి ముచ్చెల విషయమున ముచ్చట తీర్చుకొనుటె కవకాశము కలిగినది. కాని కోటు విషయమున ముచ్చట తీరినది కాదని యతనికి బెంగపట్టెను. కోటుగుడ్డలున్న దుకాణములలో హస్తలాఘవము చేయుటకు వీలు చిక్కినదికాదు. పోనీ, కుట్టి సిద్ధముగా నున్న కోటులే హస్తలాఘవము చేసి సంపాదింపవలె నన్న నతని గుజ్జురూపమునకుఁ దగిన కోటులు దొరకుట యరుదు. స్వగ్రామము చేరిన నాలుగు దినములకుఁ దన బుద్ధి విశేషముచేత నార్జించిన ముచ్చెల నుపయోగింపవలె నని యభిలాష వొడమ, గణపతి మూట విప్పి జోడుదీసి చూచి దాని యందమునకుఁ గడుంగడు సంతసించి యది యున్న దున్నట్లుగాఁ దొడగుకొన్న పక్షమునఁ తన దొంగతనము వెంటనే బయట పడునని శంకించి దానికి మారురూపము గల్పింపఁ దలచి దాని మీఁద నున్న జల్తారు నూడఁబెరికి యావలఁ బారవైచి తొడిగికొని, మొదటి దినమున దన యింటిలోనె బదిసారు లిటునటు బచారు చేసెను. తన యైశ్వర్యముం జూచి చుట్టములు నెచ్చెలులు సంతోషింపఁవలెనని లోకమునఁ బ్రతి మనుష్యుడు గోరును గదా! అట్లే గణపతిగూడఁ దన భాగ్యవశమునఁ దనకు లభించినదియు నాగ్రామమున ననన్యలబ్ధమైనదియు నగు ముచ్చెలజోడు దొడిగికొని బంధుమిత్రుల కన్నులకు విందుసేయవలెనని తలంచి నోట చుట్ట వెలిగించి కుచ్చుతలపాగ జుట్టి రాజమహేంద్రవరము నందలి కొందఱు పెద్దమనుష్యుల వలెఁ జేతిలో కఱ్ఱ బట్టుకొని ముచ్చెలు దొడిగికొని టక్ టక్ మని చప్పు డగునట్లు నాలుగు వీధులు దిరిగి పనిలేని చోటసైతమాగుచుఁ దన చెలికాండ్రం బిలిచి యేదో సంభాషణ సేయుచు, 'మీ గాళ్ళవాపు మొగముమీఁదనె తెలియు' నన్నట్లు ముచ్చెలజోడు లభించె నన్న యానందము ముఖవికాసమె తెలియఁ జేయునట్లు విహరించెను. కొందఱు స్నేహితు లాతని జూచి "గణపతీ! పైజారు లెంతకు గొన్నావురా?" యని యడుగ నతడు వెలవెలబోయి తత్తరపడి నొకనితో నర్ధరూపాయ యనియు మఱియొకనితో మూడుపావలా లనియు యొకనితో రూపాయ యనియు వేఱొకనితో "నాకిది రాజమహేంద్రవరములో నొక కోమటి పిల్లవాఁడు బహుమాన మిచ్చె" ననియు, ఇంకొకనితో "మామామ కొనిపెట్టినాఁడనియు" నొకరితో జెప్పిన విధమున మరియొకనితో జెప్పక పరిపరివిధముల బ్రత్యుత్తర మిచ్చెను. మిత్రు లనేకులు "గణపతి మిక్కిలి యదృష్టవంతుడు. అతఁ డేదోవిధమున దన కోరిక దీర్చుకొనును" నని శ్లాఘించిరి. ఒక రిద్దఱు మాత్రము "వీ డెక్కడనో దొంగతనముజేసి తెచ్చినట్లున్నాఁడు. కాని యెడల వీనికీ ముచ్చెలు బహుకరించువాఁడెవ్వడు? పెండ్లికి వచ్చినప్పుడు, వీనిదగ్గర నెఱ్ఱని యేగాని లే" దని నిరసించిరి. వారి మాటలకు గణపతి యెంతమాత్రము సరకు సేయక "చేతగాని కుంకలు, అప్రయోజక వెధవలు. తాము ప్రయోజకత్వముచేతఁ దెచ్చికొనలేరు. ఎవఁడైన సంపాదించుకొన్నయెడల దొంగతనమని సింగినాదమని జీలకఱ్ఱయని పేర్లుపెట్టి వెక్కిరించుచుందురు. ఈ నిర్భాగ్యులేమనుకొన్న నాకేమి? ఏలాగో యొకలాగున సంపాదించుట ప్రయోజకత్వము. దొంగతనము చేసినను సరె పట్టుబడకుండుట దెలివి. నేను కొంటే వీళ్ళ కెందుకు? నేను కొనకపోతే వీళ్ళకెందుకు? చేతనైతే సంపాదించు కొనవలె, లేకపోయిన నోరు మూసికొని యూరకుండవలె" నని తనమీద

నిందారోపణము చెసినవారికి పది పుంజీల చివాట్లంటగట్టి తన కాపులయినవారిని నలుగురిని వెంటబెట్టుకొని యిచ్చవచ్చిన చోటు లెల్ల విహరించి యింటికిఁ బోయెను. ముచ్చెలజోడు తొడిగికొని తన కన్నులకు బండువుచేయుచున్న కుమారుని జూచి తల్లి యానందించి రాత్రి భోజనమైన తరువాత గణపతి పండుకొనఁగా నతని ప్రక్కంజేరి యిట్లనియె "నాయనా జోడు మిక్కిలి బాగున్నది. మొట్టమొదట నది యిప్పటికన్న బాగున్నది. నీకిదేలాగు దొరికినది? నీవు కొన్నావా? ఎవరైనా బహూమాన మిచ్చినారా? దానిమీఁద జరీపోగు నీ వెందుకు తీసివేసినావు? ఎవరిదైన దొంగతనముగా దీసికొని రాలేదుకద. ఎఱ్ఱతలపాగాల బంట్రోతులు వచ్చి రెక్కలుగట్టి తీసికొనిపోదు రేమో యని భయము. అందుచేత నడిగినాను. ఏలాగున దొరికినదో చెప్పునాయనా! తెలియక దొంగతనముగ దెచ్చిన పక్షమున వారిది వారి కిచ్చివేయుదము. మామయ్య విన్నపక్షమున మిక్కిలి కోపపడి నిన్ను గొట్టఁగలడు. ఈ గడబిడ యెందుకు? ఉన్న దున్నట్టు చెప్పు. ఈ యూరి దయితే రాత్రివేళ గోడమీఁదనుంచి వారి దొడ్డిలో గిరవాటు వేయవచ్చును. పొరుగూరి దయితే మరియొకలాగు సర్దుకోవచ్చును!" అని మందలించుటయు నులకకుక్కిమీద బండుకొన్న గణపతి దిగ్గునలేచి కూర్చుండి, తల్లి కిట్లనియె అమ్మా! ఎందుకు నీకు భయము. ఇది యీ గ్రామములో నెవరిది గాదు. కోమటుల యింట వివాహమునకు నేను రాజమహేంద్రవరము వెళ్ళినప్పుడు నాయదృష్టవశమువల్ల నా కిది దొరికినది. దొంగతనము చేసినానో దొరతనమే చేసినానో సంపాదించినాను. కొడుకు గొప్ప ప్రయోజకుఁడయి ముద్దినుసు వస్తువులు సంపాదించుచున్నాఁ డని సంతోషింపక వెఱ్ఱిముండలాగు విచారించుచున్నా వెందుకు? అయినదానికి కానిదానికి విచారించిన దాని బ్రతుకు విచారపు బ్రతుకే యగును. ఈ గ్రామములోనే నే నెందుకును పనికి రాకున్నాను గాని రాజమహేంద్రవరంలో నేనంటే నెంతో గౌరవము. అక్కడివారు నన్ను నెత్తిమీఁద బెట్టుకున్నారు. ఏ దుకాణములోనికి నేను వెళ్ళినప్పటికి వర్తకులు బీరువాలు తెరచి మూటలు విప్పి ముద్దినుసు గుడ్డలు నాకు చూపించినారు. నన్ను దయచేయ మని మర్యాద చేసి దండము పెట్టినారు. నా కీ జోడు దొరికినది. దొరికినది దొంగవస్తువగునా? వీధిలో మనము నడచి వెళ్ళునపుడు మనకే వస్తువైన దొరకవచ్చును. అది మన దగునా కాదా? అలాగే నా కీ జోడు దొరికింది. ఒకరి చేతిలో నుండఁగా నేను లాగుకొనలేదు. ఒకరి పెట్టె బ్రద్దలు కొట్టి నేను దీసికొనలేదు. ఒకరి కాలి నుండి నె నూడఁదీయలేదు. నా పుణ్యమువలన నాకు దొరికినది. ఇదే దొంగతనమైతే మనము జేయుచున్న ప్రతిపనియు దొంగతనమే యగును. యజమానితోఁ జెప్పకుండ మనము దంతధావనము కొఱకు చెట్టునుండి యొక పండ్లుతోము పుడక విఱుచుకొందము. అది దొంగతనము గాదా? చెట్లనుండి పువ్వులు కాయలు కోసికొనుచున్నాము. అది దొంగతనము కాదా? కష్టపడి కన్నదూడలకు లేకుండ ఆవులను గట్టిపెట్టి పాలు పితుకుకొనుచున్నాము. ఇది దొంగతనముకాదా? దొంగతనముల మాట నాదగ్గఱ జెప్పకు. ఎవరి కేది ప్రాప్తమో ఆ వస్తువు వారిదగ్గర పడును. అది దొంగతన మనుట తెలివితక్కువ. ఇది నా కేలాగు వచ్చినదో రెండవ కంటివాఁడెఱుఁగఁడు. ఇందుకోసము బెంగపెట్టికొని నీవు చావనక్కఱలేదు! ప్రపంచ మంటే యేమిటో తెలియని యమాయకపు ముండవు. కనుక ఎఱ్ఱ తలపాగాల వారంటే నీకు భయం. నాకట్టి భయము లేదు. వాళ్లు నాదరికి వచ్చినారంటే తుపాకీ వేయించఁ గలను. రెండుకోట్లు నా కుండనీ; ఆ కోట్లు తొడిగికొని, గిరజాలు నున్నగా దువ్వుకొని, కుచ్చు తలపాగ జుట్టి, ముచ్చెలు దొడిగికొని, బెత్తము చేతఁబట్టుకొని, టక్కు టిక్కు టక్కు టిక్కు మని బయలుదేరి నానంటే ఎఱ్ఱ తలపాగాల వాళ్ళు,

నల్ల తలపాగాలవాళ్ళు, వీఁడెవఁడురా బాబూ! డిప్యూటీ కలెక్టరులాగున్నాఁడని తొకతెంచుకొని పోఁగలరు. నేనేమి? మునుపటి చచ్చు గణపతి ననుకొన్నావా యేమి? రాజమహేంద్రవరములో నెన్ని టస్సాలు నేర్చినా ననుకొన్నావు? ఎన్ని తమాషాలు నేర్చినా ననుకొన్నావు? గిరజా యెదిగినతరువాత, కోటు కుట్టించినతరువాత నాదర్జా యేమిటో మాకందఱకు తెలియఁగలదు. మానాయన సంపాదించిన బిందె యేదైన నున్న పక్షమున నాకియ్యి. అమ్మియో, తాకట్టు పెట్టియో రెండు కోటులు కుట్టించుకుందును. కోటు లేనివారి కీ కలియుగములో గౌరవమే లేదు. కొంప లేకపోయినను భయము లేదు. భూములు లేక పోయినను విచారము లేదు. ఉద్యోగము లేకపోయినను కొరతలేదు. కాని కోటు లేకపోతే యావత్తు వెలితియే! కోటు లేని వాఁడు చిల్లిగవ్వ చేయఁడు. రాజమహేంద్రవరములో నున్న మగవాళ్ళందఱు కోట్లు వేసికొన బట్టియే మిక్కిలి గౌరవము పొందుచున్నారు. రెండు కోట్లున్న పక్షమున నేనీ గ్రామములో శిఖామణినై యుండెదను. అప్పుడు నేను తగవులు దిద్దఁగల పెదమనిషినై యుందును. అప్పుడు అందఱు నా దర్శనమే చేయుదురు. నన్నే యాశ్రయింతురు. నన్నే పిలుతురు. నాకే దండములు పెట్టుదురు. పూర్వకాలములో జడలు ఉంచుకొన్న మునీశ్వరులకే గౌరవము. ఈ కాలములో గిరజాలు పెంచుకొన్న పడుచు వాండ్రకే గౌరవము. పూర్వకాలములో మంచి కాషాయి వసాల్త్రు కట్టుకొన్నవాళ్ళే పూజ్యులు. ఇప్పుడు కోట్లు తొడిగికొన్న వాళ్ళే పూజ్యులు. పూర్వకాలములో దండము చేతిలో దాల్చినవారికి మర్యాద. ఇప్పుడు బెత్తము చేతితో బట్టుకొన్న వారికి మర్యాద. పూర్వము పావుకోళ్ళుఁ దొడిగినవాళ్ళది గొప్ప. ఇప్పుడు ముచ్చెలు, చెడావులు దొడిగికొన్న వాళ్ళది గొప్ప. కాలము మారిపోయినది. గౌరవమునకు కావలసిన నాలుగు వస్తువులలో నేను మూడు సంపాదించుకొన్నాను. అవేవనగా గిరజాలు, ముచ్చెలు, చేతికఱ్ఱ. నాలుగవది కోటు అవి రెండుండుట మంచిది. అధమపక్ష మొకటియైన గుట్టించి తీరవలెను. మామయ్య చూడకుండ మన బిందె యీవల పడవేసినా నా గౌరవము కాపాడినదాన వగుదువు. తల్లంటె నీవే తల్లివి, ఈ యుపకారము చేసితివా వేయిజన్మలకైన నీ కడుపుననే పుట్టవలె నని కోరుదును. ఇప్పుడు మనకు బిందె యెందుకు? మామయ్యగారు వాడుకొనుచున్నారు. మన కవసర మున్నప్పుడు వారెందుకు వాడుకోవలెను? రెండు కోట్లు కుట్టించుకొని, నేను తగు మనుష్యుడనైన తరువాత కావలసినన్ని బిందెలు సంపాదింపఁగలను. బిందెలే కావు గంగాళములు, గాబులు సంపాదింపఁ గలను. గౌరవము కోటులో నున్నది. దేవుఁడు కోటుజేబులో కూర్చుండును. ఆడుదానవు, అందులో మాయామర్మ మెరుగని దానవు కనుక నీకు తెలియదు, కోటు సంగతి. మగవాడను, చదువు కొన్నవాఁడను, ప్రయోజకుడను గనుక నాకు తెలుసు దాని సంగతి. ఈ పట్టున కోటు పురాణము వ్రాయమంటె కావలసినంత గ్రంథము వ్రాయగలను." అంతరాయములేని ధోరణితో గణపతి యుపన్యాసము చేయుచుండ నల్లమందు పట్టిచ్చుటచే నామెకు కునికిపాటు వచ్చెను. అందుచే నామె జోగి జోగి మంచము మీఁదనుండి క్రిందబడెను."ఓసీ! నీవెర్రి తగులబెట్ట! కునికిపాట్లు పడుతున్నావటె? పూట పూటకు కుంకుడు కాయంత నల్లమందు వుండలు మ్రింగి చెడిపోయినావు, సరే; యిప్పుడు పడుకో; రేపటి దినము మాటాడ వచ్చును" అని గణపతి పండుకొనెను. తల్లి నిద్రాభారముచేత గన్నులు తెరువలేక ప్రక్కవైచికొనలేక వట్టి నేలనే పండుకొనెను. గణపతి నిద్రించి, బిందె తీసికొనిపోయి యమ్మినట్లు, రెండుకోట్లు కుట్టించుకున్నట్లు, తిన్నగా నుదుకనందుకుఁ జాకలి దానితోఁ గలహమాఁడినట్లు స్వప్నములు గాంచెను. మరునాఁ డుదయమున లేచి గణపతి బిందె యిమ్మని తల్లిని మిక్కిలి పీడించెను.

అమాయకురాలైన యా యిల్లాలు కొడుకు మాట లన్నియు వట్టి కొతలని తెలిసికొనలెక యివి సత్యములే యని నమ్మి బిందె దాకట్టు పెట్టియో, విక్రయించియో, రెండురూపాయలు తెచ్చి యిచ్చిన పక్షమున తన కుమారుఁడు మిక్కిలి గొప్పవాఁడై విశేషమగు ధన మార్జించి తన నుద్ధరించునని తలంచెను. అందుచేత బిందె కుదువ బెట్టవలెనని యామెకూడా సంకల్పించెను. కాని సోదరుఁడు, సోదరుని భార్యయు జూచుచుండగా నట్టిపని చేయుట కిష్టము లేదు. వారా పని సాగనియ్య రని యామె యెరుగును. అందుచేత నామె మరునాడు రాత్రి సోదరుఁడు నిద్రించిన తరువాఁత గడచిన రాత్రివలెనే కుమారుని ప్రక్కలోఁ గూర్చుండి యిట్లనియె. "నాయనా! బిందె తాకట్టుపెట్టుట నా కిష్టమెకాని నీ మేనత్తయు నీ మేనమామయుఁ జూచుచుండ నట్టి పని చేయుటకు నాకిష్టము లేదు. అందులో ముఖ్యముగ నీ మేనత్త నిన్ను జూచి నప్పుడెల్లఁ కన్నులలో నిప్పులు పోసికొనును. నీవు పచ్చగా నుండుట యామె కెంతమాత్ర మిష్టములేదు. నీవు గిరజాలు దువ్వుకొని కోటు దొడిగికొని యల్లారుముద్దుగా నుండుట దాని కిష్టములేదు. అది చూచుచుండగా బిందె తీసికొనుటకు వీలులేదు. బిందె చిల్లి పడినందున నీళ్ళుపోసుకొనుటకు వీలులేక సున్నిపిండి కుంకుడు కాయలు పోసుకొనుచున్నారు. అది నేను తీసికొంటినా నీ మామతోఁ జెప్పి తిట్టించును. ఆవిడ నాలుగు దినములలో పురిటినిమిత్తము పుట్టింటికి వెళ్లును. మీ మామ పొలము వెళ్లుచుండును. అప్పుడు మనకు స్వేచ్ఛగా నుండును. గనుక బిందె నేనే తాకట్టుబెట్టి సొమ్ము తెచ్చి యిచ్చెదను. అంత వఱకు నోపికపట్టుము. అనవుడు గణపతి కోపించి పండ్లుకొఱికి "బోడి పెత్తనములు వెధవ పెత్తనములు మన బిందె మనము తీసికొనుటకు వీలులేక వచ్చినది. ఈ కోట్లు కుట్టించుకొన్న తరువాత మన మొకరియండ నుండకుండ హాయిగా స్వేచ్ఛగ నుండవచ్చును. సరే! నీయిష్టము వచ్చిన ట్లామె పుట్టింటికి వెళ్ళిన తరువాత చేయవచ్చు" నని పండుకొనెను. నాఁడు మొదలుకొని గణపతి యెప్పుడు మేనమామభార్య పుట్టింటికి వెళ్ళు, నెప్పుడు బిందె కుదువఁబెట్టి తల్లి రూకలు తెచ్చి తనచేతఁ బడవేయు, నెప్పుడు కోట్లు తాను కుట్టించుకొనుట కనువుపడు నని నడుచు నప్పుడును స్నానము చేయునప్పుడు భోజనము సేయునప్పుడును జిత్తంబు దానియందె నిలిపి, కాముకుండు తన ప్రియురాలి యం దనురాగము నిలుపునట్లు, భక్తుడు తన యిష్టదైవము నందు మనంబు నిల్పునట్లు తదేక ధ్యానపరాయణుఁడై యుండెను. అంతలో సమీపగ్రామమున నొక బ్రాహ్మణుని తండ్రి మృతి నొందగా పదుకొండవ దినమునను బండ్రెండవ దినమునను గణపతి మిత్రులతో శ్రాద్ధభోక్తగా నియమింపఁబడెను. ఈ కాలమునందువలెఁ గాక యా కాలమున గావలసినంతమంది శ్రాద్ధభోక్తలు దొరకుచుండెడివారు. ఒకప్పుడు గావలసినవారికంటె నెక్కువ సంఖ్య లభించుటయుఁ గలదు. వారి కీయవలసిన దక్షిణ కూడ నిప్పటివలె నధికము కాక నాలుగణాలకు మించకుండెను. గణపతి తన మిత్రబృందముతో నచ్చటి కరిగి తన చెలిమికాండ్రను దనకు బరిచితులు గాని యితర గ్రామవాసు లగు భోక్తలను బిలిచి, స్నానపు నెపమున జెరువుగట్టునకుఁ దీసికొనిపోయి, రావిచెట్టు క్రిందఁ గూర్చుండబెట్టి పొగచుట్టలు గాల్చు నభ్యాసముగలవారి కందరకుఁ దలకొక చుట్ట నిచ్చి, తానొక చుట్ట వెలిగించి కాల్చుచు నీ క్రింది విధమున మాట్లాడెను.

"మీకందరకు నేనొక సలహా చెప్పదలఁచుకొన్నాను. అది మన కందరకు మిక్కిలి ఉపయోగకరమయినది. షోడశ బ్రాహ్మణార్థములు మన మందరము చేయుచున్నముకదా! కాబట్టి మన యవసరము బ్రాహ్మణుల కందరకున్నది. భోక్తలుగా మనము కూర్చున్నందుకు

మనకు వారు నాలుగణాలు రొక్కమో లెక యొక సైనుగుడ్డయో యిచ్చుచున్నారు. ఆ గుడ్డలు చిరకాలము మన్నవు. అవి ప్రేతకళ క్రక్కుచుండును. అవి కట్టుకొన్నవానికి మునుపున్న కళకాంతులు కూడ నశించును. మంచిగుడ్డలు వేసికొనవలె నని మనకుఁగూడ నుబలాట ముండునుగదా! అందుచేత మన మందర మొక కట్టుకట్టి భోక్తలకు సైనుపంచె లిచ్చుటకు మారుగా మంచి కోటుగుడ్డ లీయవలసినది; అలా గీయని పక్షమున మేము బ్రాహ్మణార్థములు చేయ మని స్పష్టముగా చెప్పవలసినది, మన మందఱ మొక్క మాటమీఁద నిలువబడిన పక్షమున మన కోరికె సిద్ధించును. కప్పల తక్కెడవలె నొకరితో నొకరు సంబంధము లేకున్న యెడల మనయందు గౌరవముండదు. ఒక్క మాటమీఁద నుంటిమా కర్మలు చేయువారు మన కాళ్ళ మీఁద బడుదురు. ఏమిటి మీ యభిప్రాయము? మీ కందఱకిష్టమా? అయిష్టమా? ఆ పలుకులు భోక్తలుగా వచ్చిన వారిలోఁ గొందరికి సంతోషకరములయ్యె. మంచి మంచి కోటులు దొడిగికొని తిరగవచ్చు నని వా రా సలహా బాగున్నదనిరి. కోటుగుడ్డ లెట్టివో యెఱుఁగనివారు కొందరందుండిరి. వారందరా సలహాకు సమ్మతింపక "ఛీ! కోటు గుడ్డ లేమిటి? పెద్దల నాఁటినుండి సైనుగుడ్డ లిచ్చుటే యాచారమైయున్నది. కోటుగుడ్డలిచ్చుట, పుచ్చుకొనుట గూడ మిక్కిలి యనాచారము. ఇది విన్నపక్షమున శంకరాచార్యులవారు మనల నందర వెలివేయుదురు. ఈ కట్టు కట్టితిమా దేశములో మన కుప్పెన బుట్టదు. కాఁబట్టి మీ జట్టులోకి మేము రాము" అని భిన్నాభిప్రాయు లయిరి. "ఇందు స్వాములవారు వెలి వేయుట కేమున్నది? మన మేమి యకార్యకరణము చేసినామని గణపతి పక్షమువారు రెండవ పక్షమువారి నడిగిరి. పాత పద్ధతులు విడిచి క్రొత్తపద్ధతు లవలంబించుటే తప్పు. శ్రాద్ధమున కోటుగుడ్డ లేమిటి? ఎవరయిన విన్నపక్షమున మొగము మీద నుమ్మి వేయుదురు రని వారు బదులు చెప్పిరి. మొగముమీఁద నుమ్మివేయుదు రన్నమాట గణపతికి, గణపతి పక్షము వారికి మహాగ్రహము కలిగించెను. తీవ్రములైన మాటలతో వారు కొంతసేపు యుద్ధము చేసిరి. ఆ మాటలు క్రమక్రముగ ముదిరెను. చేతులు కలసెను. కొందరు చేతులతో చెట్లకొమ్మలు బెడ్డలు పుచ్చుకొని కొట్టుకొనిరి. కొందరు జుట్టుపట్టుకొని నేలఁబడిరి. ఏడ్చువారు కొందరు, తిట్టువారు కొందరు, పాఱిపోవు వారు కొందరు మన గణపతికి కడపటి గుణములోఁ జేరెను. బెడ్డల దెబ్బలు తగిలి కొందరికి నెత్తురులు కారెను. అది నీళ్ళ రేవగుటచే నచటకు వచ్చిన స్త్రీలు స్నానము చేయవచ్చిన పురుషులు చుట్టుముట్టి వివాదకారణ మేమని యరసి, శ్రాద్ధములలో సైనుగుడ్డలకు మారు కోటు గుడ్డలు భోక్తలు పుచ్చుకోవలసిన దను విషయమును గూర్చి వివాదము పొడమి తుద కీ విధముగఁ బరిణమించిన దని విని, కడుపు చెక్కలగునట్లు నవ్విరి. భోక్తలుగా వచ్చినవా రిరువదిమంది. అందు బదునలువురు గణపతిపక్షమై యుండిరి. గణపతి పారిపోయి మరి యెక రేవున స్నానముచేసి తనపక్ష మున్నవారి కందఱకు వర్తమాన మంపి వారి కిట్లనియె. "ఒరే? మనకు వ్యతిరేకముగ నున్నవారికంటె మనమె యెక్కువమంది యున్నాము. మనము పట్టుపట్టితిమా యజమానుఁడు లొంగి తీరును. నేఁడు పదకొండో దినము. కాబట్టి పది యెనమండ్రుగురు బ్రాహ్మణులు కావలెను. మనము మానివేసితిమా సంఖ్య కుదురదు శ్రాద్ధము చెడును. అందుచేత మీరు మొత్తబడక నేను చెప్పినటులు చేయండి. సైనుగుడ్డలు వద్దోయి, కోటుగుడ్డలు కావలెనోయి యని నేను కనుసంజ్ఞ చేయగానే కేకలు వేయుఁడు. అప్పుడు చచ్చినట్లు మనము కోరిన దిచ్చితీరును. నవరాత్రములలో హాయిగా మంచికోటులు వేసికొని తిరుగవచ్చును. బ్రాహ్మణార్థము చేసినప్పటికి మనము కూడ శుభ్రమైన బట్టలు కట్టుకొని యుద్యోగస్తులవలె నుండవచ్చును. చూడండీ! నేను ముచ్చెలు

తొడిగికొని బ్రాహ్మణార్థమునకు వచ్చినాను. ఎవరి వృత్తి వారిది. కూటికి పెదల మైనామని గుడ్డకు పేదలము కానవసరము లేదు. మనదీ శరీరమే; మనకూ ముచ్చట లున్నవి. కాఁబట్టి మనము తప్పక కోటుగుడ్డలే కోరవలెను. జ్ఞాపకమున్నదా? మరిచిపోరుగదా?" అనవుడు వారందఱు 'మరిచిపోము; జ్ఞాపకమున్నది. మీరు చెప్పినట్లే యందు ' మని యరచిరి. వారి మాటల యందు నమ్మికలేక గణపతి వారందఱిచేత గాయత్రీసాక్షి యనియు, దైవసాక్షి యనియు, నిన్ను జంపుకొన్నట్లే, నీ పొగజూచి నట్లే, అమ్మతోడు, బాబుతోడని యొట్లు బెట్టించుకొనెను. పిమ్మట నందఱు స్నానముచేసి, శ్రాద్ధకర్త గృహమున కరిగిరి. ఈ లోపున రెండవపక్షమువారిలోఁ గొందఱు కర్తగృహమున కరిగి, గణపతి చెరువుగట్టు దగ్గఱ రావిచెట్టుక్రింద భోక్తలనందరఁ జేరదీసి కోటుగుడ్డల నడుగమని యుపన్యసించుటయు దాము భిన్నాభిప్రాయులై యతని యుపదేశంబుల నిరాకరించుటయుఁ మాటలాడుట క్రమక్రమముగా ముదిరి పోట్లాడుటగా మారుటయుఁ దమ సంఖ్య స్వల్పముగా నుండుటచే దాము దెబ్బలు తిని యోడిపోవుటయు మున్నగు వృత్తాంత మంతయు నాతని కెఱింగించి తమ గాయములం జూపిరి. శ్రాద్ధభోక్తలు కోటుగుడ్డలు కోరుట కలికాల మహిమ అనుకొని యాకర్త దానికిందగు బ్రతి విధానము మనసులో నాలోచించి సిద్ధముగా నుండెను. అంతలో గణపతి మిత్రబృందముతో వెళ్ళి, కూర్చుండెను. రెండుజాములైన తరువాత బ్రాహ్మణుల యధాస్థానములఁ గూర్చుండఁబెట్టి కర్త యర్చింపఁ దొడఁగెను. అర్చింపఁబడువారిలో మొట్ట మొదటివాఁడు గణపతి. పసుపు గణపతి యైనతోడనె నిజమైన గణపతిపూజ వచ్చెను. పసుపు గణపతివలె నేమిచ్చిన దానితోనే తృప్తినొందక మన గణపతి బొజ్జనిండఁ గోరికలు పెట్టుకొనియుండెను. భోక్తకు వస్త్ర మియ్యవలసిన సమయమున తడిసిన సైనుగుడ్డ తెచ్చి కర్త యియ్యవచ్చినపుడు 'నేనీ గుడ్డ పుచ్చుకోను. మంచి కోటుగుడ్డేదైన నాకియ్యవలెను. మరొకటి నేను పుచ్చుకొన' నని పలికెను. కర్త యప్పలుకులు విని మిక్కిలి యచ్చెరువడి గణపతి వంక తేరిచూచి "ఏమీ! కోటుగుడ్డలే కాని పుచ్చుకొనవా? కోటుగుడ్డ లిదివర కెన్నడయిన పుచ్చుకొంటివా? కలికాలముచేత నేటి కాలమున నీ వొకఁడవు కోర మొదలిడినావు. నీకీబుద్ధు లెవరు గరపినా" రని మందలించెను. అనవుడు గణపతి "అయ్యా! నే వొక్కఁడనే కాదు. మా వాళ్ళకందఱ కట్టి కోరికలే యున్నవి. అడిగి చూడండి." "ఓరీ! ఏమిరా, మీ కేమి కావలెనురా" యని యరచెను. అరచుటయు గణాధిపతిమాట ననుసరించి ప్రమధ గణమువలెఁ దక్కిన పదమువ్వురు నేకకంఠముగ "మాకు సైనుగుడ్డలు వద్దోయి! కోటుగుడ్డలు కావలెనోయి!" అని ఇంటిమీఁదియాకు లెగిరిపోవు నట్లరచిరి. అదియెల్ల గణపతి చెప్పిన పాఠమే యని కర్త నిశ్చయించి కార్యవాదమే గాని ఖడ్గవాదము కర్తవ్యము గాదని క్షణ మాలోచించి, శ్రాద్ధము చెడకుండునట్లు మనసులో నొక యుపాయము పన్నుకొని యిట్లనియె. "సరే మీ కందఱకు సైనుగుడ్డ లిష్టములేకపోయిన పక్షమున మీకేమి కావలయునో యవే తెచ్చియిచ్చెదను. కాని యా గుడ్డ లిప్పుడు మా గ్రామములో దొరుకవు. కాకినాడకైనను, రాజమహేంద్రవరమున కైనను మనుష్యు నొక్కని బంపి యా బట్టలు తెప్పించవలెను. రేపు సాయంకాలమున కెట్లో తెప్పించెదను. ప్రస్తుతము కథ కానియ్యండి. సైనుగుడ్డ లెవరి కిష్టమో వారే పుచ్చుకోవచ్చు," యని యనునయించెను. గణపతి ప్రశాంతుఁడయ్యెను. అతనితో శిష్యగణ మంతయుఁ బ్రసన్నమయ్యెను. ప్రతిపక్షులు సైనుగుడ్డలు స్వీకరించి సంతుష్టులైరి. గణపతియు శిష్యులును రెండు దినములు కూడ నేమియు స్వీకరింపక కోటుగుడ్డలకై నిరీక్షించుచుండిరి.

# పదునొకండవ ప్రకరణము

పదునొకండవ నాఁటి రాత్రి గ్రామచావడి యరుఁగు మీఁద గణపతి మిత్రబృంద సమేతుఁడై పండుకొని నెచ్చెలులతో నిట్లు ప్రసంగించెను.

"ఒరే! యజమానుఁడు కాశ్మీబేరమునకు వచ్చినాడు కాని యతఁ డేదో నాలుగు తుక్కుగుడ్డలు తెప్పించి యివే కోటుగుడ్డలు పుచ్చుకోండి యనునేమో అందుచేత మనము మంచి గుడ్డలు కోరుకోవలెను. ఏ రకము గుడ్డలు బాగుండునో మన మాలోచించుకొనవలెను. చలికాలములో తొడుగుకొనుటకు మంచి బనారసు గుడ్డలు కావలెనని కోరుకొందమా, లేకపోయిన మంచి పట్టుబట్టలు కోరుకొందమా? అతలష్ గుడ్డ లడుగుదమా? ఏ రంగు గుడ్డ లడుగుదము? చారల గుడ్డలున్నవి అందులో తెల్లచారలు నల్లచారలు పచ్చచారలు నెఱ్ఱచారలు గల గుడ్డలున్నవి. మనలో నెవరెవరి కేగుడలు బాగుండునో యవి కోరుకోవలెను. నా మట్టుకు నాకే గుడ్డ బాగుండునో మీరు చెప్పండి!" అనుటయు "ఒరే! గణపతి నీ కెఱ్ఱబనారసు గుడ్డ బాగుండునురా" యని యొకఁడు. "నల్లబనారసు బాగుండునురా, రంగు రంగులో కలిసిపోవు" నని యొకఁడు, "ఒరే చాఱల గుడ్డ బాగున్నదిరా, పెద్దపులిలాగ నుండగల" వని వేఱొకఁడు పలికెను. "ఛీ! మీ సలహాలు నాకు బాగులేవు. నేను పట్టుగుడ్డ కోటు కుట్టించుకొందును. వంగపండు చాయ పట్టుగుడ్డ మీఁద నా కెంత కాలము నుండియో మనసుగా నున్నది. ఆ" గుడ్డ నిమ్మని నేను కోరెదను. మీరేమందురు?" అని గణపతి వారి నడిగెను. "సరే! యదే కోరు" మని వారైక్యకంఠ్యముగఁ బలికిరి. ఎవరి గొంతెమ్మకోరికె వాఁడు కోరెను. మాట లాడుచుండఁగానే యొక్కొక్కరి కన్నులు మూతపడెను. అందఱు గుఱుపట్టి నిద్రించిరి. అందఱు తమ కిష్టములైన గుడ్డను కోట్లు కుట్టించుకుని ధరించుకొని తిరిగినట్లు స్వప్నములు గాంచిరి. తాను కుట్టించుకున్న వంగపండు చాయకోటు తన స్నేహితులలో నొకఁ డెరువు పుచ్చుకున్నట్లు, మరల దానిం దెచ్చి యీయక యపహరించినట్లు గణపతి కలగని, కోపముతో కలలోనే స్నేహితునిమీఁద చేయి విసరెను. కోటు నపహరించుట కలలోని వార్తయైనను చేయి విసరుట వలన దన ప్రక్కనె నిద్రించుచున్న మిత్రునకు మాత్రము చెంపకాయ గట్టిగాఁ దగిలెను. దానితో నతఁ డులికిపడి లేచి "యెవఁడురా నన్ను కొట్టినాఁ" డని బిగ్గరరా నఱచుచు నల్లరి జేసెను. గణపతికి మెలఁకువ రాలేదు. తక్కినవాఱందరు లేచిరి. మేలుకొన్న వారందఱు ప్రయత్నముమీఁద గణపతిని మేల్కొల్ప నతఁడు తాను నిద్రలో సల్పిన దుండగ మెఱుగక నతనికిఁ దగిలిన దెబ్బకుఁ గారణ మేమి యని పలువిధముల విచారించి యెట్టకేల కిట్లనియె. "ఒరే! అప్పుడప్పుడు దయ్యములు వచ్చి మనుష్యులు నిదురపోవు చున్నప్పుడు బాధపెట్టుచుండును. ఒకప్పుడు రాత్రులు మనము పండుకొనఁ బోవునప్పటి కేమియు లేక తెల్లవారు నప్పటికి శరీరము మీఁద రక్కులు గీరులు గనఁబడును. ఒకప్పుడు తెల్లవారు నప్ప" టికి మన చేతులు వాచును. నిద్రలో నన్నెవరు బరికినారు? ఎవరు రక్కినారు? ఎవరు విరిచినారు? దయ్యమువచ్చి యాపనులు చేయుచుండును. నిన్ను కూడ దయ్యమే కొట్టియుండును. దయ్యమని భయపడవలసిన పనిలేదు. ఇవి ప్రతిదినము జరుగుచున్న ముచ్చటలే. అవి కొంటెతనము కోస మిటువంటి పనులు జేయును గాని హాని చేయుటకుఁ గాదు. చిన్నపిల్ల లెవరైన మనకు ముద్దుగాఁ గనబడి నప్పుడు

మనము వాళ్ళ బుగ్గ గిల్లియో చిన్న చెంపకాయ గొట్టియో చెతిలొ నున్న వస్తువు లాగికొనియో వారిని మన మేడిపించుచుందుము కదా! తమాషాకే మన మాపని జేయు చుందుము గాని బిడల నేడిపించుట కని యుద్దేశ మున్నదా? అలాగే దయ్యములు గూడ మంచి యుదేశముతోఁ జమత్కారము కోస మిటువంటి పనులు చేయును. కాబట్టి భయపడ నక్కఱలేదు." ఆ యుపన్యాసము విని దెబ్బ తిన్నయతఁడు సంతుష్టుఁ డయ్యెను. అప్పుడు తెల్లవారు జామగుటచే మేలుకొన్న వారిలో గణపతి దక్క తక్కినవారు మరల నిద్రింపరైరి. అంతలో నాల్గవ జాము కోడి కూసెను. కొంత సేపటికిఁ దెల్లవాఱెను. కాలకృత్యములు దీర్చికొని గణపతి సపరివారముగ యజమానుని కడకుఁబోయి "అయ్యా ! కోటు గుడ్డలలో మీ ఇష్టము వచ్చినవి దెప్పించుటకు వీలులేదు. మేము మా కోరికలు చెప్పెదము. ఆ ప్రకారము దెప్పింపవలెను. నాకు వంగపండు చాయ పట్టుబట్ట కావలెను. తక్కిన వాండ్రు తమకు గావల సిన గుడ్డలు తామే చెప్పుదు రడుగండి!" యని చెప్పెను. యజమానుఁడు ముందు మాట లాడక యప్పలుకులు విని గణపతి వంక తేఱిచూచి "సరే! మీమీ కోరికల ప్రకారమె చేసెదను లెండి" యని బదులు చెప్పెను. తక్కిన వాండ్రుఁ గూఁడ దమ మనోరథములు దెలిపిరి. అనంతరము గణపతి వారి నందఱను వెంటఁబెట్టుకుని చెఱువునకుఁ బోయి స్నానముచేసి వచ్చెను. ఆ దిన మేడుగురు భోక్తలే కావలసినను యజమానుఁ డందఱు భోక్తల కన్నము బెట్టి సంతుష్టులఁ జేసెను.

భోజనానంతరమున మాకు సెలవు దయ చేయుఁ డని గణపతి ప్రముఖులు యజమాను నడిగిరి. "మీరు కోరిన బహుమానము లీ రాత్రి దెప్పించుచున్నాను. రేపుదయమున మీరు వెళ్ళవచ్చు" నని యజమానుఁడు బదులు చెప్పెను. సంతుష్టహృదయులై వారంద ఱచ్చట నా రాత్రి నిలువఁదలఁచిరి. గణపతి యాకారముచేత గాకపోయినను గొప్ప యాకలిచేతనైన వృకోదరుం డగుటచే నతనికి నా రెండు దినములలో రాత్రి మిక్కిలి యాఁకలిబాధ కలిగెను. ఉదయమున జల్ది కూడు లేకపోటొకటి, రాత్రి మజ్జిగన్నమైన దొరకక పోవుట యొకటి ఈ రెండు లోపముల చేత నతఁడు మధ్యాహ్నమునఁ గుడుముల తోడను సుష్టుగా భుజించినను రాత్రి పేరాకలికి నకనకబడి, తెల్లవారు నప్పటికి వాడి వత్తియయ్యెను. పండ్రెండవ నాఁటి రాత్రి క్షుధానలము యొక్క దండయాత్ర కాతని గర్భకోశ మాగజాలక పోయెను. అందుచే నతఁ డుదరశాంతికై ప్రయత్నములు చేయఁజొచ్చెను. ఒక నిముస మాలోచించి నప్పటి కుపాయము దోఁచెను. ఆ గ్రామమున నతని తల్లికి దూరపు జుట్టమైన యొక ముసలమ్మ యుండవలెనని యతనికి జ్ఞప్తి వచ్చెను. రాఁగానె తన మిత్రబృందమును విడిచి యా యవ్వ బస యెక్కడని గ్రామమున భోగట్టచేసి తెలిసికొని, యామె యింటికిఁ బోయి పలుకరించి తన్నెఱిఁగించుకొనెను. ఆ యవ్వయు నతనిని గౌరవించి వచ్చిన పని యడిగి, యతఁడు భోక్తగా వచ్చిన వాఁడని యతని నోటనే విని, బ్రాహ్మణార్థపు మైల సోకినందున దూరముగాఁ గూర్చుండు మని నాలుగు మాటలాడి 'నాయనా! పొయ్యిమీఁద రొట్టె వైచినాను. మాడిపోవుచున్న దేమో' యని లోపలికి బోయెను. గణపతి పడమటింటి గుమ్మము ముందరే గూర్చుండెను. రొట్టె కాలిన తరువాత ముసలమ్మ పడమటి యింట హద్దు గోడవద్ద రొట్టెతో నున్న బూరెల మూఁకుడు పెట్టి, బిందెడు నీళ్ళు తోడి తెచ్చుకొనుటకు దొడ్డిలోని నూతి కడకుఁ బోయెను. ఆ బూరెలమూకుఁడు చూచినది మొదలు కొని గణపతి కన్ను లా రొట్టెమీఁదనే యుండెను. నూరూరఁ జొచ్చెను. ఎంత కాలమునుండియో తినుట కేమియు లేక మలమల మాడుచున్న వానివలె నతఁడెట్లయిన దానిని గ్రహించి తిని ప్రాణము నిలుపుకొన సంకల్పించెను. పొట్ట యుపాయముల పుట్ట యగుటచే

నాలశ్యము లెకయె యతని కుపాయము దోఁచెను. కుక్క యచ్చటికి రాకపోయినను గణపతియె తత్కాలమున శునకరూపమెత్త మూఁకుడు జరజర లాగి "ఛీఛీఛీ! లేలే కఱ్ఱదే!" యని కేకలు వైచెను. ముసలమ్మ బిందె యెత్తుకుని వచ్చు చుండఁగా నీ మాట లామె చెవిని బడెను. పడుటయు విసవిస నడిచి "నాయనా! కుక్క వచ్చినదా యేమిటి? దానితల బ్రద్దలైపోను. ఆ నల్లకుక్క నా నెత్తురు పీల్చివైచుచున్నది. కొంపత్రవ్వి రొట్టె ముట్టుకోలేదుగదా" యని బిందె దింపెను. అనవుడు గణపతి యిట్లనియె. "అయ్యో! అవ్వా! నేను పరధ్యానముగా నటువైపు తిరిగి కూర్చుండఁగా మూఁకుడు జరజరలాగినట్లు చప్పుడైనది. ఇట్టె తిరిగిచూడఁగా నల్లకుక్క లాగున్నది. వెంటనే దానిని కొట్టితిని. ఈ దారినే పాఱిపోయినది. పెద్ద గుఱ్ఱములా గున్నది. పాపము సిద్ధముగా నున్న రొట్టె పోయినది. నూతికి వెళ్ళినప్పుడు కుక్క బాధ యున్నది. జాగ్రత్తగాఁ జూచు చుండు మని చెప్పినావు కావు. పాపము! నీ వీరాత్రి యూరక పండుకోవలెను గాఁబోలు! కొంచె మటుకులైన నానవైచికొని తిను." అనుచుండ నా ముసలమ్మ ఇట్లనియె. "నాయనా ! అటుకులున్నవి. చిటికలో నానవైచికొని తినగలను. కాని రొట్టె పోయినందు కే విచారము లేదు. ఇప్పుడీ కుక్క యెంగిలి ముట్టుకొని స్నానము చేయలేను. పెద్దదానను, కొంచెము జబ్బుగా నున్నది. ఎలాగా యని యాలోచించు చున్నాను." అనవుడు గణపతి చివాలున లేచి "అవ్వా! నేను పరాయి వాడనా? నేను నీమనుమఁడనె యనుకో! నేను మైల భోజనము చేసినాను గనుక రేపుదయమున స్నానము చేయవలెను. ఈ రాత్రి నాకు భోజనము లేదు. ఈ బూరెల మూఁకుడు చెఱువు గట్టునకు దీసికొనిపోయి రొట్టె యే కాపుల కుఱ్ఱవానికో బెట్టి మరల మూకుఁడు దెచ్చి నీకప్పగించి యీ స్థల మలికి వెళ్ళెదను" అని యామె మైలపడకుండునట్టి యుపాయము జెప్పెను. రొట్టె పోయినందుకు ఆమె విచారింపక కుక్కయెంగిలి ముట్టుకొనకుండఁ దనపాలిటి దైవమువలె గణపతి వచ్చి తనకు సహాయము చేసి నందుకు సంతసించి "నాయనా ! ఈ పని నేనే నీకు జెప్పుటకు సందేహించి యూరకుంటిని. కావలసిన వాఁడవు గనుక మనస్సులో నెరమరిక లేక యీ పని కొప్పుకొంటివి. ముసలమ్మ మీఁద నెంతో యభిమానముతో ఎక్క డున్నానోయని వెదకికొనివచ్చి నాకీ పూట సాయము జేసితివి. రేపు శుద్ధిస్నానము చేసి మా యింట పట్టెడు మెతుకు దిని వెళ్ళు, నాయనా! " యనెను. "రేపు గ్రామములో నున్న పక్షమున నాలాగే చేసెదనులే, ఇదిగో బూరెల మూకుడు తీసికొనిపోవుచున్నాను. వెంటనే వచ్చెద" నని చెప్పి యాబూరెల మూఁకుడు చెఱువుగట్టుకుఁ దీసికొని పోయి పాలు గోరుచున్న మిత్రుల కీమాట చెప్పక రావిచెట్టుక్రింద బెట్టుకొని రొట్టె రవంతయు మిగులకుండ దిని నీళ్ళుద్రాగి గఱ్ఱున త్రేన్చి, యా మూకుఁడు తానే తోమి కడిగి యవ్వ కప్పగించి కుక్క ముట్టుకొన్న చోట గోమయముతో నలికి శుద్ధిచేసి ముసలమ్మను వీడ్కొని వెన్నెల రాత్రియగుటచేతను రెండు గడియల ప్రొద్దు కంటె నెక్కుడు కాకపోవుట చేతను నిర్భయముగా మిత్రులున్న చోటికి వెళ్ళి పండుకొనియెను.

మరునాడు తెలతెల వాఱుచుండగా భోక్తలు పండుకొన్న చోటి కొక బ్రాహ్మణుఁడు వచ్చి గణపతిని లేపి యజమానుఁడు పిలుచు చున్నాడని చెప్పెను. గణపతి కన్నులు నులుము కొనుచు లేచి తన మిత్రులం జూచి "ఓరీ! కోటుగుడ్డలు వచ్చినవి కాఁబోలు, అందుకే నా నిమిత్తమై యాయన వర్తమానమంపించినారు. నేను వెళ్ళి యిప్పుడే వచ్చెదను. మీరిక్కడుండుడి" యని చెప్పి యాతనివెంట నడచుచు "ఏమయ్యా ! ఎందుకు నాకోసము వర్తమాన మంపించినారు? గుడ్డలు తెప్పించినారా యేమిటి? మంచివేనా గుడ్డలు? చాఱల గుడ్డలు వచ్చినవా? చాలా త్వరగా

దెచ్చినారె, గుడ్డలు!" అని గుడ్డల విషయమై తనకుగల యాత్రము దెలుపఁ జొచ్చెను. తోడుకొని పోవుచున్న బ్రాహ్మణుడు వాని మాటలు విని తనలోఁ దాను నవ్వుకొనుచు "ఎందుకు వర్తమాన మంపించినారో నేనెఱుంగను. మంచి మంచి గుడ్డలు వచ్చినవని చెప్పుకొన్నారు. అందులో మీకు మిక్కిలి ప్రశస్తమైన బహుమానము చేయదలంచు కొన్నారని విన్నాను!" అని చమత్కారముగాఁ బ్రత్యుత్తరము జెప్పెను. అప్పుడు గణపతి మన సెట్లున్నదో వర్ణింపఁ దరమా? యజమానుఁడు తాను కోరిన గుడ్డ లిచ్చినట్లు తానది జంగము చేతి కిచ్చి కుట్టించుకొన్నట్లు, తొడుగు కొన్నట్లు, షికారు చేసినట్లు గూడ నతని కప్పుడే తోఁచెను. ఏ జంగము చేతి కిచ్చి కోటు కుట్టింతునా? యని యాలోచింపఁ దొడంగెను. స్వగ్రామమందున్న కుట్టుపనివాండ్రు పల్లెటూరి వాండ్రగుటచే కత్తిరింపులు సరిగా జేయ లేరనియు, గుట్టు నాజూకుగా నుండదనియు దలచి యాగుడ్డ బట్టుకొని రాజమహేంద్రవరము వెళ్ళి యచ్చట మిక్కిలి సొగసుగాఁ గుట్టు జంగము చేతికిచ్చి కుట్టించుట మంచిదని నిశ్చయించుకొనెను. తక్కిన శ్రాద్ధభోక్తలవలెఁ దాను సైనుగుడ్డ పుచ్చుకొనక తోడి బ్రహ్మచారులచేత గట్టికట్టుకట్టించి తన కోరికె ప్రకారము కోటుగుడ్డలే పుచ్చుకొన గలిగినందుకుఁ దన పంతము నెగ్గించు కొన్నందుకు మిక్కిలి సంతోషించుచు గణపతి యతని వెంటఁ బోయెను. ఆ బ్రాహ్మణుఁ డతనిని యజమానుని యింటిలో మిక్కిలి లోపలి గదిలోనికిఁ దీసికొనిపోయెను. యజమానుఁడు మంచముమీఁద గూర్చుండెను. ఆయన యొద్ద మెరియలవంటి వంటబ్రాహ్మణు లిద్దఱు నిలిచియుండిరి. గణపతి రాఁగానే యజమానుఁ డతనిని జూచి "ఏమయ్యా! కోటుగుడ్డలు రాలేదు. సైనుగుడ్డలు తీసుకొందువా లేదా!" యని యడిగెను. "నాకు సైనుగుడ్డ లక్కఱలే" దని కోపమును గ్రక్కు మొగముతో నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "అట్లైన నీవిప్పుడేమి చేసెదవు? చేతులు నలుపు కొనుచు వెళ్ళిపో" యని యజమానుఁడు పలికెను. "అబ్బ ! చేతులు నలుపుకొనుచు వెళ్ళిపోవలెనే? ఈ మాత్రపు దానికి మమ్మెందు కాపవలెను! తప్పక యిచ్చెద నని శ్రాద్ధము సరిగా జరిపించుకొని, యేఱుదాటి తెప్ప తగుల వైచిన ట్లవసరము తీరిన పిదప చేతులు నలుపుకొనుచు వెళ్ళు మందురా? సరే! ఈ మాటు అవసరము దాటినదిగదా యని మీరు సంతోషించు చున్నారు గాబోలు ! ఇంతటితో నైపోయినదా? ఈ వేళ కాకపోతే రేపైనా తిరిగి అవసరము రాదా? మీరు చావరా? మీ బందుగులు చావరా? అప్పుడు భోక్తలతో నవసరముండదా? అప్పుడే మీ పని చెప్పగలను. తొందర పడకండి. ఇల్లలకగానే పండుగ కాలేదు. తొందర పడకండి! తద్దినపు మంత్రము జెప్పెడు వాండ్రతోను భోక్తలతోను అవసరము లేనివాఁడు లోకములో లేఁడుగదా!" యని గణపతి క్రోధావేశంబున నౌచిత్య మెఱుఁగక నోటికి వచ్చినట్లు బ్రసంగించెను. యజమానుని మనసులో నదివఱకే రవులుచున్న కోపాగ్ని నా పలుకులు మండించెను. కోపాగ్ని ప్రజ్వరిల్లుటయు యజమానుఁడును "ఊరకున్నా రేమిరా?" యని ప్రక్క నిలిచిన వంట వాండ్రతో ననియెను. అనుటయు నా వంటవాం డ్రిరువురును గణపతిని బట్టి కొల్లాయి గుడ్డతో నతనిని పందిరిపట్టె మంచపు కోటికిఁ గట్టి వైచిరి. యజమానుఁడు క్రొత్తగా చెట్టునుండి కోసి తెచ్చిన పొడువాటి యీత జువ్వ తీసికొని "భడవా? తుంతరి వెధవా! శ్రాద్ధబ్రాహ్మణార్థములు చేసి పదిమంది నాశ్రయించి" బ్రదుకవలసిన కుంకవు! నాలుగు కొల్లాయి గుడ్డలు కట్టుకొని కాలక్షేపము చేయవలసిన చచ్చుపీనుఁగవు! నీకు కోటులు నీటులు కావలెనా ! పోకిరీవేషములు వేయఁదలఁచి, భోక్తగాఁ గూర్చుండి యర్చించిన తరువాత గొంతెమ్మ కోరికలు గోరి శ్రాద్ధము భంగము చేయుదువా? ముందెన్నఁడయిన నిటువంటి పనులు చేయవు గదా?" యని యా జువ్వతో వీపుమీఁద రెండు దెబ్బలు కొట్టెను. పాపము, గణపతి 'స్థానబలిమి గాని తన బలిమి

గాదయా విశ్వదాభిరామ వినురవేమ' యనినట్లు పూర్వకు బింకమంతయు వదలి "బాబొయి! బాబోయి! ఇకముం దెన్నఁడు చేయనండి ! రక్షించండి ! బుద్ధితక్కు వొచ్చింది, నా వల్ల !" యని యేడ్చుచు వేడుకొనెను. బ్రాహ్మణుని – అందులోఁ దన యింటికి శ్రాద్ధ భోక్తగా వచ్చియున్నవాని – నంతకంటె నెక్కువగా శిక్షింపఁగూడదని యా రెండు దెబ్బలతోనె శిక్ష చాలించి, కట్టు విప్పించి యిట్లనియె. "జాగ్రత్త ! బుద్ధిగల్గి బ్రతుకు. మన దేశములో బ్రాహ్మణులంటే మిక్కిలి భక్తి గనుక బ్రాహ్మణుఁడేమిచేసినను జెల్లు నసుకొంటివి కాబోలు. భోజనము దగ్గఱ నీ వాగడము చేయుటయే గాక మీరు చావరా, మీ బందుగులు చావరా యని మొదలు పెట్టితివి. ఈ లాగున మఱియొకసారి ప్రేలితివా త్రవ్వి పాతిపెట్టించెదను. చర్మము నొలిపించెదను. నీ ఋణము నే నుంచుకొన దలఁపలేదు. ఒక్కొక్క భోక్తకు రెండేసి సైనుగుడ్డలు మేమీయఁ దలఁచుకొన్నాము. నీకు నీ జట్టుపిల్లలకు రావలసిన సైనుగుడ్డ లివిగో ! ఇవి మూటగట్టుకొని తీసికొనిపోయి వారి కిచ్చి తిన్నగా నీ దారినపో !" యని గుడ్డలమూట జూపెను. గణపతి కిక్కురుమనకుండ నెంతో బుద్ధిమంతుఁడై యా మూట పట్టుకొని కన్నుల నీరచ్చటనె తుడిచి కొని తన మిత్రు లున్న చోటి కరిగెను. గణపతి మిక్కిలి సొగసైన గుడ్డలు తెచ్చునని వాటిని జూడవలయునని మిత్రు లెంతో ముచ్చటపడుచు వాని యాగమనమునకు నిరీక్షించు చుండిరి. అంతలో గణపతి గుడ్డలమూట తీసికొని వెళ్ళుటయు మూటలో నున్నవి ముద్దినుసు కోటుగుడ్డ లనుకొని పండ్లగంప చుట్టు పిల్లలు మూగినట్లు వా రాతని చుట్టు మూగి, మూట క్రిందకి లాగి విప్పి చూచి విస్మితులై "ఇదేమిరా ! గణపతీ ! చిట్టచివరకు సైనుగుడ్డలే పట్టుకొని వచ్చినావు. వ్రతము చెడినను ఫలము దక్కవలయును గదా! మనము రెండు విధముల భ్రష్టులమైతిమి. నలుగురితో మనకుగూడ నీ గుడ్డలే యిచ్చినప్పుడు పుచ్చుకొనక తెగనీల్గితిమి. కోటుగుడ్డలు కావలెనని గోల చేసితిమి. ఇప్పు డా సైనుగుడ్డలే రహస్యముగాఁ బుచ్చుకొనుచుంటిమి. మాచేత నీవు కట్టుగట్టించి మమ్మల్లరిపాలు చేయుటకా, యీగొడవ. నిన్ను నమ్ముకొనుట కుక్కతోక పట్టుకొని గోదావరీదుట! ఇటు వంటి పని యేల చేసితివి? ఈ గుడ్డలు పుచ్చుకొమ్మని నీతో మేము చెప్పితిమా? మా యిష్టములేకుండ నీ వేల తేవలెను" అని యిష్టము వచ్చిన ట్లతనిని మందలించిరి. కారణ మేదో చెప్పకపోయిన పక్ష మున వారు సంతుష్టిచెందరు. గావున గణపతి నిమిష మాలోచించి వారి మనస్సులు తృప్తి పొందించుటకై యిట్లు చెప్పెను. "ఓరీ ! వెఱ్ఱికుంకలారా ! దండుగు బేరములో దిగుటకు నే నంత పిచ్చివాఁడనా? దీని కొక కారణమున్నది. చెప్పెద వినుండు. పాప మా యజమానుడు మిక్కిలి మంచివాడు. కాని డబ్బులేదట ! యింటి డాబు, వాకిలి డాబే గాని–డబ్బు లేదట. సంసారము మేడిపండు వాటముగా నున్నదట! ఆయన నన్ను రప్పించిన పని యేమను కొన్నారు? పాపము! సంపన్నగృహస్థుడు నన్ను బిలిపించి నా రెండు చేతులు బట్టుకొని 'నాయనా గణపతీ! ఇవి చేతులు గావు కాళ్ళుసుమీ, నా పరువు కాపాడవలెను. నేను వట్టి వ్యర్థుఁడను. ఋణములబాలై యున్నాను. ప్రస్తుతము కోటుగుడ్డలు నీకియ్యలేను. ఇప్పటి కీ సైను గుడ్డలు పుచ్చుకొని సంతోషించవలసినది. మీస్నేహితులు నీవు చెప్పినట్లు నడుచుకొందురు. నీ కున్న పలుకుబడి నిజముగా మహారాజునకైన లేదు. నీ స్నేహితులతో మాట్లాడి వారి నొడఁబరచి నన్నొకదరికి జేర్చవలె' నని వేడుకొన్నాఁడురా! అంతవాఁడు నాచేతులు పట్టుకొని ఎంతో వినయముతో వేడుఁకోగానే నా మనసు కరిగిపోయినది. నేను రెండవమాట చెప్పలేకపోయినాను. మీ చేత తిట్లు పడినను సరే కాని యాయన కోరిక ప్రకారము చేయవలెనని యీ మూట పట్టుకొని వచ్చినాను. మీయిష్టము వచ్చినట్లు చేయండి. మీరు తిట్టినను సరే, కొట్టి నను సరే నాకిష్టమే. నేను

స్వలాభము చూచుకొనలెదు. ఆబ్రాహ్మణున కుపకారము చెయవలయునని యిట్లు చెసినాను.''
అని సత్యమును గప్పిపుచ్చి, తన పరాభవము వారికిఁ దెలియకుండ మాటువేసి యిచ్చవచ్చిన తెఱగున దంభములు కొట్టెను. వారు యథార్థస్థితి నెఱుఁగరు. కావున నిది సత్యమని నమ్మిరి. అంత దీనముగా బ్రతిమాలుకొన్నప్పుడు మన మొప్పుకోవలసినదే యని కొందరనిరి. అంత చేతగానివాఁడు మొదట మనము కోరిన కోర్కెల దీర్చెదనని యేల ప్రజ్ఞలు కొట్టవలెనని కొందఱనిరి. శ్రాద్ధము చెడిపోవునని యాప్రకారము చేసెనని మరికొంద ఱనిరి. "ఇంతకు మన యదృష్టములు బాగుగ లేవు. మనము కోటు తొడిగికొనునట్టి యోగము మనకుఁ బట్టలేదు. మన మొగముల కటువంటి భాగ్యము గూడనా!" యని యొకఁడనెను. "తొందరపడకండి ! ఆ భాగ్యము నేడు పట్టకపోయిన మఱియొకనాఁడు పట్టదా?" యని గణపతి పలికెను.

# 2 వ భాగము

## పన్నెండవ ప్రకరణము

గణపతి మేనమామభార్య గర్భముఁ దాల్చెను. ఆమెకు నెల మసలినది మొదలుకొని గణపతి తల్లికి మనస్సులో నెన్నెన్నో కోరికె లుదయించెను. ఆమె కడుపున నాఁడుపిల్ల పుట్టవలయునని యామె యిష్టదైవముల వేయివిధముల వేఁడుకొనుచుండెను. ఇల్లు వాకిలి లేక మడులు మాన్యములు లేక విద్యాబుద్ధులు లేక రూపము లేక యున్న తన కుమారునకుఁ బిల్ల నిచ్చి వాని నొక ఇంటివానిని జేయుటకు లోకములో మేనమామ తప్ప మఱి యెవ్వరు లేరని యామె యూహించి, స్వలాభ పరాయణయై యట్టి కోరికలఁ గోరఁజొచ్చెను. ఆమె మనోబల మెట్టిదో కాని యామె కాఁడుబిడ్డయే కలిగెను. బిడ్డ పుట్టగానే నాకు కోడలు పుట్టినది, కోడలు పుట్టినది, యని యామె యరచి యానందాతిశయమున గంతులు వైచెను. పురిటాలిం జూడవచ్చిన యమ్మలక్క లందఱు గణపతికిఁ బెండ్లాము పుట్టిన దని సంతోషించిరి. ఆ మాట చెవిన బడినప్పుడెల్ల గణపతి మేనత్త మొగము చిట్లించుకొని "అయ్యో! నా కూఁతురు నీ నిర్భాగ్యునకాయిచ్చి పెండ్లి జేయునది" యని తనలో ననుకొను చుండును. పురుడు సుఖముగా వెళ్లిపోయెను. గణపతి తల్లికి సోదరుని భార్యమీఁదను నామె బిడ్డల మీఁదను మునుపెన్నఁడు లేని మహానురాగము నెలకొనెను. బాలెంతరాలిని మంచముమీఁదనుండి దిగనీయక పథ్యపానములు జాగ్రత్తతోఁ జేసి పెట్టుచు, బిడ్డకు నీళ్ళు పోయుట మొదలగు నంగరక్షలు తానే స్వయముగాఁ జేయుచుండును. బిడ్డ కారు మాసములు గడిచెను. అన్నప్రాశన మయ్యెను. విద్దెములు చేయఁజొచ్చెను. అత్త తాత యను మాటలు వచ్చెను. తనకు భార్య జనియించిన దన్న సంతోషము మనంబున గలుగుచుండినను గణపతి కిప్పుడొక క్రొత్త చిక్కు సంభవించెను. అతఁడు సంగడికాండ్రతో యథేచ్ఛగఁ దిరుగకుండఁ దఱచుగాఁ దన తల్లికి మేనత్తకుఁ బనితొందరలు గలిగినప్పుడు బిడ్డ నెత్తుకొని యాడించవలసిన పను లతనిమీఁదఁ బడెను. ఇది యతని కెంతో విసుగు బుట్టించు పని యయ్యెను. బాలికను వివాహ మాడవలె నను సంకల్పము గణపతికిఁ గలదు గాని యామె నెత్తుకొని యాడించి తన పనులను జెఱుపుకొనుట కెంతమాత్ర మిష్టము లేక పోయెను. ఎంతెంత యుద్యోగములు చేయువారికైనను దీరిక లుండును గాని యే ఉద్యోగము లేక గణపతికి నిమేష కాలమైనను దీరిక లేదు. ఒకవేళ నింటికడ నతఁ డుండవలసి వచ్చెనేని నట్టి కాలము వ్యర్థము కాకుండ నతఁడు గాఢనిద్ర పోవుచుండును. ఈ బిడ్డవలన నతనికి నిద్రాభంగము మొదలగునవి గలుగజొచ్చెను. అవి యతఁడు సహింపలేక యా విషయమై గట్టిగ నాలోచించి యొక యుపాయము పన్నెను. బిడ్డ నెత్తుకొమ్మని మేనత్త గాని మేనమామ గాని తనచేతి కిచ్చి వెళ్ళగానే యొక నిముస మెత్తికొన్నట్లేయుండి మెల్ల మెల్లఁగా గిల్లనారంభించెను. గిల్లిన తోడనే బాలిక గ్రుక్కవెట్టి యేడ్చుట సహజము కదా! అంత గ్రుక్కబెట్టి యేల యేడ్చుచున్న దని మేనత్తయో మేనమామయో పరుగెత్తుకొని వచ్చి యడిగినప్పుడు గణపతి నవ్వుచు "నేనేమి చేయగలను? అది నాదగఱ నుండదు. నా మొగము చూడగానే యేడ్చు"నని యుత్తరము చెప్పుచుండును. నోరులేని పిల్ల కావునఁ దన కతనివల్లనే బాధ కలిగిన దని యా శిశువు

చెప్పఁజాల నందున గణపతి యాతంత్రము కార్యసాధనమని పలుమాఱుఁ బ్రయోగింపఁ జొచ్చెను. ఈ ప్రయోగము వలన బాలిక గణపతిని జూడఁగానే పెదపెట్టున నేడ్వ నారంభించెను. "చూచినారా! అది నన్ను జూడగానే యేడ్చుచున్నది. నా మాట మీరు నమ్మరు!" అని గణపతి మేనమామతో మేనత్తతో ననుచుండును. ఒకటి రెండు సారులు బాలిక మేనెఱ్ఱగాఁ గందియుండుటఁ జూచి మేనత్త "ఏమోయీ గణపతీ! దీని కాలిమీఁద నెఱ్ఱగా కందిన దేమి? వీపుమీఁద నెత్తురు గ్రమ్మినట్లున్న దేమి?" యని యడిగెను. "కండచీమలు కుట్టినవి కాబోలు!" నని యతఁడు బదులు చెప్పెను. "నీ చంకనుండఁగా కండచీమ లేలాగున వచ్చి కుట్టినవోయి?" యని యామె మరల నడుగ "సరి సరి! బాగున్నదిలే! కండచీమలు కుట్టకపోతే నేను గిల్లినా ననుకొన్నావా? రక్కినా ననుకొన్నావా? ఎత్తుకుని యాడించినందు కేనో యక్షింతల గింజలు నాల్గు నా నెత్తిని వైవఁదలంచుకొన్నావా యేమి?" అని పెద్ద గొంతుకతో నఱచి బదులు చెప్పెను. అనవసర కలహము సంభవించు నని వానితో వాదింపక ఆమె లోనికిఁ పోయెను. తెనాలి రామకృష్ణుని పిల్లి పాలు జూడఁగనే పారిపోయినట్లు గణపతి మొగము జూడఁగానె బాలిక పెడమొగము పెట్టుకొని యతని కడకుఁ బోవుటయే మానెను. గణపతి కృతార్థుడయ్యెను. బిడ్డ యెంత గ్రుక్కపెట్టి యేడ్చుచున్నను మేనత్త గాని మేనమామ గాని దాని నెత్తుకొమ్మని మేనల్లునితో ననుట మానిరి. గణపతి బిడ్డను గిల్లినట్లో యేదో బాధ పెట్టినట్లో యనుమాన పడి మేనత్త సూటిపోటి మాట లనుచుండ, గణపతి తల్లి యవి సహింపక యిట్లనుచుండును. 'మా అబ్బాయి పిల్లను కొట్టినాఁడో తిట్టినాడో యని నీ కనుమానమున్నది కాబోలు? వాఁడాలాటివాఁడు కాఁడు. వాఁడెత్తికొనుట దీని కిష్టము లేదు. ఎందుచేత నంటే దానికి సిగ్గు. మావాఁడు దాని మగఁడు కనుక మగఁడెత్తికొని యాడించుట దాని కిష్టము లేదు. చిన్నపిల్ల కేమి సిగ్గని మీరనుకోవద్దు. దేవుఁడు వారి నిద్దరిని మగడు పెండ్లములుగా నేర్పాటు చేసినప్పుడు సిగ్గు దానంత టదే లోపలినుండి బయలుదేరును. లేనిపోని పాపముమాట లాడుకోవద్దు. నీకేమో గాని మా యబ్బాయి మీఁద లేనిపోని కోపము కలిగినది. మేనమామ పిల్లనిచ్చి మా అబ్బాయి నొక యింటివానిఁ జేయఁదలచు కొన్నాఁడని తెలిసి పిల్లను వాని కియ్యకుండఁ జేయవలెనని నీవీ పన్నాగము పన్నుచున్నావు. ఈలాటి బుద్ధులు నీకు కూడవు. నీకు గిట్టకపోతే గిట్టనట్టే యుందువుగాని యిటువంటి లేనిపోని నిందలు వేయకమ్మా!"

ఇట్టి మాటలచేత మనస్సులో నున్న కోపాగ్ని రగిలిమండక మానునా ? ఈ బిడ్డ మూలమున వారికిఁ దఱచుగా కలహములు సంభవించుచు వచ్చెను. ఆ తగవులు తీర్చలేక గృహ యజమానుఁడు విసిగికొని మొత్తుకొని యన్నము తినక పస్తుండి తన్నుఁ దిట్టికొని యొకప్పుడు భార్యనుగొట్టి రెండు మూడు దినము లింటికి రాకయుండును. పిమ్మటఁ గ్రమక్రమముగా వారికి సఖ్యత గలుగుచుండును. గణపతి మేనమామ నేమియు ననజాలక పోయినను దరచుగా మేనత్తను మేనమామ లేనప్పుడు సూటిపోటి మాటలని నొప్పించుచుండును. ఇట్లుండ శివరాత్రికి మేనమామ కోటిపల్లి తీర్థమున కేగ సమకట్టెను. గణపతి తల్లియుఁ దన్ను వెంటఁబెట్టుకొని పొమ్మని సోదరుని వేఁడుకొనెను. ఆ వేఁడుకోలు నంగీకరించి యత డామెం దోడ్కొని కోటిపల్లికి వెళ్ళెను. ఇంటి యొఘ్న భార్యను బిడ్డని నిలిపి వారికి సహాయముగా నింటనే పండుకొమ్మని గణపతితోఁ జెప్పి యెన్నో బుద్ధులు చెప్పి మేనమామ చనియెను గాని యా బుద్ధులు మేనల్లుని కుడిచెవిలో బడి క్షణమాత్రమైన మనసులో నిలువక యెడమ చెవిలోనుండి యావ లకు బోయెను. ఒక్కనాఁడైన వేళ కతఁడు భోజనమునకు రాలేదు. ఒక్క రాత్రియైన నింటఁ

బండుకొనలెదు. అట్లు రెండు దినములు చెసిన తరువాత మెనత్త గణపతిం బిలిచి 'యెమోయి ! సరిగా వేళకు భోజనమునకు రావు. చిన్నపిల్లను పెట్టుకొని నేనింట నొకర్తెను పండుకొనజాలకున్నాను' అని మందలించెను. మునుపే మేనత్తపై ద్వేషభావ మూనియున్న యాతని మనస్సున కా పలుకులు ములుకులవలె నాటి నొప్పి కలిగించెను. ద్వేషము ద్విగుణమయ్యెను. అంతమాట తన్నామె యన్నందుకు మరల నామె కేదైన పరాభవము జేయవలెనని సంకల్పము కలిగెను. ఆ విషయమై కొంతసే పతఁడాలోచింపఁజొచ్చెను. ఉపాయము పొడకట్టెను. ఆ యుపాయము భోజనసమయమం దతఁడు ప్రయోగింపఁ దలంచెను. మధ్యాహ్నము భోజనమునకు గణపతికి మేనత్త విస్తరినిండ నన్నము వడ్డించెను. ఉపాయ ప్రయోగమున కదే సమయమని గణపతి చివాలున పీటమీఁద నుండి లేచి విసవిస నడచి వీథిలోనికి బోయి దారిం జనుచున్న యొక బ్రాహ్మణుని బిలిచి లోనికిం దోడ్కొనిపోయి "అయ్యా ! చూడండి. ఈవిడ నా మేనత్త. ఎంతన్నము పెట్టినదో చూడండి ! నేను కుఱ్ఱవాడఁను కదా ! అమ్మవారికి కుంభము పోసినట్లు విస్తరినిండ రాసె డన్నము పెట్టినది. ఇంతన్నము నేను తినగలనా ? ఇది నామీఁద గిట్టక చేసిన పని కాని ప్రేమ చేత చేసిన పనియా? అన్నము తినలేక పాఱవైచిన పక్షమున తిన్నంత తిని పారవైచినంత పాఱవైచెనని నా నెత్తిమీఁద లేనిపోని నిందలు వేయుటకును, పెట్టిన యన్నము దిగబెట్టుట కాదని యేలాగో యొకలాగు తిన్నపక్షమున మా మేనల్లుడు పూటకు తవ్వెడు బియ్యపన్నము లకోటాకు మెతుకు లేకుండ తినునని వాడుకలు వైచుటకు యీామె యీపని చేయుచున్నది. ప్రతిదిన మీలాగుననే జరుగుచున్నది. ఒకసారి మీ వంటి పెద్దల కీ చిత్రము చూపించిన పక్షమున బాగుండు నని నేను మిమ్ము దీసికొని వచ్చితిని. నేనుమాత్రము అమ్మవారినా ? దున్నపోతునా ? నాది మాత్రము కడూపు గాక మడుగా యేమిటి ? " యని యా యన్నము జూపెను.

సాక్షిగా వచ్చిన బ్రాహ్మణుఁ డా యిల్లాలిం జూచి "అమ్మా ! ఇతఁడు పదునెనిమిది సంవత్సరములలోపు పిల్లవాఁడు కదా ; అంత యన్నము తినఁగలడనే మీరు పెట్టినారా ? లేక పొరపాటు చేత పెట్టినారా? కొంచె మన్నమే మొదట వడ్డించి కావలసిన పక్షమున మరల మారు వడ్డింపరాదా? రెండుసారులు తిరుగుట తప్పిదమా? పాప మా కుఱ్ఱవాఁడు మీరు పెట్టిన యన్నము ప్రోగు చూచి యడలిపోయినాఁడు. ఇదెంత మాత్రం బాగులేదు. మీ పెనిమిటి మాత్రమిటువంటి పని కొప్పుకొనునా?" యని మందలించెను. అనవుడు బ్రాహ్మణుని కామె తలుపు చాటున నొదిగి యుండి మెల్లగా నిట్లనియె. "అయ్యా ! మే రెరుఁగరు గాని మా గణపతి మామూలుగ తినగలంత యన్నమే నేను పెట్టినాను. గాని యెక్కువ పెట్టలేదు. అతని సంగతి మీకు తెలియదు. నామీఁద నేమో కోపము వచ్చి నలుగురిలో నన్ను రట్టు పెట్టుట కిట్ల జేయుచున్నాఁడు గాని నేను జేసిన తప్పు లేదు. ఆ యబ్బాయిని కంటగించుటకు నేనీలా గనలేదు. పోనీ నే నొక వేళ నిజముగా నన్న మెక్కువ పెట్టినా ననుకొన్నప్పటికీ అత్తా ! యన్న మెక్కువ పెట్టినావు తియ్యమనరాదా. మేనమామ నాలుగు రోజులు లేకపోగానే నన్నల్లరి పెట్టదలఁచినాడు." అని పలుక నా బ్రాహ్మణుఁడు "ఓరీ ! గణపతి ! నీ తల్లి వచ్చువరకు నీ వెట్లో గడుపుకొమ్మ"ని సలహా చెప్పి వెడలిపోయెను. గణపతి కోపావేశమున భోజనము చేయక యొక స్నేహితుని యింటికిఁ బోయి యన్నము దినెను. మిత్రుని యింటికి వెళ్ళినవాఁడు తల్లి వచ్చువఱకచ్చటనే భుజియించు నని మేనత్త యనుకొని, రాత్రి యతని నిమిత్తమై బియ్యము పోయలేదు. గణపతి రాత్రి భోజనమునకు సిద్ధమయ్యెను. "నీవు రావనుకొని నీకోసము బియ్యము

పోయలెదు. వండిపెట్టెద నుండు"మని మెనత్త ప్రత్యుత్తరము జెప్పఁ జుట్టుప్రక్కల నున్న యాఁడువాండ్ర మగవాండ్ర బిలిచి "చూచినారా? రెండురోజులు మాయమ్మ గ్రామములో లేకపోఁగానే నాకీమె యన్నము పెట్టుట మానినది. వీళ్ళ కొంపలో నేను పొట్టకూటికున్నాని యావిడ యభిప్రాయము కాబోలు ! నే నన్నము లేక మాడి చచ్చిపోవలసినదేనా ? ఈ గ్రామములో నా కన్నము పెట్టువా రెవరు?" అని కల్లబొల్లి యేడ్పు లేడువఁ జొచ్చెను. ఆ యేడ్పు వినగానే చుట్టుప్రక్కలమ్మలక్కలకు జాలిచేత మనస్సులు కరిగిపోయెను. "మా యింటికి రా, నాయనా ! పట్టెడన్నము మా లోపల తినరా, నాయనా !" యని ముసలమ్మలు కొంద రనిరి. "నేనే వండి పెట్టెదనమ్మా ! మీ యింటి కెందుకు రావలె?" నని గణపతి మేనత్త వారితోఁ బలికెను. అందులో నొక్క ముసలమ్మ గణపతిం జూచి "నాయనా ! మేనమామ భార్య మేనత్త కాదు. పినతండ్రి పెండ్లాము పినతల్లి కాదు. నీ సంరక్షణము నీ తల్లికి విధాయకము గాని మేనత్త కేమి విధాయకమురా? ప్రేమ చేత పేగు పెరపెర కోసికొనిపోవు చున్నదా యేమి? రా నాయనా? నే కెంతన్నము కావలె? నాలుగు మెతుకులు. నీ వన్నము తినకుండ యీ రాత్రి పండుకున్నావన్నమాట మీ యమ్మ వింటే గొల్లున యేడ్చి మొత్తుకొనును. లేక లేక వరప్రసాదిలాగు నొక్కడవు పుట్టినావు. నీమీఁద గంపెడాశ బెట్టుకొని ఆ ముండ యున్నది. అన్నము తినక చచ్చిపోకు. మా యింటికి రా! యని చేయి పట్టుకొని నాలుగడుగులు వెనుకకుఁదీసికొని పోయెను. అది చూచి మేనత్త కోపించి " నా మేనల్లునిం దీసికొని పోవుటకు నీవెవతవు? అనుకొన్నప్పుడు నాలుమాట లనుకోగలము, లేనప్పుడు కలియగలము మాకు మాకు విధాయకము 'సత్తిరాజువా రింటికి నీ వెక్కడి తొత్తు' వన్నట్టు, నడుమ నీ వెవ్వరమ్మా? అన్న మీ రాత్రి పెట్టగలవు గాని యెల్లకాలము పోషింప గలవా? మేనమామ పెళ్లాము మేనత్త గాదని నోటికి వచ్చినట్లన్నావు. నీవా యబ్బా యికి మేనత్తవా, తల్లివా, పెత్తల్లివా ? యెవతెవని పిలిచినావు? చాలు చాలు నోరు మూసుకో!" యని కఠినముగాఁ బలికెను. మాటఁమీద మాట వచ్చెను. మాటలు తిట్లుగా మారెను. బారలు చాపుకొని వారిద్దరొండొరులను దూషించుకొనుచు, తలిదండ్రులను చుట్టాలను బ్రతికియున్నవారికి చచ్చినవారిని నన్యోన్య మాతృవంశమున నేడు తరముల వారిని నిందించి, దెప్పుకొని గొంతులు పోవునట్లఱచి పోరాడి, కలహ మాడుట కోపిక లేక లోపలికిఁ పోయిరి. గణపతి తన పక్షము వహించిన ముసలమ్మను వెనుక వైచికొని మేనత్తను నాలుగు మాటలని యెట్టకేల కారాత్రి ముసలమ్మ గృహమందే భుజించి పండుకొనెను. గణపతి మరునాడు కూడ ముసలమ్మ యింటనే భోజనము చేయదలచెను. గాని గణపతి భోజన వైఖరి రాత్రి చూచిన తరువాత ముసలమ్మ గుండె బాదుకొని యట మీఁద వానె నెట్లయిన వదలించుకొనవలెనని తలంచి యుదయముననే గణపతిం జేరఁ బిలిచి " నాయనా ! ఈ పూట వెళ్ళు ! నా బియ్యము పోయ వలసినదని చెప్పు. పోయనంటే మా యింటి యొద్ద తినవచ్చును. ఎందుకు పెట్టదో చూడవలె దీని బాబుగారి ముల్లె తెచ్చిపెట్టు చున్నదా యేమి? నీ మేనమామ సొమ్మేకదా నీకు పెట్టుచున్నది. వెళ్ళి చెప్పిరా, యేమనునో చూత" మని మెల్లఁగా నుపదేశించెను. సరేయని చివాలున లేచి గణపతి యింటికిఁ బోయి "ఇదిగో నమ్మా ! ఈపూట మన యింటికే భోజనమునకు వత్తును. వంట చేయ వలసినది" యని చెప్పెను. "సరే" యని మేనత్త యూరకుండెను. ఆ మాట ముసలమ్మతో మరల జెప్పెను. ముసలమ్మ తన కొంపలో నుండి గణపతి వెడలి పోయినందుకు మనస్సులో మిక్కిలి సంతోషించి ప్రేమ ముట్టిపడునట్లుఁ బై కిట్లనియె. "ఓరీ ! గణపతి ! నీవు గుప్పెడన్నము మాయింట తిన్నంత మాత్రమున నాకు లోటు

లెదు. ని యిష్టము ఎక్కడ తిన్నా సరె. ని యింటికి వెళ్ళుటకు ని కిష్టము లెకపోయిన పక్షమున మా యింటనే తిను; కాని, దానింటికి వెళ్ళి దాని పొగ రణచవలె. రాఁగానె యీ సంగతులు మీ యమ్మతో చెప్పి మీ మేనమామతో చెప్పి చావగొట్టించు. ఒక్కమాటు జాతరైతేగాని బుద్ధి రాదు. పొగరెక్కి యున్నది. కట్టు పొగరుబోతు. గిద్దెడుప్పు నేను బదులు పుచ్చుకున్నాను. ఇరువదిసార్లు తిరిగి నిలువబెట్టి పుచ్చుకున్నది. ఉప్పు బదులు తీర్చక దీని ఋణమున నుండిపోదునా? దాని బుద్ధి యది చూపించుకొన్నది. గాని, మీ మామతో నేను కూడ చెప్పి ధూపమువేయ తలచుకొన్నాను. నీవుకూడ గట్టిగా చెప్పు. మేనల్లుడంటే ఇంత కిట్టకపోనా? గిట్టని వాళ్లున్నారు. అన్నము పెట్టనివా ళ్లెక్కడా లేరు. దాని సాంప్రదాయ మేలాటిది? దాని బామ్మ పెనిమిటి కన్నము పెట్టక వెళ్లకొట్టింది. ఆ ముసలివాఁడు హోరున నేడ్చి కాశీ రామేశ్వరాలు వెళ్లి యెక్కడనో చచ్చిపోయినాఁడు. ఇందుకే ఆడపిల్లను తెచ్చుకొనేటప్పుడు సాంప్రదాయాలు చూచి తెచ్చుకోవా లన్నారు. మనము తగిన ప్రాయశ్చిత్తము దీనికి చేయవలె. సరే, నాయనా ! నేను మడి కట్టుకోవలె నీవు వెళ్ళు. అన్నానికి మట్టుకిబ్బంది పడకు, నాయనా ! ఎప్పుడు లేకపోయినా నేనున్నాను" అని చెప్పి పంపెను.

గణపతి యిట్టట్టుదిరిగి రెండు జాము లగునప్పటికి స్వగృహమున కరిగి యన్నము పెట్టుమని మేనత్త నడిగెను. వెనుకటి దినమున నన్న మెక్కువ పెట్టినందుకు గొప్పయల్లరి చేసినాఁడని మేనత్త యీ దినమున గణపతికి విస్తరినిండ బెట్టక యన్నము కొంచెము తక్కువగాఁ బెట్టెను. అది చూచి గణపతి చివాలున పీటమీఁదనుండి లేచి విస విస వీధిలోనికి నడచిపోయి, దారిన వెళ్ళుచున్న బంధువు నొక్కని బిలిచికొని పోయి తన విస్తరిలో నున్న యన్నముఁ జూపి "చిత్తగించినారా ఈ దురన్యాయము! సరిగాఁ బెట్టక కడుపు మాడ్చి చంపు చున్నది. చూడండి ! విస్తరిలో నాలుగు మెతుకులు పెట్టినది. ఈ నాలుగు మెతుకులతో నా యాకలి తీరునా? పట్టెడన్నము పట్టెడుకూర తినఁగల ముండాకొడుకును గదా! ఈలాగున డొక్కమాడ్చి చంపవచ్చునా! నోరెత్తి మాటాడితే తంటా. ఎక్కువ పెట్టినా వేమంటే నాలుగు మెతుకులే పడవైచును. తక్కువ పెట్టినా వేమంటే గ్రామదేవతకు కుంభము తోడినట్లు తోడును. ఇంతకూ నా తల్లిముండ కోటిపల్లి వెళ్ళి కొంపతీసింది." అని చెప్ప, వచ్చిన చుట్ట మామె నుద్దేశించి యిట్లనియె. "అమ్మాయి! అర్ధాన్నము బెట్టుట మహాదోషమని పెద్దలు చెప్పినారు. అలా గెప్పుడు చేయకమ్మా! కావలసిన దేదో పెట్టి మాట దక్కించుకో, తల్లి వచ్చినదాకా!" యని "ఓరీ గణపతి! నేనిక్కడనె కూర్చుందును. నీ వన్నము తిను. కావలసిన దేమో యామె వడ్డించకపోతే యామెనే చీవాట్లు పెట్టెదను." అని గణపతిని గూర్చుండ బెట్టి తాను ప్రక్కనుఁ గూర్చుండెను. గణపతి మేనత్త యా చుట్టము నదివరకె యెఱిఁగియుండుట చేత జాటునఁ దాగక యెట్ట యెదుటికి వచ్చి "అయ్యా! ఎగదీసిన గోహత్య దిగదీసిన బ్రహ్మహత్య యన్న సామెత నిజమైనది. మామూలుగా నతఁడు తినగలిగినంత యన్నమే నేను నిన్న విస్తరిలో పెట్టినాను. అమ్మవారికి తోడినట్లు కుంభముతోడినా నని కోపపడి యెవరో బ్రాహ్మణుని తీసుకొని వచ్చి కనుపఱచి నన్నల్లరి పెట్టినాఁడు. కావలసిన పక్షమున మారుపెట్ట వచ్చునుగదా యని నేనీ రోజు తక్కువ యన్నము పెట్టినాను. నాలుగు మెతుకులే పెట్టి కడుపు మాడ్చఁ దలఁచుకొన్నా నని మిమ్ము తీసికొని వచ్చి గొడవ పెట్టినాఁడు. ఇతనితో నేను వేగలేను. ఏదో మనసులో పెట్టుకుని పూట పూట కీలాగున నానా బాధలు పెట్టుచున్నాఁడు. అన్న మెక్కువుంటే తీయ మనవచ్చును. తక్కువుంటే పెట్టమనవచ్చును గాని వడ్డించిన విస్తరి వదలిపెట్టి వీధిలోకి వెళ్ళి, దారిన వచ్చు

వారినిఁ దిసికొనివచ్చి, నన్ను రవ్వ పెట్టవచ్చునా? నావల్ల తప్పుంటె మేనమామగారితొ చెప్పి నన్ను శిక్ష చేయించవచ్చును. తన తల్లితో చెప్పి చీవాట్లు పెట్టించవచ్చును. అంతేకాని పూటకూళ్ళదానిని దాసీదానిని యల్లరిచేసినట్లు ఈ లాగల్లరి చేయవచ్చునా?" అని కంటఁ దడిపెట్టుకొని గద్గదస్వరముతో మాట్లాడెను. అనవుడు బంధువుఁ డిట్లనియె. "అమ్మా! గృహకృత్యములలో నొకరు తగవు చెప్పుట కష్టము. అయినదేమో అయినది. ఆ మాట మీరు తలఁచుకోవద్దు. ఈ రాత్రియో రేపో అతని తల్లి వచ్చును. వచ్చిన తరువాత మరే గొడవ లుండవు. చిన్నతనము చేత వాడు చేసిన తెలివితక్కువ పనులు పాటింపక సర్దుకోవచ్చును. సరే; ప్రస్తుతము వానికి కావలసిన వస్తువు లొడ్డించండి. అన్నము తిన్నదాక యుండి తరువాత నా వెంట తీసికొనిపోదను." అనవుడు నామె మంచిదని కావలసిన వస్తువులు వడ్డించెను. గణపతి భోజనము చూచిన తరువాత చుట్టము గణపతి తిండిపుష్టి గలవాఁడనియు నతనికిఁ గొంచె మన్నము మాత్రమే పెట్టుట చేత మేనత్త లోపమనియు గణపతి చేసిన యల్లరికి గొంత కారణము లేకపోలేదనియుఁ దలంచెను. గృహకలహములలోఁ బౌర్వాపర్యములు విచారింపక నొకపక్షము మాత్రమే వినువారి కిట్టి యభిప్రాయములు దోఁచుట యాశ్చర్యము కాదుగదా ! ఆ సాయంకాలము కోటిపల్లి నుండి గణపతి తల్లియు, మేనమామయు వచ్చిరి. రాఁగానె గణపతి యాడిన విచిత్ర నాటక వృత్తాంత మంతయు మేనత్త తన యాడుబిడ్డతోను భర్తతోడను బూసగ్రుచ్చినట్లు చెప్పి తన కతఁడు గావించిన పరాభవమును దలంచుకొని వల వల యేడ్చెను. ఆ విషయమున భార్య నిర్దోషురా లని భర్త మనంబునకు నచ్చెను. నచ్చుటయు గణపతినిఁ జూచినంత మాత్రముననే మ్రింగి వేయవలె నన్నంత కోప మాయన మనస్సులో నుదయించెను. కాని గణపతి తల్లికి మాత్రము సోదరుని భార్య చెప్పిన నేరములు తలకెక్కలేదు. ఆమె యేదో గొప్ప యనాదరము చేసియుండబట్టి మిక్కిలి బుద్ధిమంతుడైన తన కొమారుఁ డిట్టి గొడవఁ జేసి యుండునే గాని యూరక మేనత్తకు నిష్కారణ పరాభవము గలిగింపఁడని యామె యభిప్రాయపడెను. అంతలో నంతకుముందు జరిగిన గొడవలలో గణపతి పక్షమూనిన ముసలమ్మ తీర్థయాత్రలు చేసుకొని వచ్చిన గణపతి తల్లింజూడవచ్చి, కోటిపల్లి వెళ్ళి సోమేశ్వరస్వామివారి దర్శనము చేసి ధన్యురాలైనందు కామెను శ్లాఘించి చెవిచెంత జేరి మెల్లఁగా " నా తల్లీ! నీవు లేని నాలుగు రోజులలో మీ వదినెగారు నాలుగు భాగవతము లాడినది. అది యెంతకయిన సాహసురాలే. నీ కొడుకుకు సరిగా నొకపూటైన అన్నము పెట్టలేదు. నాలుగు రోజులు నాలుగు యుగములై పోయినవి. అన్నము లేక విడ్డ అడలిపోయినాడు. ఒకపూట మా యింటికి తీసికొని వెళ్ళి పట్టెడన్నము పెట్టినాను. వాడివల్ల రవంత దోషమైన లేదు. అది కొంపలు మాపఁగల కొఱవి. దాని మొగము చూచితే పంచమహాపాతకములు చుట్టుకొనును. నీ కొడుకు చాలా మంచివాఁడు. కనుక నాలుగురోజులు ఎంతో ఓపికపట్టి బాధలు పడినాఁడు. నా బోటిదానినైతే కొంపంటించి లేచిపోదును. నీ బిడ్డను మాత్రము నీ వేమి తిట్టకు కొట్టకు" మని చెప్పి వెళ్ళెను.

తాను పడిన యభిప్రాయమే సరియైనదనియు, దన కుమారుఁడు నిర్దోషి యనియు నామె మరియు దృఢముగా నమ్మెను. మేనమామ గణపతిమీఁద మహాగ్రహము కలిగి యిల్లెగిరిపోవునట్లు కేకలు వేయజొచ్చెను. ఈ వృత్తాంతము తన మిత్రునివలన విని గణపతి యా పూట యింటికి రాక మున్ను దనపక్షము బూనిన ముసలమ్మ యింటిలోఁ గూర్చుండి మేనమామయొక్క నరసింహావతార చేష్ట లన్నియుఁ గనిపెట్టు చుండెను. అతఁ డిక్కడున్న వార్త యా ముసలమ్మ

తల్లి కెరుకజెయఁగా నామెవచ్చి కొడుకుం గౌఁగిలించుకొని గట్టిగా నెడ్చునపక్షమునఁ దన సోదరునికి వినబడు నని శంకించి మెల్లగా నేడ్చెను. తల్లినిఁ గౌగిలించుకొని కుమరుఁడుగూడ నేడ్చెను. అన్యోన్యాలింగన పురస్సరముగా మాతాపుత్రులు కొంతసేపు రోదనము చేసిన తరువాతఁ దల్లి కుమారున కిట్లనియె.

"నాయనా! నీకెంత కష్టము వచ్చినదిరా! అన్నములేక నీ వెంత మల మల మాడిపోయినావో నీ కెంతయాఁకలైనదో, అలాటప్పుడు నన్నుఁ దలంచుకొని నీ వెంత యేడ్చినావో! ఆ వగలాడి కొంచెమైన జాలిలేక పెనిమిటితో నీ వడ్డమైనమాట లన్నావని చెప్పింది. దాని వలలోఁ బడిపోయి వాడు నిన్ను చంపివేయవలెనని యున్నాఁడు. నే నేమి చేతురా తండ్రీ!" అనవుడు గణపతి తల్లి కిట్లనియె.

"అమ్మా! విచారించకు, నావల్ల లోపము లేదు. మామయ్య పెండ్లాము చెప్పిన మాటలు పథ్యముగా గ్రహించి నా మీఁద గంతులు వేయుచున్నాఁడు. ఆడుదాని మాటలు విని నన్ను చావఁగొట్టుటకు సిద్ధమవుచున్నాఁడు. అతని యింటిలో మన ముండవద్దు. ముష్టి యెత్తియైన నిన్ను నేను పోషింపఁగలను. పోదాములే! 'పెండ్లాము బెల్లము తల్లి దయ్య ' మన్నట్టి సామెత నిజమయినది. ఇత నెంత, యితని యన్నమెంత? ఇతని యిల్లెంత? నూరుతిట్లు తిట్టి పట్టెడన్నము పెట్టినంత మాత్రమున లాభ మేమిటి? నాకా అన్నము వంటబట్టుటలేదు. రేపుదయము వెళ్ళిపోదములే! "అనవుడు నామె " నాయనా! తొందరపడకుఁ మామయ్యతో మన కెన్నో పనులున్నవి. అతనిదగ్గర పిల్ల వున్నది. పెండ్లాము కిష్టము లేకపోయినప్పటికి అతని నేలాగో వంచి పిల్లను మనము చేసుకొనవలెను. కోపపడకు! తమాయించుకో ! నిదానించు! తొందరపడకు. కార్యము సాధించుకోవలెను గాని చెడదీసుకోగూడదు" అని మందలించెను.

సరే యని గణపతి యొప్పుకొని తల్లినిఁ బంపి తానొకటి రెండు దినము లక్కడక్కడ భోజనముఁజేసి తరువాత మేనమామ లేనప్పుడు చాటుగా బోయి తినుచుఁ బిమ్మట మెల్లమెల్లఁగ మేనమామ కంటఁబడుచు నెప్పటియట్లు వుండెను. మేనమామయుఁ గ్రమక్రమముగ గోపపువేఁడి చల్లనగుటచే గణపతిని చూచియు నూరకుండెను.

# పదమూడవ ప్రకరణము

తోఁబుట్టువు, మేనల్లుడు దనగృహమునందె యుండుట చేత నాదాయముకంటె వ్యయ మెక్కువై నాగన్నకు నలువది వరహాలప్పయ్యెను. మేనల్లుడైన గణపతి కుటుంబమునకుఁ జేయు నట్టిది కలహాదాయమే గాని యన్యము లేదు. ఋణప్రదాతలు నాగన్నను ఋణము దీర్చుమని పలుమారులు వేధింపఁ జొచ్చిరి. అప్పు వడ్డీతో నేబది వరహా లయ్యెను. ఈ ఋణము దీర్చునట్టి యుపాయము నాగన్నకుఁ గనబడదయ్యెను. ఒకనాఁటి సాయంకాల మప్పులవాఁడు వ్యాజ్యము నేయుదునని మిక్కిలి తొందరసేయ, నాగన్న విషాదభరిత మనస్కుఁడై సరిగా భోజనము చేయక మంచముమీఁదఁ బండుకొనియుండఁ గంగమ్మ భర్త యవస్థజూచి ఋణవిమోచన కుపాయముఁ జెప్పఁదలంచి యిట్లనియె.

"ఈ లాగున బెంగపెట్టుకొని అన్నము తినక నిద్రపోక విచారపడినంత మాత్రాన ఋణము దీరునా? దీనికి నాకొక్క యుపాయము తోఁచినది. అది చెప్పుచున్నాను వినండి. నా యుపాయము మంచిదైతే నే చెప్పినట్లు చేయండి. లేకపోతే మానండి, మా పినతల్లికొడుకు రాయప్పను మీ రెరుగుదురు కదా! మన బుచ్చి పుట్టింది మొదలుకొని వాఁడు దానిని తనకిమ్మని నన్నడుగుచున్నాఁడు. ఆ మధ్య వాడిక్కడికి వచ్చినప్పుడు "ఓసి ! గంగమ్మా! మీ బుచ్చిని నాకిచ్చి పెండ్లి చేసి నాబ్రహ్మచర్యము వదల్పవే నావంశము నిలిపినదాన వగుదువు" అని యెన్నో విధముల బ్రతిమాలినాఁడు. వాడు పునహా వెళ్ళి ఐదారువందల రూపాయలు సంపాదించుకొని వచ్చినాఁడు. ముసలివాడు కాడు. ముక్కువాడు కాడు. నోటికి చేతికి యెంగిలి లేని సంబంధము. మనకు చేలోకువైనవాఁడు. మన బుచ్చిని వాడికిచ్చి పెండ్లిచేసినపక్షమున మన ఋణము దీరి పోవును. నాలుగేండ్ల పిల్ల గనుక నాలుగువందలు వా డివ్వగలడు. ఒక వందరూపాయలు వస్తువులుకూడ పెట్టుమని నేను చెప్పి పెట్టించగలను. ముప్పదేండ్లకంటె యెక్కువలేవు. కాలు నొచ్చినా కడుపు నొచ్చినా కాకిచేత వర్తమానమంపితే రెక్కలు కట్టుకొని వచ్చి, వాడిక్కడ వాలి మన పనిచేసి వెళ్ళిపోవును. మా నాయన కూడ మనపిల్లను రాయప్పకే యిమ్మని రెండు మూడు సారులు నాతో చెప్పినాఁడు. మాయమ్మ సరేసరి. నూరు సారులు చెప్పింది. మనకు నూరు వరహాలు చేతికిచ్చి పిల్లకు నూరు రూపాయలు నగలు పెట్టి ఉభయఖర్చులు తానే పెట్టుకొని పెండ్లి చేసికొని వెళ్ళునట్లు మా నాన్నద్వారా నే నేర్పాటు చేయగలను. పెండ్లి యిక్కడ చేసినను సరే మానాన్నగారి యింటిదగ్గర చేసి ననుసరే వాడొప్పుకొనును. ఈ సంగతి మీరు గట్టిగా ఆలోచించుకొని మాకేదో సమాధానము చెప్పండి. తరువాత మా నాన్నకు వర్తమాన మంపించెదను."

భార్య చెప్పిన యుపాయము నాగన్నకు నచ్చెను. రాయప్పకుఁ గాని మఱియొకరికిఁ గాని నాలుగువందలు పుచ్చుకొని, పిల్లకు వివాహము చేసినపక్షమునఁ దనకు ఋణవిమోచన మగునని యొక దారి యతని మనస్సునకుఁ బొడకట్టెను. గాని పుత్రికా వివాహము తలఁపునకు రాఁగానె తోఁబుట్టువు మాట యతనికి జ్ఞప్తికిరాగా సతీపతుల కీ క్రింది సంభాషణము జరిగెను.

"మా గణపతికి పిల్ల నీయకపోయినపక్షమున నా చెల్లెలు దుఃఖపడు నని మనసులో సందేహము కలుగుచున్నది."

"గణపతికి పిల్ల నిచ్చుటకంటె పెద్దగోదావరిలో దింపుట మంచిది. అతనిదగర ఒక గుణమైన నాడెమైనది లేదు. పిల్లవాడు మరుగుజ్జు, బుద్ధులు పాడుబుద్ధులు; ఇల్లు లేదు. వాకిలి లేదు. భూములు లేవు, పుట్ర లేదు. తినబోతే అన్నము లేదు. కట్టబోతే గుడ్డ లేదు. ఏమి చూచికొని పిల్ల నివ్వను!"

"ఇల్లు వాకిలి భూమి పుట్ర విద్యాబుద్ధులు వుంటే పిల్లనెవరైన యివ్వగలరు. లేనివాడు కనుకనే మన మియ్యవలసి వచ్చినది."

"మేనల్లు డని జాలిదలఁచి గొంతుక కోయఁదలతురా! పెండ్లాము బిడ్డలకు అన్నము పెట్టుటకైన శక్తి యుండవలెనా లేదా? దానిమా టటుండనీయండి! ఇప్పుడు మనకు ఋణవిముక్తి కావలెనుగదా? గణపతి దగ్గర నాలుగు వందల రూపాయలు కాదుగదా నాలుగు రూపాయలు కూడ లేవు. మనకే మియ్యగలడు? పిల్లను మేనల్లున కుచితముగా నిచ్చి వివాహము చేసినపక్షమున అప్పులవాళ్లు మన యిల్లు వాకిలి అమ్ముకొని పోదురు. నిలువ నీడలేక మనము చెట్టుమీది పక్షులు లాగు దేశములపాలై పోవలెను. అందుచేత గణపతికి పిల్ల నియ్యవలె నన్నమాట తలచుకోవద్దు. నే చెప్పినట్లు మా రాయప్పకే యివ్వండి!"

"నీవు చెప్పినమాట సరిగనే యున్నది కాని ఆడుపడుచు దుఃఖపడిపోవునని నాకాలోచనగా నున్నది. లేక లేక దాని కొక్క పిల్లవాడు కలిగినాడు. ఏలాగైనా వాని నొక యింటివాని జేయ వలె నని దాని సంకల్పము. వాడు బుద్ధిలేనివాడన్న మాట నిజమే. అది నన్నే నమ్ముకొని యున్నది. అది యేడ్చిపోవును."

"పిల్ల నియ్యకపోతే ఆవి డేడ్చిపోవును. ఇచ్చిన పక్షమున నే నేడ్చి పోదును? ఇన్ని మాట లెందుకు. గణపతికి మీరు పిల్ల నియ్యదలచుకొన్న పక్షమున నే నే గోతులోనో దిగదలచుకొన్నాను. ఇది నిశ్చయము."

"లేనిపోని సాహసపుమాట లాడకు, తప్పు."

"మీ యిష్టము. నే నాలాగున జరిగింపదలచుకొన్న మాట నిజము." అంతటితో సంభాషణ ముగిసెను. నిద్రపట్టెను. తెల్లవారుజామున నాగన్న మేలుకొని భార్య చేసిన హితోపదేశముయొక్క పూర్వాపర్యములు స్థిమితముగా మనస్సులో విచారించి గణపతిని దనకూఁతు నిచ్చి వివాహము చేయుట వలన లాభములకంటె నష్టము లెక్కువ యున్నవని తెలిసికొని, యిల్లాలుచేసిన హితోపదేశమె సమంజసమై యున్న దని గ్రహించి, తన యభిప్రాయము భార్య కెరిగించి తన మనో నిశ్చయమును మామగారికిఁ దెలియజేయుటకయి జాబు వ్రాసెను. ఆ జాబు చూచుకొని యతని యత్తమామలు పెండ్లికొడుకయిన రాయప్పను వెంటబెట్టుకొని వచ్చిరి. ఈ బంధువు లేలవచ్చిరో నాగన్న తోఁబుట్టువునకుఁ గాని గణపతికిగాని స్పష్టముగ దెలియలేదు. కాని భార్యాభర్తలు పలుమారు గుస గుస లాడుటం బట్టియు, నత్తమామల రాకం బట్టియు వారనుమానపడిరి. కాని స్పష్టమగు వరకు నోరెత్తఁ గూడదని యూరకుండిరి. గంగమ్మ చెప్పిన ప్రకారముననె రాయప్ప నాలుగువందల రూపాయలు రొక్క మిచ్చుటకును, నూరురూపాయలు నగలు పెట్టుటకు, బాజాభజంత్రీలతోఁ దరలివచ్చి వివాహము చేసికొనుటకు నొడంబడి ఋణము దీర్చుకొనుటకు ముందుగా నేబది వరాలు అనగా రెండువందల రూపాయలు నాగన్న కిచ్చెను.

నాగన్న ఋణము దిర్చి బాధానివారణము చెసికొనెను. అనంతరము నాగన్నయొక్క యత్తమామలును రాయప్పయు, వారి స్వగ్రామమగు పలివెలకుఁ బోయి ప్రధానముచేసికొనుటకు, ముహూర్తము నిశ్చయించుటకు రమ్మని నాగన్నకు జాబువ్రాసిరి. నాగన్నయు మంచి దినము చూచుకొని పలివెల వెళ్ళెను. మేనమామ ఋణము దీర్చిన సంగతి గణపతికిఁ దెలిసెను. అతఁడా వార్త తల్లికిఁ జెప్పెను. తల్లి చుట్టుప్రక్కలనున్న యమ్మలక్కల కెరిగించెను. అమ్మలక్కలందరు సభజేసి భూమి విక్రయింపకుండ, గృహ మమ్మకుండ నాగన్న రెండువందల రూపాయలు సంపాదింప సమర్థుఁడు కాఁడనియు దనకూతును రాయప్ప కిచ్చి వివాహము చేయనొడంబడి యాతనియొద్దనే రెండువందల రూపాయలు పుచ్చుకొని ఋణము తీర్చుకొని యుండునని నిశ్చయించి, మేనల్లుఁ డుండఁగా మేనమామ పిల్లను పైవాని కిచ్చుట యధర్మమని నిర్ధారణముచేసి పిల్ల నిమ్మని గట్టిగా నడుగవలసిన దనియు నల్లరి చేయవలసిన దనియు బదిమందిని బిలిచి తగవు పెట్టవలసిన దనియు నాలోచన చెప్పిరి. ఆ యుపదేశము మాతాపుత్రులకు నచ్చెను. నాగన్న పలివెల వెళ్ళి ప్రధానము చేసికొని వచ్చిన తరువాత నొకనాఁడు రాత్రి భోజనానంతరమున సోదరుని బిలిచి తోఁబుట్టు విట్లనియె.

"అన్నయ్యా! మన బుచ్చి పుట్టింటి మొదలుకొని తప్ప కుండ దానిని నీవు గణపతి కిచ్చి పెండ్లిచేయుదు వని గంపంత ఆశపెట్టుకొని యున్నాను. నీవేమో రాయప్పకు పిల్ల నియ్యఁ దలంచుకొన్నానని గ్రామములో చెప్పుకొనుచున్నారు. ఇది నిజమేనా!"

"ఆహా! నిజమే. నేను మన బుచ్చిని రాయప్ప కిచ్చి పెండ్లి చేయఁదలచుకొన్నాను. ఈ వేళో రేపో నేనే ముందుగా నీతో చెప్పదలఁచుకొన్నాను. నీవే అడిగినావు కనుక చెప్పుచున్నాను. ఆ మాట నిజమే. ప్రధానము చేసికొని వచ్చినాను. ముహూర్త నిశ్చయముగూడ అయింది. పెండ్లి నెల్లాళ్ళున్నది. మాఘ శుద్ధ దశమినాఁడు సుమూహూర్తము."

ఆ మాట చెవినిఁ బడగానె యామె మహాపద వచ్చిన తెరంగున గుండె బాదుకొని మొత్తుకొని "అయ్యో ! అయ్యో ! నాయనా ! యెంత పని చేసినావురో, నా కొంప తీసినావురా, అన్నయ్యా ! నన్ను చంపివేసినావురా, అన్నయ్యా ! నా వంశము నాశనము చేసినావురా, అన్నయ్యా ! నా కొడుకును ఘోటకపు బ్రహ్మచారిని చేసినావురా, అన్నయ్యా!" అని యంతటితో నిలువక "ఓ అమ్మా ! ఓ నాయనా!" యనుచు మృతినొందిన తల్లిం దలంచుకొని కొంతసేపు తండ్రిం దలంచుకొని కొంతసేపు మగనిం దలంచుకొని కొంతసేపు పెద్దపెట్టున రోదనము చేసెను. ఏమో కీడు మూడిన దని చుట్టు ప్రక్కలవారందరుఁ జేరిరి. ఆ యమ్మలక్కల మొగములు గనఁబడగానే యామె దుఃఖము మరింత యధికమగుచు నామె దుఃఖపరవశయై "ఓ పుల్లమ్మత్తా! ఓ నరసమ్మ పిన్నీ ! ఓసీతమ్మ వదినే ! ఓ మాచమ్మక్కయ్యా ! విన్నారటె మీరు ! మాఅన్నయ్య మాబుచ్చిని నా గణపతి గాడి కివ్వక యెవరికో యిచ్చుకోదలచు కొన్నాడట! మా వదినకు నెల తప్పినది మొదలుకొని ఆడపిల్లే పుట్టవలెనని అది నా కోడలు కావలె నని యెంతో ముచ్చటపడి పుట్టెడాశ పెట్టుకొని యున్నాను. నా యాస లడుగంటిపోయినవే, పుల్లమ్మత్తా! నా కొడుకు దిక్కుమాలిన పక్షి అయినాడే, పుల్లమ్మత్తా! ఎవడో దిక్కుమాలిన ముండాకొడుకు వచ్చి పిల్ల నెత్తుకొని పోదలచుకొన్నాడు, పుల్లమ్మత్తా! ఇక నేనేమి చేతును? పుల్లమ్మత్తా ! పల్లకిలో గణపతి, బుచ్చి కూర్చుండగా ముచ్చటగా చూడవలె ననుకొన్నానే, అమ్మా! బుచ్చి బుల్లి చేతులతో గణపతి నెత్తి మీద తలంబ్రాలు పోయగా రెప్పవేయకుండా చూడవలె ననుకొన్నానే, యమ్మా! తలుపు దగ్గఱ

పెరులు చెప్పించి వినవలె నని అనుకొన్నానె, అమ్మా! గంధాలు పూయించవలె ననుకొన్నానె అమ్మా! నాకన్నులు కాలిపోయినవే, అమ్మా! నేనెంత పాపిష్టి ముండనే, అమ్మా!" యని పరిపరి విధముల వన్నెలు చిన్నెలు పెట్టి యేడ్చెను.

ఆ యేడ్పు విని జాలినొంది చూడవచ్చిన యిరుగు పొరుగు పడతులు "మేనరికమంటే ఆడపడుచు ఆశపడక పోదు కదా. దాని కొడుకు బ్రహ్మచారియై పోవలసి వచ్చింది గనుక దాని కంత బాధగా నున్నది. మేనల్లు డేలాటివాడై నప్పటికి మేనమామ పిల్లనిచ్చుట న్యాయ" మని కొందరు, "అల్లరి చేయక అతని కాళ్ళమీదను బడి మెల్లగా బతిమాలు కోవే, నీ యన్న గారు ఎల్లవారివంటివాడు కాడు. ఎంతో మంచివాడు. నీ పెనిమిటి పోయినప్పటినుంచి, నిన్ను నీకొడుకును కడుపులో పెట్టుకొని ఆదరించి వేయి విధముల కనిపెట్టినాడు గదా" యని యొకతె, "ఏమి జూచుకొని పిల్ల నిమ్మనావమ్మా" యని మరి యొకతె, తోచిన భంగి పలుకఁజొచ్చిరి. ఆమె యేడుపు కొంత యణగిన తరువాత నాగన్న తోబుట్టువున కిట్లనియె.

"ఓసీ ! నీవు గయ్యాళితనము జేసి నన్నల్లరి పెట్ట దలఁచుకొన్నావా యేమిటి? నేను సుఖముగా బిడవివాహము చేసుకో దలచుకొని ప్రధానము చేసికొని వచ్చినాను గదా! నా యింటిలో ఎవరో చచ్చినట్లు నీవు ఏడువవచ్చునా? శుభకార్యములు దలచుకొన్నప్పుడు అశుభముగా మాటలాడ గూడదు. నోరు మూసికో ! నీ కొడుకుకు పిల్లను ఏమి చూచుకుని యిమ్మన్నావు? గోష్పాదమంత భూమి లేదు. గిద్దెడు గింజలు వచ్చుట కాధారములేదు. పెండ్లి చేసిన తరువాత రేపు నీకొడుకు చచ్చిపోతా డనుకో, మనోవర్తికైన భూమి ఉండవలెనా? తల దాచుకొనుటకు కొంపైనలేదు. ఇంక నీకొడుకు గుణములు మాకు చెప్పనక్కరలేదు. ఎన్ని దుర్గుణము లుండవలెనో అన్ని దుర్గుణములు నీ కొడుకుదగ్గఱనే యున్నవి. అటువంటి నిర్భాగ్యునకు పిల్ల నేలా యియ్యగలరు? గుణముల మాటటుంచు నా కిప్పుడు రెండువందలు ఋణ మున్నది. ఆ ఋణము తీర్చుకోవ లెను. నాకు నీవు నాలుగువందల రూపాయ లియ్యగలవా, పిల్లమీద ? బుఱ్ఱ గొరిగించుకొనేందుకు గూడ యేగాణియైన దగ్గర లేక చిక్కుపడుచున్న ముండవు. నీవు నాలుగువందల రూపాయలు నాకిచ్చి పిల్లకు ముచ్చట తీరుటకు వందరూపాయలు నగలు పెట్టి పెండ్లి చేసికోగలవా? మేనల్లుడు గనుక తండ్రి చచ్చినప్పటి నుంచి అన్నవస్త్రము లిచ్చి పోషించినాను. నే నంతకన్న చేయవలసిన దేమీలేదు. నీ వేడ్చినప్పటికి మొత్తుకొన్నప్పటికి నేను పిల్ల నియ్యను."

అనవుడు సోదరి సొదరున కిట్లనియె. "అన్నయ్యా! యిల్లులేని మనుష్యులు భూమిలేని మనుష్యులు బ్రతుకటలేదా? చచ్చిపోయినారా? మనవాడుకదా, నాలుగూళ్లు తిరిగి ముష్టెత్తి భార్యను పోషించుకొనలేకపోవునా? లోకములో అందరికి భూములున్నవా? పుట్ర లున్నవా? గుణములు మంచివికా వన్నావు. చిన్నతనము కనుక అల్లరి చిల్లరగా తిరిగినాడే కాని పెద్దవాడైన తరువాత కూడ నీలాగే యుండునా? పై వేషాలే గాని గణపతి మనస్సంత మంచి మనస్సెవరిదిగాదు. వాడు జాలిగుండెవాఁడు. ఎంతో బుద్ధిమంతుఁడు. నీ పెండ్లాము మా మీద గిట్టక మమ్ము లేవగొట్టించవలె నని నీతో అయినప్పుడు కానప్పుడు కొండెములు చెప్పి నా మీద, మా అబ్బాయిమీద నీకు కోపము తెప్పించినది. దాని మందులు నీకు తలకెక్కినవి. దాని మాటలు పథ్యమైనవి. అది నా వుసురు పోసుకున్నది. నా వలెనే అదికూడా హోరున యెప్పు డేడ్చునో, దాని యాశ లెప్పుడడుగంటిపోవునో, దాని పుట్టింటివా రెప్పుడు బుగ్గయిపోవుదురో, నన్ను

పెట్టిన వుసురు తగులకపోదు. ఆడపడుచు నుసురుపెట్టినవా ళ్ళక్కరకురారు. ఆడపడుచుల ఉసురు ఒక్కనాటితో పోదు. ఏడేడు తరాలు కట్టి కుడుపక పోదు. ఆడపడుచు నేడిపించినవారి వంశము నిర్వంశము కాకమానదు. ఆ దిక్కుమాలిన రాయప్ప యెక్కడ దొరికినాడురా, నాయనా ? వాని మొగము మండ ! వాని మొగాన ప్రేతకళే గాని మంచికళ లేదురా, నాయనా? పెండ్లియోగ మెక్కడున్నదో ఆ మొగానికి, నాకు తెలియదు?" అని రెండవసారి రుద్రపారాయణము చేసెను. గంగమ్మను నామె పుట్టినింటివారిని జామాత కావలసిన రాయప్పను నోటికి వచ్చినట్లు తిట్టుట చేత గంగమ్మ కోపించి యా తిట్లబుుణ మాడుబిడ్డకు వడ్డీతో దీర్చెను. ఇద్దరు కలియబడి కొట్టుకొన్నట్లు కయ్యమాడిరి. అంతట నాగన్న కోపావిష్టుడై సోదరిం జూచి "యిష్టము వచ్చినట్లు కారుకూతలు కూసి నన్ను, నా భార్యను, నా యత్తవారిని నా యల్లుని నోటికి వచ్చినట్లు తిట్టుచున్నావు. సుఖముగా నేను పెండ్లి చేసుకోఁ దలఁచు కోఁగా నీవు అమంగళము లాడుచున్నావు గనుక నీవు నాయింటిలో నుండవద్దు. నీవు నీ కొడుకు ఈ క్షణం లేచిపొండి. ఒక్క నిమిషమున్నారంటే నే నోర్వను. పొండి. మీ సామాను లేమున్నవో తీసికొనిపొండి" యని కఠినముగాఁ బలికెను. మేనమామ తన విషయమై పలికిన పలుకులకుఁ దల్లి నాడిన మాటలకుఁ దగిన ప్రత్యుత్తరముఁ జెప్పవలె నని గణపతి రెండు మూఁడు సారు లుంకించెను. కాని బదులు చెప్పినచో మేనమామ బుజ్జ వంగఁదీసి చావగొట్టు నని భయపడి నోరెత్తక "అమ్మా ! రావే; అతఁ డింటిలో క్షణ ముండఁగూడ దని, యతఁ డను చున్నప్పుడు సిగ్గులేక మన ముండఁగూడదు. అన్నము లేకపోతే నాలుగూళ్ళు ముష్టెత్తుకు తినవచ్చును, రా. మాటలు మనము పడఁగూడదు లే!" యని చేయి బట్టుకుని లేవఁదీసి తీసికొని పోయెను. ఆమె గొల్లుమని యేడ్చుచు వీధిలోనికిఁ బోయి "దేముడా, దేముడా ! నా తోడబుట్టినవాడు చచ్చిపోయినాడమ్మా ! నా పుట్టింటికి నాకు బుుణము తీరినదమ్మా ! నా పుట్టిల్లు బుగ్గి అయిపోయిందమ్మా! " యని కేకలు వేయుచు దోసెడు మన్ను తీసి యన్నగారి గుమ్మంమీఁద పారబోసి రవంతమట్టి తన నోట వేసికొని, తల బాదుకొని గుండె బాదుకొని లబలబ మొత్తుకొని, మున్ను గంగమ్మకు విరోధురాలైన యవ్వ యింటికి గణపతి యీడ్చుకొనిపోఁగా వెళ్ళి పెద్ద పెట్టున రోదనము చేసెను.

# పదునాల్గవ ప్రకరణము

భగవంతుడు గణపతికిఁ గావలసినంత యభిమానమునే ప్రసాదించెను గాని యైశ్వర్యమును బ్రసాదింపలేకపోయెను. మేనమామమీఁది కోపముచేత వేరింటి కాపురము చేయవలయు నని తల్లిం దోడ్కొనిపోయి పొరుగింట నిలుపఁగలిగెనే గాని, తన భుక్తికిఁ తల్లి భుక్తికి నొక్కపూటకు సరిపడునంత బియ్యమైన దేజాలకపోయెను. గణపతికిఁ దల్లికి నాగన్న మీఁదను గంగమ్మ మీఁదను గ్రోధమెక్కించి పుల్లవిఱుపు మాట లనియెడు సమిధల చేత ద్వేషవహ్ని రగుల్కొలిపిన యవ్వయు, దక్కిన యమ్మలక్కలును మాతాపుత్రులను రెండు మూడు పూటలు పోషించునప్పటికే కష్టమయ్యెను. తల్లికొడుకు లని లెక్క కిద్దరైనను రమారమి యేడెనమండుగురు మనుష్యులు గల కుటుంబమునకుఁ గావలసినంత సామగ్రి వారికి గావలసెను. గణపతి ప్రాయమున నిరువదేండ్ల లోపువాఁడైనను, జూపులకు వామనమూర్తి యైనను, జఠరాగ్ని వృకోదరుని జఠరాగ్ని వంటిదని యీ గ్రంథమునందే స్థలాంతరమున వర్ణింపబడియెఁ గదా! గణపతి భోజనప్రమాణముబట్టి యతని తల్లి భోజన ప్రమాణము జదువరులు మీ రూహించుకొన వచ్చును. అందుచేత సామాన్య గృహస్థులు వారిని భరించుట కష్ట మని వేఱె చెప్ప నవసరము లేదు. దినమునకు మూఁడు శేరులు బియ్యమున్న పక్షమున వారి కొకవిధముగా సరిపోవును. అది వచ్చునట్టి దారి పొడకట్టదయ్యెను. తల్లి కొడుకులు తన కొంపమీద బడి తిందురేమోయను భయమున బస యిచ్చిన యా యవ్వ గణపతినిఁ దల్లిం గూర్చుండబెట్టుకొని మూఁడవనాఁ డిట్లనియె. "ఓరీ గణపతీ ! మీ తల్లిని పోషింపవలసిన భారము నీది. కుక్కదానము పట్టి కుటుంబము పోషించు మన్నారు. గనుక నీవు యాయవారము చేసి మీకు సరిపడిన బియ్యము తీసికొనిరా ! గ్రామములో నున్న పెద్దమనుష్యులను నల్గురను జూచి మేనమామ నన్ను, నా తల్లిని లేవఁగొట్టినాడని చెప్పు. ఏ ధర్మాత్ములకైన జాలి పుట్టవచ్చును. తలకొక కుంచెడు ధాన్యము వారివ్వవచ్చును. దానివలన మీ కుటుంబ పోషణ గావచ్చును. ముందుగా యావవార మారంభించు. మావారు రామేశ్వర యాత్ర వెళ్ళినప్పుడు కొనితెచ్చిన పెద్ద కుంభకోణపు చెంబున్నది. అది మానెడు బియ్యము పట్టవచ్చును. రేపటినుంచి నీ వభిమానపడక ఆలాగున చెయ్యి, నాయనా ? " యని యుపదేశింప గణపతి యా యుపదేశమునకు సమ్మతింపక యిట్లనియె.

" చెస్! నేను బ్రాహ్మణార్థములే మానివేయఁదలచుకొన్నాను. యాయవారము వృత్తి కొప్పుకొందునా ! అటువంటి మాటలు నాకు పనికిరావు. అమ్మా ! నా కొక యుపాయము తోచింది, విను ! కొద్దిరోజులలో మన మీ యూరు విడిచి వెళ్ళిపోదము. అంతవఱకు నీవు యాయవారము చేసి, బియ్యము తీసుకొనిరా ! ఈ గిరజాలతోను ముచ్చెలతోను నేను యాయవారము చేయుట బాగుండదు. నాకది పరువు తక్కువ. రెండు మూడు మాసము లాలాగు నీవు గడిపితే నేనేదో యుద్యోగము సంపాదించి యొకరికంటె యెక్కువగా నిన్ను పోషింపఁగలుగుదును. అంతవరకు మాటదక్కించు" మని ప్రత్యుత్తరము చెప్పెను. మాతాపుత్రులలో నెవరు భిక్షాటనము చేసినను నుపదేశము చేసిన యవ్వకు సమానమె గనుక యామె యా సలహా నంగీకరించి బిచ్చమున కామెం బురికొలిపెను. మరునా డుదయమునుండి

యామె యాయవార మారంభించెను. ప్రతిదిన ముదయము గణపతికి గడుపునిండ జద్దియన్నము బెట్టి యామె గ్రామ సంచారము కరిగి రెండుజాములైన తరువాత వచ్చి స్నానము చేసి మడికట్టుకొని వంటచేసి కొడుకునకు బెట్టి తాను దినుచుండెను. గణపతి చద్దికూడు తిని తల్లి తెచ్చిన బియ్య మప్పుడప్పు డమ్మి పొగచుట్టలు కొనుచు, డబ్బు లేనప్పుడు బియ్యమే యిచ్చి యీతపండ్లు, జీడిమామిడిపండ్లు, వెలగకాయలు, రాచయుసిరికాయలు, చెఱుకుకట్ల ముక్కలు, నేరేడు పండ్లు మొదలగు చిరుతిండివస్తువులు వీధిలోని కమ్మవచ్చినప్పుడు దీసుకొనుచు, నున్నగా గిరజాలు దువ్వుకొని చుట్టలు కాల్చుచు, గ్రామము వెంటc దిరిగి తిరిగి రెండుజాము లగునప్పుడు టక్కు టక్కు మని ముచ్చెలు చప్పుడగునట్లు గృహమునకు వచ్చి "వంటైనదా లేదా!" యని గొప్ప యధికారి వంటకత్తె నడిగిన ట్లడిగి, యైన దన్నప్పుడు ముందు తనకే పెట్టుమని తిని 'కాలేదు, నాయనా !' యని యన్నప్పుడు 'థౌర్భాగ్యపుముండా ! పెంటముండ ! వంట పెందలకడ చేయక గుడ్డిగుఱ్ఱమునకు పండ్లుతోముచున్నావా? నీకు నాలుగు చెంపకాయలు తగులవలె, లేకపోతే బుద్ధిరా' దని యొకప్పుడు మాటలతో పోనిచ్చుచు, మరి యొకప్పుడు చేయి విసరి రెండు తగులనిచ్చుచు, యథేచ్ఛముగc దిరుగ జొచ్చెను.

గ్రామస్థులలో గొంద రప్పుడప్పుడు గణపతి యొక్క స్వచ్ఛందవ్యవహారములc జూచి నవ్వుచు "ఏమిరా, యీయన్యాయము? చెట్టంత మగబిడ్డవు, నీ వుండగా మీయమ్మ బిచ్చమెత్తుకొనుట న్యాయమటరా? ఆ గిరజాలేమిటి? ఆ పొగచుట్టలేమిటి ? ఆ ముచ్చె లేమిటి? ఆ టక్కు టక్కు లేమిటి? తల్లి యాయవార మెత్తు టేమిటి, సిగ్గులేదా? పెద్దముండ, ఆవిడను పోషించుటకు మారుగా నిన్నే యావిడ పోషించవలెనా?" యని చివాట్లు పెట్టc జొచ్చిరి. అది విని గణపతి రోసము దెచ్చికొని తల్లిచేత బిచ మెత్తింపc గూడదని యామెను మాన్పించి తానే చెంబు దీసికొని యాయవార మారంభించెను. అదెట్లనcగా నుదయమున లేచి చద్దికూడు దిని గిరజాలు దువ్వుకొని కోటు తొడుగుకొని తెల్లపంచె కట్టుకొని పొగచుట్ట నోటపెట్టుకొని కుడిచేతితో చెంబు పట్టుకొని యెడమచేతి తర్జనమధ్యమాంగుళీయములతోc పొగచుట్ట నోటనుండి పట్టుకొని యుమ్మి వేయుచు, యాయువారము చేయును. ఆ వేషమును జూడ గ్రామ మందలి స్త్రీ పురుషులు బాలురు పనులు మానుకొని వచ్చి గణపతితో నించుకసేపు పని లేకపోయినను బ్రసంగించి, పొట్టలు విచ్చునట్లు నవ్వుకొని వినోదించు చుందురు. గణపతి యక్షయ పాత్రము బుచ్చుకొని యెవరింటికైనను వెళ్ళి నప్పుడు వారు లోపలినుండి బియ్యము తెచ్చుట యాలస్యమైన పక్షమున, నచ్చట నిల్చియుండక వారి వాకిట మంచ మున్న యెడల మంచముమీcద, తివాసి యున్న యెడల తివాసిమీcదc, గుర్చీ యున్న యెడల గుర్చీమీcదc గూర్చుండి యాలస్యముగ బిచ్చము దెచ్చినందుకు "ఇంత సేపెందుకు ఆలస్యమైనది? ఎల్లకాలము మీ యింటిదగ్గఱ నేను పడియుందు ననుకొన్నారా యేమిటి? మీరు నాకు నిలువుజీత మిచ్చినట్లున్నారు, నేను మీ వాకిట్లో నిలిచి యుండుటకు ! మీ నౌకరును కాను. పెద్ద మనుష్యుcడు వచ్చినప్పుడు వెంటనే పంపక యీ యాలస్యమేమిటి?" యని మందలించు చుండును. గణపతి మందలింపులు స్త్రీ పురుషుల కాగ్రహము తెప్పించుటకు మారు మందహాసము సంతోషము గలిగించుచు వచ్చెను. ఈ తెరంగునc దల్లి కొన్ని నాళ్ళు, కొడుకు కొన్ని నాళ్ళు, యాయవారము చేసి పొట్ట పోసుకొనుచుండిరి. అంతలో నాగన్న కూcతురు వివాహము సంభవించెను. వివాహమునకు విఘ్నము లాపాదింప వలె నని గణపతియుc దల్లియు బహువిధోపాయములు వెదుకc జొచ్చిరి. గణపతి కంటికిc గనcబడిన వారి నెల్ల వివాహము కాకుండc జేయుట కుపాయము జెప్పు మని

యడుగు చుండును. మేనమామయైన నాగన్నకు సన్నిహిత జ్ఞాతి యొకఁ డుండెను. అతని పేరు పుల్లయ్య. పుల్లయ్యకు నాగన్నకు సరిహద్దు గోడలఁ గూర్చియు, పొలములలో గట్ల గూర్చియు, నీళ్ళబోదెలం గూర్చియు, మనస్పర్థలు పొడమి విరోధములు బ్రబలి నందున వారికి మాటలు గాని శుభాశుభ కార్యములందు భోజన ప్రతిభోజనములు కాని లేవు. శక్యమైన యెడల నాగన్న కపకారము చేయవలె నని పుల్లయ్యయు, పుల్లయ్య కపకృతి చేయవలె నని నాగన్నయుఁ జూచుచుండిరి. అట్టి సమయములో నొకనాడు గణపతి పుల్లయ్య యింటికిఁబోయి నాగన్న కూతురుయొక్క వివాహము కాకుండఁ జేయుట కుపాయము చెప్పుమని యడిగెను. పుల్లయ్య ముహూర్త మాలోచించి "వహవ్వ! మంచియుపాయము దొరికిందిరా! గణపతీ ! ఇది సాగెనా బుచ్చి, రాయప్పకుఁ దక్కకుండ నీకే దక్కు" నని యుత్సాహముతోఁ బలికెను. పిల్ల తనకే దక్కు నన్న మాట వినఁబడగానే గణపతి సంతోషముచే హృదయ ముప్పొంగ "పుల్లయ్య మామ ! ఉపాయ మేదో త్వరగా జెప్పు! నాగన్నగాడి రోగము మన మందఋము చేరి కుదుర్చవలె" ననియెను. అనుటయు పుల్లయ్య యిట్లనియెను. "బుచ్చిని నీవె తీసుకొని పోయి రహస్యముగా నేదో యొక గ్రామములో దేవాలయములో పెండ్లి చేసుకో. దానితో నాగన్న రోగము రాయప్ప రోగము కూడ కుదురును. రాయప్పగాడికి రెండువందల రూపాయలూ తిరుక్షౌర మన్నమాటె. నీకు దమ్మిడీ ఖర్చులేకుండా పెండ్లి యగును. ఒకసారి పెండ్లియయిన పిల్లకు తిరిగి పెండ్లిచేయగూడ దని మన శాస్త్రము. ఏడువనీ మొత్తుకోనీ తిట్టనీ పెండ్లి మాత్రము చేయుటకు వీలులేదు. ఎప్పటికయినా బుచ్చి నీ పెండ్లామే, తప్పదు. ఈ పని నీవు చేసితివా మన గ్రామములో జనులే గాక చుట్టుప్రక్కల గ్రామముల వాండ్రుకూడ గణపతిగాడు బహద్దరురా ! మంచిపని చేసినాడని మెచ్చి సంతోషింతురు. కనుక నీ వీ విషయములో గట్టి పని చేయవలెను. ఇసుక తక్కెడకు వెంటనే పేడ తక్కెడ ఉండవలెను. కుక్కకాటుకు చెప్పుదెబ్బ తగలవలెను" అని యుపదేశము చేయుటయు, గణపతి సంతోషించి, "పుల్లయ్యమామ ! నీ యుపాయము బాగున్నది. కాని యది యేలాగున నెరవేరఁ గలదు? ముందు మనకు పిల్ల స్వాధీన మగు టేలాగు? అది యొంటరిగా మనకు దొరుకునా ? దొరకినప్పటికిఁ దలిదండ్రుల విడిచిపెట్టి మనతో నది పారుగూరు వచ్చునా ? బలవంతమునఁ దీసికొని పోదుమా యది యేడ్చి గోలచేయదా? ఆ గోల విని పదిమంది చేరరా? అప్పుడు మన ప్రయత్నము చెడిపోదా? అదిగాక యే గ్రామములో వివాహము చేసికోఁగలను? ఎవరికి దెలియకుండ ముందక్కడ బ్రయత్నము చేయవద్దా? డబ్బు కావలెఁ గాఁబోలు. నా దగ్గర డబ్బులేదు. వీటి కన్నిటికి నీవే యేదో యాలోచన చెప్పవలె" నని పలికెను. అడుగుటయు నతనికి పుల్లయ్య యిట్లనియె. "ఆ గొడవ నీకక్కరలేదు. కావలసిన సొమ్ము నేనే పెట్టుబడి పెట్టఁగలను. నీ తల్లి మాయింటి యాడుపడుచు. నీవు నాకు మేనల్లుడవు. నా దగ్గర నలుసంత ఆడపిల్ల ఉన్నపక్షమున నేనే నీకు పిల్లనిచ్చి పెండ్లిచేయవలసిన వాఁడను. వేయేండ్లు తపస్సు చేసినను కలిసిన సంబంధము దొర కునా ? నిర్భాగ్యుడు గనుక నాగన్న సంబంధము చెడఁగొట్టుకున్నాఁడు. దానికేమి. డబ్బుగొడవ నీ కక్కరలేదు. వానపల్లి దేవాలయములో నీకు నేను వివాహము చేయించగలను. పిల్ల నేదోవిధముగా నేనే తీసుకొని రాఁగలను. అప్పు డప్పు డాపిల్ల మాయింటి ప్రక్కనున్న కందర్పవారి యింటికి వచ్చి యాడుకొను చుండును. ఏదో మచ్చికవేసి పిల్లను తీసికొని రావచ్చును. నేను ముందుగా వానపల్లి వెళ్ళి పురోహితునిఁ గుదిర్చి ముహూర్త మేర్పాటుచేసి పూజారితో మాటలాడి భజంత్రీలను గుదిర్చి వచ్చెదను. బుచ్చి పెండ్లి దశమినాడుగదా తండ్రి యేర్పరిచినాడు. ఈ లోపుగా షష్టినాడో,

సప్తమినాడొ మనము తలంచుకొన్న పని చెసితిరవలెను. నివు పంచమినాడె వానపల్లి వెళ్ళియుండు. నేను రేపు వుదయమున బయలుదేరి వానపల్లి వచ్చెదను. పాతిక రూపాయలు సొమ్ము మేనల్లుఁడవు కనుక నీ నిమిత్తము ఖర్చు పెట్టెదను. ఈ సంగతి మట్టుకు నీ వెవరితోను జెప్పవద్దు. మీ యమ్మకుఁ కూడ తెలియనీయవద్దు. ఆడుదాని నోటిలో రహస్యము దాగదు. పూర్వము ధర్మరాజులవారు "ఆడుదాని నోట రహస్యము దాగకూడ" దని కుంతికి శాపమిచ్చినారు. అప్పటినుంచి యాడుదానితో చెప్పిన ఏకాంతము లోకాంత మగును. ఇది మన కిద్దరికె గాని, యీ గ్రామములో మరెవ్వరికిఁ దెలియ గూడదు సుమీ!" అనవుడు గణపతి తన కాపూట వివాహ మైనట్లే మహానందము నొంది లేచి "పుల్లయ్యమామ ! నిజ ముగా నీవే నా మేనమామవు. నాగన్నగాడు నా మేనమామగాదు. నీ కున్న యభిమానము మఱెవరికి లేదు. ఈ దెబ్బతో నాగన్నగాడి రోగము కుదిరిపోవును. బ్రహ్మాస్త్రమువంటి యుపాయమిది. ఇక నేను వెళ్ళెదను. నీవు వానపల్లి వెళ్ళి వచ్చిన తరువాత మనము తిరిగి కలుసు కొందము." అని వెళ్ళెను. పుల్లయ్య వీధి వరకు వానిని సాగనంపి చిరకాలము నుండి నాగన్న మీఁద తనకుఁ గల క్రోధమును దీర్చికొనుటకుఁ దగిన యవకాశము లభించినదని మనంబున మిగుల సంతసించెను. నాగన్న మీఁది కోపము చేతనే పాతిక ముప్పది రూపాయలు కూడ నతఁడు ఖర్చుపెట్ట దలఁచెను. క్రోధమే పని జేయింపదు? పుల్లయ్య మరునాడు తెల్లవారుజాముననే లేచి వానపల్లి వెళ్ళి యచ్చట నున్న విష్ణు దేవాలయము యొక్క పూజారిని కలుసుకొని రెండు రూపాయలు వాని చేతిలోఁ బెట్టి రహస్య వివాహము జరుగునని యతనితోఁ జెప్పి సాయము చేయవలెనని కోరి పిల్ల తండ్రి పేరు మొదలైనవి చెప్పక తనకుఁ చిరకాల మిత్రుఁడైన ద్రావిడ బ్రాహ్మణుని మంథా మహాదేవశాస్త్రిని గలిసికొని తన సంకల్పమాయనతోఁ జెప్పి యాయన సమ్మతిం బడసి పురోహితుడుగా నుండవలె నని యతనినే గోరి రెండు రూపాయలు ముందాయనకిచ్చి మాఘశుద్ధ షష్టినాడు ముహూర్తము పెట్టించి బాజా భజంత్రీలను గుదుర్చుమని యతనితో చెప్పి తీరిగి వచ్చునప్పుడిట్లనియె "మహాదేవుడు బావ ! పిల్లను షష్టినాడు వీలైతే షష్టినాడు తీసికొనివచ్చెదను. సప్తమినాఁడు వీలైతే సప్తమినాడు తీసికొనివచ్చెదను. అందుచేత రెండు రోజులకు గూడ ముహూర్తములు పెట్టి మీ రుంచవలెను. నే నుత్తరము వ్రాసి యిచ్చి, పెండ్లికొడుకును మీ యింటికి పంచమినాడే పంపెదను. అతనికి మీ యింటిలోనే భోజనము పెట్టండి. దేవాలయములో రాత్రి వివాహములు చేయఁగూడ దని పెద్దలన్నారు. మీరు రాత్రి ముహూర్తము పెట్టినారేమి?" అని పలికెను. "రాత్రులు దేవాలయములో వివాహము చేయఁగూడ దని నే నెరింగినంతవర కే శాస్త్రములోనూ లేదు. అందుచేతనే రాత్రి ముహూర్తము పెట్టినాను. ఇటువంటి పిచ్చిపిచ్చి సందేహములు పెట్టుకొనక పిల్లను తీసికొనిరా! మూడు నిమిషములలో వివాహము చేయించెద" నని మహాదేవశాస్త్రి బదులు చెప్పెను. పుల్లయ్య సంతుష్టుడై వానపల్లి విడిచి స్వగ్రామమునముఁ బోయెను. అతడు వచ్చునప్పటికి గణపతి వాని వీథియరుఁగుమీఁద గూర్చుండెను. గణపతిం జూచి పుల్లయ్య మీఁదఁ జేయివైచి తట్టి "గణపతీ! నీ వదృష్టవంతుడవురా! నీ పేరుఫల మేమో గాని యెక్కడికి వెళ్ళితే అక్కడ దిగ్విజయమే. పురోహితుఁడు కుదిరినాఁడు. పూజారి యనుకూలముగా నున్నాడు. సమస్తము నేటివరకు శుభముగానే యున్నది. నీకు తప్పక కళ్యాణకాలము వచ్చినట్లు కనఁబడుచున్నది. కక్కు వచ్చినప్పుడు, కళ్యాణము వచ్చినప్పుడు ఆగదన్నారు, పెద్దలు. ఇంతకు నీ దినములు మంచివి యని బహూకరించెను. "మామా ! ఇది నీ చలవ గాని నా ప్రజ్ఞ యేమున్నది? నన్నొక యింటివానిం జేసినాడన్న ప్రజ్ఞ నీకు

దక్కవలసియున్నది. నా మేనమామ బ్రతికి యున్నప్పటికిఁ జచ్చినవారిలో జమ. నివె నా మేనమామవు" అని గణపతి ప్రత్యుత్తర మిచ్చెను. అనవుడు " పంచమి యెల్లుండేకదా! యెల్లుండి వుదయమున నీవు నా దగ్గరకు రా! ఉత్తరము వ్రాసి యిచ్చెదను. అది పుచ్చుకొని మహాదేవశాస్త్రి దగరకు వెళ్ళుదువుగాని; వివాహ మగువరకు నీ వక్కడనే యుండవలెను. జాగ్రత్తసుమా! నోరుజారి ఎవరితోనైన రహస్యము బయలు పెట్టెదవేమో?" యని హెచ్చరించి పుల్లయ్య వాని నంపెను. గణపతి పరమసంతోషముతో నింటికిఁ బోయి మరునా డుదయమున వానపల్లి కరిగెను. బుచ్చమ్మ పెండ్లి పలివెలలో శ్రీ కొప్పులింగేశ్వ సామివారి యాలయములోఁ జేయవలె నని నాగన్న తలంచెను. గాని, రాయప్ప దేవాలయములోఁ జేసికొన్న వివాహము వలన వధూవరులకు ముచ్చటలు తీరవని గుడిలో పెండ్లి వల్లకా దనియు నైదుదినములు యథావిథిగ వివాహము జేయవలసినదనియు వ్యయ మంతయు, దానే చేయుదు ననియు నాగన్నయొక్కయత్తమామలతోఁ జెప్పి వారి నొడంబరచెను. అత్తమామ లొప్పుకొనగానే నాగన్నయు నొప్పుకొనెను. పుట్టింటనే తన కూతురు వివాహము జరుగుచున్నప్పుడు గంగమ్మ నిరుపమానందముతో నొప్పుకొన్న దని వేరుగా వ్రాయనక్కఱ లేదుకదా! పలివెలలోనె వివాహము జరుగును గావున నాగన్న స్వగృహమందు వివాహ ప్రయత్న మేమియుఁ జేయనక్కర లేకపోయెను. అప్పడములు వడియములు పెట్టించుట యరిసెలు వండించుట యటుకులు కొట్టించుట పందిళ్లు పాకలు వేయించుట మొదలగు సమస్త ప్రయత్నములు రాయప్ప తన పినతల్లి యొక్కయుఁ బినతండ్రియొక్కయు పెత్తనము క్రిందఁ జేయించెను. నాగన్న పుత్రికను, భార్యను దీసికొని మాఘ శుద్ధ సప్తమినాఁడు పలివెల వెళ్ళ నిశ్చయించెను. పెండ్లికూతురైన బుచ్చమ్మ నాలుగేండ్ల పిల్ల యగుటచే లక్కపిడతలు లక్కబొమ్మలు కఱ్ఱబొమ్మలు మొదలగునవి తీసికొని, కందిపప్పు, బెల్లపుముక్క మొదలగు నవి పట్టుకొని తన యీడు పిల్లలతో తఱుచుగా నాడుకొనుటకుఁ బోవుచుండును. షష్టినాడు సాయంకాల మా బాలిక పుల్లయ్యగారి యింటిప్రక్క నున్న యొక బ్రాహ్మణ గృహమున నాడుకొని నాలుగుగడియల ప్రొద్దువేళ మరల నింటికి బోవుచుండెను. ఆ బాలిక యొక్క రాకపోకలను మిక్కిలి జాగరూకతతోఁ గనిపెట్టుచుండిన పుల్లయ్య యామె యొంటిగాఁ బోవుచుండుటఁ జూచి యదివఱకే తాను గొని యుంచిన కర్జూరపుపండు పొట్లము విప్పి యామె చేతికిచ్చి "అమ్మాయి ! ఈ పండు తిను. మా యింటికిరా! ఆడుకొందువుగాని" యని యెత్తుకొని ముద్దుబెట్టుకొనెను. బుచ్చమ్మ ఖర్జూరపుపండుయొక్క యెరలోఁ బడి యది తినుచు మాటాడక యూరకుండెను. పుల్లయ్య యాబిడ్డ నెత్తుకొని "అమ్మాయి! మీ యమ్మదగ్గరకుఁ దీసికొని వెళ్ళనా ! రా !" యని చల్లగాఁ మాటలు చెప్పుచుఁ దా నదివఱకుఁ గుదిర్చి యుంచిన బండిమీఁద నెక్కించి బండి కీ ప్రక్క నాప్రక్క రెండు గుడ్డలు కట్టి మిక్కిలి వేగముగ బండి తోలుమని బండివానితోఁ జెప్పి "బుచ్చమ్మ ! నీకు లక్కపిడతలు కొని యివ్వనా? మంచి పరికిణీ గుడ్డ లున్నవి. నీవు కుట్టించుకొని కట్టుకొంటావా?" యని యిచ్చకము లాడుచు, ఖర్జూరపుపండు తినిన వెంటనే మిఠాయి పొట్లము చేతి కిచ్చి యేదో విధముగా నేడువకుండ రాత్రి నాలుగు గడియ లగునప్పటికి వానపల్లి తీసికొనిపోయి మహాదేవశాస్త్రి గారి యింటిదగ్గర బండి దిగెను. పూజారి గుడిలో సిద్ధముగా నుండెను. మహాదేవశాస్త్రిగారి యొక్క యేర్పాటుచేత రెండు కాగడాలు సిదముగా నుండెను. భజంత్రీలు వచ్చి కూర్చుండిరి. మహాదేవశాస్త్రి యానాటి యుదయముననే గణపతిని దన యింటనే పెండ్లి కుమారుని చేసెను.

బుచ్చమ్మ బండిలోన నిద్దుర పోయినందున నామెను భుజముమీఁదఁ బండుకొనఁ బెట్టుకొని పుల్లయ్య మహాదేవశాస్త్రి యింటికిపోయి యతనిం బిలిచెను. గణపతియు మహాదేవశాస్త్రియు నత్యంత సంతోషముతో నాతని నెదుర్కొని నిర్విఘ్నముగా బాలికం దోడి తెచ్చినందుకు వానిని గడుంగడు బ్రశంసించిరి. అప్పుడు పుల్లయ్య మహాదేవశాస్త్రిం జూచి "ఏమోయి ! కన్యా ప్రదాన మెవరు చేయుదురు? ఆ మాట నీతోఁ చెప్ప మఱచితిని. అందు కెవరినైన గుదిర్చితివా లేదా?" యని యడిగెను. 'నీవు మరచిపోయినావు గాని నాకా మాట జ్ఞాపక మున్నది. కన్యధార పోయుటకు దంపతులను సిద్ధము చేసి యుంచినా? నని యతఁడు బదులుచెప్పెను. 'వహవ్వా ! మహాదేవశాస్త్రి యంటే సామాన్యుఁడా? బృహస్పతి వంటివాడఁవు నీ వుండగా మాకు లోటు జరుగునా? ఇంతకూ మీరు పెట్టిన ముహూర్తము మంచిది. ముహూర్త బలిమిచేతఁ బిల్ల దొరికినది గాని, లేకపోతే సామాన్యముగా దొరకునా? కాని, కన్యాప్రదానమునకు సిద్ధమైన దంపతు లెవరు?" అని పుల్లయ్య యడిగెను. మహాదేవశాస్త్రి యిట్లనియె.

"ఎవరేమిటి? మా గ్రామములో మంగళంపల్లి నర్సయ్య యనే యొక బ్రాహ్మణు డున్నాఁడు. ఆయనది కృష్ణాతీరము కాపురము. మునుపు కొన్నా ళ్ళమలాపురములో నీళ్లకావళ్ళు మోసినాఁడు. అక్క డుండఁగా నరసాపురము నుంచి బ్రాహ్మణ వితంతు నొకర్తె లేచివచ్చినది. అది తలవెండ్రుకల విధవ; అమలాపురములో నున్నప్పుడే దానిని వీ డుంచుకొన్నాఁడు. దానికి కొంత కాలమునకు కడుపైనది. బిడ్డను చంపివేయుట కిష్టములేక, ఆ గ్రామము విడిచి దంపతుల మని చెప్పుకొని వారిక్కడఁ బ్రవేశించిరి. ఆబిడ విధవా రూపముం దీసివైచి పసుపు రాసుకొని కుంకుమబొట్టు పెట్టుకొన నారంభించినది. వాళ్ళ కిప్పుడిద్దరు పిల్ల లున్నారు. వారు దంపతులే యని మేముకూడ మొదట నమ్మినాము. తరువాత నా కీ రహస్యమంతయు నమలాపురపు బ్రాహ్మణుఁ డొకడు చెప్పినాడు. అది విని నరసయ్యను పిలిచి యడిగినాను. లేదు లేదని మొదట బొంకినాఁడు కాని చివరకు నా రెండు కాళ్ళు పట్టుకొని యేడ్చి బ్రతిమాలుకొన్నాడు. స్వాములవారి పేర వ్రాసి ఆంక్షపత్రిక తెప్పించి డొక్క బ్రద్దలు చేసెద నని నేను వానిదగ్గర పది వరాలు సొమ్ము గుంజుకొని రహస్యము బయటబెట్టక కాపాడినాను. వాఁ డిప్పుడు నగ్నప్రచ్ఛాదనలు చుట్టుప్రక్కల పది పన్నెండు గ్రామములలో పట్టు చున్నాఁడు. నా మాటంటె చాల గౌరవము. నేను గీచిన గీటు దాటడు వాఁడు. నేను చెప్పినట్టు చేయఁగలడు. ఆ దంపతులిద్దఱు గూర్చుండి కన్యాదానము చేయ నొప్పుకొన్నారు."

"సరే ! చాలా బాగున్నది. వారికిఁ ద్వరగా వర్తమానమంపండి ! పిల్ల నిద్రపోయినది. ఈ సమయములోనే గబ గబ ముడివేయ వలెను. లేచిన పక్షమున నేడ్చునేమో ! రండి దేవాలయములోనికి" అని పుల్లయ్య వారిం ద్వరపెట్టెను.

గణపతికి మెడలోఁ బెద్ద జందె మొకటి పడుటే ప్రధానము గాని కన్యాప్రదానము తల్లిదండ్రులే చేయవలె నను పట్టింపులేదు. అప్పుడు వారందరు దేవాలయమునకుఁ బోయిరి. తొలుత గ్రహించిన రెండు రూపాయలకుఁ దోడుగా మఱి రెండు రూపాయలు వచ్చునను నాసతో నర్చకు డచ్చటనే గూర్చుండెను. మంగళంపల్లి నరసయ్య పుత్రకళత్ర సమేతుఁడై వచ్చి కన్యాప్రదానమునకు సిద్ధముగఁ గూర్చుండెను. భజంత్రీలు మేళముసేయ నారంభించిరి. మహాదేవశాస్త్రి పుల్లయ్య చేసిన తంత్రము సఫలము చేయుటకై మంత్రములు చదువ నారంభించెను. అంతలో బుచ్చమ్మ బాజాల చప్పుడువలన మేలుకొని "మా అమ్మేది ! నన్ను మా

అమ్మదగ్గరికి తిసికొనివెళ్ళు!" అని పెద్దపెట్టున నెడ్వ నారంభించెను. పుల్లయ్య మిఠాయి పొట్లమిచ్చెను. అఱఁటిపం డిచ్చెను. బెల్లపుముక్క జూపెను; కాని యవి యామె యేడ్పును నివారింపలేకపోయెను. బ్రతిమాలెను; బెదరించెను; ప్రాణము విసిగి రెండు చెంపకాయలు కొట్టెను. ఎన్ని చేసినను బుచ్చమ్మ యేడ్పు మానలేదు. విఘ్నేశ్వర పూజ నిమిత్తము పళ్ళెములో బోసిన బియ్యము బుచ్చమ్మ క్రిందఁ బడి దొర్లి యేడ్చునప్పుడు కాళ్ళతో దన్ని పారబోసెను. ఈ యేడ్పు వల్ల జూడవచ్చిన వారు పిల్లను దొంగతనముగా దీసికొని వచ్చి నట్లు దెలిసికొని వివాహము చెడగొట్టెదరేమో యని గణపతి గుండెలు పీచు పీచు మనెను. తన కేదైన చిక్కు వచ్చునేమో యని పుల్లయ్య భయపడెను. కుశాగ్రబుద్ధియైన మహాదేవశాస్త్రి సమయోచితముగా నాలోచించి దేవాలయం యొక్క వీధి తల్పులు గట్టిగా మూసివేయించి పిల్లదాని యేడు పెవ్వరికి వినబడకుండ గట్టిగా మేళము చేయు మని భజంత్రీలతోఁ జెప్పెను. వారు గట్టిగా వాయించి యొకరిమా టొకరికి వినబడకుండఁ జేసిరి. పిల్లయేడ్పుగాని మహాదేవశాస్త్రి మంత్ర మూలుగానే యెవరికీ వినబడలేదు. ఏడ్చి, యేడ్చి పిల్ల నేలఁ బండుకొని నిద్రపోయెను. కదిపినయెడల మరల లేచి గోలసేయునేమో యను భయమున దానిని లేపక పండుకొని యుండగానే గణపతిచేత మహాదేవశాస్త్రి మంగళసూత్రములు కట్టించెను. నిద్రించుచుండగా గణపతి బుచ్చమ్మ తలమీద తలంబ్రాలు పోసెను. కాని బుచ్చమ్మ తలంబ్రాలు తనమీద పోయునట్టి భాగ్య మబ్బలేదని యతఁడు విచారించెను. ఏలాగో యొకలాగున వివాహమయ్యెను. మూడు పోచలు జందెము వదలిపోయి దూడకన్నెవంటి పెద్దయజ్ఞోపవీతము మెడలోఁ బడెను. మంగళస్నానము చేయించినట్లు కనబడ దేమని పూజారి ప్రశ్నవేయగా మహాదేవశాస్త్రి "మా యింటిదగఱ మంగళస్నానములు చేయించి తీసికొని వచ్చినామయ్యా ! మంగళస్నానములు లేకుండ నేను వివాహము సేయింతునా?" యని యతడు తిరస్కారభావముగా బలికెను. " జడ జడపాళముగానే యున్నదే, మంగళ స్నానము లెట్లు చేయించితి" వని యతఁడు మరఁల బ్రశ్న వేయగా "జడ విప్పకుండగనె చేయించితి" నని బదులు చెప్పియతని రెండు రూపాయ లతనికిప్పించి, ఫలప్రదానము విశిష్టాద్వైత తాంబూల మతని కిప్పించి వాగ్బంధము చేయించెను. వివాహము సంపూర్ణమయ్యెను. బాలిక నడుమ నడుమ "అమ్మా !" యని యేడ్చుచు మరల నిద్రావశమునఁ గన్నులు మూయుచుండెను. బిడ్డను భుజముమీఁద బెట్టుకొని పుల్లయ్య మహాదేవశాస్త్రి యింటికి వెళ్ళి యక్కడ నొక మంచముమీఁద దానినిఁ బండుకొనబెట్టి తాను గణపతియు మహాదేవశాస్త్రియు మంగళంపల్లి నరసయ్యయుఁ గలసి భోజనము చేసిరి. భోజన మగునప్పటికి రెండుజాముల రాత్రి యయ్యెను. గణపతిని రెందు మూడు దినముల వర కక్కడనే యుండుమని చెప్పి పుల్లయ్య బుచ్చమ్మను దీసికొని బండి కట్టించుకొని మరల స్వగ్రామమునకు బయనమైపోయెను.

అక్కడ దీపాలవేళకు బిడ్డయింటికి రానందున గంగమ్మ చుట్టుప్రక్కల యిండ్లకుఁబోయి "మాపిల్ల మీయింటికి వచ్చినదా? మీ యింటికి వచ్చినదా?" యని యడిగెను. మాయింటికి రాలేదని కొందరు, వచ్చి యాడుకొని నాలుగు గడియల ప్రొద్దువేళనే వెళ్ళిపోయిన దని మరికొందరు చెప్పిరి. అంతకంతకు గంగమ్మకు భయమయ్యెను. కన్నుల నీరు పెట్టుకొనుచు గ్రామము నాలుగు మూలల వెదకెను. ఎవ్వరింటను బిడ్డ కనఁబడలేదు. నాగన్న కా వర్తమానము తెలిసి యతఁడు గూడ పరుగు పరుగున వచ్చి గ్రామమందలి గృహము లన్నియు వెదకుటయే గాక దొడ్లు, పొలములు, తోటలు, నూతులు, గోతులు వెదకెను.

ఎక్కడ వెదకినను బిడ్డ కనబడలెదు. బిడ్డ నెవ్వరొ ద్వేషముచెతనొ కాళ్ళనున్న చిన్నయందెల కాసపడియో చంపి పారవైచి యుందురని నిశ్చయించి యాలుమగలు మిగుల దుఃఖింప జొచ్చిరి. చుట్టుప్రక్కల వారందరు వారి నూరడింప వచ్చిరి. అన్నము వండుకొనక పొరుగువారు తమ యింటిలోఁ దినుమని బలవంత పెట్టినను దినక మూఁడుజాముల రాత్రివరకు శోకించి దుఃఖభారము చేతను నిద్రాభారము చేతను తెల్లవారు జామునఁ గన్ను మూసిరి. ఆప్తబంధువులు మృతి నొందుదురుగాక; సర్వస్వము నష్టమౌగాఁక ! మనుష్యుఁడు క్షుత్పి పాసానిద్రలకు మాత్రము లోఁబడక తప్పదుగదా! నాలుగు గడియలు వారికి గాఢమగు నిద్రపట్టెను. అప్పుడు పుల్లయ్య బుచ్చమ్మను భుజముమీఁదఁ బండుకొనఁబెట్టుకొని యెవ్వరు జూడకుండ నామెను నాగన్నగారి వీథి యరుగుఁమీఁద బండుకొనఁ బెట్టి పోయెను. బుచ్చమ్మ నిద్రావశమున నొడ లెరుఁగక యా యరుఁగు మీఁద గొంతసేపు పండుకొని మెలకువవచ్చి "అమ్మా! " యని పిలిచి గట్టిగా నేడువఁ జొచ్చెను. అప్పుడు నాగన్నకు మెలకువ వచ్చెను. అతడు తలుపు తెఱచి చూచునప్పటికి వెదకఁబోయిన తీఁగ కాళ్ళకుఁ దగిలినట్లు తనయరుఁగుమీఁదనే కనఁబడెను. "పిల్ల దొరికినది. పిల్లదొరికినది లేవవే!" యని కేకలు వేయుచు బిడ్డ నెత్తుకొని 'అమ్మాయి ! యెక్కడికి వెళ్ళినావు? ఎవరు తీసుకొని వెళ్ళినారు?' అని యడుగుచు లోపలకు దీసికొని పోయెను. గంగమ్మ భర్త కేకవిని, కలవరపడుచు లేచి "'ఏదీ నాచిట్టితల్లి వచ్చిందా?" యని విసవిస భర్తకడకుఁ బోయి యాతని చంకనున్న బిడ్డను దానెత్తుకొనెను. తల్లిం గౌఁగిలించుకొని బిడ్డయు, బిడ్డను గౌఁగిలించుకొని తల్లియు నేడ్చిరి. అంతలోఁ జుట్టు ప్రక్కలవారందరుఁ జేరిరి. అప్పుడు తూర్పునఁ దెల్లవారెను. కాకులు కూయఁ జొచ్చెను. బుచ్చమ్మ మెడలో మంగళసూత్రము లగుపడెను. "ఇవిగో ! దీని మెడలో మంగళసూత్రము లున్నవి. ఎవరో తీసుకొని వెళ్ళి దొంగపెండ్లి చేసి కొన్నారు కాఁబోలు! ఎవరోగాదు. మాయచచ్చినాఁడు గణపతిగాడే యింతపని చేయగలవాఁడు. వీడి పెళ్ళి పెడాకులు గాను! ఎంతపని చేసినాఁడు. ఇవిగో! చూడండి పుస్తెలు!" అని గంగమ్మ మంగళసూత్రములు భర్తకుఁ దమ్ముఁ జూడవచ్చిన వారికిఁ జూపించెను. చూచి నాగన్న "ఔనౌను! ఇదిగో కాళ్ళకు బసుపు కూడ కనఁబడుచున్నది. కన్నుల కాటుక గూడ కనఁబడుచున్నది. పిల్ల యేడుపు వలన కొంతవరకు కాటుక కరగిపోయినది. పాప మెంత యేడ్చినదో యెంత బెంగ పెట్టుకొని నదో! "అమ్మా! నిన్నెవరు తీసుకవెళ్ళినారు? " అని కూతుఁనడిగె. మూఁడేండ్ల పిల్ల యగుటచే బుచ్చమ్మ మాటలు సరిగ రాక "వోరోబ్బి బన్నిమీద తీచికెళ్ళాడు." అని బదులుచెప్పెను. ఆమెను గణపతియే తప్పక తీసికొనిపోయి దొంగపెండ్లి చేసికొని యుండునని యచటివారందరు నిశ్చయించిరి. నాగన్నకు దుఃఖము కోపము మనంబున మల్లడిగొని నందున నవి యాపుకొనలేక పండ్లు పట పట గొరుకుచు "నోరెరుగని బిడను దొంగతనముగా తీసికొనిపోయి పెండ్లి చేసికొని వీడు గృహస్థుడు కాదలచుకొన్నాడు కాఁబోలు! వెధవ పెండ్లి, బోడి పెండ్లి. ఆ వెధవ బ్రతుక్కు గృహస్థాశ్రమముకూడానా? ఆ పాడుముండకొడుకు ఘోటక బ్రహ్మచారియై చావవలసిందే గాని పెండ్లి కానిత్తునా? ఈపెళ్ళి పెళ్ళికాదు. ఆ వెధవ కిది పెండ్లాము కాదు. ఇదిగో! పెండ్లి పెడాకులు చేసినాను. నా కూతురికి నేను తిరిగి పెండ్లిచేయక మానను" అని మంగళసూత్రములు పుటుక్కునఁ ద్రెంచి పాఱవైచెను. అక్కడఁ జేరినవారిలో వద్దు వద్దా పని చేయవద్దని కొందరు, తుంటరిపని చేసినందు కా వెధవ కా శిక్ష కావలసినదే, యని కొందరు, శాస్త్ర మొప్పదని కొందరు, శాస్త్రము లేదు చట్టుబండలు లేవు, దొంగపెండ్లికి శాస్త్రమున్నదా? యని మరి కొందరు దోఁచిన

చొప్పున బలుకఁ జొచ్చిరి. ఆ పలుకులువిని నాగన్న యిట్లనియె "ఆ శాస్త్రము చెప్పఁగలవాఁ రెవరో రమ్మను, నాకడుపు మండిపోవుచున్నప్పుడు ఆ శాస్త్ర మెందుకు. మీ శాసాల్త్రు గీసాల్త్రు తుంగలో వూరతొక్కుతాను. శాసాల్త్రు దొంగపెండ్లి చేసుకోమని చెప్పినవా యేమిటి? స్వాములవారు వెలివేసినప్పుడు చూచుకుందాములే. ఇదివరకు నేను నా పిల్ల నెవరి కియ్యదలచుకొన్నానో యతనికే యిచ్చివేసెదను. చూడు నాదెబ్బ. నా కూతురికి తిరిగి పెండ్లిచేయుటేగాదు. గణపతిగాడు కంటికగపడ్డాడా, చంపి, నెత్తురు బొట్టు పెట్టుకొంటా ననుకోండి. నరసింహమూర్తి హిరణ్యాకశిపుని చంపి ప్రేగులు మెడలో వేసికొన్నట్లు వాడి ప్రేగులు నేను జందెముగా వేసికొనక మానను. సర్కారువారు న న్నురిదీసినను సరే. ఆ వెధవను నేను చంపక మానను. ఈ మారు వచ్చినాడంటే చచినా డన్నమాటే" అత డాలా గనుచుండ గంగమ్మ కంట దడిపెట్టుకొని గద్గద స్వరముతో నిట్లనియె. "ఒక్కగా నొక్క పిల్లగదమ్మా! అచ్చటా ముచ్చటా దీనివల్ల మాకు తీరు ననుకొన్నాము. సుఖముగా మే మిద్దరము పీటలమీఁద గూర్చుండి చేతులార బిడ్డను కన్యాదానము చేయవలె ననుకొన్నాము. ఇంతలో మాయచచ్చినాఁడు మారీచుడు లాగ వచ్చి వాడి పెండ్లి పెడాకులుగాను వాడి దుంప తెగిపోను! వాడి కల్యాణం నేలబడ ! నా పిల్లకోసం నేను నిన్న రాత్రి యేడ్చినట్లు వాడితల్లి వాడికోసం యెప్పుడేడ్చునో, వాడి గూనె దింప; వాడి తల్లికడుపు మాడ, వాడింట పీనుగు వెళ్ళ, మా కండ్లలో దుమ్ముపోసి మాణిక్యములాగు ఆడుకొనుచున్న దానిని యెత్తుకొనిపోయి పుస్తెకట్టినడమ్మా. వీడి తాడు కోటిపల్లిరేవులో పుటుకు పటుక్కున తెంప! వాడి పిండాకూడు పిల్లులు తినిపోను. వాడి వంశము నిర్వంశముగాను. అంతంత మాటలడకూడ దంటారేమో మీరు. మేము వాడిచేత వాడి తల్లిచేత మహాకష్టాలు పడిపడి యున్నాము. అందుచేత నా ప్రాణం విసిగిపోయింది. ఆ చండాలపు ముండాకొడుకు నే మన్నప్పటికి తప్పు లేదు."

అనుచు గంగమ్మ గంగాప్రవాహమువంటి శాపపరంపరను నోటనుండి వెలివరచుచుండ నాగన్న తన తిట్ల చేత నామె తిట్లకు వన్నెపెట్టుచు గొంతు బొంగుబోవునట్లు మేనల్లుని చంపుదు నని తోడబుట్టిన పడుచుని జంపివేయుదు నని ప్రతినలు సలుపుచు వీథి ప్రహ్లాద నాటకములో నరసింహమూర్తి చిందులు త్రొక్కినట్లు చిందులఁ ద్రొక్కి పరుగు లెత్తినట్లు పరుగులెత్తెను. నరసింహమూర్తిని బట్టుకొన్నట్లు చూడవచ్చినవారాయనను బట్టుకొని నాటకము సమాప్త మైన దని ప్రేక్షకులొక్కరొక్కరే వెడలిపోయిరి. అన్నగారి ప్రతిజ్ఞలను, వదినెగారి తిట్లను గణపతియొక్క తల్లి ప్రక్కయింటి దొడ్డిలోనుండి విని, తన సోదరుఁడు కొడుకుం జంపివేయు నేమో యని భయపడి చప్పు చప్పున సోదర జ్ఞాతి యగు పుల్లయ్య యింటికిఁబోయి "పుల్లయ్యన్నయ్యా! నా మాటేమి చెప్పినావురా, నాయనా! గణపతిని మావాడు చంపి నెత్తురు బొట్టు పెట్టెకుంటా నని ప్రతిజ్ఞ చేసినాడు. నాబిడ్డను బ్రతికించరా, నాయనా! నాకు పుత్రభిక్షము పెట్టరా నాయనా! నే నేమి జేతునోయి పుల్లయ్య తండ్రీ ! నా గణపతిని నాకప్పగించవోయి పుల్లయ్యతండ్రీ! ఈ పెండ్లి వాడి ప్రాణముకోసమొచ్చింది గాబోలునోయి నాయనా? పెండ్లి లేకపోయినా బ్రతికిపోదువోయి తండ్రీ! వాడెక్కడున్నాఁడో చూపించవోయి తండ్రీ! వాడు కనబడకపోతే నేను బ్రతకలేను, నాయనా!" యని పలువిధముల విలపించి వానిని రక్షింపుమని వేడికొనెను. ఆమె దీనాలాపములువిని పుల్లయ్య "ఓసీ వెఱ్ఱి ముండ! నీవింత తెలివితక్కువదానవు గనుకనే వాండ్లు నిన్నీ లాగున యేడిపించినారు. నాగన్న పరవళ్లు తొక్కగానే సరటే? చంపుతా ననగానే చంపగలడా? నెత్తురు బొట్టు పెట్టుకోగలడా? ఈ యవక తవక కూతలకు కోతలకు వట్టి

వెఱ్ఱిముండవు గనుక నీవు భయపడు చున్నావు కాని యెఱిగిన వా రెవ్వరు భయపడరు. వెధవ నాగన్న కాఁబోలు వెలఁదిమగఁడు' అన్నట్లు నాగన్న సంగతి యెవ్వ రెఱుఁగరు. వీరు గణపతిని చంపితే సర్కారువా రూరకుందురా? భయపడకు వెళ్ళు. గణపతి ప్రాణానికి నా ప్రాణ మడ్డము వేయగలను. ఏ భయము లేదు. మంగళసూత్రాలు తెంపివేసినాడు గాఁబోలేమి? తెంపనీ తెంపనీ ! కోర్టులో వ్యాజ్యము వేసి నాగన్న తాడు నేను తెంపుతాను. నీవు వెళ్ళు భోజనముచేసి, మా యింటికి రా. గణపతిని నేను తీసికొనివచ్చి నీ కప్పగింతునులే" యని ధైర్యము చెప్పి యామెను పంపెను.

పంపి, యానాటి సాయంకాలము బయలుదేఱి పుల్లయ్య వానపల్లి వెళ్ళి మహాదేవశాస్త్రి యింట మనుకుడుపు పెండ్లి కొడుకైయున్న గణపతిని జూచి మేనమామ యాడిన నాటకమంతయు దెలిపి యిట్లనియె,--

"నీ మేనమామ మోటముండకొడుకు. నీవు కంటబడితివా చప్పున దుడ్డు కఱ్ఱతో బుఱ్ఱ బద్దలు కొట్టగలఁడు. నెత్తి పగిలెనా ప్రాణము పోగలదు. తల్లి కొక్కడవు. ఆ ముసలి ముండ నిన్నే నమ్ముకొని యున్నది. కనుక నీవా గ్రామము పది దినములదాఁక రావద్దు. కాని మీ యమ్మ నిన్ను చూడవలెనని యేడ్చుచున్నది. దానినే నీదగ్గరికి పంపించెదను. పిల్ల పుస్తెలు తెంపివేసినా డని విచారింపకు ! నే నెక్కడో నొక చోట పిల్లను మాట్లాడి నీకు మరల వివాహము చేసెదను. ఒక వేళ నిన్నెవరైన పిలిచి పిల్లను దొంగతనముగా దీసికొని వచ్చి నీ కెవరు పెండ్లి చేసినారని అడిగిన పక్షమున నా పేరు చెప్పకు. నా కొంప ముంచకు. నాగన్న నా కొంప ముంచగలఁడు. ఏ పొలమో వెళ్ళి వచ్చునపుడు దారిలో నా తల పగుల గొట్టగలఁడు. ఈ మాట గట్టిగా జ్ఞాపకముంచుకో." అని నొక్కి నొక్కి చెప్పి, తన పేరు బయట పెట్టకుండునట్లు చేతిలోఁ జేయి వేయించుకొని, మరునాఁ డుదయమున నింటికి వచ్చి గణపతి క్షేమముగా నున్నాఁడని శుభవార్త తల్లి కెఱింగించెను. తల్లియుఁ గుమారుని జూడఁ గోరినందున నొక కూలివానిని సాయమిచ్చి యామెను వానపల్లి పంపెను. ఆమెయు గూలివాని సాయమున వానపల్లి చేరి, మహాదేవశాస్త్రి గృహమున కరిగి పోత విగ్రహము వలె వీధి యరుగుమీఁద గూర్చున్న కుమారునిఁ జూచి, కౌఁగిలించుకొని యిట్లు విచారించెను. "నా తండ్రీ! పసుపు పారాణి కాళ్ళకు పెట్టుకొని, మొగమున కళ్యాణపు బొట్టు పెట్టుకొని కన్నులకు కాటుకపెట్టికొని బుగ్గను చుక్క బెట్టికొని, పల్లకిలో కూర్చుండగా చూడవలె నని యెంతో అంత ముచ్చటపడితిరా, నాయనా! నా కన్నులు కాలిపోను. ఆ యదృష్టము నాకు లేదురా, నాయనా! తక్కువ నోములు నోచినవారి కెక్కువ ఫలములు వచ్చునటరా, నాయనా! వంశము నిలుచు ననుకొన్నానురా నాయనా! పుల్లయ్య మన కుపకారం చేసినాడు గాని దైవమోర్చలేదురా, నాయనా! ఆ దుర్మార్గపు ముండకొడుకు మంగళసూత్రాలు తెంపి వేసినాఁడు, వాడిచేతులు పడిపోను ! పోనీ విచారించకు, నాయనా పెండ్లి కాకపోతే బ్రహ్మచారివై యుందువుగాని, నాకంఠములో ప్రాణ మున్నట్టయిన నిన్నేదో విధముగ గృహస్థుని చేయక మానను; నీవు బెంగ పెట్టుకోకు" అని యూరడఁబలికి గణపతిని ముద్దు పెట్టుకొని, యతఁడు దోడ్కొనిపోవ మహాదేవశాస్త్రి గారి లోపలికిఁ బోయి శాస్త్రి యొక్కయు, వారి యాఁడువాండ్ర యొక్కయు సన్మానము బడసి యాపూట నచ్చట నత్తెసరు పెట్టికొని భోజనము చేసెను. భోజనానంతరమున మాతాపుత్రులు తమ భవిష్యజ్జీవనమును గూర్చి గట్టిగా నాలోచింపఁ దొడఁగిరి. ఏనుఁగులమహాలులో నున్న పక్షమున మేనమామ తప్పక చంపి

వెయు నని భయము పుట్టెను. మఱియొక చోటికిఁ బోయిన పక్షమున నక్కడ జీవనోపాధి యెట్లని సంశయము పొడమెను. ఆ పూట వారి కాలోచనలు తెగలేదు. నాఁటి రాత్రియు మరునాడును గూడ వా రా విషయమై యాలోచించిరి గాని యిదమిత్థమని నిర్ణయింపలేక పోయిరి.

# పదిహేనవ ప్రకరణము

గణపతి మేనమామకూతుఁ నెత్తుకొనిపోయి దొంగ పెండ్లి చేసుకొనుటచేత నతఁడు నీచుఁ డని చదువరులు తలంచు చున్నా రేమో యని భయమగుచున్నది. ఇతర చారిత్రములు బట్టి యతఁడు నీచుఁడో ఘనుఁడో చదువరులు నిర్ణయింపఁనగును గాని, యీ వివాహముచేతనే నీచుండని నిర్ణయింపరాదు. ఏలయన దమకు గూర్చునట్టి కన్యల దొంగిలించుకొనిపోయి పెండ్లియాడిన వారిలో గణపతియే ప్రప్రథముఁడు గాఁడు. ఈతనికంటె బూర్వులనేకులు గలరు. కలరని చెప్పినంతమాత్రమునే కథకునిపై గౌరవము కలిగి యాతని వాక్యంబులు పరమప్రమాణంబు లని విశ్వసించునట్టి మంచికాలము గతించుటచేతను దగిన దృష్టాంతరములు, నుదాహరణంబులు చూపినం గాని యెట్టివారి మాటకైన జిన్న పిల్లవాఁడు సైతము నమ్మని పాడుదినములు వచ్చి యుండుట చేతను నట్టివారు పూర్వు లనేకులు గల రని ఋజువు చేయుటకుఁ గొన్ని యుదాహరణము లిచ్చుట మంచిది. ధర్మసంస్థాపనంబు జేసి శిష్టజనుల ననుగ్రహించి, దుష్టజనుల నిగ్రహించి, భూభారమడంచు తలంపున శ్రీమన్నారాయణాంశమున మహీమండలమున యదుకులమున నవతరించి, కంసశిశుపాల దంతవక్త్ర జరాసంధ ప్రముఖులైన దుష్టుల బరిమార్చి, బ్రహ్మర్షి రాజర్షి దేవర్షి గణములచేతను, భీష్మాదులచేతను గొనియాడబడిన వాసుదేవుడు విదర్భరాజు శిశుపాలున కియ్యఁ దలంచిన రుక్మిణి నెత్తుకొనిపోయి వివాహము జేసికొనుట జగత్ప్రసిద్ధమే కదా! మహేంద్రుడు పుష్కలావర్త మేఘములతో వచ్చినను వాని నొక పూరికైనఁ గొనక ఖాండవవన మగ్నిహోత్రున కర్పించిన ధైర్యసాగ రుఁడును, నివాతకాలకేయాది దానవులను నిర్జించిన మహాధనుర్ధరుడును, ముక్కంటిని గెలిచి పాశుపత మహాస్త్రమును గైకొన్న బాహుశాలియు, గాండీవ మను తెప్పచేత కౌరవసేనాసముద్రము నీఁదిన మేటికోవిదుఁడును, తాను మూర్ధాభిషిక్తుఁడు గాకున్నను దేవేంద్రుని యనుగ్రహమునఁ గిరీటంబు సంపాదించి కిరీటి యను సార్థక నామము బడసిన విఖ్యాతుఁడును నగు పాండవమధ్యముఁడర్జునుఁడు వాసుదేవుని చెలియలగు సుభద్ర నెట్లు వివాహమాడె? శ్రీకృష్ణ బలరాములుం దక్కిన యాదవులు నింటలేని సమయంబున సుభద్రను దొంగతనముగా దీసికొనిపోవలేదా? తన మార్గము నవరోధించిన యాదవులను దండింపలేదా? కురుకుల శిఖామణి యని చెప్పదగిన దుష్యంతుడు కణ్వమహాముని యాశ్రమముజేరి, మాయలు మర్మము లెరుఁగని శకుంతలను మచ్చికచేసి; యిచ్చకములాడి మనసు మెత్తపరచి, పెంపుడుతండ్రి యింటలేని తరి నామెను జేపట్టలేదే? అవి యెవ్వ రెరుంగని రహస్యములు? ఈ పురాణపురుషుల మాట యటుండనిచ్చి సామాన్యుల విషయ మించుక విచారింతము. వత్సదేశముల కధీశ్వరుండైన యుదయనమహారా జొకానొక కారణంబున నుజ్జయినీ పురాధీశ్వరుండైన ప్రద్యోతన మహారాజు నింటఁ గొంత కాలముండి యాతని కూతుఁ రగు వాసవదత్తకు గానము నేర్పుటకై యామె తండ్రిచేత నియుక్తుడై, రాగములు నేర్పుటకు మారుగా ననురాగంబు నేర్పి యెట్టకేలకు నామెను దన వశము జేసికొని యర్ధరాత్రమునఁ గోట గోడలు దాటించి తీసికొనిపోయి పరిణయము జేసికొనెను. నరనారాయణాంశ సంభూతులగు పార్థవాసుదేవులును, నుత్తమక్షత్రియుడైన వత్సరాజును, వివాహము నిమిత్తము కక్కుర్తిపడి దొంగపనులు చేయఁగాఁ దనకుఁ బెండ్లి కాదను భయమున గణపతి వంటివాడు కక్కుర్తిపడి పిల్ల నెత్తుకొని పోవుట తప్పా? కృష్ణార్జునులు రాక్షసవివాహములు చేసికొని రనియు, దుష్యంతుడు గాంధర్వవివాహము చేసికొని ననియు,

శాస్త్రము లా వివాహము లంగికరించు చున్న వనియు మి రనవచ్చును. మహాపురుషులు చెసిన యపరాధములకు మహర్షు లేదో గతి కల్పించిరి. గాని మా గణపతి చేసిన పనియే చేసిరి. వారి కార్యములు దోషములైన పక్షమున వీని కార్యములును దోషము లగును. వారి వివాహములు నిర్ధుష్టములయిన పక్షమున వీని వివాహము నిర్దుష్ట మగును.

ఇది యటు లుండనిండు. గణపతియొక్క భవిష్యజ్జీవితమును గూర్చి విచారింతము. మాతాపుతుల్త్రు మూడుదినములహోరాత్రములు విచారించి, పౌర్వాపర్యములు బరీక్షించి, యౌగాముల నరసి, మంచిచెడ్డలు మదిలో దర్కించి, మహాదేవశాస్త్రి యొక్క యాలోచనం గూడఁ గైకొని యేనుఁగుల మహాలు విడిచి, వానపల్లి గ్రామమున నివాసము చేయుటకు నిర్ధారణ చేసిరి. తరువాత వానపల్లిలో జీవన మెటులు జేయవలె నని ప్రశ్న వచ్చెను. వచ్చుటయు తల్లి కుమారుని జూచి 'నాయనా! యాయవారము జేసికొని బ్రతుకవచ్చును. అక్కడ మాత్రమిప్పు డందల మెక్కుచున్నామా యేమిటి? రెండు పొట్టలు గడవక పోవునా? బ్రతికితే బలుసా కేరుకొని తినవచ్చును. ఆ దుర్మార్గుని చేతిలో బడకుండ మరెక్కడ నున్నను మంచిదే. దుష్టులకు దూరముగా నుండు మన్నారు పెద్దలు!' అని చెప్పెను. చెప్పుటయు గణపతి చివాలున లేచి "నేను యాయవారము చేయను. ఎల్లకాలము యాయవారమేనా? నేను వట్టి పనికిమాలిన వెధవ ననుకొన్నావా యేమిటి, యాయవారము చేయుటకు? ఈ యూరిలో బడి లేదు. ఇక్కడ బడిపెట్టి చదువు చెప్పుదును. నాలుగు రోజుల నుండి నేను చూచుచున్నాను. పిల్లలందరు గాడిదల లాగున తిరిగి చెడిపోవుచున్నారు. వాళ్ళందరిని బాగుచేయవలె నని యున్నది. చెంబు మూల పడవైచి బెత్తము చేతితో పుచ్చుకోవలెను. ఇదే నా వృత్తి. ఈ యూరువారుకూడ బడిపెట్టు మని నన్ను బలవంత పెట్టుచున్నారు. మహాదేవశాస్త్రి గారు కూడ ఆమాటే అన్నారు. ఆయన నాకు వివాహ విషయములో యెంత యుపకారము చేసినారు! గనుక వారి గ్రామమునకు నే నీ యుపకారము చేయక తప్పదు. గనుక నీవు మన యూరు వెళ్ళి సామానులు తెప్పించు. ఆ నాగ్తన్నగా డున్న గ్రామంలో మన ముండకూడదు. వాఁడు వట్టి దుర్మార్గుడు. అతని మొగం చూచినవారి కన్నము దొరకదు. ఈ గ్రామములో హాయిగా నుండవచ్చును." అనవుడు "సరే మంచిది. అలాగే చేయవచ్చు" నని నాటి మధ్యాహ్నము బయలుదేరి యామె యేనుగుల మహాలు వెళ్ళెను.

వెళ్ళి పుల్లయ్యను గలిసికొని యతని సహాయమున నొక బండి దెప్పించి దానిమీద తన సామాను లన్నియుఁ బడవైచెను. ఆ సామాను లెవ్వియో చదువరులు తప్పక యెరుఁగ గోరుదురు. కాన నందు ముఖ్యమైనవి పేర్కొనుట సమంజసము. పాత్రసామానులు చెప్పఁదగిన వెవ్వియు లెవు. వరతంతు మహాముని శిష్యుఁడైన కౌత్సుం డను మునికుమారుడు యాచించ వచ్చి నప్పుడు రఘు మహారాజు వేనిలో నర్ఘ్యపాద్యములు పెట్టుకొని సంభావించెనో యాపాత్రలె వంటకు నీళ్ళకు వారి యింట నుపయోగపడు చుండుటచే నవి పొరుగూరునకు దీసికొని పోఁదగినవని కావనిఁ యింటివారికిఁ గొన్ని, చుట్టుప్రక్కలవారికిఁ గొన్ని దానముచేసి తక్కిన సామానులు మాత్రమే యామె బండిలోఁ బెట్టెను. అవి యెన్ని యన చాలాచోట్ల తోలూడిపోయి రెండు మూఁడు చిల్లులుగల బోనముపెట్టె యొకటి, మూతలేని తాటియాకుల పెట్టె యొకటి, చెవులు విరిగిన ప్రాత రాచిప్పలు రెండు, చిల్లు లుండుటచే గూటిమైనము మెత్తిన యిత్తడి చెంబులు రెండు, యక్షయపాత్ర చెం బొకటి, యుప్పు పోసుకొను కర్ర తొట్టె యొకటి, యంచు జవయూడి మూలలు చిల్లులుపడిన చేఁటలు రెండు, కఱ్ఱ సోల యొకటి, ప్రాత జల్లెడ యొకటి,

జల్లెడవలె తూట్లుపడిన ప్రాత కంబళి యొకటి. ఒకకోడు విరిగిపోయిన నులకమంచము కుక్కి యొకటి. కాడసగము విరిగిపోయిన యినప గరిటె యొకటి. గ్రంధి యూడిపోయిన పీట యొకటి, బల్లచెక్క యొకటి, ఒక సన్నెకల్లు, పొన్నూడిపోయిన రోకలి యొకటి, మరియు నాలుగు మూఁడు తాఁటియాకు బుట్టలు, రెండు మూఁడు వెదురువేళ్ళ బుట్టలు గూడ నుండవచ్చును. ఈ సరుకులు బండిమీఁద వేయించుకొని యామె తాను సోదరుని గృహము వెడలివచ్చిన తరువాత తనకుఁ గుమారునకుఁ దల దాచుకొనుట కిల్లిచ్చి సాయముచేసిన యా యిల్లాలిని పలు తెరంగుల గొనియాఁడి యామెను వీడ్కొని పుల్లయ్య చేసిన మేలునకు వానిని గూడ కొంతతడవు ప్రశంసించి వానికడ సెలవు గైకొని పుట్టినింటివారిఁ దలంచి "వాండ్రు నా యుసురుగొట్టి, పోకపోదురా! ఆఁడుపడుచు నేడిపించినవాళ్ళ వంశములు నాశనము గాకమానవు. దాని పుట్టిల్లుగూడ బుగ్గి యైపోవలె. నా యాశలాగె దాని యాశలుగూడ అడుగంటిపోవలె. దాని కడుపుకాలిపోవలె. దాని వాళ్ళందరు వల్ల కాటిపాలై పోవలె" అని తోచినట్టు తిట్టి "పుల్లయ్యతండ్రీ ! యేనుగుల మహలుకు నాకు ఋణము నేటితో దీరిపోయినది. ఈ పాటిమీఁదనే చావవలె ననుకొన్నాను. ఈ పాఁటిమీదనె మట్టి కావలె ననుకొన్నాను. మా వెధవ నాగన్న మూలమున, ఊరికి దూరమై దేశాలపాలై దిక్కుమాలిన పక్షినై పోవలసివచ్చినది. మా సంగతి కొంచెము కనుక్కో నాయనా ? అన్నింటికి నీవే మా "కని యేడ్చి బండియెక్కి పోయెను. గణపతి వానపల్లి పొలిమేరవద్ద కెదురుగ వచ్చి బండి తోలించుకొని మహాదేవశాస్త్రి గారి యింటి కరిగి సామాను దింపించి వారి పడమటింటి వెనుక పంచపాళిలో పెట్టించెను. మహాదేవశాస్త్రి వెనుక పంచపాళి వారికి బసగ నిచ్చెను. సన్యాసి పెండ్లికి జుట్టుదగ్గరనుంచి యెరువన్నట్లు గణపతియొక్క సంసారమునకు వండికొను కుండ దగ్గర నుంచి యెరువె. వంటకు రెండు మూడు కుండలు దాకలు మూకుళ్లు కొనుటకయిన వారి దగ్గర డబ్బులు లేవు. బండి కిరాయి పుల్లయ్య యిచ్చినందున వారు సామాను తెచ్చుకోగలిగిరి. మహాదేవశాస్త్రి వారి పేదస్థితి నెరిఁగి రెండు మూడు కుండలు తెప్పించి వారి కిచ్చి మరునా డుదయమున తనకు మిత్రులయిన బ్రాహ్మణులను గాపులను జేరబిలిచి యిట్లనియెను. "ఈ గణపతిగారు మన గ్రామములో బడి పెట్టదలఁచు కొన్నారు. అలాగున పెట్టుమని నేనే బలవంతం పెట్టినాను. మన గ్రామములో బడి లేక పోవుటచేత మన పిల్లలు చెడిపోవుచున్నారు. ఈయన చాలా పేదవాడు. అందుచేత మన మందరము ముందుగ గణపతి గారికి కావలసిన ధాన్య మీయవలెను. నా మట్టుకు నేను రెండుకుంచాల ధాన్య మిచ్చెదను. మీ రందఱు తల కొక కుంచెడు రెండుకుంచములు నిచ్చి పాప మా పేద బ్రాహ్మణుని మన గ్రామములో నిలపండి. ఈలా గిచ్చినందువల్ల రెండు విశేషము లున్నవి. ముందుగా బ్రాహ్మణునకు సహాయము చేసెడు వల్ల గలిగెడు పుణ్యా మొకటి, మన పిల్లలకు విద్య వచ్చుట యొకటి. అందుచేత స్వలాభ మాలోచించుకొని గాని పుణ్యాము వచ్చునని కాని మన మీ సాయము చేయవచ్చును. 'బ్రాహ్మణున కిచ్చుట యనఁగా మనము ముందు జన్మమునకు దాఁచికొనుట ' అని యుపదేశించుటయు నచ్చట చేరిన వారందరు యధాశక్తిగ ధాన్య మిచ్చిరి. మహాదేవశాస్త్రి మాత్రము తన రెండు కుంచముల ధాన్య మీయలేదు. కాని మాటసాయము చేసి యిప్పించి నందుకు మనము సంతసింపవలెను. మాతాపుత్రులయొక్క భోజన ప్రమాణము వారి యాకారములకు వయస్సునకుఁ దగని దగుటచే పదికుంచముల ధాన్యము దంపుకోగా వచ్చిన బియ్యు మైదు కుంచములు పదిపన్నెండు దినములలోనె యైపోయెను. భోజనము నిమిత్తమే గాక వారికి గావలసిన సమస్త వస్తువులు గొనుటకు బియ్యమే

యుపయోగ పడుచుండెను. ఉప్పు మిరపకాయ చింతపండు మొదలగునవి యెల్ల బియ్య మిచ్చియే కొనవలసి యుండెను. అదిగాక చిరుతిండి తినుటలో గణపతియు తల్లియు నొకరి కొకరు తీసిపోరు. ఈతపండు రేఁగుపండు చెరుకు ముక్కలు నేరేడుపండ్లు మామితాండ్ర తాటిచాప కొబ్బరి కురిడీలు మొదలగున వేవి వీధిలోనికి వచ్చినను తల్లి యరసోలెడు బియ్యము బోసి కొని తిని తీరవలయును. ఈ విధముగ సంసారము చేయుచుండుటచే వారి కిచ్చిన ధాన్య మాటుట కష్ట మయ్యెను. ఏఁడాదికి గ్రామవాసులు పుట్టెడు ధాన్య మిచ్చునట్లు మహాదేవశాస్త్రి యేర్పాటుచేసి మూడు మాసముల కొక యేదుము ధాన్యము చొప్పున నిచ్చుటకు నిర్ణయము చేసి ముందుగ నొక యేదుము వారి కిప్పించి తమ యరుగుమీఁదనే బడి పెట్టించెను.

# పదహారవ ప్రకరణము

బడి పెట్టకమునుపె గణపతి కాలువయొద్దునకు బోయి మంచి యీతబెత్తములు రెండు మూఁడు విరిచి యాకు లూడదీసి నున్నగా జేసి యెకటి చేత బట్టుకొని బడికివచ్చి కొబ్బరి యాకుల చాపమీద గూర్చుండెను. ఉపాధ్యాయుని రూపురేఖా విలాసములు చూచినతోడనే బెత్తపుదెబ్బ లక్కఱలేకయె బాలకుల కడలు జనించెను. ఈ బెత్తము చేతబూని కూర్చుండిన గణపతి బాలురకు సాక్షాద్దండధరుఁడట్లు తోఁచెను. పంతులు దండధరుఁ డైనపుడు పాఠశాల యమలోకము నరకలోకము నగుట యొక యాశ్చర్యములోనిది కాదు. అక్షరములు రాని పిల్లల కక్షరములు బూడిదలోవ్రాసి యివ్వవలసిన దనియు వ్రాసిన యక్షరములు దిద్దించి నోట పలికించవలసిన దనియు పుస్తకములు పట్టిన పిల్లలకు గణపతి యాజ్ఞాపించెను. బాలబోధ చదువువారికి రెండవ పాఠపుస్తకము చదువువారిని గురువులుగఁ జేసెను. ఇంటిదగ్గఱ తల్లి దండ్రులయొద్ద రుక్మిణీకల్యాణము దాశరథీ శతకము మొదలైనవి చదువుకొనివచ్చినవారిని వారికంటెఁ గ్రిందివారి కొజ్జలుగ నేర్పఱచెను. తాను కలము కాగితముబుచ్చుకొని గాని యాకుగంటము బుచ్చుకొని గాని యెన్నఁడు వ్రాసి యెఱుఁగడు. వ్రాత వ్రాయవలసి వచ్చినపుడు పెద్దపిల్లలచేత చిన్న పిల్లకు వరవళ్ళు పెట్టించును. ప్రధానోపాధ్యాయుఁడు పాఠశాలలో బాఠములు చెప్పకుండ దానొక యుపద్రష్టయై సర్వము జక్కఁగా జరుగుచున్నదో లేదో కనుగొనవలసినదని నేటికాలమున బయలువెడలిన క్రొత్త సిద్ధాంతమును మొట్టమొదట కనిపెట్టిన మహాత్ముఁడు గణపతియే యనిమీరు నిశ్చయముగ నమ్మవలయును. గణపతి బడికి బోయినది మొదలుకొని గోడకు జేరబడి థౌడలు నొప్పులెత్తు వఱకుఁబొగచుట్టలు కాల్చును. థౌడలు నొప్పులెత్తిన తరవాత గోడకు జేరఁబడి కొంతసేపు చాపమీఁదఁ బండుకొని నిద్రపోవును. పిల్లల యల్లరి వల్లగాని దానంత టదిగాని నిదుర మెలఁకువ వచ్చిన తరువాత రామరావణ మహా సంగ్రామమున బలాత్కారముగా నిద్ర నుండి మేల్కొలుపఁబడిన కుంభకర్ణుఁడు వలె నల్లరిచేసిన వారిని జేయుని వారిని గలిపి దూదేఁకిన తెఱగున నేకి విడిచిపట్టును. బడి కాలస్యముగ వచ్చినవారిని "నీవింత జాగేల చేసితి" వని బాదును. ముందుగ వచ్చికూర్చుండినవారిని "వెధవ నీ కేమీ పనిపాటలు లేవటరా, యింటిదగ్గఱ?" యని మోదును. పాఠము తిన్నగఁ జదువని వానిని చదవనందుకు శిక్షించును. గబగబ పాఠ మప్పగించిన వారిని "వెధవ ! వెనకనుంచి నిన్నెవరైన దఱుము చున్నారా, యేమిటి? అంత తొంద రెందు" కని దండించును. పాఠము మెల్లగా నప్పగించినవారిని "గాడిద, నీ వన్నము తినలేదా? లంఖనాలు చేసినావా? మాట హీనస్వరముగ వచ్చుచున్న దేమి? యని తన్నును. పాఠము బిగ్గరగ జదివినవారిని "మొండివెధవ ! నేను చెవిటివాఁడ ననుకొన్నావా యేమిటి? దాకపిడతలాగున నోరు తెఱచి దయ్యపు గొంతుతో ఆలాగున నఱచెద వెందు?" కని దండప్రయోగము చేయును. ఇన్ని మాట లెందుకు. బడిలో నున్నంతసేపు ప్రతిపిల్లవాఁడు తన వీపుమీఁద నిప్పు డప్పు డనక యిందు కందు కనక బ్రతిక్షణము దెబ్బ పడుచున్న దని తలంపవలసినదే. పంతులువారు చాప మీఁద నుంచి లేచిరనఁగానె పిల్లల గుండెలు పీచుపీచు మనుచుండును. దినమునకు నాలుగై దీతబెత్తములు విరుగుచుండును. బెత్తములు విరిగినప్పుడు కలములతో నెత్తురు వచ్చునట్లు పొడుచును. కలములు లేనప్పుడు గంటము మొదలు గూడ నాయుధము లగును. బందుల పలకలు బోడి పలకలు తాటియాకు పుస్తకములు పుస్తకములను గట్టెడి త్రాళ్ళు చీపురుకట్టలు మొదలగున వన్నియు, ధనుర్వేద పారంగతునకు గడ్డిపరకలు మొద

లైనవి యస్త్రములైనట్టు వానికి బరికరము లగుచువచ్చెను. అవి దొరకినప్పుడు చెతితొ చరచును. పిడిగ్రుద్దులు గ్రుద్దును. తొడపాశములు పెట్టును. చెవులు పెనవేయును. స్తంభమునకు గట్టి పెట్టి చింతబరికెలు తెప్పించి వెన్ను నెత్తురు గ్రమ్మునట్లు కొట్టును. కోదండము తీయించును. ఎండలో నిలువబెట్టి మీఁద రాళ్ళెత్తును. గోడకుర్చీలు వేయించి వారిపై బాలకులఁ గూర్చుండబెట్టును. కొందఱను వంగబెట్టి కాలికి మెడకు లంకెవేయును. వెయ్యేల! పాపకర్ముల నిమిత్తము యమధర్మరా జెన్ని నరకముల నిర్మించెనో గణపతి తన శిష్యుల నిమిత్త మన్ని దండనలు సృజించెను. తమ బిడ్డలయందు మితిలేని ప్రేమగల గ్రామవాసు లప్పుడప్పుడు పాఠశాలకు బోయి "యేమండీ పంతులుగారూ ! మాపిల్లవాని నంత దారుణముగఁ గొట్టినా రేమి? పిల్లవానివల్ల తప్పులుండవచ్చును. ఉన్నంతమాత్రముచేత నింతచేటు కొట్టుదురా? శరీర మంతట వాతలు బెట్టినట్టు దద్దురులు దేలినవి. అంత మోటదనమా? పసిబిడలు నోరులేనివాళ్ళు చచ్చిపోగల" రని మందలింప గణపతి యుగ్రుడై తారాజువ్వవలె లేచి కోపావేశమున మాటలు తడబడ "మీ పిల్లవాఁడు వట్టి వెధవ. ఆ వెధవను నే నెలాగైన బాగుచేయవలె నని భయభక్తులు చెప్పుచున్నాను. ఈ లాగున వానిని మీరు వెనుక వేసికొని వచ్చి నాతో దెబ్బలాడితే యా వెధవకు భయముండునా? ఛీ! పుణ్యమునకు బోతే పాప మెదురుగ వచ్చినది. ఉపకారమున కివి రోజులు కావు. పిల్లవానిని బాగుచేసినా నని విశ్వాసము లేదు. సరిగదా మీదు మిక్కిలి దెబ్బలాటలకు వచ్చినారా, నా మీఁదికి? మీ పిల్లవాఁడు నా బడిలోనికి రానేవద్దు. తీసుకొని పొండి. పోరా వెధవా! యని లేవగొట్టెను. ఒక పిల్లవాఁడు రెండుదినములు బడికి రాక మూడవదినమున వచ్చినందుకు గణపతి వానికి బుద్ధివచ్చుటకై జుట్టుకు త్రాడువోసి వానిని దూలమునకు గట్టెను. ప్రాతచేఁదత్రా డగుటచే వెంటనే తెగిపోయెను. పిల్లవాఁడు క్రిందపడెను. ఆ పాటున నొడ లెల్ల గాయము లయ్యెను. దెబ్బ తగులక పోయినను తగిలిన ట్లేడ్చుచున్నావా దొంగ వెధవా!" యని పైగా బెత్తముతో రెండు వడ్డించెను. వాఁడు గోలపెట్టి పెద్దపెట్టున నేడువసాగెను. పదుగురు బడిచుట్టు జేరిరి. "దయా దాక్షిణ్యము లేక పశువును గొట్టిన ట్లీ విధమున గొట్టవచ్చునటయ్యా! యని కొందరయ్యలు గణపతిని బ్రశ్నింప గణపతి యాక్షేపణ పూర్వకముగ వారి కిట్లనియె. "కుండలో కూడు కుండలో నుండవలె, పిల్లవాడు దుండుముక్క వలె నుండవలె నన్నారఁట" వెనకటికి ! మీ మాట లాలాగున నున్నాయి. బెత్తము దాచినానా పిల్లవాఁడు చెడిపోయినాడన్న మాటే. ఈలాగున చిత్రవధ చేయుచున్నప్పుడే యీ విధవ లింత పొగరెక్కినారు. నేనూరకుంటినంటే వీళ్ళ ముందర లోకా లాగుతాయా! అతికాయుఁడు మహాకాయుఁడు వంటివాళ్ళీ వెధవలు. ఈ మాత్రమునకే మీరీలాగున భయపడుచున్నారు. నా చిన్న తనములో మా గురువుగారు చేసిన శిక్షలలో నిది యెన్నోవంతు? ఒకనాఁడు మా గురువుగారు గరిటె కాల్చి వాతలు పెట్టినారు. ఒకనాడు ముంతపొగ పెట్టినారు. గోడదగ్గర నేను కూర్చుండగా నా తల గోడకుపెట్టి గొట్టినారు. ఒక నియోగుల కుఱ్ఱవానిని జునపములు పట్టుకొని కొట్టగా జునపము లూడి చేతిలోనికి వచ్చినవి. ఒక కుఱ్ఱవానికి పాఠము రాకపోతే చముదు కాల్చిపోసినారు. ఒక పిల్లవాడు చదువకపోతే కాల్చే కాల్చే చుట్టతో చంటిపిల్లలకు దెబ్బ వేసినట్టు వేసినాడు. ఇంత చేసినప్పటికి మేమేడ్వవలనుగాదు. నోట్లో గుడ్డలు క్రుక్కేవారు. పోనీ చంటిపిల్ల లేడ్చిపోదు రని జాలిచేత నట్టి పద్ధతు లవలంబించనే లేదు. పిల్లలంటే నాపిల్లలే. నేనుపూర్వపు వాళ్ళవలె నంత కఠినపద్ధతులు నేడవలంబించలేదు. నేనంత దయతో జూచుకొను నప్పటికి మీకు విశ్వాసము లేక నన్నడ్డమైన మాటలనుచున్నారు. ఒకమాటు పాఠము చదువకపోతే కంట్లో కారపు పొడి

మిరపకాయ పొడి వెసెవారు. ఒక పరియాయము నెను బడికి రాక యాగడముసెయ జుట్టుకు త్రాడుపోసి నూతిలో దింపినారు. అంతంత శిక్షలుచేసి యాయన నాలుగు ముక్కలు చెప్పబట్టి నేనింత బాగుపడి యక్కఱకు వచ్చినాను. ఆ మహారాజు పెట్టిన దీప మిది. ఈ వృద్ధంతా యాయనదే. ఆయనకే దీపము పెట్టి మ్రొక్కవలె. ఈ గ్రామములో పిల్ల లందఱును నాయంత వాళ్లను చేయవలెనని తలంచుకోగా మీ రా పని సాగనియ్యక బాధ పెట్టుచున్నారు. పోనీ నా దేమి పోయినది? చదువు కొన్నారో యింతన్నము దిని బాగుపడ్డారో ! లేకపోతే చెడి పోదురు నాకేమి?"

అని తానొక మహావిద్వాంసు డైనట్లు తానా విద్యలు బహుపరిశ్రమచేసి గురువు పెట్టెడి బాధలుపడి నేర్చుకొన్నట్లు కొన్ని కోతలు కోసెను. అతని పాండిత్యప్రభావ మెఱింగినవారు వాని దంభము విని ముసి ముసి నవ్వులు నవ్వుకొని పోయిరి. ఒకనాఁ డొక గ్రామవాసి వచ్చి "పంతులుగారూ! ఏమండీ! మా పిల్లవాడు మీ బడిలో ప్రవేశించి యాఱుమాసములైనది. ప్రవేశించినప్పు డెంత వచ్చెనో యిప్పు డంతె వచ్చెను. మీరు బొత్తిగా పాఠములు చెప్పుట లేదా యేముటి?" యని యడిగెను. అట్టి ప్రశ్నల కుత్తరము గణపతియొక్క జిహ్వాగ్రమందు సిదముగానే యుండునుగదా. "అయ్యా ! మీ వాడు మిక్కిలి యల్లరిపిల్లవాఁడు. ఆ పిల్లవానికి నేను చదువు చెప్పుట కంటె భయము చెప్పుట మంచిదని యాలోచించి చదువు చెప్పుట మాని ముందుగా భయము చెప్పినాను. వెధవ చదు వెంతసేపు వచ్చును? భయము వచ్చుట చాల కష్టము. చదు వనగా మీయభిప్రాయ మెంతో యున్నదనుకొన్నారు కాబోలు. అంత చదువూ నేను నెల దినములలో చెప్పివేయగలను. అదీగాక చదువు మఱియొక పంతులయిన జెప్పగలఁడు. మీ పిల్లవానికి నావలె భయము చెప్ప గలవారు మఱొకరు లేరు. మీ పుణ్యము చేత నేనీయూరు రాబట్టి మీ పిల్లవాడు బాగుపడినాఁడు. లేక పోతే వాఁ డెందుకు పనికిరాకపోవును. ఇప్పుడు వాని కెంత భయము వచ్చిన దనుకొన్నారు. నాపేరు వింటే వానికి గడగడ వణకు! నేను నడచుచున్న వీధిలో నడవడు. మొన్నరాత్రి మీ యమ్మగారు చెప్పినారు. అన్నమెక్కువయైనది నేను తినలేనన్నాఁ డట మీవాఁడు. 'పంతులుగారిని పిలవనా, తింటావా?' యని మీ యమ్మగా రడిగినాఁరట. ఆ మాట ననగానే చచ్చినట్లు కంచములో నున్న యన్నమంతయు కిక్కురు మనకుండ తిన్నాఁడట. భయ మనగా నాలాగుండ వలె! ఏఁడీ పిల్లలకు నావలె భయము చెప్పగల పంతులును వేలుమడిచి మరొక్కని చెప్పండి. వెధవ చదువు, కూర్చున్న గుడ్డిముండ చెప్పగలదు! చదువు చెప్పుట కష్టమను కొన్నారా యేమిటి? దాశరథీ యని రెండు కూని రాగాలు తీసి చెప్పగానే సరా యేమిటి? భయము చెప్పాలి, అదీ ప్రజ్ఞ! అదీ సొగసు! పంతులును చూడగానే గజగజ వణికి మూర్ఛపోవాలి, పిల్లవాడు. వాఁడే పంతులు. తక్కినవాఁడు పంతులు మెంతులు పావు శేరు మెంతులు, ఎగరేసి కొడితే యేడు మెంతులు! అలాటి పంతుళ్ళు పనికిరారు. పంతులంటే నేనే పంతులును!" అని ప్రత్యుత్తరము చెప్ప నాతఁడు తెల్లపోయి మాఱుమటాడక తన పిల్లవానిని బడి కంపుట మానెను.

గణపతి బడిలో గూర్చుండు నప్పుడు కునికిపాట్లుపడుచు బాలురకడ పాఠము లప్పగించుకొనును. కునికిపాట్లు పడుచునే చెప్పదలచుకొన్న ముక్కలు చెప్పును. ఒకప్పుడు కునికిపాటు పడుచునే చుట్టకాల్చును. ఒకనాఁడు కునికిపాట్లలో నోటనున్న పొగచుట్ట కట్టుకొన్న బట్టపైఁ బడి, బట్ట కాలజొచ్చెను. పంతులుగారు బ్రతికియుండగానే శరీరము దగ్ధమగు నను

భయమున, బాలురు కళవళపాటు నొంది "పంతులుగారు! బట్ట కాలుచున్న" దని కేకలు వైచి మేలు కొలిపిరి. ఆ కేకలు విని గణపతి మేల్కొని చేతులతో నలిపి బట్టయార్పి లేచి బెత్తము పుచ్చుకొని "పాడుముండా కొడుకులారా! బట్టంటుకోగానే కాలి చచ్చిపోదు ననుకున్నారా యేమిటి? మెల్లగా లేపలేక పోయినారా? అంతంత కేక లెందుకు? నిక్షేపమంటి నిద్ర చెడగొట్టినారు, వెధవ" లని వరుసగా నొక్కొక్కరినె వీపు బ్రద్దలు కొట్టెను. మఱియొకనా డా విధముగానే గణపతి నోటిచుట్ట కునికిపాట్లలో నుత్తరీయముపైఁబడి నది కాలఁజొచ్చెను. లేపిన పక్షమున పంతులుగారు చావగొట్టుదు రని పిల్ల లూరకుండిరి. వీథిని వెళ్ళువా రెవరో యది చూచి గణపతిని మేలుకొలిపిరి. అతఁడు మెలఁకువ దెచ్చుకోని బాలకులఁ జూచి 'యోరి దరిద్రగొట్టు వెధవలారా! నేను కాలి చచ్చిపోతే సుఖముగ నుండవలె ననుకొన్నారా? ఇంతంత దుర్బుద్ధులా మీ' కని బెత్తము విఱుగువరకు తాషాలు వాయించినట్లు వీపులమీఁద వాయించెను. ఒకనాడు లెక్కలు చెప్పుదును రమ్మని బాలకులం దనచుట్టుఁ గూర్చుండఁబెట్టుకొని, యంతలో గన్నులు మూఁతపడ కునుకుచు, "ముప్పది రూపాయల పందొమ్మిదణాల యిరువది పైసలు, దీనిని పదకొండు పెట్టి హెచ్చువేయం" డని చెప్పెను. అప్పుడొక పిల్లవాఁడు లేచి "పంతులుగారండి! పందొమ్మిదణాలుండవండి. ఇరువది పైస లుండవండి" యని చెప్పెను. అది విని గణపతి కన్నులు తెఱచి యాపిల్లవాని వంక తేఱిపాఱ జూచి "యోరి తుంటరివెధవా! ఉండవేమి? ఎందు కుండవు? నా కన్న నీ కెక్కువ తెలుసునా? నాలుగు ముక్కలు వచ్చినవో లేదో, యప్పుడే పంతులుగారికే పంగనామాలు పెట్టదలచుకొన్నావా? ఈలాటి వెధవవు నీ వక్కరకు వత్తువటరా?" యని యా దినమున బెత్త మదివరకె విఱిగిపోవుటచే జుట్టు వంగదీసి, చాకలివాడు బట్టలుదికిన తెఱంగున చరుపుమీద చరుపు పడునట్లుగా తనచేయి నొచ్చువరకు గొట్టి, యిటువంటి వెధవలకు లెక్కలే చెప్పనని యూరకుండెను. మఱియొకనాఁడు కునికిపాట్లు పడుచు "ముప్పదియాఱు రూపాయల డెబ్బదియా ఱణాల యఱువది యాఱు పైసలు కలపండి" యని చెప్పెను. "ఒక కచ్చమే చెప్పినారు పంతులుగారూ! రెండవ కచ్చము చెప్పలేదు. ఏలాగున కలపమండి" యని పిల్ల లడిగిరి. అడుగుటయు నతడు కోపోద్దీపితుఁడై యిలాటి వెధవ ప్రశ్నలు వేయకుండ చెంపలు పగులగొట్టెద చూడుండని యొక్కొక్కని నాలుగేసి చెంపకాయలు కొట్టి వారి పలకలు వీథిలో గిరవాటులు వైచెను. చాలామంది పలకలు పగిలిపోయెను. పిల్లల తల్లిదండ్రులు సంరక్షకులు వచ్చి పలకలేల పగుల గొట్టినారని గట్టిగా నడుగ గణపతి మీ పిల్లలే పగులగొట్టినారు కాని నేను పగులగొట్టలేదని యబద్ధమాడి, యొట్టు పెట్టుకొని ప్రమాణముచేసి, యాయాపద తప్పించు కొనియెను. ఒట్లు ప్రమాణములు గణపతికి లెక్కలోనివి కావు. అతని దృష్టిచేత నన్నియు గాలికి పోవు మాటలే కావున వాని కనృతభయమనునది లేదు.

గణపతియొక్క పాండిత్యప్రభావము బోధనాశక్తి యెట్లున్నదో తెలిసికొని యానందింపవలె నని చదువరులు కుతూహల పడుచుందురు. కావున నట్టివిశేషములు కొన్ని యుదహరించుట సమంజసము. ఆ బడిలో చదువుకొనని క్రొత్తబాలుఁ డొకనాఁడు పాఠశాలకు వచ్చి గణపతియొక్క వికారరూపమును వికృత చేష్టలను విపరీతపు బ్రసంగమును విని యాతనిచేత మాటలాడించి యానందింప వలయు నని నిశ్చయించి దాశరథీ శతకము లోని "శ్రీరఘురామ చారుతులసీ దళ దామ" యను పద్యము చదివి "పంతులుగారూ ! దీని యర్థము మీ ముఖతః వినవలయు నని యున్నది. మీరు బహు సరసముగ జెప్పగల రని విన్నాను. కావున సెలవియ్యవలయును" నని యడిగెను. అటువంటి ప్రశ్న పాఠశాలలోని బాలుఁ డడిగిన పక్షమున

వాని విపు పుల్ల మజ్జిగ పోసి కాల్చిన రొట్టెవలె దెబ్బలతొ నుదికి యుండును. అడిగినవాఁడు పాఠశాల విద్యార్థి గాక పైవాఁడగుటచే గణపతికి యేమియుఁ దోఁచక పచ్చివెలగకాయ గొంతు పడిన ట్లేమాటయు రాక క్రిందు చూచి మీదు చూచి నలు ప్రక్కలు జూచి తన బుద్ధి నుపయోగించి యర్థము చెప్పవలయునని నిశ్చయించి పద్య మా పిల్లవానిచేతనే చదివించి యీవిధముగ నర్థము చెప్పెను. శ్రీరఘురామ=శ్రీరాములువారు, చారు=ఒకనాడు పైత్యముగా నుండి చారు కాపించుకొన్నారు. తులసీ దళదామ=ఆ దేశములో కరివేపాకు లేదు గనుక తులసీ దళములే యందులో వేసి పొంగించినారు. శమక్షమాది శృంగార గుణాభిరామ=శ్రమ యావత్తు పోగొట్టగలిగి బహు శృంగారముగా నున్నదట, ఆ చారు త్రిజగన్నుత శౌర్యరమాలలామ=ఆ చారు త్రాగిన తరువాత ఆ రాములు వారికి కావలసినంత శౌర్యము గలిగిందట, రాక్షసులను చంపుటకు – దుర్వారకబంధ రాక్షస విరామ=వారి కందరకు కఫము పుట్టకుండ పోయినదట. జగజ్జనకల్మషార్ణవోత్తారికనామ= ఆ చారు తారక మంత్రములాగు త్రాగిన జను లందరకు గల్మషము కొట్టివేసినది. భద్రగిరి=వారి కెంతో భద్రము కలిగినది." అంతవర కర్థము చెపునప్పటికే ప్రశ్న మడిగిన పిల్లవాఁడు నవ్వు పట్టలేక నవ్వుచునే "వహవా పంతులు గారూ! వహవా! ఈ పద్యార్థము నే నెందరు పండితులనో యడిగితి, కాని మీ వలె నింత రసవంతముగా జెప్పినవా రొక్కరును లేకపోయినారండి. రాయలవారి వంటి మహారాజొకఁ డిప్పుడున్న పక్షమున మీ వంటివారి కెన్నో యగ్రహారములు లిచ్చు" నని యాతని ప్రజ్ఞా విశేషము నుగ్గడించెను. గణపతి యా ప్రశంస యంతయు నిక్కముగాఁ దలంచి మిక్కిలి వినయముతో "అయ్యా ! నే నెంత వాడను. తమ దయచేత నాలా గనుచున్నారు. కాని నేనంత పండితుఁడను కానండి. ఆ సరస్వతీదేవి దయవల్ల నాకు నాలుగు ముక్కలు వచ్చినవి, కాని నేను పట్టుమని శాస్త్రములు చదువుకోలేదండీ !" యని బదులు చెప్పెను. పై పద్యముయొక్క యర్థమును బట్టి గణపతి యెంత ప్రజ్ఞాశాలియై వానికడ నెటువంటి విచిత్రభావము లున్నవో, యెంత సమయస్ఫూర్తి యున్నదో సరసులు నిష్పక్షపాత మనస్కులు నగువారందరు గ్రహింపవచ్చును. వ్యాకరణ శాస్త్రమొ, తర్కశాస్త్రమొ, చదువుకొని శబ్దమున కపార్థము కల్పించి నిజ మబద్ధ మని, యబద్ధము నిజ మని కల్ల వాదములు సేయు పండితులను జూచి జనులు జోహారులు చేసి వారి చెవులకు సువర్ణ కుండలములు తగిలించి శాలువలు కప్పి యఖండ సన్మానము చేయుదురు. కాని గణపతి 'శ్రీరఘురామ ' యన్న పద్యమునకు స్వకపోలకల్పితముగ నత్యంతరమణీయమైన యర్థము చెప్పినపు డా గౌరవము జూపుటలేదు. సరికదా మీదు మిక్కిలి యపహాస్యము చేయుదురు. ఇవి మెత్తని వారికి దినములు కావుగదా!

పూర్వోదాహృత పద్యార్థమును బట్టి యతని యాంధ్రసాహిత్య ప్రభావము తేటపడినది. సాహిత్యమునందే గాక యతనికి శారీరశాస్త్రము నందును మరికొన్ని యితరవిషయములందును గల ప్రవేశము దెలుపుటకై కొన్ని మాటలు చెప్పుట అవశ్య కర్తవ్యము. ఎవఁడో పిల్లవాఁడు జ్వరముచేత బాధపడు చున్నాఁడని తెలిసినప్పుడు జ్వరమునుగూర్చి యతఁడు చేసిన చిన్న యుపన్యాస మెల్లవారు వినఁదగి యున్నది. జ్వరమెందుకు వచ్చు ననగా మన కడుపులో బొడ్డుదగ్గర దీపముండును. ఆదీప మొకప్పుడు భగ్గున మండి పెద్దదగును. అప్పుడు లోపల వేఁడి చాల పుట్టును, లోపల వేడిచేత పై చర్మము గూడ వెచ్చబడును. లోపల దీపము మండుచుండుటచేతనే జబ్బుగా నున్నవానికి కడుపులో మంటలు బయలుదేరును. ఆ దీపము తగ్గి యథాప్రకారమైతే జ్వరము తగ్గిపోవును. ఆ దీప మారిపోయినప్పుడు మనము చచ్చి

పోవుదుము. ఆ దిపము వెలుగుటకె మన్నములో నెయ్యి చమురు వెసికొనవలెను. చమురు లేకపోతే దీపాలు వెలుగవు కదా!

ఉరుములు వరములు పిడుగులు మొదలగువానిం గూర్చి గణపతి యీ విధముగఁ జెప్పుచుండును. "దేవుడు బండియెక్కి యాకాశముమీఁద తిరుగుచుండును. ఆ బండి చప్పుడే వురుములు. అప్పుడప్పుడా బండి సీల లూడి క్రింద పడుచుండును. అవియే పిడుగులు. దేవుని బండికి గట్టిన గుఱ్ఱాల డెక్కలు రాళ్ళమీఁద తగులుటవల్ల నిప్పులు మంటలు బయలుదేరును. అవే మెరుపులు. వాననగా తిరిగితిరిగి వచ్చినమీఁదట దేవుని వంటిమీఁద పట్టిన చెమట. గాలి వేసినప్పుడు వాన రాకపోవుటకు గారణ మేమో తెలుసునా? గాలి విసరునప్పుడు చెమట యారిపోవును. సూర్యుఁడనఁగా దేవుడుఁగారి యింట బెట్టుకొన్న కుంపటి. చంద్రుఁడంటే దేవుడుగారి యింట్లో యిత్తడి సిబ్బె. ఈ విధముగ గణపతి యనేక శాస్త్రములలో బ్రవేశము గలిగి తాను నేర్చిన విద్య యొరులకు నేర్పనివాఁడు ముందు జన్మమున ముషిణిచెట్టయి పుట్టునని పెద్దల నోటినుంచి వెడలు వాక్యములు పలుమారు విని యుండుటచే నట్టి విషపు చెట్టయి పుట్టుట కిష్టములేక తన కడుపులోనున్న జ్ఞాన మంతయు నిప్పు డప్పు డనక ప్రసంగము వచ్చినపుడు తన విద్యార్థులకు, గ్రామవాసులకు జెప్పుచుండును. సర్పములను గురించియు సర్పస్వభావచేష్టితములను గురించియు నాతనికిఁ దెలిసిన జ్ఞానము లోకోపకారముగ నుండును. కావున గ్రంథ విస్తరతకైనను నొడంబడి నవ్విషయ మందలి ముఖ్యాంశము లిందు బొందుపఱుపఁ బడుచున్నవి.

"పాము దీర్ఘ క్రోధముగల జంతువు. దాని జోలికి పోయిన మనుష్యునిపై నది కసిపట్టి పగ పూని యుండును. పాము కసి, పాము పగ యని మీరు వినలేదా? తన జోలికి వచ్చినవాడు వెంటనే దొరకిన యెడల వానిని వెంటనే కరిచి చంపును. వాఁడు దొరికినప్పుడే దాని సొగసు, దాని తమాషా ! వాఁడు దొరకనప్పుడు పాము పగబట్టి వాఁ డెన్ని మేడలమీఁద బండుకొన్నప్పటికి, యెన్ని మిద్దెలమీఁద దాఁగొన్నప్పటికి, ఎంతమందిలో నిద్రపోయినప్పటికి రాత్రివేళ వెళ్ళి వానిని పట్టి కరిచి చంపును. ఏలాగో తెలుసా? ఎవరిమీద పాము పగపట్టునో వాని యడుగు లనఁగా వాడు నడిచిన చోటు తియ్యగా నుండును. తక్కినవారి యడుగులు చప్పగా నుండును. ఆ యడుగుల తీపినిబట్టి వారున్నచోటికిఁ బోయి మెల్లగ కాటువేయును. అందుచేత పాముపగ గలవాఁడు తిన్నగా నడువక వంకరటింకరగ నడువవలెను. అప్పుడు పాముగూడ వంకరటింకరగ నడచును. ఆలాగున నడచిన యెడల దాని యెముకలు విరిగిపోవును. ఒకప్పుడు పాముపగ గలవాఁడు నడవక బండెక్కి గాని మనుష్యుల భుజమెక్కి గాని వచ్చుట మంచిది. అడుగుల జాడ లేదు గావున వాఁడున్న చోటికి పాము రాఁజాలదు."

ఆ తెఱంగున నతఁ డెల్ల విషయముల దనకుగల జ్ఞానము లోకహితార్థముగ వెలిబుచ్చు చుండును. అతని కే విషయమున నెంత జ్ఞాన మున్నదో, యది యెంతవరకు యదార్థమైనజ్ఞానమో, తమ బిడ్డల కతడు విద్య చెప్పుచున్నాడో లేదో, యితని పాఠశాలకుఁ బోయినందునఁ దమ బిడ్డ లెంత బాగుపడు చున్నారో తెలిసికొనువారు గ్రామస్థులలో ననేకులు లేరు. అట్టివాఁడు నూటి కొకఁ డుండవచ్చును. తన పిల్లవానిని మిక్కిలి కఠినముగ శిక్షించినాఁడని యిద్దఱు ముగ్గురు గణపతితో వివాదపడిరేగాని చదువు విషయములో వివాదపడువా రరుదు. 'పంతులుగారు మాకు సరిగా పాఠములు చెప్పుటలే ' దని కొందఱు

పిల్లలు తల్లిదండ్రులతో మొఱపెట్టుకొనిరి. కాని యా మొఱలు తల్లిదండ్రుల మనస్సున కెక్కలేదు. పంతులుగారిమీఁద గిట్టక బిడ్డలు లేనిపోని నేర ములు వానిమీద చెప్పుచున్నారని తల్లిదండ్రు లూహించిరే కాని దాని యాథార్థ్యము జక్కగా నరసి కనుగొన వలయునని వారికి తోఁచలేదు. పంతులుగా రతిక్రూరశిక్ష జేయుచున్నారని బిడ్డలు గోల పెట్టినప్పుడు సయితము తమబిడ్డలను మిక్కిలి గారాబమున బెంచుకొను చున్న వారిద్దఱు ముగ్గురు దక్క దక్కినవారా మొఱ చెవినిడక 'పిల్లవా ళ్ళేదో దుండగము చేయఁబట్టి పంతులు కొట్టుచున్నాడే కాని యూరకకొట్టునా? పిల్లల మాటలు పట్టుకొని పంతులుగారితో వివాదపడుట మంచిదికాదు.' అని యా విషయమై వా రెంతమాత్రము విచారింపరైరి. అభిమన్యుఁడు పద్మవ్యూహమందు బ్రవేశించుటయే గాని దానినుండి వెలికివచ్చుట యెఱు గనట్లు గణపతి శ్రుతపాండిత్య ప్రభావము చేత నేవో కొన్ని లెక్కలు చెప్పుటయె యెఱుఁగును. కాని పిల్లలు లెక్కలు చేసిన తరువాత నవి సరిగ నున్నవో లేదో దిద్దుట యెఱుఁగడు. ఎవరిది తప్పో నిర్ణయింపఁజాలడు. ఉన్న పిల్లలలోఁ బెద్దవాఁడు చేసినదె సరి యని దానింబట్టి తక్కినవారి లెక్కలు నిర్ణయించును. అందుచేత నతని ప్రజ్ఞా సారము బాలకు లెల్లరు గ్రహించిరి. చదువు రాకపోవుటయు, దెబ్బలు ప్రతిదినము వర్షధారలవలె పడుచుండుటయు, సంరక్షకులుఁ దలిదండ్రులు తమ మొఱలు వినకపోవుటయుఁ జూచి బుద్ధి మంతులైన కొందఱు పిల్లలు పంతులుగారికి మెల్లమెల్లగ లంచములు మప్పిరి. తిరుపతి వెంకటేశ్వరులు మొదలగు దేవతలే ధనము పండ్లు మొదలగు లంచములు మరిగి భక్తజనుల కుపకారములు చేయుచుండగా పల్లెటూరి పంతులొకఁడు లంచముల కాశపడి విద్యార్థులయెడ నిగ్రహానుగ్రహములు చూపుట యాశ్చర్యమా! ఒకనాఁ డొక పిల్లవాఁడు నాలు గరటిపండ్లు తెచ్చి పంతులుగారికి సమర్పించెను. అవి తిని గణపతి యా దినమున వాని నొక దెబ్బయైన గొట్టలేదు. ఆ పరమ రహస్యము వెంటనే బాలకు లందఱు గ్రహించి గురువు దైవసమానుడు గనుక దైవమున కర్పించినట్లే మరునాటినుండి గురువు గారికి కట్నములు కానుకలు ముడుపులు సమర్పణము జేయఁజొచ్చిరి. వైశ్యబాలకులు బెల్లము పటికబెల్లము పంచదార వక్కలు లవంగములు మొదలయినవి సమర్పింపఁజొచ్చిరి. పంట కాపుల బిడ్డలు పొగచుట్టలు, వీలైనప్పుడు శనగలు కందులు కూరలు మొదలగునవి తెచ్చి యియ్యఁదొడఁగిరి. బ్రాహ్మణ బాలకులు తలిదండ్రుల నడిగియు, వారీయనప్పుడు గూళ్ళలోను దూలములమీద గదులపెట్టెలలోను దాఁచికొన్నవి దొంగిలించియు డబ్బులు తెచ్చి యియ్యదొడగిరి. ఏదేని వస్తువు నివేదింపఁ బడిననాఁడు విద్యార్థులకు దెబ్బలు తప్పిపోవుటచే, బాలకులు బదులు తెచ్చియొ దొంగిలించియొ తలిదండ్రుల నడిగి తెచ్చియొ యేదో యొకటి పంతులుగారికి సమర్పించి దండనము తప్పించుకొనుచు వచ్చిరి. ఈ పద్ధతి యవలంబించిన తరువాత గ్రామస్థుల యిండ్లలో పెద్దవాండ్రు దాచికొన్న పొగచుట్టలు డబ్బులు కనపడకపోయెను. ఎవరో దొంగలు వచ్చినారని గోల బయలుదేఱెను. ఇంటిదొంగ నీశ్వరుఁడైన బట్టుకొన లేడుకదా! ఇట్లగుటచేట బెత్తమునకు బొత్తిగా పని తప్పిపోయిన దని మీరనుకొనవద్దు. ముడుపులు తెచ్చుటకు శక్తిలేని నిర్భాగ్యులగు బాలకులమీఁద దండము ద్విగుణముగఁ బ్రయోగింపబడుచు వచ్చెను. కార్తవీర్యార్జునుఁడు మొదలగు మాహావీరులు బాహువుల తీట తీరుటకయి లేనిపోని కయ్యములు కల్పించిన విధమున గణపతి తన చేతుల తీట తీరుటకు గొట్టవలయు నను ముచ్చట తీరుటకు నెన్నో వంకలు కల్పించి కానుకలు తేజాలని పేదబాలకులను చిత్రవధ చేయ నారంభించెను. ఆ పీడ తప్పించు కొనుటకయి వారు గూడ బహు విధోపాయముల నన్వేషించి గురు ప్రీత్యర్థము కానుకలు తెచ్చుటకయి చిన్న చిన్న

దొంగతనములు చెయ నారంభించిరి. విథిలొ నెండబొసిన వడ్లు దొంగిలించిన వారు కొందఱు, దుకాణములో గూర్చుండినట్లె గూర్చుండి డబ్బులో సరకులో దొంగిలించెడు బాలురు కొందరు,అప్పుడప్పుడీ బాలకు లలవాటు లేని దొంగతనమున బట్టువడ పంతులువారి చేతినుండి తప్పించుకొనదలచిన శిక్ష, వస్తువుగల యజమానుల చేత పడజొచ్చిరి.

గణపతియొక్క చిత్రచేష్టలు విని యింతకు మున్ను చదువుకొనుట కిష్టము లేనివారయ్యు విద్యాభ్యాసమునం దెక్కడ లేని తమకము గలవారై మొట్టమొదట వినయ వినమితగాత్రులయి తమ్ము శిష్యులుగఁ బరిగ్రహింప వలసినదని గణపతిని వేడి యతని యనుగ్రహపాత్రులై యతని శిష్యగణములో జేరిరి. చేరి వీలైనప్పుడు తా మల్లరిచేయుచు, వీలుకానప్పు డేదో చెరుపు చేయుమని తమకంటె జిన్నవాండ్ర బురిగొల్పుచు, వారు చేయునట్టి యల్లరి జూచి మహానందము నొందుచుండిరి. పెద్ద పిల్లలు చేరిన తరువాత చిన్నపిల్లలకు మునుపటికన్న ధైర్యసాహసములు హెచ్చెను. ఒకనాడు గణపతి శిష్యులకు తాను చిన్నప్పుడు నేర్చిన 'ఎవరయా మీరు చక్కనిరాజులిద ' అను పద్య ముక్తలేఖనము జెప్పదొడగెను. పదుగురుబాలకులది వ్రాయుచుండిరి. 'నేనన్నమాట మీరు మరల ననవద్ద 'ని గణపతి వారి కాజ్ఞ యొసగెను. ఆ యాజ్ఞ చెవి నిడక మొదటనున్న బాలకులు 'ఎవరయా మీవరని' గణపతి చెప్పగా 'యెవరయా మీరని' మరల ననజొచ్చిరి. గణపతి కోపావిష్టుడై యాబాలకుల తలలు గోడనుబెట్టి కొట్టి దండించుచుండగా జిట్టచివర నున్న బాలకులు మరల 'ఎవరయా మీరని ' పలికిరి. మొదటి వారిని వదలి గణపతి చివరివారిని దండించుటకయి రాఁగా మధ్య బాలకు లా విధముగ నరవజొచ్చెను. తాడనము చేయుటకయి వారి కడ కతఁడు పోగా మొదటి పిల్లలు జివరపిల్లలు గూడ నొక్కపెట్టున నఱచిరి. అప్పుడు గణపతి కోపావేశమున నిజముగ నొడలు మఱచిపోయి యా బాలకులలొ నొక్క బక్కవానిని బట్టుకొని చేయి నొచ్చువరకు చఱపులు చఱచి క్రింద బడవైచి కాలితో త్రొక్కి "నాబడిలో నుండి లేచిపో వెధవా!" యని యరుఁగు మీదనుండి రెండుకాళ్ళు పట్టుకొని క్రిందికి లాగెను. ఆ పిల్లవాడు సహజముగ దుర్బలుఁ డయ్యుఁ చిరకాలమునుండి దెబ్బల కలవాటుపడి యుండుటచే నాటి దినమున నా దెబ్బలకంత స్రుక్కకపోయినను గణపతి నేడిపింపవలయు నని సంకల్పించి గోలపెట్టి యేడ్చి చచ్చిపోవు వానివలె వగర్చుచు నాయాసపడ జొచ్చెను. ఆ కొంటెతన మెఱిగియు గణపతిని వంచింపఁ దలచి తక్కిన బాలురు 'అయ్యో! అయ్యో! మన మందయ్యను పంతులుగారు చంపివేసినారోయి! చచ్చినాఁడోయి, చచ్చినాఁడోయి!' యని పెద్దపెట్టున నేడ్చి కేకలు వేయజొచ్చిరి. అందులో నొకడు చెవులు మూసెను. రెండవవాఁడు మొగమున చన్నీళ్ళు గొట్టెను. మూఁడవవాడు ముక్కు దగ్గర వేలుపెట్టి చూడజొచ్చెను. చుట్టుప్రక్కల నున్న మనుష్యులు పరుగు పరుగున రాజొచ్చిరి. పశులవాడు పశువులను గొట్టినట్లు గణపతి యుపాధ్యాయుడైన నాటగోలె యిచ్చవచ్చి నటుల బాలకుల దండించెను. ఇటువంటి దురవస్థ యెన్నడు గలుగలేదు. ఆ పిల్లవాని యవస్థ జూడగానే గణపతి కమిత భయముకలిగెను. మేనెల్ల చెమటలు గ్రమ్మెను. కాళ్లు గుడ్డపేలికలై శరీరమును భరింపజాలక పోయెను. గ్రామస్తులువచ్చి తన్ను ముక్కముక్కలుగ నరికివేయుదురనియు, లేనియెడల నరహత్య చేసినందుకు దొరతనమువా రురి తీయుదురనియు నతనికి దోఁచెను. ఆ యాపద దప్పించుకొనుట కప్పుడువాని కే యుపాయము దోఁచలేదు. ఎందుకైనను మంచిదని యాతం డటనుండి మెల్ల మెల్లన నెవ్వరికి గనఁబడకుండ బారిపోయెను. అక్కడ చేరినవా రందరు బాలునకు భయములేదని చెప్పి కొంచెము మంచినీళ్లు త్రావ నిచ్చి మెల్లగా నింటికి బంపిరి. ఆ బాలుని తండ్రి

మహాదెవశాస్త్రిగారి యింటికి వచ్చి గణపతితొ మాటలాడగొరెను. కాని యెక్కడ వెదకినను గణపతి కానఁబడడయ్యెను. గణపతి పొరబాటుచేత నట్లుచేసి యుండ వచ్చును. కాని మరియొక క్రోధముచేత నతడు కొట్టియుండ డని మహాదేవశాస్త్రి యతనికి జెప్పి యొడంబరిచి పంపెను. అతి భయముచేత గణపతి నూతిలోనో గోతిలోనో దిగి యాత్మహత్య చేసికొన్నాడేమో యని మహాదేవశాస్త్రియు, వాని యింటి యాడువాండ్రును శంకించిరి. సాయంకాలమువరకు గణపతి కనబడనే లేదు. అతని తల్లి కొడు కెందులోనో దిగి చచ్చియుండు నని నిశ్చయించి "అయ్యో! కొడుకా! అయ్యో కొడుకా! యీ దిక్కుమాలిన యూరికి నిన్ను బలి యిచ్చినానురా నాయనా! నా వరహాలచేట్టు కూలిపోయినదోయి, దేవుడా! నా చిట్టిబాబును చూడండి, నాయనా!" యని వినువారి గుండె లవియునట్లు రోదనము చేయజొచ్చెను. రాత్రి నాలుగు గడియల ప్రొద్దు పోయినప్పటికి గణపతి రాలేదు. మహాదేవశాస్త్రిగారి భార్య యా సమయమున నావకాయ తీసికొనుటకై యటుక యెక్కి కుండదగ్గర చేయిబెట్టెను. చేతికి మెత్తనియొడలు తగిలెను. దీపము దీసికొనకయె వెళ్ళుటచేత నది యేమో యెరుంగక యీ గ్రామములో మర్కటబాధ యెక్కువగ నుండుటచే తన చేతికి తగిలిన దేదో యా జాతి జంతు వనుకొని "కొండముచ్చు నాయనోయి ! కొండముచ్చు" ని గట్టిగా నరచి యాకళవళ పాటులో నిచ్చెన యొకచోట నుండగా మరియొకచోట దిగబోయి గుభాలున నేలబడెను. ఇంటిల్లిపాది పరుగెత్తుకొని వచ్చిరి. దైవవశమున నామె కాలుమాత్రమె బెణికెను కాని దెబ్బ మాత్రము విశేషముగఁ దగులలేదు; ఆ గొడవ విని యిరుగు పొరుగువా రందరు జేరిరి. ఏమి టేమి టని యెల్లవా రడిగిరి. కొండము చ్చటుకమీఁద గూర్చుండినదని యామె చెప్పెను. అప్పు డందులో ధైర్యవంతుఁ డొకడు దీపము వెలిగించుకొని యటుకమీఁద కెక్కెను. ఎక్కి చూచుచునప్పటికి కది కోఁతిగాదు, కొండముచ్చుగాదు కాని యాకార చేష్టలయందు నిజముగ కొండముచ్చని చెప్పదగిన మన గణపతియే!

అతఁ డావకాయగూనకుఁ జేరఁబడి గుర్రుపట్టి నిద్రపోయెను. ఇంత గొడవ జరుగుచున్న నతనికి మెలఁకువయే రాలేదు! అటుక యెక్కిన యతఁడు మొదట నది కొండముచ్చే యనుకొని మీఁదపడి కఱచునొ యను భయమున జాగ్రత్తగ సమీపించెను. కాని దీపపు వెలుగున గణపతి మూర్తి కనఁబడగానే "భయపడకండి భయపడకండి! కొండ ముచ్చుగాదు, కోతిగాదు! మన పంతులుగా" రని క్రింద నిలిచియున్నవారి కందరకు వినబడునట్లు బిగ్గఱగ నరిచెను. అచ్చటనే యున్న గణపతి తల్లి యప్పలుకులు చెవినిబడగానే "యేఁడి యేఁడీ ? నా నాయన యేడీ? నా బంగారు తండ్రి యేఁడి? బ్రతికియున్నాఁడా? నాయనా! మూఁడు తవ్వ లావు నేతితో వెంకటేశ్వర్లువారికి దీపారాధన చేసుకుంటాను. క్రిందికి రమ్మను, నయనా!" యని సంతోషించి యిష్టదైవతమునకు మ్రొక్కికొనెను; కుండలదగ్గర గణపతి కూర్చుండి నాఁడని వినిన తోడనే మహాదేవశాస్త్రి తల్లి మిక్కిలి కవలి "అయ్యో అయ్యో! మన యావకాయ తగులుబడిపోయినదిరా, నాయనా! వీఁడమ్మకడుపుకాలా! కుండలు మైలపరిచినాఁడు. ఆ పాడుగుడ్డలతో ముట్టుకొన్నాడు కాఁబోలు. ఈ దిక్కుమాలిన పంతులుకు బస యియ్యవద్దని నేను మొత్తుకొన్నాను. కాని మావాడు నామాట విన్నాఁడు కాఁడు. ఈ యే డావకాయ లేకుండా గొడ్డన్నము తినవలసివచ్చినది. వాడి మొగముమండా, ఆవకాయ కుండదగ్గర కూర్చుండవలెనని యెలా తోచిందమ్మా, వీడికి? ఇంకా నయము నూతిలోఁ గూర్చుండినాఁడు కాఁడు. నూతెడు నీళ్ళు మైలపడిపోను! ఈపాటికి దింపండి, చచ్చుపీనుగును!" అని కేకలు వేయజొచ్చెను. ఆ కఠినోక్తులు

తల్లి కెంతొ మనస్సంకటము కలిగింప నామె యిట్లనియె "అమ్మా ! నాకొడుకు గనఁబడక నేనెంతో దుఃఖపడుచుండగా నాపుణ్యముచే కనఁబడినాఁడని సంతోషపడుచున్నాను. అలాటి తిట్లు తిట్టకమ్మ. ఒక్క బిడ్డ. వాని నాధారము చేసికొని బ్రతకదలఁచుకున్నాను. మీ దిక్కుమాలిన కొంపలో నుండబట్టి నాకిన్ని పాట్లు కలిగినవి. అనవుడు మహాదేవశాస్త్రి తల్లి "కొడు కా వరసని కుండలు మైలపరచినాడు; తల్లి దిక్కుమాలిన కొంప యని తిట్టుచున్నది. ఇద్ద రిద్దరే. వీళ్ళ కేమి వినాశకాలమో కాని పొండి, మా యింట్లో నుండి లేచిపొండి" యని పలికెను.

# పదిహేడవ ప్రకరణము

నిద్ర పరమసుఖప్రద మనియు నా రోగ్య ప్రదాయిని యనియు సర్వావస్థలయందు నపేక్షనీయ మనియు మన మందర మెరుగుదుము. మరియు నిద్రవచ్చినప్పు డీ స్థల మా స్థల మనక మెట్టయనక పల్లమనక పాను పనక వట్టినేల యనక తలగడలు మొదలగునే వున్నవనిక లేవనక మనుష్యుఁడు మైమఱచి గాఢ సుషుప్తి నొందుననియు మన మెరుగుదుము. కాని, వ్యాధియు మనోవ్యాధియు భయము మున్నగునవి పీడించు నప్పుడు మనుష్యునకు సాధారణముగా నిదురరాదు. మానవుఁ డట్టివానికి లోనగునప్పుడు నిశాసమయ మతిదీర్ఘమై చక్రాతివలెఁ గదల నట్టులుండి, నిద్రను మనుజుని సన్నిధికిని రానీయ త్రోసి వేయును. ప్రకృతిధర్మ మిట్లుండగా బడిలోని పిల్లవానిని జావఁ గొట్టినందుకుఁ దన్నా బాలుని తండ్రి చంపివేయు నని యతిభయ భ్రాంతుడై విహ్వాలచిత్తుడై యటకమీఁద కెక్కిన గణపతికి నావకాయగూనకు జేరఁబడి కూరుచున్న యవస్థలోనే తన్ను గూర్చి జరుగుచున్న గొడవ వినఁబడకుండ నంత గాఢనిద్ర యెట్లు వచ్చెననీ మీకుఁ దోచవచ్చును. గణపతియొక్క నిద్రాసుఖముఁ గూర్చి మీరు సంపూర్ణముగ నెఱుగరు. కాన మీ కట్టి శంకలు పొడముచుండును. నిద్రావిషయమున గణపతికి గల యసాధారణ శక్తి వర్ణనాతీతమై యుండును. అతఁడు నడచుచు నిద్రపోగలఁడనుట యతిశయోక్తి కాదు. కూరుచుండి నిద్రింపఁ గలడనుట కవి చాతుర్యము గాదు. భోజనము సేయుచు సుషుప్త్యవస్థయం దుండఁగల డనుట వర్ణనా చమత్కృతి గాదు. లక్షలు, కోట్లు నల్లులు గల మంచము మీఁద నే విధమయిన పరుపు గానిఁ దుప్పటి గాని లేకుండ నతనిం బండుకొన బెట్టుడు. ఆ నల్లు లన్నియు నతని శరీరమందంతట సముద్రముమీఁద దెప్పునఁనదేలి చెరలాడు చేపలవలె నిట్టటు బరుగులెత్తుచు నతనిం గరచుచు, నెత్తురు పీల్చుచున్నను నతఁడు కదలఁడు మెదలఁ డొత్తిగిల్లఁడు. ఇట్టి నిద్రాసుఖము ప్రపంచమునం దెవరికిఁ గలదు? ఒక నల్లి మంచముమీఁద నున్నంత మాత్రమున నిద్రపట్టదని దీపము చేతపుచ్చుకొని యానల్లిం బొడిచి కడతేర్చినదాక మంచముపై మఱల బండుకొనని మహాత్ము లనేకులు గలరు. నల్లులే కాదు. జుమ్మని దోమలు ముసరి, తమ విపరీత గానముచేత నిద్రా దేవతకు భయము గల్పించి యా గదిలోని కామెను రాకుండఁ జేసినప్పుడు సయితము గణపతికి నిద్రాదేవికి నెట్టి మైత్రి కలదో గాని యతనికిఁ మాత్ర మామె ప్రసన్నురాలగును. దోమల సేనయు నల్లుల సేనయుఁ గలసి యాతని శరీరముపై పడినను మూసిన కన్ను దెఱువకుండ నతఁడు నిద్రింపఁ గలడు. మహాకవియైన వాల్మీకి, రామాయణ మహాకావ్యము నందు రావణానుజు డయిన కుంభకర్ణుడు నిరంతరము నిద్రాసక్తుడై యుండి యాఱునెలలు కొక్కసారి లేచు ననియు, లేచినప్పుడు వానిని వేల్పు లయిన గెలువలే రనియు, మాసషట్కము లోపల నతనిని మేల్కొలుపవలసివచ్చెనేని మసలఁగ్రాగిన చమురు మీఁద బోయుట, ధాన్యము తనువుపైఁ బోయించి యేనుగులచేత ద్రొక్కించుట మొదలగు భయంకర సాధనములు ప్రయోగింప వలె ననియు వ్రాసియున్నాడు. ఈ కలియుగంలోనే గణపతి వంటి దుర్వార నిద్రాపరాయణుడు జనించినప్పుడు మహాద్భుతముల కెల్ల నిలయమైన త్రేతాయుగమున కుంభకర్ణునివంటి నిరంతర నిద్రాప్రియుఁడు పుట్టియుండుట యాశ్చర్యము కాదని హేతువాదము సలుపునట్టి యీనాటి నవనాగరికులు నమ్ముట కవకాశము యున్నది. కాని కుంభకర్ణునకు మన గణపతికి నొక్క భేదము కలదు. కుంభకర్ణుడు బ్రహ్మదత్త వరప్రసాదమున షణ్మాస పరిమిత మయిన నిద్రం

జెంద గలిగె. గణపతి యె దేవతాప్రసాదము లెకయె నిద్రావిషయమున నింత ప్రజ్ఞానవంతుఁడయ్యె. కావున నిరువురలో గణపతియె యొకవాసి గొప్పవాఁడని మనము నిశ్చయింప వచ్చును. నిద్రానుభవమున గణపతి కెంత నిరుపమాన ప్రజ్ఞ కలదో లోకమునకుఁ దెలియుటకు స్థాళీపులాక న్యాయముగా రెం డుదాహరణము లిచ్చుట మంచిది. ఆ యుదాహరణం బట్టి యతని నిద్రానైపుణ్యమును మీరు కొంతవఱకు గ్రహింపవచ్చును. గణపతి వేసవికాలములో రాత్రులు విశేషమైన యుక్క యుండుటచే నింటిలోఁ బండుకొనక మహాదేవశాస్త్రిగారి వీథి యఱుగులమీఁద బండుకొను చుండును. దీపములు పెట్టిన తరువాత నతఁ డొంటిగాఁ బండుకొనలేడు. కదలలేడన్న మాట చదువరుల కీవఱకే విశదము. అందుచేతఁ దనకు విధేయులయి వివిధోపచారములం జేయునట్టి పెద్దశిష్యులను నలుగు రైదుగురను బ్రతిదినము రావించి యిరువుర నీప్రక్కను నిరువుర నాప్రక్కను బండుకొనఁబెట్టి నడుమ దాఁ బండుకొనుచుండును. అట్లు పండుకొనుచుండ నొకనాఁడు గణపతి నిద్రించిన పిదప నలువురు శిష్యులు రెండవ యఱుగుమీఁద కరిగి యా రాత్రి యేదయిన చమత్కారము చేయవలె నని సంకల్పించిరి. ఆ చమత్కృతికిఁ దమ పంతులుగారినే విషయముగాఁ జేయఁదలచు కొనిరి. ఆ చమత్కృతి యే రూపముగ నుండవలయునని ప్రశ్న రాగాఁ గడుసుదనంబునకు దావకం బైన యొక శిష్యుడు తక్కినవారి కిట్లనియె. "ఓరీ! అన్నిటి కన్న మిక్కిలి యందమైన విధము నేను చెప్పెద వినండి. ఏడుకట్ల సవారి కట్టి పంతులవారిని దానిమీద పండుకొన బెట్టి వల్ల కాళ్ల దగ్గరకుఁ దీసికొనిపోయి పెట్టెదము. పంతులవారి నిద్రసంగతి మీకు దెలియునుదగదా! ఆయనకు మెలకువరాదు, ఉదయమున దారింబోవు వారందఱుఁ మహానందభరితు లగుదురు. ఈ వృత్తాంతము విన్న వారందఱు గడుపు చెక్కలగు నట్లు నవ్వి వహవ్వా! యీ పని నెవరు చేసినారో గాని మిక్కిలి చమత్కారముగా జేసినారురా యని మెచ్చుకొందురు. మేమే యీపని చేసినా మని మన మెప్పుకొని యామెప్పును బొందుటకు వీలులేక పోయినను గ్రామవాసుల కింతటి యానందము గల్పించితిమి గదా యని మన మనంబులలో మనమే గర్వించవచ్చును. ఇది రహస్యముగ గట్టవలయునుగదా! ఎక్కడ గట్టుద మని మీరడుగుదురేమో, ఆ విషయమై విచారింప నక్కఱలేదు. మా దొడ్డిలో వెదుళ్ళున్నవి. వెదురు బద్దలున్నవి. మాదొడ్డిలో గోడ యొకమూల పడిపోయినది. ఆ దారిని వెళ్ళి మనము రెండు వెదుళ్ళు, రెండు బద్దలు తెచ్చి యీప్రక్క నున్న బోడిగోడల దొడ్డిలో కటుకు కట్టవచ్చును. తాటినార కూడ మా దొడ్డిలోనే యున్నది. తీసుకు వచ్చెదను. ఆయనకు మన మేమియు హాని చెయ్యవద్దు. ఇది మీకు సమ్మతముగా నున్నదా! లేని పక్షమున మీకు దోచిన విధము లెఱిగింపుడు." అతని పలుకులు తక్కిన ముువ్వురకు శ్రవణానందకరములై మనఃప్రమోదావహములై యుండినందున వారు భళీ యని యాతని యుపాయమునకు మెచ్చి తక్షణమే ప్రయత్నము జేయుమనిరి. వెంటనే యతఁడు తన దొడ్డిలో నుండి వెదుళ్ళు, నార మొదలైనవి దెచ్చెను. నలుగురు గలిసి కష్టపడి పొట్టి కటుకు నొకదానిం గట్టిరి. అనంతర మా శిష్య చతుష్టయము గురువు పండు కొన్న చోటికి వచ్చి కాళ్ళిద్దరు చేతు లిదరు పట్టుకొని యాదొడ్డిలోనికిఁ దీసికొనిపోయి యక్కటుకు మీఁద బండుకొనబెట్టి యతని యుత్తరీయమె మేనిమీఁద గప్పి జాఱిపోకుండ నారతోఁ గట్టి యా దారుణకర్మమున కపరిచితులయ్యు నలుగురు నాలు కొమ్ము లెత్తి భుజములపైఁ బెట్టికొని మోసికొని స్మశానభూమి కరిగిరి. అరిగిన తరువాత నేమి చేయవలెనో వారికిఁ దోచలేదు. నిద్ర మేల్కొలుపుద మని యొకడు, కాదు కాదు మరల నీ విధముగానే గృహమునకు

తిసుకొనిపోవుదమని యొకడు చెప్పిరి. వారి యాలొచనలు ద్రొసిపుచ్చి మొట్టమొదట ని చమత్కృతి సలుపు మని యుపదేశించిన యత డిట్లనియె "ఓరీ! మనము మొట్టమొద టేమనుకొన్నాము? తెల్లవారినదాక నిచట నునిచి, యీదారిన బోవు జనులకు వేడుక గలిగింపవలయు ననిగదా మన సంకల్పము! దానికి భిన్నముగా మన మిప్పు డేల యాచరింప వలయు? గావున నిది యీవిధముగానే యిక్కడనుంచి మన మిండ్లకు వెళ్లుదము. కాని పంతులుగారికి మిక్కిలి భయము గదా! మెలకువ వచ్చినప్పుడు వల్లకాడు చూచి భయపడి చచ్చిపోవు నేమో? యని మీకు సందేహము కలుగవచ్చును. కాని యట్టిసందేహమున కవకాశము లేదు. ఏలయన మనపంతుల వారికి సూర్యోదయ మగువఱకు మెలకువరాదు. ప్రతిదినము చూచుట లేదా? ఇంటిలోఁ బండుకొన్నపుడు తల్లియు, మహాదేవశాస్త్రి గారు ప్రొద్దెక్కినది లే లెమ్మని పెద్ద పెట్టున నఱచి, చేతులతో జఱచి లేపిన గాని లేచెడి వాడు కాడు. వీథిలో బండు కొన్నపుడు సూర్యకిరణములు మొగము మీద బడి కన్నులలో దూరి తాళముచేతులు తలుపులను దెఱచినట్లు ఱెప్పలు విప్పిన గాని లేచుటలేదు. మనమిక్కడ గొంతసేపుండి తెల్లవారుజాముమున నింటికి వెళ్ళుదము." అనవుడు నతని మాటలు తమ ప్రారంభమున కనుకూలముగా నున్న వని వారందఱు నిశ్చయించి, పంతులవారి యాకారము చక్కదనము నాకారమునకుఁ దగిన ప్రజ్ఞలు గుణగణములు చెప్పుకొని కడుపులు పగులునట్లు నవ్వి కాలక్షేపముజేసిరి. అటకమీద గూనకు జేరబడి పండుకొన్నప్పుడు గణపతి కెంత సుఖముగా నిద్రపట్టెనో కటుకుమీద బండుకొన్నప్పుడు నంత సుఖముగానే నిద్రపట్టెను. నిద్రపోయినవారును జచ్చినవారును సమాన మన్న సామెత యొకటి యున్నదిగదా! ఆ సామెత గణపతికడ నిజమయ్యెను. ఎన్నడో చచ్చిన యట్లతఁడు మైమఱచియుండెను. కడపటిజాము కోడి కూయు వఱకు శిష్యులు గురువుం గనిపెట్టుకొనియుండి, కాపులు మొదలగువారు పొలముల కా దారినే దెల్లవారుజామున బోవుదురు గనుక దా మచ్చట నిక యుండగూడ దని లేచి గ్రామమునకుం బోయి యెవరి యింటికి వారరిగిరి. కాకులు గూసెను. తూర్పుదెస తెల్లవాఱెను. ఆడవాండ్రు ముందుగ లేచి ముంగలివాకిళ్లు వీథియరుగులు గుమ్మములు తుడుచుకొనఁ జొచ్చిరి. కనుచీకటి యుండగానే యొక కాపువాడు వల్లకాటి మీదుగా దన పొలమునకు కరుగుచు నచ్చట కటుకుపై నున్న శవముం జూచి "హా ! యేమిది చిత్రముగ నున్నది. శవము కనఁబడుచున్నది. చుట్టుప్రక్కల జుట్టములు పక్కములు లేరు. నరసంచారమే లేదు. నిప్పు లేదు. కుండలు లేవు. మోసినవారు లేరు. కాడు పేర్చలేదు. పుల్లలు లేవు. పిడకలు లేవు. కూనీ యైన శవమేమో యనుకొందమన్న నట్టి శవమును నే తుంగలోనో త్రొక్కి పారవేయుదురు. గాని యింత జాగ్రత్తగా నొక కటుకుఁ గట్టి మోసికొని తీసికొనివత్తురా! ఇది యేమో మాయగా నున్నది. ఈ విషయమై నేను పోయి మునసబు, కరణాలతోఁ జెప్పి దీసికొనివచ్చెదను." అని పరుగునఁ బోయి మునసబు కరణాలని లేపెను. ఈ లోపున మరికొంద ఱా మార్గమునం బోవుచు, నప్పటికి మొగ మానవాలు పట్టుటకు దగినంత వెలుతురు వచ్చినందున దగ్గఱకుఁ బోయి కటుక మీఁదనున్న విగ్రహముం జూచి పంతులుగారి నెవరో చంపి పడవైచి రని కలఁతజెందిన మనస్సులతో వెనుకకుఁ బోయి గ్రామవాసులతోఁ చెప్పిరి. ఆ వార్త గ్రామమంతయు గుప్పుమనెను. స్త్రీలు మిక్కిలి యక్కజముతో జాలి పెంపున గన్నీరు విడుచుచు "అయ్యో! తల్లి కొక్క బిడ్డమ్మ, ఆ ముసలిముండ ముప్పు గడపకుండ బోయినా డమ్మ! ఇంత పని చేయుటకు వాళ్ళకు చేతు లేలా గొచ్చెనో యమ్మా! అయ్యో ! బెత్తము పుచ్చుకొని పిల్లలను కొట్టుచున్నట్లే నా కన్నుల ముందర మెలఁగుచున్నాడే

అమ్మా!" యని చెప్పుకొనజొచ్చిరి. పురుషుఁ లందరు ని వార్త చెవినిఁ బడగానె యితరకృత్యములు విడచి స్మశానభూమికే పరుగిడిరి. ఎవరో మహాదేవశాస్త్రిగారి గుమ్మము ముందరకుబోయి "శాసుల్తు గారు! పంతులుగారి నెవరో చంపి వల్లకాటిలో వైచిపోయినారయ్యా!" యని కేకవేసి పోయిరి.

ఆమాట సింగమ్మ చెవిని బడగానే చేతిలో నున్న పనిని విడిచిపెట్టి "అయ్యో ! కొడుకా! అయ్యో కొడుకా, నీ వుసురెవరు పోసుకున్నారురా, కొడుకా! అయ్యో! అయ్యో శాసుల్తుగారు! నా వరహాలచెట్టు నెవరో పడగొట్టినారట రండి నాయనా! రండి నాయనా, రండి" అని గుండె బాదుకొనుచు మొత్తుకొనుచు వీధిలోఁ బడెను. "అయ్యయ్యో! ఎంత పని, ఎంతపని! యింత పాపమున కెవడు వడిగట్టినారయా!" యని మహాదేవశాస్త్రిగారు, స్త్రీలు జాలిపడిరి. శాస్త్రి యామెం దోడ్కొని రుద్రభూమికరిగెను. సింగమ్మ త్రోవలో దుఃఖావేశము చేతఁ దన కుమారుని గుణగణములు మెచ్చుచు గ్రామవాసులం దిట్టుచు శపించుచు నరిగెను. వా రిరువురు వెళ్ళకముందే గ్రామవాసు లనేకు లచ్చట జేరి గణపతి చచ్చిపోయినాఁడని యొకరు, చావలేదు ప్రాణము గుడుగుడు లాడుచున్నదని యొకరు, ముక్కుదగ్గర వ్రేలుపెట్టి శ్వాస యాడుచున్నదో లేదో యని చూచువా రొకరు. శ్వాస యున్నది కాని యది కొనయూపిరి యని యొకరు, చచ్చిపోలేదు నిద్రపోవుచున్నాడు, అదిగో గుఱ్ఱని యొకరు, గుఱ్ఱు కాదయా గురక, గొంతు పిసికి చంపినారు అని యొకరు, గొంతు పిసికితే కంఠము వాచి యుండదా? గొంతు పిసకలేదు, కత్తితోఁ బొడిచి చంపినారేమో యని యొకరు, పొడిచిన పక్షమున నెత్తురు, గాయములు కనఁబడవా? యని యొకరు, పలు తెరంగుల నెవరికి దోచినట్లు వారు పలనించిరి. మొత్తముమీద గణపతి సంపూర్ణముగఁ జావలేదనియు, నవసానలక్షణమయిన గురక బైలుదేరిన దనియు క్షణములోనో నరక్షణములోనో కడతేరు ననియు నచటివారు నిశ్చయించిరి. అంతలో మహాదేవశాస్త్రితో సింగమ్మ వచ్చెను. వచ్చి కొడుకు పైఁబడి "నా తండ్రీ! నా కొడుకా! నన్నొంటి దాన్ని జేసి లేచిపోయినావురా! నాకింక దిక్కెవరురా, నాయనా! నన్నుఁ గూడ నీతోఁ దీసికొనిపోరా! తండ్రీ! నా వరహాలచెట్టూ ! నా కాసులపేరూ! నిన్న రాత్రి కడసారి నీకుఁ గడుపునిండా అన్నము పెట్టినానురా, నాయనా! తెల్లవా రే పాడుమొగం చూచినానో గాని యింత దుర్వార్త వినవలసి వచ్చిందిరా, నాయనా! నాముప్పు కడతేర్చి నన్నింత మట్టిచేసి పోదువని అనుకున్నాను గాని యింత పని జరుగునని కలలోనూ నే ననుకో లేదుర నాయనా! నిన్నింత పని చేయుటకు యెవరికి చేతులు వచ్చినవిరా, నాయనా! వాళ్ళ చేతులు పడిపోనూ, వాళ్ళ వంశము నాశనంగానూ! నాలాగే వాళ్ళ తల్లులుగూడ కొడుకా! కొడుకా! అని యెప్పు డేడ్చి మొత్తుకొందురో, నాయనా! నానోట్లో మట్టిపోసి పోయినావురా నాయనా! నా కడుపులో చిచ్చుపెట్టి పోయినావురా, నాయనా! నా కొంప తీసినావురా, నాయనా! ఈ చావు దేవుఁడు నా కెందుకు పెట్టినాడు కాదురా, నాయనా! నీకు పెండ్లిచేసి నీ వొక యింటివాఁడవై యుండగా నా కన్నులు చల్లగా చూడవలె ననుకొన్నానురా, నాయనా! బ్రహ్మచారివై చచ్చిపోవలసి వచ్చినదిరా, తండ్రీ! నీ పేరుగా చూచుకొనేందుకు నీ కడుపున నొక పిల్లవాఁడైన లేకపోయెరా, నాయనా! నీ వెవరిజోలికి వెళ్ళనివాడవురా, నాయనా! నీ మీఁదింత కోపము మెవరికి వచ్చిందిరా, నాయనా! ప్రాణము పొయ్యేటప్పుడు నన్ను దలఁచుకొని యెంత దుఃఖపడ్డావో, తండ్రీ! నీ ప్రాణమెంత కొట్టుకున్నదో, నాయనా! దిక్కిమాలినముండను నేను లోపల పడుకొన్నాను గాని వీధిలో పడుకున్నానుకానురా, నాయనా! నీ కిన్ని పాట్లుండబట్టే భగవంతుఁడు నాకటువంటి

పాడుబుద్ధులు తోపించాడురా, నాయనా! ఆ నాగన్న వెధవ, ఆ గంగమ్మ ముండ యీ వార్త విని సంతోషముతో పరమాన్నము వండుకొని తింటారురా, నాయనా! నేనేలాగున బ్రతకనురా, బాబూ! నిన్ను రాజులాగు పెంచుకొన్నానురా, బాబు! అవతారమూర్తి అనుకున్నానురా, నాయనా! ఎవరు దగ్గరవుంటే నీ దగ్గరున్న ట్లుంటుందిరా, నాయనా! దాహం తాగితే మానెడు తరవాణి త్రాగేవాడవురా, నాయనా! నీవు చద్ది అన్నము తినేవేళైనది లేరా, నాయనా!" అని పరి పరి విధముల దుఃఖించెను. తల్లి పెద్ద గొంతుకతో నెల్లవారి గుండెలు నీరగున టేడ్చుచున్నను, గ్రామవాసులు చేరి కంఠము లెత్తి మాటలాడుచున్నను గణపతికి మెలకువ రాలేదు. అంతలో సూర్యోదయ మయ్యెను. గణపతి మొగముమీద సూర్యకిరణముల వెలుగు పడెను. అప్పుడు గణపతికి నించుక మెలకువరాఁగా నతఁడు "ఉండవే లేస్తాను. ఏమి తొందర వచ్చినది?" అని కన్నులు తెరవకయే చేతితోఁ దల్లిని గెంటెను. అప్పుడందరు 'పంతులుగారు బ్రతికి యున్నారు, బ్రతికి యున్నారు, చావలే' దని కేకలువేసి చప్పటలు కొట్టిరి. సింగమ్మ "నా తండ్రీ! బ్రతికున్నావురా, నాయనా ! ఈ గండము గడిచినది గనుక నిన్ను దీసికొని తిరుపతి వెళ్ళెదనురా, నాయనా ! వెంకటేశ్వర్లువారికి కుంచె డావునేతితో దీపారాధన చేసెదనురా, నాయనా ! యని మనస్సులో వెంకటేశ్వర్లు వారిని దలచుకొని చేతులు జోడించి నమస్కరించి 'నాయనా ! దెబ్బలెక్కడ తగిలినవి? నిన్నెవరు చంపవచ్చిరో యెరుగుదువా?' యని గట్టిగా నడిగెను. అంతలో మొగము మీదకిఁ నెండ బాగుగా వచ్చుటచేతను గ్రామవాసులు చప్పటుల చేతను మొగము, చేతులు, తల్లి మాటి మాటికి పట్టుకొని కదుపుట చేతను గణపతికి మెలఁకువ సంపూర్తిగ వచ్చెను. అంతలో గ్రామవాసులలో నొకడు వచ్చి కట్లు విప్పెను. అంత గణపతి కన్నులు దెరచి చీకు చాపలు, కుండపెంకులు, కచ్చికలు, పంచయనము చేసిన చోటులు, వెదురుముక్కలు మొదలగు వానింజూచి, గుంపులు గుంపులుగా నుండు జనముం జూచి, గుభాలున కటుకుమీఁదనుండి లేచి భయమునకు నాశ్చర్యమునకు లోనై "ఇదేమిటి! మహాదేవశాస్త్రిగారి యరుగుమీఁద పడుకున్న వాఁడను నేనిక్కడ కెల వచ్చితిని. నారాయణ! నారాయణ! నన్నీ కటుకుమీఁద పండుకోబెట్టినవాఁరెవరు! ఇదేమిటి నన్ను వల్లకాటికి దీసికొని వచ్చినారు. ఏరీ ! రాత్రి నా ప్రక్కను బండుకొన్న పిల్లవెధవలు! నన్నెవరో యీలాగున తీసుకువచ్చుచుండఁగా నా ప్రక్కను పండుకున్న కుఱ్ఱవెధవలు భయపడి పారిపోయినారు గాఁబోలు?" అని లేచి నిలిచెను. పంతులుగారి నెవ్వరు చంపఁ దలంచుకో లేదనియు నెవరో కోపముచేతనో, కొంటెతనముచేతనో నీ విధముగా జేసినారని నచ్చటఁ జేరిన గ్రామవాసు లందరు నిశ్చయించిరి. పదిమంది పెద్దమనుష్యులను బ్రోగుచేసి పోలీసువారికి వర్తమాన మంపించి, భోజనములు లేకుండ మూడు జాములదాక గూర్చుండి పంచాయితీ చేయనక్కరలేకుండ వ్యవహారము చులకనగా తేలినదని మునసబు కరణములు సంతోషించుచు నింటికిఁ బోయిరి. "తమ మరణానంతరము బంధువులు తమ నిమిత్త మెట్లు విలపింతురో చెవులార వినియెడిభాగ్య మెవ్వరి కబ్బదు! గణపతి కట్టి మహోత్సవము తీరిన" దని నవ్వుకొనుచు, గ్రామవాసుల నందర నచ్చటికిఁ జేర్పఁ గలిగిన యీ పన్నాగము పన్నినవారి బుద్ధికుశలత మెచ్చుకొనుచు, గ్రామీణులు "వహవ్వా ! యేమి పంతులయ్యా ! ఎందరనో పంతుళ్ళను చూచినాము గాని యింత విపరీతపు పంతులును చూచినాము కాము. మన యదృష్టము కొద్ది దొరికినాఁడుగాని" యని పరిహాసాస్పదమగు పలుకులు పలుకు కొనుచుఁ బోయిరి. అప్పుడు సింగమ్మ కొందరు పెద్దమనుష్యులం గనుంగొని "చూచినారా, నాయనా! కిట్టకపోతే కిట్టనట్లుండవలెను గాని యింత దుర్మార్గపుపని

చెయవచ్చునా ? పోని కొంటెతనము కొసము చెసినారంటారా, వెళాకొళపు మాటలాడుకోవచ్చును, హాస్యములు చేసికోవచ్చును. సరసాలాడుకొనవచ్చును. గాని యింత కొంటెతనమున్నదా? ఒక్క బిడ్డ, నాకు. నా కెంతో వోగాయిత్యముగా నున్నది. ఈలాటి మోటసరసాలా. ఈ పని జేసిన దేవరో తెలిసినపక్షమున దుమ్మెత్తిపోసెదను. మునసబు గారితోఁ జెప్పి బొండ వేయించెదను. వాళమ్మ కడుపు గాలా, యీలాటి పనిచేసినవాళ్ళ వంశాలుండవురా, నాయనా! మీకు తెలిసెనా వాళ్ళ ముఖాలు చీకి తాటాకులతో తగులబెట్టి, నోట్లో గడి పెట్టండి! అర్దాయుస్సు ముండాకొడుకులకుఁ గాని యిట్టి బుద్ధులు పుట్టవు. నా మనస్సెంత క్షోభపడిందో వాళ్ళ తల్లులు గూడ యంత క్షోభపడవలెను. చూడు, నేనన్నాను. ఉత్తమ యిల్లాలను!" అని తా జెప్పవలసిన దంతయుఁ జెప్పి "రా నాయనా! యింటికి ! యీ కటుకుమీఁద నిన్ను మోసికొని వచ్చినవాళ్ళనే మోసికొని పోవుదురులే. నీవు చిరంజీవివై నూరేళ్ళు బ్రతుకఁ గలవు. ఆ దుర్మార్గపు ముండకొడుకులే రాళ్లు పగిలిపోయినట్లు తలలు పగిలి చచ్చిపోఁగలరు!" అని కుమారుని చేయి బట్టుకొని యింటికిఁ దీసికొనిపోయె, దృష్టిఁ దీసి, వేడి నీళ్ళతో స్నానము చేయించెను. స్మశానవాసదోషము దొలఁగి పోవునట్లు, పిశాచాది పీడాపరిహార మగునట్లు మహాదేవశాస్త్రి విభూతి మంత్రించి గణపతి మొగమునిండ బొజ్జనిండ భుజముల నిండఁ బెట్టి శతగాయత్రీజపము జేసికొమ్మనెను. గణపతికి గాయత్రీ మంత్రము రాదన్న మాట మహాదేవశాస్త్రి యెరుఁగడు. అయినను గణపతి యా జపము చేసినట్లే యభినయించెను. ఆనాఁడు మహాదేవశాస్త్రిగారి యిల్లు కోటిపల్లె తీర్థమువలె నుండెను. స్మశానభూమికి గ్రామమునం గల మగవారే వెళ్ళిరి గాని స్త్రీలు శిశువులు మొదలగువారు వెళ్ళకపోవుటంజేసి వారందరు గణపతిం జూడవచ్చిరి. విభూతి పెండెకట్లు పెట్టుకొని జంగముదేవరవలె గూర్చున్న గణపతిం జూచి వారందరు నవ్వి "అదృష్టవంతురాలవమ్మా" యని యతని తల్లిని బరామర్శచేసి వెళ్ళిరి. నాఁటిరేయి మొదలు గణపతికి స్వప్నములలో స్మశానము కాష్టములు కటుకులు కుండపెంకులు గుడ్డపేలికలు చాపలు మొదలైనవి కనఁబడ జొచ్చెను. స్వప్నదృష్టములైన యా వస్తువులం జూచి యతఁడు పెద్దపెట్టున నేడ్చుచుండును. 'నే చావలేదు! నన్ను దహనము చేయకండోయి! యని కేకలు వేయుచుండును. తల్లి యతనిం గట్టిగఁ గౌగిలించుకొని పండుకొనవలసి వచ్చెను. ఆ పని యెవరు చేసిరని గణపతి తన ప్రక్కను రాత్రి పండుకొన్న బడిపిల్లలనుబిలిచి యడిగెను. ఆ శిష్యు లిట్లనిరి – "పంతులుగారు, రెండు జాముల రాత్రివేళ కాగడాలతో నెవరో కొందరు వచ్చిరి. ఎవరో మనుష్యులనుకొని మేము లేచి యెవరువా రని యడిగితిమి. వారు మా కుత్తరము చెప్పలేదు. వాళ్ళ నోళ్ళు చిన్నవి. కడుపులు బానకడుపులు. మడమలు ముందరికి పాదములు వెనుకకు నున్నవి. చిన్నప్పుడు మా తాత మా నాయనమ్మ దయ్యము లాలాగుండునని చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చెను. అవి కొరవిదయ్యము లని మే మప్పుడనుకొంటిమి. కేకలు వేసిన పక్షమున నోళ్లు నొక్కునని మేము కిక్కురు మనకుండ మా ప్రాణము లరచేతిలోఁ బెట్టుకుని పారిపోయితిమి. మిమ్ము లేపుటకయిన వ్యవధానము లేకపోయినది. ఆ కొరవి దయ్యములే యింతపని చేసినవి!" గణపతి కా మాటలు సత్యములని తోచెను. ఎవరో కొంటెపిల్లవాండ్రాపని చేసి యుందురని చూడవచ్చిన గ్రామవాసు లందరు నేకగ్రీవముగాఁ జెప్పినను గణపతి వారి మాటయందు లేశమైన విశ్వాసముంచక తన విద్యార్థుల మాట యందె నిండు నమ్మిక యుంచి పిశాచ మాంత్రికుని కడకు బోయి వానికి గొంత ద్రవ్య మిచ్చి మంత్రించిన విభూతి పుచ్చుకొని మేనఁ బాముకొని రెండు రక్షరేకులు పుచ్చుకొని రెండు భుజములకుఁ గట్టికొని వీథులలో నెన్నఁడు బండుకొనఁ

గూడ దని లోపలనే బండుకొనుచుండెను. శిష్యుల కొంటెతన మెరుఁగడూ గనుక వారినే నమ్మి తన ప్రక్కను వారిని బండుకోబెట్టుకొను చుండెను. ఒకనాఁ డొకఁ శిష్యుఁడు చేదత్రాడు దెచ్చి వాని జుట్టుకు ముడివైచి యాత్రాడు దూలమునకుఁ గట్టెను. ఆ నాఁడు గణపతికి నిద్రలో దాహము విశేషముగ నైనందున రెండు జాముల రాత్రివేళ నతనికి మెలఁకువ వచ్చి దాహము త్రాగుటకయి లేవబోఁగా, దన జుట్టు పట్టుకొని యెవరో లాగినట్లయ్యెను. అప్పు డతఁడు మహాభయభ్రాంతుఁడై "చచ్చిపోయినానోయి, నాయనా ! దయ్యములు నా జుట్టు పట్టుకొని లాగుచున్నవిరోయి ! ఓ అమ్మా ? ఓ శాస్త్రిగారు ! చచ్చిపోయినాను, చచ్చిపోయినాను! రండోయి, రండోయి! రండోయి!" యని యుచ్చైస్స్వరముతో నరచెను. కొంటెతనము చేసిన విద్యార్థియు వానితోఁబాటు 'దయ్యాలు బాబో! దయ్యాలు ' అని యేడువఁజొచ్చెను. తక్కిన విద్యార్థులుగూడ నాఁటి కుట్రలోఁ జేరినవారె యుగుటంచేసి చకితస్వాంతులైన ట్లభినయించి గోల పెట్టి యేడ్చిరి. 'అయ్యో కొడుకో! కొడుకో!' యని సింగమ్మ లోపలనుండి వచ్చెను. ఇంటిలో దీపము లారిపోయినందున సింగమ్మ నిద్రలోనుంచి యకస్మాత్తుగ లేచి గుమ్మ మెక్కడున్నదో యెరుఁగక గోడమీఁద బడి మొగమునకు దెబ్బ తగిలించుకొని దయ్యములే పడవేయుచున్న వని కొడుకు గతి యేమైనదో యని యేడ్వఁజొచ్చెను. ఇంతలో మహాదేవశాస్త్రి తన యడప సంచిదీసి చెకుముకిరాతితో నిప్పుచేసి దీపము వెలిగించి చూచునప్పటికి గణపతి జుట్టుకు త్రాడుపోసి దూలమునకుఁ గట్టి యుండుట కనఁబడెను. అపు డాయన నిజస్థితి చెప్పి గణపతి భయ మడిసి యది యా శిష్యులలో నెవ్వరో చేసిన కొంటెతనమని గట్టిగాఁ జెప్పెను. అది దయ్యములు చేసిన పని గాని మేము చేసిన పని గాదని విద్యార్థులు గురువుగారిమీద నొట్టు పెట్టుకొని చెప్పిరి. గణపతి కా మాటలే విశ్వాసపాత్రములైనను మహాదేవశాస్త్రి నాఁటంగోలె విద్యార్థులను లోపలికి రానియ్యగూడ దని నొక్కి వక్కాణించెను. మఱి యొకనాడు మహాదేవశాస్త్రి సకుటుంబముగా బంధుగృహమున జరుగు వివాహము నిమిత్తము పలివెల వెళ్ళెను. ఇంటిలో గణపతియుం దల్లియు మాత్రముండిరి. దల్లులన్నియు వైచుకొని రాత్రి తల్లికొడుకులు నిద్రపోవుచుండగా దొడ్డిలో నున్న తాటియాకుల పాక యంటుకొనెను. చుట్టుప్రక్కల నున్న జను లందరు లేచి కుండలతోను; బిందెలతోను నీళ్ళు తెచ్చి యది యార్పఁ బ్రయత్నించిరి. పెద్ద గోల యయ్యెను. తలుపులు తీయుమని సింహద్వారము వొద్ద దొడ్డిగుమ్మమువొద్ద నాకసము మాఱుమ్రోగునట్లు గ్రామవాసులు పెద్దపెట్టున నఱచిరి. కాని గణపతికి గాని తల్లికిఁగాని మెలఁకువ రాలేదు. గ్రామీణులలోఁ గొందఱు గోడ దూకియు దొడ్డిగోడ దూకియు గొందఱు నిచ్చెనలు వైచుకొని లోనికి దిగియు దొడ్డి తలుపులు దీసికొని యంటుకొన్న పాక చల్లార్చిరి. కాని గణపతికి మెలకువ రానందున సాహసులు కొంద ఱుతకలెత్తి తలుపులు తీసి గణపతిని లేపబూనిరి. గాని యంతకు నతనికి మెలకువ రానందున నతని చెవిలోఁ జల్లని నీరు పోసిరి. అప్పు డతడు మేల్కొనియెను. మఱియొకసారి గణపతి మహాదేవశాస్త్రిగారితోఁ గలిసి రాత్రి బండిమీఁద బయనమై వెళ్ళు చుండెను. అది చీకటిరాత్రి. బండి పొలములోనుండి వెళ్లుచు నొకచో బోల్తపడెను. అదివరకు బండిలో బండుకొని నిద్రపోవుచున్న గణపతి బండి బోల్తపడినప్పు డెగిరి దూరముగాఁ బడెను. కునికిపాట్లు పడుచున్న మహాదేవశాస్త్రి మఱియొక వైపున గూలఁబడియెను. శాస్త్రిగారికి జేయి మడతబడి నొప్పిపట్టెను. బండివాఁడు గుమ్మడికాయవలె నేలఁబడ వాని చట్ట విఱిగెను. 'చట్టవిఱిగినది, బాబోయి!' యని వాడేడ్వజొచ్చెను. 'నాచేయి విఱిగినదిరా!' యని శాస్త్రి బెంగగొని గణపతీ ! గణపతీ! యని పదిసారులు పిలిచెను. అతఁడు పలుకలేదు. ఎద్దులు త్రొక్కిచంపినవో,

బండి చక్రముక్రిందఁ బడి చచ్చెనొ యని శాస్త్రి "భగవంతుడా ! యీ ప్రయాణ మెందుకు దెచ్చిపెట్టితివి ! పాప మీ కుఱ్ఱవాని జంపుటకా" యని ఖేదపడుచుండ నంతలో నెవరో మార్గస్థులు చిన్నలాంతరు పుచ్చుకొని యాదారినె వెళ్ళుచుండిరి. మహాదేవశాస్త్రి దూరమునం బోవుచున్న యా బాటసారులను గేకవైచి పిలిచెను. వారా కేక విని రాగా శాస్త్రి వారితో "మా బండి బోల్తా పడినది. నిద్రించుచున్న పిల్లవాఁ డెక్కడనో బడిపోయినాఁడు. చచ్చిపోయినాడేమో యని భయపడుచున్నాము. కొంచెము వెదకండి, నాయనా!" యని చెప్పెను. వారు నలు దెసలు కలయం గనుంగొనఁగా గణపతి యొకచోఁ బడియుండెను. 'ఆ పిల్లవాఁడు స్మారకము లేక పడియున్నాడండి' యని శాస్త్రితోఁ జెప్పిరి. బ్రతికి యున్నాడో లేదో నాడి చూచి, ముక్కుదగ్గర వ్రేళ్లుపెట్టి చూడండి యని ప్రత్యుత్తర మిచ్చి చేతినొప్పితో మెల్లగా నచ్చటి కరిగెను. వారట్లు చూచి "బ్రతికి యున్నాఁడు. తలకు మోపైనదెబ్బ తగిలియుండఁబట్టి తల దిమ్మెత్తి పడియుండఁబోలు" నని చెప్పి చేతితో నిట్టటు గదలించి చెవిదగ్గఱ గణపతీ! గణపతీ ! యని గట్టిగా నఱచిరి. అప్పు డతఁడు ఆ! యని పలికెను. మరియు నట్టివిధముగానె నిద్దఱు రెండుచెవులదగ్గర జేరి కంఠము లెత్తి పిలువ నతడు మేల్కొని 'బండి యాపినారేమి? యని యడిగెను. అపుడు జరిగిన వృత్తాంత మంతయు శాస్త్రి వానితోఁ జెప్పెను. క్రొత్త బాటసారులు గణపతి యొక్క యఖండనిద్రను దెలిసికొని 'కలియుగ కుంభకర్ణుడురా, యీ గణపతి!' యని మహాశ్చర్యమనస్కులై తమ దారిం జనిరి. మన కథానాయకుని నిద్రాతిశయమును గూర్చి వ్రాయఁదలచుకొన్న పక్షమున నింకను ననేకోదాహరణము లున్నవి. గాని గ్రంథ విస్తరభీతిచేత నింతటితో విరమింపవలసి వచ్చెను.

# పదునెనిమిదవ ప్రకరణము

గణపతియొక్క బ్రతుకంతయు నల్లరి బ్రతు కగుటచేతను నతని తెలివితేటలు బాలకుల తలిదండ్రులకే గాక బాల కులకు గూడ విస్పష్టముగ దెలియుటచేతను బడి క్రమక్రమముగఁ క్షీణించెను. గణపతి చేష్టలు జూచి నవ్వఁ దలచినవారును, వినోదముగఁ గాలక్షేపము సేయఁ దలఁచిన వారు మాత్రమే యతని చుట్టుఁ జేరజొచ్చిరి. బాలకుల సంఖ్య క్షీణించినను బెద్దవా రనేకులు సయితము తమ కేదియు దోచనప్పుడు బడిలేనప్పుడు నతని బడికిఁబోయి కూర్చుండి యాతని మర్కటచేష్టలు నసందర్భప్రలాపములు విని యానందించుచు వచ్చిరి. బడి నిండుగా నున్నప్పుడు జీతములక్రింద బాలకుల దలిదండ్రులు ధాన్యము, కందులు, కూరలు మొదలగు వస్తువులు పంపుటచేత నతని యింట నిబ్బంది యంత విశేషముగ లేకపోయెను. అంతియెగాక దెబ్బలు తినలేక బాలకులు తెచ్చి యిచ్చు లంచములచేత గూడ కొంతకాల మతనికి దారిద్ర్యము లేకపోయెను. కాని ముగ్ధభావము దాచిపెట్టిన దాగునది గాదు. కనుక క్రమముగ బయలుపడి యాతనియందించు కేనియు గౌరవము లేకుండునట్లు చేసెను. గ్రామవాసులలోఁ గొందరు తమ బిడ్డలకు విద్యాభ్యాసము జేయించునట్టి మంచి యుపాధ్యాయుఁడు లేనందున విచారించి క్రొత్తపేట వెళ్ళి యచ్చటినుండి యొక యుపాధ్యాయునిఁ దీసికొనివచ్చి మఱి యొక యఱుగు మీఁద బడి పెట్టించి, తమ బిడ్డల నచ్చటికిఁ బంపదొడంగిరి. గణపతియం దే కారణముచేతనో యభిమానమున్న వారు కొందఱు మాత్రము తమ పిల్లల నితని బడికే యెప్పటియట్ల బంపుచుండిరి. క్రొత్తగా వచ్చిన పంతులు యుక్తాయుక్త వివేకజ్ఞానము గలవాఁ డగుట చేతను, వికృతచేష్టలు గాని విపరీత లక్షణములు గాని యతనికడ లేకపోవుట చేతను, మంచి బోధన శక్తి గలవాఁ డగుటచేతను, విశేషించి వినయాది సద్గుణములు గలవాఁ డగుటచేతను, గ్రామవాసుల కతని యెడఁ గ్రమక్రమముగ నభిమాన ముదయించెను. తమ బిడ్డల నతని పాఠశాలకంపి వారా యభిమానము స్థిరముజేసిరి. కాలక్రమమున గణపతి బడి వట్టిదయ్యెను. అందుచేత నతఁడు జీవనాధారము లేక మఱియొక వృత్తి నేదైన స్వీకరింపవలె నని యాలోచించుచుండగా శివరాత్రి కా యూరికి భాగవతులు వచ్చి భాగవత మాడిరి. పలివెల నుండి యెండమూరి గరుడాచల మను వేశ్యాంగన, యా భాగవతములో సత్యభామ వేషము గట్టెను. ఆ భాగవతము గణపతి చూచి మిక్కిలి సంతసించి మఱునాడు వేశ్య లున్న బసకుఁ బోయెను. అతఁ డచ్చటఁ గూర్చున్న సమయమున మేళనాయకురాలైన గరుడాచలము, దాని తల్లియగు పాపాచలము, మద్దెలవాఁడు సారంగు వాయించువాఁడు హాస్యగాడు మున్నగువాండ్రందఱు కృష్ణవేషగాఁడు తగినవాఁడు దొరకలేదనియు, స్థిరముగాఁ దమవద్ద నుండునట్టి కృష్ణవేషగాడు దొరకిన పక్షమునఁ దమ మేళము మిక్కిలి బాగుండు ననియు జెప్పుకొనిరి. అది విని గణపతి గరుడాచలమువంటి సరసురాలు సత్యభామ వేషము వేయుచున్నప్పుడు తనవంటివాఁడు కృష్ణవేషము వేసిన పక్షమునఁ దన జన్మము ధన్య మగు ననియు జన్మము ధన్యమగుటయే గాక తన పితృమాతృవంశములు గూడ జరితార్థము లగుననియుఁ దలంచి "కృష్ణవేషగాడు దొరికిన పక్షమున మీరేమి జీత మిత్తు" రని యడిగెను. "ఆటకు రెండు రూపాయలు చొప్పున నిత్తు" మని గరుడాచల ముత్తరము చెప్పెను. "నెల కెన్ని యాట లుండు" నని యతడు మరల నడిగెను. 'అది మన యదృష్టమును బట్టి యుండును. ఇన్నని వక్కాణించి చెప్పజాల ' నని యా వెలయాలు బదులు చెప్పెను. "నీకు శూద్రుడు కావలెనా? బ్రాహ్మణుడు కావలెనా? యని గణపతి వెండియుం

బ్రశ్నింప "ఏమింత తరచి తరచి యడుగుచున్నారు. మి కాపని గావలెనని యున్నదా!" యని వేశ్యమాతయైన వృద్ధాంగన యడిగెను. "ఔను, మీకంగీకార మైన పక్షమున నేనే కృష్ణవేషము వేయవలెనని యున్నది." యని యతఁడు త్తరము జెప్పెను. అతని వాలకము మాట తీరు చూచి యతఁ డాపని కక్కరకు రాడని పాపాచలము తలంచెను. గాని తమ మేళములో నతఁడుండుట వినోదకరముగా నుండి తమకుఁ బ్రొద్దుపుచ్చుననియు నవసరమై నప్పుడు నతనిచేఁ గృష్ణవేషముఁ గూడ వేయించవచ్చు ననియు గరుడాచల మాలోచించి "సరే ! మీరు మా మేళములో నుండవచ్చును. మీ బట్టలు మూఁటగట్టి తెచ్చి మాతో రండి" యని చెప్పెను. ఆ పలుకులు నిజముగా నతని మనస్సు మీఁద నమృతవర్షము గురిసినట్లయ్యెను. తాను కృష్ణవేషము ధరించుట గరుడాచలము సత్యభామవేషము ధరించుట దలంచుకొని గణపతి నిజముగాఁ దానా మేళనాయకురాలికిఁ బ్రాణనాయకుండె యనుకొని యపారమైన సంతోషము నొందెను. సత్యభామ తన్ను వరించునని తెలిసినప్పుడు శ్రీకృష్ణు డంత యానందము నొందెనో లేదో మనము జెప్పజాలము. ఆ దినమున నతని మనంబునం గలిగిన గర్వము వర్ణనాతీతమై యుండును. గరుడాచలము బసనుండి యింటికి వచ్చి ప్రాతశిష్యులను గొందరిని గ్రామవాసులలోఁ గొందరిని గలిసికొని మీసము మీఁదఁ జేయివైచి రెండు, మూడు సారులు సకిలించి కోరచూపు చూచుచు నిట్లనియె!" చూడుడి నా తమాషా! మీ యూరివారు నా తెలివి, నా తేట, నా మంచితనము, నా యోగ్యత విచారించకుండఁ దమ పిల్లలకు నేను విద్యాబుద్ధులు చెప్పి బాగుచేసినందకు విశ్వాసమైన లేకుండ నిష్కారణముగా మరియొక పంతులును బిలుచుకొనివచ్చి పోటీగా బడి పెట్టించినారు. వెధవబడి ! వెధవబడి! నా బడిపోతే యెంత, ఉంటే యెంత? ఇంతకంటె నెక్కువ పని సంపాదించినాను. గరుడాచలము తన భాగవతములో శ్రీకృష్ణవేషము వేయుమని నన్ను బ్రతిమాలినది. దాని మాట తీసివేయలేక నేను సరే యని వప్పుకొంటిని. చూడండి! యెటువంటి గౌరవమైన పని సంపాదించినానో, గరుడాచలమంటే యేమనుకొన్నారు? దేశదేశాల పేరు మ్రోగిన యాటకత్తె. అది భామవేషం కట్టితే చూచినవారు మూర్ఛపోవలెను. అది పాడితే ఆదిశేషు డాలకించవలెను. దాని భాగవతంలో కృష్ణవేషం కట్టడమంటే తహసిల్ దారీపని చేయడ మన్నమాట. ఈ బడిపోగానే మరేపని సంపాదించుకొనలేకుండుటకు నేనంత వెధవననుకొన్నారా? గణపతంటే సామాన్యుడు గాడు, వీఁడు మైరావణుఁడని మీకు యిప్పుడైనా తెలిసిందా? దాని భాగవతములో కృష్ణవేషము వేయఁగల యదృష్ట మెంతవానికిఁ బట్టును? వేదం జదువుకొన్న వెట్టినాగన్నలకు, శాసాల్త్రు నేర్చుకొన్న సన్యాసులకు, పెద్దవాళ్ళమని తెగనీల్గే పెద్దన్నయ్యలకు ఈ యోగము పట్టునా? నా యదృష్టముచేత నాకు పట్టినది. "అని త్రైలోక్య సామ్రాజ్య పదవి తనకుఁ జేకురినట్లు సంతసిల్లుచు నతఁడు పలికిన యా వెంగలి పలుకులు విని వారు ముసిముసినవ్వులు నవ్వుకొని "నిజముగా నీ యదృష్టము చేతనే దాని సేవ లభించినది. ఈ గ్రామములో నింతమందియున్నారు, వారి కెవరికైన లభించినదా? అందొక్కొక్కరి పూర్వజన్మ పుణ్యమువల్ల వచ్చుచుండును. 'ముఖేముఖే సరస్వతీ' అన్నారు. నీ ముఖము చూడఁగానే గరుడాచలము నీచేత శ్రీకృష్ణమూర్తి వేషము వేయించి, తాను భామవేషము కట్టి "రారా నందకుమారా రారా నవనీతచోర!" యని నీ బుగ్గమీఁద చేయివైచి ధన్యురాలు కాదలఁచుకొన్నది. ఇంతకు దాని యదృష్టము మంచిది. కానియెడల నీవంటి బ్రాహ్మణోత్తముఁడు దానికి వేయి జన్మములు తపస్సు చేసినను దొరకునా? మమ్మది చేర్చుకొన్న పక్షమున నాల్గు వరాల సొమ్ము దాని కిచ్చికొందుము. లంచ మిచ్చినను మమ్ములను జేరనియ్యదు. నీ ముఖారవిందము చూడఁగానే

యది ని వలలోఁ బడినది" యని వారెగతాళి చెయుచుఁ బలికిరి. వారు తన్ను బరిహాసముచేయుచున్న వారైనను నా బాలిశుఁడు గ్రహింపలేక దేశ మందరు తన్ను గౌరవించునట్టి మహాపదవిలోనికి వచ్చినట్లు సంతసించి యా వార్త తల్లికి జెప్పెను. అది విని యామె తన కొడు కేనుఁగు నెక్కినట్లు సంతసించి "నాయనా! మంచిపని సంపాదించినావు. నీ కింత గొప్పతనము పట్టినందుకు ఈ యూరివారందరు కన్నులలో నిప్పులు పోసికొంటారు. దిక్కుమాలిన బడి పోతేపోయిందిలే, దాని తాత వంటి పని వచ్చినది. నే నిక్కడనే సోలెడు బియ్యము కాచుకొని కాలక్షేపము చేయుచుండెదను, నీవు వెళ్ళిరా!" యని యన్నము పెట్టిపంపెను. గణపతి తన గుడ్డలు నాలుగు మూటగట్టుకొని తన స్నేహితులం బిలిచి "యీ చుట్టుప్రక్కల గరుడాచలం భాగవతం కట్టిందంటె నేను కృష్ణవేషము వేసినా నన్నమాటె. మీరందఱు నా కోసమైనా భాగవతం చూచుటకు రండి! నా వేషమెంత దర్జాగా యెంత ఠీవిగా నుంటుందో మీరు చూతురు గాని! అల్లరి చిల్లరి వెధవలు వేషము కట్టినట్లు కడతా ననుకున్నారా యేమిటి? ఎంత చమత్కారముగా నుండునో నా వేషము చూచిన తరువాత మీకే తెలియఁగలదు. తప్పక రండి." యని ప్రత్యేకముగ నొక్కరొక్కరితో జెప్పి గరుడాచలముతో బయలుదేరి పలివెల వెళ్ళెను.

ఆ యూరు వెళ్ళిన తరువాత గణపతి గర్వము మేఱమీఱెను. 'మీ రెవ్వరండీ!' యని యతని నెవ్వరైన క్రొత్తవా రడిగినప్పుడు 'గరుడాచలము మఁగడ ' నని యుత్తరము చెప్పు చుండును. ఆ పణ్యాంగన భామవేషము కట్టినప్పుడు తాను కృష్ణమూర్తి వేషము కట్టదలచుకొనుటచే నది యొక్కసారియైనను గట్టకమునుపే తా నామె మగఁడైనట్లు భావించుకొని యట్లే లోకమున జెప్పఁ దొడంగెను. వెలవెలఁదుల నిజముగ నుంచు కొన్నవారు సయిత మావిధముగ నెన్నఁడు జెప్పుకొన రని మన మందఱ మెఱుఁగుదుము. అయినను గణపతి సంబంధ మారోపించుకొని, యది తనకు గొప్పతనమే గలిగించునని, తానట్టి యుత్తరము చెప్పుట కవకాశము కలిగినందుకు మిక్కిలి సంతసించుచుండును. గణపతి బ్రాహ్మణయింట భోజనము జేసి, తక్కిన కాలమంతయు గరుడాచలముయొక్క గృహమందె గడుపుచుండును. అంత కొన్నాళ్ళకు కొత్తపేట డిప్యూటి తహసీలుదారు గారు గరుడాచలమును పిలిపించి భామ వేషము గట్టుమని యాజ్ఞాపించిరి. ఆ తహసీలుదారువారి యాజ్ఞ తిరస్కరించుట కొంచెము గొప్పస్థితిలో నున్నవారికే యపాయకరమై యుండ నాదినములలో వేలయాలునకు గొఱవితో దల గోకికోనుట యని వేర చెప్ప నక్కరలేదు. అందుచేత నామె యచ్చటకు వెళ్ళి భాగవతము గట్టెను. హాస్యగాడు మద్దూరి మహాదేవుఁ డను బ్రాహ్మణుఁడు. అతఁడు హాస్యమున మిక్కిలి గట్టివాఁడని పేరు వడసెను. అతని హాస్యప్రసంగమును విని సభాసదులు కడుపు చెక్క లగు నట్లు నవ్విరి. సత్యభామ తెరమీద జడవైచి దానిని మిక్కిలి సొగసుగా వర్ణించుచుండ, తహసీలుదారు జరుగుచున్న యాలస్య మోర్వక "యేమిటది, గేదెతోఁక లాగున జడ తెరమీఁదవైచి లోపల కూర్చుండి యేదో గింజుకొనుచున్న దేమిటి? ఎవరోయి బంట్రోతు! జడ బట్టుకొని లాగి యీవల కీడ్చుకొని రావోయి!" యని కేక వైచెను. గరుడాచలము సహజముగ గర్వోన్మత్తురాలు. ప్రశస్తమైన కంఠమును భామవేషధారణ ప్రవీణతయు గర్వమును హెచ్చించెను. తహసీలుదారుగా రాడిన పలుకుములుకు లామెకు దుస్సహములై ప్రత్యుత్తర మీదలచినను నటువంటి మహాధికారిని యెదిరించుట స్వనాశనముకు దారి జేసికొనుట యని గుర్తెఱిఁగి బంట్రోతీడ్చుకొని రానక్కఱలేకయె జడవర్ణనము ముగించి తెఱవెడలి వచ్చెను. గరుడాచలము తన్నుంచుకొన్న

రసికుల ప్రేరణముననో వారికి గుతూహలము గల్పింపవలె నను సంతసము చేతనో చిన్న నాఁడు తల్లి చేసిన యలవాటు చేతనో మనస్సున కుత్సాహము గలుగునను తలంపు చేతనో వేసవికాలమందు కల్లును, తక్కిన కాలములందు సారాయియుఁ ద్రాగుచుండును. భామవేషము కట్టినప్పుడు చాకచక్యము హెచ్చుటకై యామె తప్పక కొంచెము పుచ్చుకొని వచ్చును. ఆనాఁడు మోతాదు కొంచెె మెక్కు వయ్యెను. సగము కలాపము వినిపించు నప్పటికి మత్తు సంపూర్ణముగ నెక్కుటచే నామె తప్పు తప్పు మాటలాడుచు నేలమీఁద బడెను. హాస్య గాడు, మద్దెలగాడు, శ్రుతిగాఁడు, గరుడాచలము నేలబడుటకుఁ గారణ మెఱుగుదురు. కాని గుట్టు బయటబెట్టుట వారి కిష్టము లేదు. కావున హాస్యగాఁడు ముందుకువచ్చి గుండె బాదుకుని "మహాప్రభూ! దుర్మార్గు లెంత పని జేసినారో, చిత్తగించండి ! గరుడాచలముయొక్క చక్కదనము, సంగీతము, భామవేషము లోని ప్రజ్ఞ చూచి యోర్వలేక యెవఁడో పాపాత్ముఁడు ప్రయోగము చేసినాఁడు. నేలబడిపోయినది. మేము దేశద్రిమ్మరులము గనుక మా దగ్గర వీనికి బ్రతిక్రియలున్నవి. ఇంత మాత్రముచేత భయము లేదు. కాని యిఁక నీ రాత్రికి భాగవతము సమాప్తము. పాప మది రేపు మధ్యాహ్నమువఱకు లేవలేదు. మహాప్రభూ, ఈ వేళకు సెలవిప్పించండి. రేపు రాత్రి యిటువంటి దొంగదెబ్బ తీయునట్టి దుర్మార్గులకు దొరకకుండ జాగ్రత్తపడి, తిరిగి భాగవతము గట్టెదము." అని వేడుకొని గరుడాచలమును తీసికొని పోయెను. వాని పలుకులు సత్యంబు గాదలచి యెవఁడో నిజముగఁ బ్రయోగము చేసినాడని నమ్మి ప్రేక్షకులు వానిని నోటికి వచ్చినట్లు తిట్టిపోయిరి. మరునాడు మరల భాగవతము జరిగెను. కొత్తపేటలో జరుగబోవు భాగవతమునకు రమ్మని యదివరకె గణపతి తన స్నేహితులకు వర్తమాన మంపెను. అందుచే హాయిగా భాగవతము జూచుటకు గణపతియొక్క కోర్కె నెఱవేర్చుటకును మందపల్లి వాసులలో బనిపాటులు లేని పడుచువాండ్రి పదిమంది వెళ్ళిరి. చదువురాని యాడు వాండ్రు పాటలు చెప్పుకొన్నట్లు గణపతి తన కలాపభాగము నొకరిచేత చెప్పించుకొని వల్లించెను. ఇప్పుడు కొన్ని రాగము లతఁడు నేర్చుకొనెను. కాని చిన్ననాఁడు తల్లి కొట్టినప్పుడు, పంతులు బాదినప్పుడు పెట్టు రాగాలకు, నీ రాగాలకు నంతగా భేదము కనబడలేదు. ఆ నాడు సత్యభామ నిర్విఘ్నముగా దన కలాపము వినిపించెను. హాస్యగాని వేషము కంటె కృష్ణవేషమే సభ్యుల కెక్కువ యానందము గలిగించెను. అనగా నతఁడు చక్కగా కథాకలాపము వినిపించుటవల్ల నని తలంపవలదు. వామనావతారమున దలపించు నతని మూర్తియే మొదట నానంద కారణ మయ్యెను. తరువాత నానందకారణ మిది. తాను జగద్రంజకముగఁ దన కథాభాగము వినిపింపగల నని గంపంతయాసతో నుండఁగా సభాసదులం జూడగానే యతనికి మేన ముచ్చెమటలు బోసెను. నోట మాట వెడలలేదు. తన స్నేహితుల యెదుర తన కవమానము గలుగు నని యాతఁ డెంతో వగచి జ్ఞాపకము జేసికోవలెనని కడు ప్రయత్నము చేసెను. కాని తాళము పోయిన పెట్టెలో నున్న వస్తువువలెనే కథా భాగము దుర్లభ మయ్యెను. సభాసదు లందఱు జప్పటలు గొట్టి నవ్విరి. అంతలో హాస్యగాడు కృష్ణవేషగానిని కొంచెము కదిపి మాటలాడించవలె నని 'మాధవా! మన దే యూర ' ని యడిగెను. కృష్ణవేషములో నుండుటచే ద్వారకకాపుర మని గణపతి యుత్తరము జెప్పుటకు మారుగా 'మనది మంద పల్లి గాదట్రా! ఎఱుగనివానివలె నడిగెదవే?' మని ప్రత్యుత్తరము చెప్పెను. అప్పుడు సభాసదుల యానంద మేమి చెప్పుదును? చప్పట్లతో దెసలు మారుమ్రోగెను. హాస్యగాఁడు కడచిన రాత్రి పన్నిన పన్నుగడయే మరల పన్నదలచి 'యెవరో మరల దెబ్బ గొట్టినారు. మహాప్రభో!' యని చెప్పెను. కాని యా పలుకులు ప్రేక్షకులకు నమ్మదగి యుండలేదు.

నిష్కారణముగ భాగవతము చెడిపోయిన దని సభాసదులు విచారించిరి. గరుడాచలము సిగ్గుపడియెను. అందరు గృహముల కరిగిరి. గరుడాచలమునకు గణపతి యొక్క వేషభాషలు కొంతకాలమునుండి యేవ గలిగించుచు వచ్చినను గథాకలాపము వినిపించుటలో నతని కేమయిన ప్రజ్ఞయుండునేమో యని యామె యాసపడెను. కాన యదిగూడ వట్టిదైనతోడనే తన కొలువులోనుండి లేచిపొమ్మని గణపతితో జెప్పెను. ఇకమీద మిక్కిలి జాగ్రత్తతో బని చేయుదునని గణపతి యామెను బహువిధముల బ్రతిమాలెను. కాని వాని కోరిక నామె నిరాకరించెను. అటమీద నే వృత్తి యవలంబింపవలయు నని గణపతి తన మిత్రులతో నాలోచింప నెక్కడయినను వంటబ్రాహ్మణుఁడుగ గుదిరినపక్షమున చక్కగా జీవనము జరుగునని కొందరు మిత్రు లుపదేశించిరి. ఆ వృత్తి యతని కంతగా నిష్టము లేకపోయినను విధిలేక యతఁ డొడంబడ వలసి వచ్చెను. గరుడాచలము దగ్గర నున్నపుడు తల కగరు నూనె సంపెంగనూనె రాచికొనుచు నది తీసి పాఱవైచిన పూలదండలు చేతులకు మెడకు తగిలించుకొని యానందించుచు దాని మగడ నని చెప్పికొనుచు గడపిన దినములే తన జన్మమధ్యమున శ్రేష్టమైన దినములుగాఁ దలంచి పూర్వజన్మ దుష్కృత విశేషమున నట్టి యఖండయోగము తనకు దప్పిపోయిన దని విచారించుచు నొక లోకలఫండు యినస్పెక్టరు గారి యింట వంట బ్రాహ్మణుడుఁగ గుదిరెను. అన్నము పెట్టి నెలకు నాలుగు రూపాయలిచ్చుటకు వారొడంబడిరి. కాని పదునైదు దినములు ముందుగా దన యాడువాండ్రదగ్గఱ వంట నేర్చికొమ్మని యా యధికారి గణపతితో జెప్పెను. అట్లే యని గణపతి యాయన తల్లియు భార్యయు వంట చేయునపుడు దగ్గఱ కూర్చుండి వంట చేయువిధము కనిపెట్ట జొచ్చెను. ఇట్లొక మాసము గతించిన తరువాత యజమానుడు గణపతిని దీసికొని యొక గ్రామము వెళ్ళి యుద్యోగస్థుల నిమిత్త మేర్పడిన యొక బంగాళాలో దిగెను. వంట కుపయోగించు పాత్రములను దెచ్చుకొమ్మని యజమానుఁడు పలుమాఱు జెప్పెను. కాని మందమతులలో నగ్రగణ్యుఁడైన గణపతి గరిటెలు మఱచిపోయెను. ఒక్కొక్క మనుష్యున కెన్ని బియ్యము పోయవలెనో యతఁ డెఱుఁగడు. ఏ గిన్నె యెంత యుడుకునో తెలియక మానెడు బియ్య ముడుకు గిన్నెలో, భోజనము చేయవలసినవారు తమ రిద్దఱైనప్పటికి వడ్డెడు బియ్యముబోసి పాక మారంభించెను. అన్నము గిన్నెలో నొక్కటే ముద్దయైపోయెను. కలియబెట్టుటకు గరిటె లేకపోవుటచే గణపతి చుట్టుప్రక్కల కరిగి యొక పుల్ల దెచ్చి దానితో గలియబెట్టెను. దైవవశమున నది వేపపుల్లయయ్యెను. పప్పులో నుప్పెక్కువ యయ్యెను. పైగా నది యెనుపక పోవుటచే బద్దలు బద్దలుగా నుండెను. చారు కాచెను. కాని యది కంసాలులు వెండి వస్తువులు మొదలగు వానికి వన్నెదెచ్చుటకై యుడుకబెట్టెడు చింతపండు పులుసు వలె రుచిలేక చూడ నసహ్యమై యుండెను. యజమానుఁడు స్నానముచేసి వడ్డించుమని కూర్చుండ, గణపతి గిన్నె దెచ్చి యా వేపపుల్లతోనే వడ్డించుటకు బ్రయత్నము చేసెను. కాని విస్తరిలో నన్న మూడిపడదయ్యెను. గిన్నె నేలబెట్టి కొట్టి వేపపుల్లతో బొడిచి పొడిచి నానా బాధలు పడునప్పటికి పారణపు ముద్దవలె రెండుండ లూడిపడెను. ఆ తరువాత గణపతి పప్పు వడ్డించెను. అన్నము చిదుపుటకు యజమానుని తరము గాకపోయెను. చేయి వై చునప్పటికి నిప్పుమీద చేయి వైచిన ట్లంటుకొనెను. విసనకఱ్ఱఁ దెచ్చి కొంతసేపు విసరిన తరువాత నన్నము చల్లబడెను. కాని యజమానుఁడు ప్రాణాహుతులు పుచ్చుకొను నప్పటికె యన్నము యొక్క రుచి తెలిసెను. వేపగింజలు వండిపెట్టి నట్లుండెను. కాని యన్నము వండిపెట్టినట్లు లేదు. తరువాత యజమానుఁడు పప్పు నోటబెట్టెను. ఉప్పులో నాలుగు పప్పుబద్ద లడ్డమువేసి యతఁడు వండెనో,

పప్పులో చెరిసగ ముప్పువేసి వండెనో కనిపెట్టుట బ్రహ్మదేవుని తరముకాదు. అన్నము, సూపము రుచి చూచిన తరువాత యజమానునకు దుఃఖము కోపము నొక్కసారిగా రాఁగా నిట్లనియెను. 'హా! హా! హా! నీ వంట యమృతమువలె నున్నదిరా! నలపాక భీమపాకము లన యీ వఱకు లోకమున నున్నవి. కాని మా కర్మపాకము చేతనో దైవ దుర్విపాకముచేతనో గణపతిపాకమని మూడవ పాకము వచ్చినది. విరోధముచేత నెవఁడైన మరియొకని జంపఁ దలఁచు కొన్నపుడు నాభి పాషాణము మొదలయిన విషములు పెట్టనక్కఱలేదు. నీ చేత నొక్కసారి యన్నము వండి పెట్టించిన జాలు ఏబది సంవత్సరములు బ్రతుకదలంచిన వాఁడా పూట జచ్చును. ఉదయమున నే నేమియుఁ దినకుండ గుఱ్ఱమెక్కి యెంతో దూరము తిరిగి బడలి మిక్కిలి యాకఁలిగొని యింత మృష్టాన్నము నీవు వండి సిద్ధముగా నుంచుదు వని గంపంత యాసతో వచ్చినందుకు అన్నము పెట్టుటకు మారు నీవు సున్నము పెట్టితివి. నీ వంట మండిపోనూ. ఇఁక చాలు! నన్ను చంపక నీ దారిని నీవు వెళ్ళు, నాయనా ! మీ పెద్దలకు వేయి నమస్కారములు!' అనవుడు గణపతి చిన్నవోయి 'వంటెందుకు బాగులేదో నేనెరుగను. ఇది మీ వాళ్ళు నేర్పిన వంటే. నా వల్ల వచ్చిన లోప మొక్కటి. గరిటె మరచిపోయినాను అన్నమీ పుల్లతో గలియబెట్టినాను. ఇది వేపపుల్ల యేమో తెలియదు. అయితేమాత్రమేమి? వేపపుల్లతో మొగము కడిగికొనమా? వేపపువ్వు తినమా ? అన్నము చేదైన మాత్రమున నింత యల్లరి చేయవలెనా? మీ యాడవాళ్ళు చేసినప్పుడు మాత్రము వంట యెప్పుడైన చెడిపోదా ? మీకింత యోపిక లేదన్నమాట మొదటే తెలిసిన పక్షమున మీ దగ్గరకు నేను రాకపోదును. పోనియ్యండి. యేలుట కూళ్ళు లేవు గాని ముష్టి యెత్తుకొని తినుట కూళ్ళు లేవా? మీ వంటివారు నాకు వేయిమంది; నా వంటివాళ్ళు మీకు వేయిమంది. నీ మీ దగ్గర నెలదినములు పనిచేసినాను. నా జీతమీయండి. మీ దగ్గర పనిచేయడము నాకే యప్రతిష్ట' యని చివాలున లేచి తన గుడ్డలు నాలుగు మూట గట్టుకొని పయనమయ్యెను. ఆ యజమానుఁడు వాని మాటల కలుగక వాఁడొక యున్మత్తుఁ డనుకొని రెండు రూపాయాలు వాని చేతిలో బెట్టి " నీకు నెలకు నాలుగురూపాయ లియ్య దలఁచుకొన్నాను. కాని నీ తెలివికి రెండు రూపాయలు చాలును. పో!" యని చెప్పెను. "పోనీయండి. నా సొమ్మెంత మంది తినలేదు, అందులో మీరొకరు!' యని యా రెండురూపాయలు బుచ్చుకొని విసవిస నడచి పోయెను. ఆ యుద్యోగస్థుఁ డాపూట భోజనము లభింపమి యరటిపండ్లు తెప్పించుకొని తిని యొక విధముగా క్షుద్బాధ తీర్చికొని సాయంకాల మాయూరు కరణముగారి యింటికిబోయి తన యవస్థ జెప్పుకొని యక్కడ భోజనము చేసెను.

# పందొమ్మిదవ ప్రకరణము

వానపల్లెలో గణపతి స్థానమందుఁ బ్రవేశించిన యుపాధ్యాయుఁడు కాలవశమున విశూచి జాడ్యముచేత మృతినొందెను. అందుచేత నా యూరులో బడి చెప్పువారు లేకపోయిరి. అంతలో గణపతి కృష్ణవేషధారణమును, పాచకత్వము నను రెండుద్యోగములు మానిఁ యా గ్రామము బోవ తటస్థించెను. గణపతిచర్య లెన్నటికి మరపురానివైనను కొంద రా చర్యలు మరచి బడి పెట్టు మని యతని నడగిరి. కొందరు గణపతి యెంతమాత్ర మా పనికి బనికిరాఁడని వాదించిరి. అభిమాన మున్నవారి యాదరముచేత నతఁడు మునుపటి చోట గాక మరియొక చోట పాఠశాల స్థాపించెను. బసయు మునుపటి చోట చేయక యా యూరివా రొకరు స్వగృహము విడిచి బిడ్డల కింగ్లీషు చెప్పించుకొనుటకు అమలాపురము వెళ్ళుచుండఁగా వారి నడిగి యా యిల్లు తన కాపురము నిమిత్తము గణపతి పుచ్చుకొని యందుఁ బ్రవేశించెను. ఇల్లు పెద్దదగుటచే పిశాచములు వచ్చి పీడించుననని యాతడు విద్యార్థుల నెప్పటి యట్లు కొందరిని దనకు సాయముగ బిలుచుచుండును. ఆ యింటి దొడ్డిలో నాలుగైదు కొబ్బరిచెట్లుండెను. ఎలుక లప్పుడప్పుడు చెట్లెక్కి లేక పుచ్చెలు కొట్టి క్రింద పారవేయజొచ్చెను. ఎలుకలు రాయిడి తొలగించుటకై గణపతి యనేక యుపాయములు బన్నెను. ఆ యుపాయములలో నొకటియు నతనికి నచ్చలేదు. ఎట్టకేల కతనికి గొప్పయాలోచన యొకటి పొడకట్టెను. అది యమోఘ మని యతడు తలంచెను. ఒకనాడు సకల గృహవర్తియగు మార్జాలచక్రవర్తిని బట్టుకొని దాని నొక బుట్టలో బెట్టి శిష్యు నొకనిం బిలిచి చెట్టెక్కించి మరియొక శిష్యునిచేత పై నున్న వాని కా పిల్లి నందియ్యమని చెప్పెను. అతఁడ ట్లందిచ్చెను. పై వాడు పిల్లి నందుకొనిన తరువాత దాని మెడ కొక త్రాడు బోసి యా త్రాడు కొమ్మకు కట్టివేయ మని గణపతి చెప్పెను. శిష్యుఁడు గురుని యాజ్ఞ ప్రకారము గావించి క్రిందికి దిగెను. అప్పుడు గణపతి శిష్యులతో నిట్లనియె. 'ఈ సారి యెలుకలు చచ్చిపోయినవి. వీటి మొగం మండ! కొబ్బరికాయ యొక్క టైన దక్కకుండ వాటిపొట్టం బెట్టుకొనుచున్నవి. ఈ గ్రామములోని వారందరు నావలెనే యెలుకలబాధ పడుచున్నారు. కాని మందమతిముండాకొడుకులు నావలెనొక్కఁడైన యాలోచన చేయలేక పోయినాఁడు తెలివితేట లుండవలెను. కాని యేళ్ళుండఁగానే సరా. డబ్బుండఁగానే సరా!' ఆ కోతలు విని శిష్యులానందించిరి. అప్పటికి సాయంకాలమయ్యెను. గణపతి భోజనముచేసి నిద్రించెను. తన బిడాల మెన్ని యెలుకలనుబట్టి రాత్రి చంపెనో చూడగోరి గణపతి చెట్టుదగ్గరకుఁ బోయి మెడయెత్తి చూచునప్పటికి పిల్లి మెడకా త్రాడు యురిపడ చచ్చి యురి స్తంభముల వ్రేలాడు నేరస్తుని వలె వ్రేలుచుండెను. అది యేమైనదో చూచుటకై శిష్యులు చేరి యా బిడాలము యొక్క దుర్దశ జూచి జాలి నొందిరి. ఆ వార్త యప్పుడె గ్రామమున బొక్కెను. సూర్యోదయ మగు నప్పటికె గ్రామమునందలి పిన్న పెద్దలు నా వింత జూచుటకై యచ్చోటికిం జనిరి. నవ్వినవారు నవ్విరి. వెక్కిరించినవారు వెక్కిరించిరి. పరిహాసగర్భమున నతని బుద్ధి మెచ్చినవారు మెచ్చిరి. అంద రన్ని విధములు ననుచుండ మహాదేవశాస్త్రి గణపతి తల్లితో నిట్లనియెను. "సింగమ్మప్పా! నీ కొడుకు పిల్లి బ్రహ్మహత్య చేసి నాఁడు. కుక్కను చంపిన పాపము గుడికట్టి నప్పటికి బోదు. పిల్లిని చంపిన పాపము బంగారు పిల్లిని చేసి బ్రాహ్మణునకు దాన మిచ్చిన గాని పోదు. అట్లు చేయకపోతే వంశనాశన మని పెద్దలు చెప్పుచున్నారు. ఆనక నీ యిష్టము. నీ మేలు కోరినవాడను గనుక నిజ స్థితి జెప్పినాను. "అనవుడు సింగమ్మ గుండె బాదుకొని "అయ్యో! నాయనా! ఎంతపని

జరిగిందిరా! ని కొబ్బరిచెట్లు కూలిపోను. మి కాయలు గంగపాలు గాను. ఈ మాయపిల్లలు మా వాడి మతి విఱిచి యీ పని చేయించినారమ్మా. అయ్యోకొడుకా! నీవు బ్రతకవు కాబోలునురా, నాయనా!" యని కొడుకును గౌగిలించుకొని యేడ్చెను. అందులోఁ గొందఱు "అవ్వగారూ! భయపడకండి. మే మందరమూ చందా వేసికొని బంగారుపిల్లి చేయించి మీ యబ్బాయిచేత దానము చేయించెదమని ధైర్యము జెప్పిరి. అంతటితో గణపతి మనస్సు, తల్లి మనస్సు స్థిమితపడెను. మహాదేవశాస్త్రి యా రాత్రి మరల గణపతి గృహమున కరిగి తల్లి కొడుకులతో నిట్లనియెను. "బంగారు పిల్లిని చేయించుటకు గ్రామస్థులు చందా లిచ్చెద మని చెప్పినారు కదా. ఆ చందాలు మీరు పుచ్చుకొన్న పక్షమున నప్పటి కప్పుడే పులుసులో పడిపోవును. అవి ప్రోగుచేసి నా చేతి కివ్వండి. శాస్త్రప్రకారము చచ్చిపోయిన పిల్లి యెంత యున్నదో అంత పిల్లిని చేయించి దాన మీయవలెను. మన మనమంతవఱకు శక్తులము గాము గనుక చందాల సొమ్ము పెద్దకాసువఱకు జేరిన తోడనే శాస్త్ర సంతృప్తికొఱకేదో విధముగా నొక చిన్నపిల్లిని చేయించి యొక బ్రాహ్మణుని చేతిలో బెట్టుదము. పిల్లిదానము తిలదానముకంటె చెడ్డది. అది యెవరు బట్టరు. ఏదో విధముగ నేనే యేర్పాటు చేయుదును లెండి, మీరు భయపడకండి" అని చెప్పిపోయెను.

మహాదేవశాస్త్రి ఉదయమున జేసిన ప్రథమోపన్యాసమును బట్టియు రాత్రి గావించిన ద్వితీయోపన్యాసమును బట్టియు నతఁ డేలాగైన గణపతిని దోష విముక్తుని జేసి, పిల్లిదాన మెవరు బట్టకపోయినను దానైనను యా దానమును బట్టి యాతని నొకదరికి జేర్పవలయు ననియు సంకల్పించి నటులు స్పష్టముగ దెలియుచున్నదికదా. ప్రాణభయముచేత గణపతి ప్రతిదినము నిద్ర మేల్కొనగానే నలుగురునో యైదురుగునో గృహస్థులను జూచి చందా నడిగి తన చుట్టముక్కల కందులో గొంత మిగుల్చుకొని తక్కినవి మహాదేవశాస్త్రిగారి చేతి కిచ్చుచుండును. అట్లొక మాసములో నొక కాసు పోగుచేసి యతఁడు శాస్త్రి కిచ్చి, పైడిపిల్లిం జేయించు మని కోరెను. కాని కా సాగ్రామమున దొరకలేదని కొంతకాలము, కంసాలి చేయలేదని కొంతకాలము, తూనిక వేయ లేదని కొంత కాలము జరిగి గణపతి యా గ్రామమున నుండగా సువర్ణ మార్జాలము నతనికి జూపలేదు. గణపతి చందావలన దెచ్చిన రాగిడబ్బులు; వెండి బేడకాసులు, పావులా కాసులు చేతబడవైచి నప్పుడే యనియె రాగిపిల్లు, వెండి పిల్లులు నని మహాదేవశాస్త్రి మనస్సులో దలంచుకొని యాపిల్లుల నెప్పటికప్పుడె భక్షించుచు వచ్చెను. కాని బంగారుపిల్లిని జేయించదలఁచుకొననే లేదు.

బంగారుపిల్లి గొడవతో నిట్లు కొంతకాలము గడచిన పిమ్మట నొకనాడు గణపతి, అతని యింటికి రాత్రులు పండుకొన వచ్చు పెదవిద్యార్థులు కొందఱును గలిసి కాలువదగ్గఱకు షికారు బోయి, యయ్యది వేసవికాల మగుటచేఁ దెల్లవాఱు జామున లేచి ప్రతిదినము స్నానము చేయవలయు నని నిశ్చయించుకొనిరి. కాని దీని కొక్కచిక్కు గనబడెను. గణపతికి మెలకువ వచ్చుట యసంభవము, ప్రతిదినము జాము ప్రొద్దెక్కిన తరువాత లేచు గణపతి జాము తెల్లవారగట్ల లేచుట యన యర్ధ రాత్రమున సూర్యోదయ మగుటయె. శిష్యుల ముందె మేల్కొని పిదప గురువును లేపవచ్చునని వారిలో నొక్క డాలోచన చెప్పెను. తెల్ల వారుజామున శిష్యులకు ముందు మెలకువ వచ్చుట యెట్లని వారిలో నొకనికి సందేహము తోఁచెను. గురువుగారి దగ్గరున్న ప్రజ్ఞలన్నియు శిష్యులకు లేకపోయినను నిద్రావిషయమున మాత్ర మతని శిష్యులే యని యనిపించుకొనుటచేత నట్టి సందేహమున కవకాశము గలిగెను. పట్టణములో గొప్పవారి

యిండ్ల నుండు నట్టి గడియారమొక్కటి యున్నపక్షమున ముందుగాఁ దక్కిన వారికి మెలఁకువ వచ్చుటకు వీలుగా నుండునని యొకడు చెప్పెను. అది విని కాపుల కుఱ్ఱవాఁ డొక డిట్లనియెను. "గడియారములు మన దేశములో లేవు. నూటనాట నొకటి యున్నదో లేదో! అదిగాక గడియారము లేకపోయిన నేమి? మంచి కోడిపెట్ట నొక దానిని మనము పెంచుకొన్నపక్షమున నది నాలుగుజాములకు కూయును. కడపటిసారి కూసినతోడనే ముందుగా మనకు మెలకువ వచ్చును. ఆ తరువాత మనము గురువుగారిమీద నెక్కి త్రొక్కియొ రక్కియొ గిల్లియొ కఱచియొ లేపవచ్చును. ఇదిగాక కోడిని పెంచుటవల్ల గురువుగారికి మఱి రెండు లాభము లుండును. కోడి గ్రుడ్లమ్మినందువలన కొంత డబ్బు చేరును. పైగా దాని కడుపున రెండుమూడు పుంజులు మంచివి పుట్టినయెడల మన యమ్మవారి తీర్థములోను మఱి యితర తీర్థములలోను వాటిచేత పందెములు కట్టించి కావలసినంత డబ్బు సంపాదించవచ్చును. కాబట్టి నా యుపాయము విని యొక కోడిని పెంచుట మంచిది. " అనవుడు వెఱ్ఱివాలకముగా నున్న యొక బ్రాహ్మణబాలుడు "ఛీ! ఛీ! కాలమానము దెలియుటకు బ్రాహ్మణు లెవరైన కోడిని పెంచుదురా? ఇది చాల తప్పు. అది మనము చేయవలసినది కా" దని హితోపదేశము చేసెను. ఆ యుపదేశము తక్కిన బ్రాహ్మణ బాలకులకును సహేకమై సమ్మతమై తోచినను నదివఱకె హాస్యాస్పదముగ నున్న గురువుగారి చరిత్రము మఱింత పరిహాసపాత్రముగఁ జేయఁదలంచిన యా శూద్రకుమారుని యాలోచనము మిక్కిలి బాగున్నదని ప్రశంసించి యతని మాట కడ్డము చెప్పిన బ్రహ్మణబాలుని వారు చీవాట్లు పెట్టిరి. పందెముల వలనను గ్రుడ్లవలనను విశేషలాభము గలుగునని వినినతోడనే గణపతి కుక్కుట స్వీకారమునకు సమ్మతించి యొక కోడిని దనకు దెమ్మని కాపుల కుఱ్ఱవాని నడిగెను. వాఁడు తన యింటనున్న యొక పెట్టను దెచ్చి మరునాఁ డుదయమున గురువుగారికి గొప్ప కానుకగా సమర్పించెను. ఆ యులుపా గ్రహించి గణపతి పరమ సంతోష భరితుఁడై దాని కొక గది యేర్పరచి కన్నబిడ్డవలె దాని నాదరింపఁ జొచ్చెను. బడిలో చదువుకొను పిల్ల లందరు వంతుల ప్రకారము దినమున కొక్క పిల్లవాఁడు దాని నిమిత్తమై తఫుడు తేవలె నని యతఁ డాజ్ఞాపించెను. ఆ ప్రకార మందరుఁ దే దొడగిరి. తవుడు తేలేనివారు గురువుగారియొక్క బెత్తము దెబ్బలకు గురి కావలసినదే. దాని కూతవలన శిష్యులకును గురువునకును మెలుకువ వచ్చుటయు దెల్లవారు జామున వారు కాలువకు స్నానమునకుఁ బోవుటయు మూఁడునాళ్ళ ముచ్చటయ్యెను. పిన్ననాటినుండియుం బెంచిన బద్ధకము వారి శ్రద్ధను కబలింప వారా ప్రయత్నము మానుకొనిరి. కోడిమాత్రమె యింట మిగిలెను. గణపతి బడిపిల్ల లందరు జూచుచుండగను, వారు లేనప్పుడును కోడిని యొడిలో బెట్టుకొని చేతితో జోకొట్టుచు 'నా బుల్లికోడి రావే! నా బుచ్చికోడి రావే! నా వెఱ్ఱికోడి రావే!' యని ముద్దులాడుచుండును. తల్లి సింగమ్మ కుమారుఁడు చేయు కుక్కుటసంరక్షణ మెంతమాత్రము సహింపక 'కొంప మాలపల్లి చేసినావురా, యాయనా! నీ కోడి మండిపోను! దీని యీకెలు రెట్టలు యెత్తిపోయలేక చచ్చిపోవు చున్నాను. బ్రాహ్మణులకు కోడి యెందుకురా? నీముద్దు ముక్కలైపోనూ!" యని పలుమారు మందలించుచుండెను. అవి యెంతమాత్రము వాని తల కెక్కలేదు. మహారాజుల యతఃపురాంగనలు చిలుకలను రాయంచలను మిక్కిలి గారాబమునం బెంచుచు నెత్తుకొని ముద్దాడుచు నానందించునట్లె గణపతియు నెందఱు చెప్పినను వినక యా కోడి తన కారవప్రాణ మనియు దనపాలిటి లక్ష్మి యనియు నమ్మి దానికే వెలితి రాకుండ వేవిధముల గనిపెట్టుచుండును. గ్రామ వాసులలో ననేకు లతఁడు కోడినెత్తుకొని ముద్దాడు సమయమున నక్కడకు బోయి, వాని మాటలు

ముఖవైఖరులును బరిక్షించి వినోదముతొ బ్రొద్దుపుచ్చు చుందురు. అప్పు డప్పుడా కొడ గ్రుడ్లు పోవుచుండును. దొంగిలించిన బాలుని గనుగోన లేక గణపతి బడిపిల్ల లందఱి వీపులమీఁద నీతబెత్తములతో బాజాలు వాయించుచుండును. రామాయణ భారత భాగవతా దులలో కథలు చెప్పుకొనినట్లు యాగ్రామవాసులు, సమీప గ్రామవాసులును వాని చరిత్రము జెప్పుకొని కడుపులు పగులునట్లు నవ్వుచుందురు. ఎప్పటి గ్రుడ్లప్పుడు గణపతి ఖర్చు నిమిత్త మమ్మివేయుచుండును. కాని కోడి పొదిగి వాటిని పిల్లలు జేయువఱకు నోపిక పట్టలేకపోయెను. అట్లుండఁగా నొకనా డాకుక్కుటము మిక్కుటమైన సంతోషముతో దొడ్డిలో దిరుగుచు నక్కడక్కడ రాలిన గింజలు చెదపురుగులు మొదలైనవాని నేరుకొని తినుచుఁ దిరుగు చుండగాఁ నేమూలనుండియొ నొక గండుపిల్లి వచ్చి దానిం బట్టుకొని గొంతుకొరికి చంపెను. చంపిన తరువాత లోపలినుండి గణపతియు బడిపిల్లలు వచ్చిరి. కార్యము మించి పోయిన తరువాత వచ్చి యేమి చేయగలరు? అప్పుడు గణపతి పడిన దుఃఖపు వర్ణన దుస్సాధ్యమైనను గొన్ని మాటలైన వ్రాయక పోవుట చరిత్రమునకు వెలితి యగును. కావున నించుక చెప్పదలంచితిమి. 'అయ్యో! నాకోడీ! నానల్లకోడీ! నా పాలిటి బంగారు గని ననుకొన్నానే, నిన్ను! నీ కడుపున పుట్టిన పుంజుల చేత పందెములు వేయించి నాలుగైదు వందలు సంపాదించి పెండ్లి చేసుకుందా మనుకున్నానే ! నీవంటి బంగారు బొజ్జగల కోడి నావంటి నిర్భాగ్యునకు దక్కునటే! నీకెంత ముద్దుగా తౌడు పెట్టుకొన్నానే! భుజముమీద ఎక్కించుకొని త్రిప్పినానే, రాత్రులు నా ప్రక్కలో బండుకొనేదానవే, ఇక నేనొక్కడ నేలాగున పడుకోగలనే ఈమాయ పిల్లెక్కడ వచ్చిందే నీ ప్రాణమునకు." అని దుఃఖించుచుండ సింగమ్మ యతని కడకుఁ బోయి "యయ్యో నాయనా! అది చుట్టమా? పక్కమా? కోడికోసమల్లా యేడువవచ్చునట్రా?" యని మందలించెను. ఆ పలుకులు వినగనే యతఁ డాగ్రహావిష్టుడై తాటియాకుల మంటవలె లేచి "దిక్కుమాలిన ముండా! నా కోడికి నీ దృష్టి తగిలిందే ముండా! దానిని చూచినప్పు డెల్ల నీ కన్నులలో నిప్పులు పోసికొన్నావు. నీ మూలమున నిక్షేపమువంటి కోడపెట్టె పోయినదే ముండా! నా యిల్లు చిన్నబోయి వల్ల కాడు లాగున్నదే ముండా! నీ కన్ను లిప్పుడు చల్లగా నున్నాయటే, ముండా!" యని కోప మాపుకొనలేక యామెకడకుఁ బోయి బుజ్జువంగదీసి పదిచఱపులు వైచెను. "నీ కేమి చేటుకాలము వచ్చినదిరా? నే నేమి జేసినానని నన్ను కొట్టుచున్నా" వని యామె యేడ్చుచు లోపలికి బోయెను. ఆ రాత్రి యతడు దుఃఖముచేత సరిగా నన్నమే తినలేదు. జన్మమధ్యమున నతనికి సరిగా నిద్రపట్టని రాత్రి యదియె. తెల్లవారుజామున నెన్నడులేని దతనికి మెలకువ రాగా "యీ పాటికి లేచి కూసేదానవే. నీ కూతలు నాకు సంగీతములా గుండేవి. నేనెంత దిక్కుమాలినవాడనైతినే! నీవు లేకపోవుటచేత యిల్లు బావురుమని పోయిందే! నీవు చచ్చిపోయినావు కాని మా తల్లి ముండైనా చచ్చిపోయినదికాదే!" అని పరిపరి విధముల దుఃఖించెను. ఆ మరునాటినుండియు మఱియొక కోడికొఱకు ప్రయత్నము చేయదొడగెను, కాని యది లభించినదికాదు.

# ఇరువదియవ ప్రకరణము

తనకు వివాహము కాలేదని, యందువలన సాటివారిలో దనకు చిన్నతనము గలుచున్న దని, కష్టపడి చేసుకొన్న పెండ్లి చెడిపోయిన దని, కొంతకాలమునుండి గణపతి మనస్సులో విచారించుచుండెను. అతఁడు కట్టిన పుస్తె త్రెంచివైచి బుచ్చమ్మకు దండ్రి మరల పెండ్లిచేసెను. ఆ వార్త విన్నది మొదలుకొని మరల కష్టపడి తా నెట్లయిన వివాహము చేసికొని మేనమామ యొద్దకుబోయి "యీ పాడుపిల్ల నాకు తప్పిపోయినంత మాత్రమున నాకు వివాహము కాదనుకున్నారా? దీ నబ్బవంటి పిల్లను చేసికొన్నాను, చూడండి!" యని వారిని దెప్పవలెనని గణపతి మనస్సులో నిశ్చయించుకొని పెండ్లికూతురు నిమిత్తమై వెదకజొచ్చెను. తల్లి సింగమ్మయు దన కొడుకు ఘోటకబ్రహ్మచారియై యుండినా డనియు, బ్రసిద్ధమైన పప్పుభొట్లవారి వంశము వానితో నంతమొందు ననియుఁ దన మగనికి మామగారికి వారి పూర్వులకు సద్గతు లుండవనియు మిక్కిలి విచారించి, యిరుగు పొరుగు స్త్రీలు కనఁబడినపు డెల్ల నిట్లనుచుండును. " అమ్మా! మీ రంద రభిమానించుకొని మా గణపతి నొక యింటివానిని జేయరుగద. వాని మెడలో నాలుగు పోగులు పడే దారి చూతురమ్మా! మీకు బహుపుణ్య ముంటుంది. ఎంతమందో వంట బ్రాహ్మణులకు, నీళ్ళ బ్రాహ్మణులకు, దెలివి తేటలు లేనివాళ్ళకు యిట్టే పెండ్లిం డ్లగుచున్నవి. నా కర్మ మేమో కాని మావాడికి పిల్లనిచ్చుట కెవ్వరు రారు. కులము తక్కువా? గోత్రము తక్కువా? మేమేమి కుక్కను దిన్నామా? నా బిడ్డ పదిమందిలో తిరుగలేనివాడా? డబ్బు తెచ్చుకోలేనివాడా? మీ రందరు తలో పదిరూపాయలు చందా వేసి మా వాడికి పెండ్లి చేయండమ్మా. మా కిన్ని యేండ్ల పిల్ల కావలెను, అన్ని యేండ్ల పిల్ల కావలెను, అని పట్టింపులేదు. ఎన్ని యేండ్ల పిల్లయినను సరే. చివరకు రెండు మూడు నెలల పిల్లయినా సరే. అమ్మా! వానికి పాతిగేండ్ల కంటె నెక్కువ లేవు. ఇదొక వయస్సా? మావాడి కిప్పటికి కట్టు తప్పిపోలేదు." అని చెప్పుచుండ నామె పుత్ర స్నేహమునకు, వెంగలితనమునకు వారు మిక్కిలి విస్మితులై నవ్వుచు "సింగమ్మవ్వా! అలాగే పెండ్లి కుదర్చండి. మాకు తోచిన సహాయము మేము చేయుదు మని యుత్తరము చెప్పుచు వచ్చిరి. ఆమె కొడుకుం గలసికొన్నను, చుట్టములఁ జూచినను, చుట్టుప్రక్కల సుదతుల గనుగొనినను, బెండ్లిమాటయె కాని మఱియొక ప్రసంగము చేయుట మానెను. అన్యప్రసంగములు వచ్చినను నామె యెట్టకేల కీ ప్రసంగముననే దింపును. బడిపిల్లలతోను బాటసారులతోను బంధువులతోను గ్రామవాసులైన కరణములతోను కాపులతోను గణపతి తన వివాహప్రసంగమే చేయజొచ్చెను. తన శాఖలో నెవనియొద్ద నవివాహితయైన బాలిక యున్నదని విన్నను దన కామె నిచ్చి పెండ్లిసేయు మని స్వయముగానైన మాతాపితరుల నతఁ డడుగును. లేక యెవరిచేతనైన వర్తమాన మంపును. నీ కెంత యాస్తి యున్నదని యెవరైన నడిగిన పక్షమున నతని కెంతో కోపమువచ్చి యిట్లనును. "ఆస్తి! ఆస్తి! ఆస్తి లేకపోతే బ్రతకలేరా యేమి? ఆస్తి యున్నవారు బంగారము దినుచున్నారా? లేనివారు మన్ను దినుచున్నారా? ఎందు కాస్తి? చచ్చినప్పుడు కూడ తగులవేయుదురా యేమిటి? నేను భార్యకన్నము పెట్టగలనా, లేనా? యని యొక్కమాట విచారించవలెను. మీ యందరి కంటె బాగానే భార్య కన్నము పెట్టగలను. ఆస్తి కావాలట. ఆస్తి పాస్తి! చాలు చాలు! నోరుమూయండి, అధిక ప్రసంగములు చేయక" ఆ పలుకులు విని పిల్ల తల్లిదండ్రులు మధ్యవర్తులు వాని బేలతనమునకు ముసిముసి నవ్వులు నవ్వుచుందురు. ఒకనాడు తల్లి గణపతి కన్నము పెట్టుచు వివాహ ప్రసంగమురాఁగా కోపముగా

నిట్లనియె "నాయనా! మన పల్లయ్యమామ భార్యకు నెలతప్పినదట. ఆ మాట విన్నప్పటినుండియు నాకెంతో సంతోషముగా నున్నది." "అయితే మనకేమి లాభమే?" యని యతఁడు బదులుచెప్పెను. "దాని కడుపున ఆడపిల్ల పుట్టినట్లయితే వాడుకూడ నీకు మేనమామే గనుక ఆపిల్లను నీకియ్యగూడదా? యని నాయాశ!" యని యామె బదులుచెప్పెను. ఆ మాట వినఁబడఁగానె గణపతి మిక్కిలి కోపించి "ఓసి భ్రష్ట కారిముండా! అంత చిన్నముండను నేను పెండ్లి చేసుకుంటాననటే? అది యెన్నడెదుగును? ఎన్నడు కాపురమునకు వచ్చును? ఈ లాటి వెధవమాట లాడకు!" మని యెడమ చేతితో రెండు మొట్టికాయలు మొట్టెను. పాప మా ముసలియవ్వ యూ రెండు మొట్టికాయలతో నెంతో సేపు తల తడుముకొనుచు నేడ్చి "నీకిదేమి వినాశకాలమురా? నీ పెండ్లి పెటాకులు చేయవలెనని నేను మంచి యాలోచన చెప్పితే నీవు నన్ను కొట్టినావు? నీ పెళ్ళి మండిపోనూ, నా కెందుకు!" అని దూషణపూర్వకముగా విలపించుచుండ "ఓసి దొంగముండా! నన్ను తిట్టుచున్నావా!" యని చెంబులో నున్న నీళ్లామె నెత్తిమీద పోసి యన్నము విడిచిపెట్టి లేచిపోయెను. అది యైన మరి నాలుగు దినముల కొకనాటి రేయి గణపతి భోజనము చేయుచుండ మరల సింగమ్మ యిట్లనియె. "నాయనా! మన రామావధానుల కూతురకు సంబంధము దొరకలేదుట. తగిన వరుఁడు దొరికితే యివ్వవలె నని యున్నాడట! నీ వెవ్వరచేతనైనా పిల్లను నీకివ్వమని వర్తమాన మంపించరాదూ? నాయనా! నే బ్రతికియుండగా నొక యింటి వాఁడవైతే చూడ వలెనని యున్నది." అనుటయు గణపతి "వారెందుకు, వీరెందుకుకే? నీవే వెళ్ళి మా పిల్లవానికి మీపిల్ల నిమ్మని యడుగు. రామావధానులు మన సంబంధముకంటె యెక్కువ సంబంధము తేగలఁడా యేమిటి?"యని యుత్తరముచెప్పెను. అందు కామె వెండియు నిట్లనియె. "అది కాదు నాయనా! నేను వెళ్ళి యడిగి నా నంటే నీ కిల్లున్నదా? వాకిలియున్నదా? యని ప్రశ్నలు మొదలుపెట్టుదురు. ఆ ప్రశ్నలకు నేను జవాబు చెప్పలేను." తన యాస్తిసంగతి యెవఁడైన నెత్తినపక్షమున నతని కమితాగ్రహము వచ్చునని యిదివరకే వ్రాసియుంటిమి. తల్లి పలుకులు వినఁగానే నతఁ డతికోపము జెంది "శకునపక్షి ముండా! పెండ్లిమాటలకు వెళ్ళిరావే యంటే యిల్లున్నదా వాకిలియున్నదా యని వారడుగుతా రని లేనిపోని శంకలుపెట్టి పాడుమాట లాడుచున్నావు. బోడిముండా? నీ మూలముననే నాకు పెండ్లి కాలేదు. ఇల్లు వాకిళ్ళు పుట్టగానే లోకు లందరు పట్టుకువచ్చారా యేమిటి? నీవే నాకేమియు లేదని ముందుగా ప్రేలుచుంటే పిల్లనిచ్చేవా రనరా యేమిటి? పిశాచపు ముండా! కోడలు రానీ. నిన్ను వీథులోనికి కుక్క నీడిపించిన ట్లీడిపించక పోతానేమో చూతువుగాని?" యని కోపమాపుకొనలేక యా విస్తరి రెండుచేతులతో నెత్తి తల్లి నెత్తిమీఁదపెట్టి రుద్ది, వీపుమీఁద రెండు చరుపులు చరిచి లేచిపోయెను. "అయ్యో! నే నేమన్నానురా? నీ పెండ్లి పేలాలు వేగిపోను! నా జోలికి రాకురా, ఇఁకమీద నీ పెండ్లిమాట నేనెత్తనురా, బాబూ! యని తన తల యంటుపడెను. గావున నూతికడకు బోయి యామె స్నానము చేసెను. సింగమ్మకు మంచి పాటలు గాని పద్యములు గాని రావు. కాని అప్పుడప్పుడు యేవో కూని రాగములు తీయుచుండును. ఆమెకు రామదాసు చరిత్రము మిక్కిలి యిష్టము. అప్పుడప్పుడు బైరాగులు భిక్షాటనము నకు వచ్చి 'రామదాసు చరిత్రము బాడినపుడు చారెడు బియ్యము వారికి పెట్టి, రెండుమూడు కీర్తనలు వినుచుండును. ఆ కీర్తనలలో, 'యెందుకైనా యుంచినావు బందిఖానలో' నను నట్టి వామెకు మిక్కిలి యిష్టము. విద్యావిహీనులైన బైరాగులు శబ్దములు స్వచ్ఛముగ నుచ్చరింపలేక, 'వ్రెందుకైనా వుంచినావూ బ్రందిఖానలో' అని పాడుచుందురు. సింగమ్మ

వారిదగ్గర నా పాట నెర్చికొని వారివలెనె 'వ్రెందుకైనా వుంచినా' వని తప్పుగా పాడుకొనుచుండును. ఒకనాఁడామె తన ప్రాత నులకమంచము మీఁద వెన్నెలలో బండుకొని యా పాట పాడుకొనుచుండగా గణపతి వచ్చి, "ఓసి నీపాట తగలెయ్య! అదేమి పాటే? బ్రాహ్మణముండవు కావటే! పాడదలచుకుంటె ఎందుకైనా వుంచినావు బందిఖానాలో నని స్వచ్ఛముగ పాడు. లేదా నోరు మూసికొని యూరుకో" యనిపలికెను. 'నా పాటజోలి నీ కెందుకురా? నాకు వచ్చినట్లు పాడుకొనుచున్నాను. నీ కిష్టమైతే విను. లేకపోతే యావలకు లేచిపో!' యని యామె బదులు చెప్పెను. "అపస్వరములు పాడి పాట తగులపెట్టి నేను దిద్దితే పైగా నామీఁద కోపపడతావా? ఓసీ కోపిష్టిముండా! అపస్వరాల పాట యెప్పుడూ పాడవుగదా? పాడవుగదా?" యని నాలుగు చెంపకాయలు కొట్టెను. ఆమె కుమారుని మనసులో దూషించుచు, గోలు గోలున మనసులో నేడ్చెను. ఒకనాడు కొట్టినాడు గదా, మరల వానియొద్ద నిట్టి పాటలు పాడ గూడదని యామె యూరకుండదు. ఆడది, పెద్దది, విశేషించి తల్లి, యామె యెట్లు పాడుకొనిన మన కెందుకని గణపతి యూరకుండఁడు. ఈ విధముగ నామె పాడుచుండుట నామెకు బుత్రదండనము జరుగుచుండుట ప్రాయికమయ్యెను. శంకరుని కుమారుఁడైన గణపతి యొక్క పురాణము జనులు వినాయక చతుర్థినాడె విందురు గాని యా గణపతి పురాణమును ప్రతిదినము వినుచుండిరి. దినమున కొక క్రొత్తవింత బయలుదేరు చుండెను. రాత్రి భోజనము లైన తరువాత గ్రామవాసు లరుగుమీఁద గూర్చున్నపుడు ప్రాతఃకాలమున దంతధావనార్థము నలుగురు చెరువు గట్టు చేరినప్పుడు "యేమిటోయి గణపతి విశేషము?" లని యొండొరుల నడుగు చుందురు. ఎవరో కొన్ని క్రొత్త వింతలు చెప్పుచుందురు. అక్కడ చేరినవారందరు మితిమీఱ నవ్వి "మన యదృష్టముచేత గణపతి మన గ్రామమునున నివసించె" నని పలుకుచుందురు. వివాహము మాట తలపెట్టినపుడు, పాట పాడుకొన్నప్పుడు, కొడుకేదో వంకబెట్టి తన్ను కొట్టుచుండుటచేత సింగమ్మ కొడుకున కెవరైన చేతపడి చేసిరో లేక పిచ్చి యెత్తెనో యని యిరుగు పొరుగు కాంతలతో నాలోచింపఁ బోయెను. కొందరు దయ్యమనిరి, కొందరు పిచ్చియనిరి. గణపతి తల్లితోనే గాక తన వివాహముమాట యెత్తి తన కాస్తి లేదన్న వారందరితోను తగవులాడు చుండుటచే గ్రామవాసులలోఁ గొందరుకూడ యతనికిఁ బెండ్లి పిచ్చియెత్తినదని తలంచిరి. ఈతని వికృత చేష్టలు చూచి గడుసువాండ్రగు పాత విద్యార్థులు కొందరు గణపతిని తమ వినోదము నిమిత్త ముపయోగించుకొనవలెనని యాలోచించి తమలో తా మొక పన్నుగడ పన్నుకొని యొక నా డతనితో నిట్లనిరి. "పంతులుగారూ! మీకు వివాహము చేయవలెనని మాకందరకు గట్టిగా మనసులో నున్నది. కాని కొందరు గణపతిగారికి పిచ్చి యెత్తిన దనియు, మీరు తిన్నగా పల్లకీలో గూర్చుండ లేరనియు, మీకు బుద్ధినిలకడ లేదనియు మీమీద లేనిపోని వాడుకలు వైచినారు. ఆందుచేత మేమీ రాత్రి పల్లకీ భజంత్రీమేళము రెండుమూడు కాగడాలు తెప్పించెదము. మీరు పల్లకీలో కూర్చుండి, పెండ్లికొడుకు ఠీవి కనబరచవలెను. ఆలాగున మీరు చేసినపక్షమున మీరు వివాహమునకు దగిన వారే యని, మీకు వెఱ్ఱిలేదని గ్రామవాసులు నమ్మి, చందాలువేసి మీకు వివాహము జేయుదురు. మీరు మాకు చదువు చెప్పి మమ్మెంతో బాగుచేసినారు గనుక విశ్వాసముచేత మిమ్మొక యింటివారిని జేయవలెనని మా కందఱకు దోచినది. పల్లకిలో గూర్చుండుట మీ కిష్టమేనా?" పల్లకీపేరు చెప్పగానే గణపతి పరవశుఁడయ్యెను. వెనుక బుచ్చమ్మ పెండ్లి మిక్కిలి రహస్యముగ జరుగుటచే బహిరంగముగా బల్లకి యెక్కి యూరేగుట కతనికవకాశము లేకపోయెను. వివాహమైనప్పుడు తీరవలసిన

ముచ్చట వివాహము కానప్పుడు తిరుట తనకు శుభసూచక మని తప్పక యటమీఁద నిఁక వివాహ మగునని యతఁడు నిశ్చయించి యిట్లనియె. "ఒరే అబ్బాయిలారా ! నేను కష్టపడి చదువు చెప్పినందుకు మీ కున్నది విశ్వాసము. తక్కినవాళ్ళలో నొక్క ముండాకొడుకు కయిన నున్నదా? ఒక్కరికీ లేదు సుమా. ఈ కలియుగములో విశ్వాస ముంటుదిట్రా! ఒక్క లమ్డీకొడుక్కైన లేదురా విశ్వాసము! యెంతకష్టపడి చదువు చెప్పినానురా మీకు? నా మూలమునేనె గాదట్రా, మీరింతంతవా ళ్ళైనారు. మీ విశ్వాసమునకు నేను సంతోషించినానురా. మీ యాలోచన బాగున్నది. ముత్యాల కుచ్చులున్న పల్లకి తెప్పిచండి. బోయలు వోం వోం వోం వోమ్మని బాగా కేకలు వేయాలి. కాగడాలు రెండు చాలవు. నాలుగై దుండవలెను. డోలు వీరణము సన్నాయి తోనే కడతేర్చక రమడోలు మేళము తాషామర్పాలు బాకాల జోడు కూడ తెప్పించండి. చూడు, వొరే వెంకటప్పా! మీ బాబయ్య చుట్టుకునే యెఱ్ఱతలగుడ్డ జరీది, తీసికొనివచ్చి జరీపట్టీలు పైకి బాగా కనబడునట్లుగా చుట్టి నా తలమీఁద పెట్టండి. పట్టుకోటెక్కడైనా తెచ్చిపెట్టండి. జరీపంచి, జరీకండువా కావలెను. అవి యింకొకరు తీసికొనిరండి. లేకపొతే చాకలి సరివిగాడికి నాలుగు డబ్బులిచ్చి తీసుకొనిరండి. ఇవి తెచ్చి సింగారం చేసి యాపైని నన్ను చూడండి. పల్లకిలో మహారాజు కొడుకులాగ ఎంత ఠీవిగా యెంత దర్జాగా కూర్చుందునో, కాగడాల వెలుతురున నా మొగమెంత ధగ ధగ మెఱయునో, నేనేలాటి నవ్వులు నవ్వుదునో, యేలాటి చూపులు చూతునో, చూడండి తమాషా నేనేమి వెట్టి వెంకటాయ ననుకొన్నారా యేమిటి? ఇరివరకిన్ని పెళ్ళిళ్ళైనవి గాని యీ గ్రామములో పల్లకిలో యింత డాబుగా కూర్చున్న పెండ్లికొడుకు లేడురా, వీడు కడుపుకాలా! వీ డసాధ్యుడురా! యని లోకు లందరు చెప్పుకొనునట్లు కూర్చుండ గలనో లేదో చూడండి. వెళ్ళండి. మీ పనిమీద మీరుండండి!" అని బడి కాదినము సెలవిచ్చెను. విద్యార్థులు వాని కడ సెలవుగైకొని తిన్నగా చాకలిపేటకు బోయి యొక పల్లకి గుదిర్చి రాత్రి యెనిమిది గంటలకు రమ్మని చాకలి వాండ్రతో జెప్పిరి. తాషాజోడు రమడోలు మేళము గుదిర్చి తక్కిన భజంత్రీల నేర్పరచిరి. ఒక డెఱ్ఱజరీ తలగుడ్డ తెచ్చిపట్టీలు పైకుండునట్లు చుట్టి యతని తలపై బెట్టి యది సరిపోవునో లేదో యని నాలుగైదుసారులు చూచిరి. గణపతి పెద్ద యద్ద మొకటి తెప్పించుకొని తనమొగ మందులో చూచుకొని సంతోషించెను. నాలుగైదు పట్టుకోట్లు తెచ్చిరి. గని యవి యన్నియు వాని బొజ్జకు సరిపోవయ్యెను. ఎన్ని కోకలు చుట్టినను హనుమంతుని తోక మిగిలియున్నట్లే యెంతెంత పెద్దకోట్లు తెచ్చినను గణపది బొజ్జ మాత్రము మిగిలియే యుండెను. చిన్న పొణకతో యాముదపు సిద్దెకో కోటు తొడిగినట్లుండెను. కాని మనుష్యునకు తొడిగినట్లు లేదు. సరివిగాని దయవల్ల జరీపంచయు నుత్తరీయము లభించెను. ఆ పంచ గట్టుకొని యాకోటుమీద నా యుత్తరీయము వైచికొని తలపాగ దాల్చి పల్లకి యెప్పుడు వచ్చు నెప్పుడువచ్చు నని యూరేగింపు టుత్సవమున కుబలాట పడుచుండగా నొక విద్యార్థి "మొగమున గళ్యాణము బొట్టు, కన్నులకు గాటుక, కాళ్ళకు పసుపు పారాణి లేకపోయిన పక్షమున పెండ్లి కొడుకున కుండవలసిన లక్షణము లుండవు గనుక తప్పక నవి యన్నియు నుండవలె" నని చెప్పెను. అది గణపతికి సహేతుకముగాఁ దోచినందున బాదములకుఁ బారాణియు, నేత్రంబులకు గజ్జలంబును బెట్టుమని తల్లి నడిగెను. ఇంతమాత్రపు ముచ్చటయైన దాను బ్రతికియుండగా దన కన్నుల బడినదని సంతోషించి యతఁడు మరచిపోయిన బుగ్గచుక్క గూడ బెట్టెను. ఊరేగింపైన తరువాతే భోజనము జేయుదు నని గణపతి యా పూట భోజనమే చేయలేదు. గణపతి యా దినమున నూరేగునను వార్త పొక్కుటచే గ్రామవాసులంద ఱా యుత్సవము గన్నులార జూచి

యానందింపవలె నని తమ తమ పనులెల్ల పెందలకడ ముగించి దిపములు పెట్టినతోడనె భోజనములు చేసిరి. చిన్నపిల్లలు సైతము నిద్రపోవరైరి. మగవాండ్రందరు గణపతి యింటిముందర రాత్రి నాలుగు ఘడియల ప్రొద్దుపోవు నప్పటికి తీర్థప్రజలవలె జేరిరి. ఆడువాండ్రందరు గృహకృత్యములు పెందలకడ నిర్వర్తించుకొని యూరేగింపు చూచుటకు వీథులలో గూర్చుండిరి. రాత్రి జామగునప్పటికి యూరేగింపు ప్రారంభమయ్యెను. గణపతికి రెండు విచారములు మాత్రము పట్టుకొనియెను. భోగముమేళము లేకపోవుట యొకటి, బాణాసంచా లేకపోవుట యొకటి. ఆ విచారము పూర్వవిద్యార్థులకు తెలుపగా నిజమైన వివాహమున కా రెండు వెలితిలు బూర్తి చేయుదుమని చెప్పి గురువుగారికి దుఃఖోపశమనము చేసిరి. ఆ రాత్రి వానపల్లి గ్రామవాసులనుభవించిన యానంద మేమని వర్ణింతును? ఉత్సవములో నెంత తిరిగినను వారికి విసుగు జనింపలేదు. కాళ్ళు నొప్పులు పెట్టలేదు. ఆయాస మనిపించలేదు. ఎందుచేత ననగా మన గణపతి తనచేష్టలచేత, నాసనములచేత, చూపులచేత మఱి యితర చిహ్నములచేత, క్షణ క్షణము వారికి క్రొత్త యానందము గల్పించుచు వచ్చెను. ఒకమాఱు వెనుకనున్న బాలీసుకు జేరబడును. ఒక మాఱు పండుకొనును. ఒకసారి ముందఱికి వంగును. ఒకతూఱి బాసెనపట్టు వేసికొనును. ఒకపరి కాళ్ళు జాపుకొనును. ఒకసారి రెడ్డికము వైచికొనును. ఒకసారి కన్నులు మూసికొనును. ఒకసారి పెద్దగ్రుడ్లు చేయును. మఱియొకతూఱి యోరచూపులఁ జూచును. ఒకసారి చప్పట్లు వాయించి తానే గానము చేయును. కాగడాలు పల్లకికి దూరమైనప్పుడు కాగడాలు పట్టువారిని గట్టిగా తిట్టి దగ్గఱకు రమ్మనుచు, ఇంటింటి దగ్గఱ పల్లకి యాపించును. వారే కారణము చేతనైన నాగకపోయిన పక్షమున బిగ్గఱగ నఱచి యాపించును. ఒకసారి భజంత్రీలు సరిగా మేళము చేయకపోగా మేళము చేయింపు మని యతఁ డొకరిద్దరితో జెప్పెను. వారా మాట వినిపించికొన నందున గుభాలున తానే పల్లకిలో నుండి క్రింది కురికి భజంత్రీలను నాలుగు చెంపకాయలు కొట్టి మరల పల్లకి యెక్కెను. కూడనున్న జనులలో నవ్వని వారు లేరు. దేవతోత్సవములకు గాని జమ్మిసవారీకి గాని గురు స్వాములవారు వచ్చినప్పుడు కాని దేశోద్ధారకులైన మహానుభావులు వచ్చినప్పుడు గాని యంతజన మెన్నడును బయలు దేఱి యుండరు. తన స్నేహితుల యిండ్లముందఱికి బల్లకి వెళ్ళినప్పుడు గణపతి చేసన్న చేసి పిలిచి "ఓరీ! యుత్సవ మేలాగున్నది? నేను జమాయించి గూర్చున్నానా? పెండ్లి కొడుకులా గున్నానా?" యని యడుగుచుండును. "పెండ్లికొడుకు బాబులా గున్నావురా! నీలాటి పెండ్లికొడుకు లేడురా, లోకములో!" నని హాస్యాస్పదముగ వారు ప్రత్యుత్తర మీయ నతఁడు దానిభావము గ్రహింపలేక తనవంటి పెండ్లికొడుకులు లోకమున లేరని యానందించెను. తన యుత్సవ మగుటచేత గణపతి యా రాత్రి నిదురపోవలేదు. ఏమియు దోఁచనపుడు చుట్ట వెలిగించి యీ ప్రక్క నా ప్రక్కనున్న కాగడావాండ్ర మీఁదను స్నేహితులమీఁదను నుమియ జొచ్చెను. ఆ మహోత్సవ పారవశ్యమున వారా యవమానము సరకుగొనరైరి. ఆ సమయమున నతని తిట్లు దీవన లయ్యెను. ఉమ్ములు పుష్పవర్షము లయ్యెను. జాము తెల్లవారునప్పటికి ఉత్సవము సమాప్తమయ్యెను. గణపతి పల్లకి దిగి యింటిగుమ్మములో నడుగు పెట్టగానే సింగమ్మ గుప్పెడు మిరపకాయలు దిగదుడిచి, తన్నిమిత్త మారిపోకుండ జాగ్రత్తపెట్టిన పొయినిప్పులో పడవైచి, కుమారునకు దృష్టిదోష పరిహారము చేసెను. పల్లకి దిగి గణపతి పండుకొని మరునాడు పగలంతయు నిద్రపోయి సంధ్యాకాలమున మేల్కొని యపుడు దంతధావనము చేసి భుజించి, కడచిన రాత్రి జరిగిన యూరేగింపునుగూర్చి విద్యార్థులతో గొంత ప్రసంగించి మరల పండుకొని మరునాడు జాము

ప్రొద్దెక్కిన తరువాత లేచెను. అది మొదలుకొని పది దినములవరకు కనబడిన వారితో తన యూరేగింపు యుత్సవమునుగూర్చి మాటలాడుచు, బాగున్నదని యెల్లవారును బ్రశంసింప నమితానందమునొందుచు, తన్మయత్వము చెంది సుఖించుచుండెను. కాని తల్లి కుమారుఁడు భోజనము చేయునప్పుడు వాని వివాహ ప్రసంగము తలపెట్టుట మానలేదు. ఏదో తప్పుపట్టి గణపతి యామెను మొట్టుట కొట్టుట మానలేదు. ఆ బాధ పడలేక యామె యిరుగు పొరుగు నున్న మగవాండ్రతో మొఱ్ఱ పెట్టుకొనగా వారు గణపతికి పిచ్చి పట్టినదనియుఁ దలమీఁద గత్తివాటులు వేయించి నిమ్మపండ్ల పులుసుతో రుద్ది, వందబిందెల నీళ్ళు పోసిన గాని యా పిచ్చి కుదుర దనిఁయుఁ జెప్పిరి. "బాధపడలేక పోవుచున్నాను, నాయనా! యాలాగే చేయుం" డని యామె బదులు చెప్పెను. మరునాఁ డుదయమున గణపతి నిద్ర మేల్కొనక మునుపే వాని పూర్వ విద్యార్థులు ఆ మెరియలవంటివాండ్రనమండ్రు వచ్చి తల్లితో మాటలాడి, గణపతి మేలుకొనువరకు నక్కడ కూర్చుండి యాతఁడు మేల్కొన్న పిదప "పంతులు గారూ! కాలువకు వెళ్ళి స్నానము చేయుదము, రండి!" యని యడిగిరి. సరేయని యతఁడు బయలుదేరెను. వారొక మంగలివానిని గూడవెంట దీసుకొని పోయిరి. అక్కడకు వెళ్ళిన తరువాత "పంతులు గారూ! మీరు పని చేయించుకొం" డని యందొకఁడు చెప్పెను, "తల మాయలేదు. నేను పనిచేయించుకొన" నని యత డుత్తరము చెప్పెను. అప్పుడిద్దరు శిష్యులు చెరియొక చేయి బట్టుకొనిరి. ఇద్దరు కాళ్ళు త్రొక్కిపెట్టి పట్టుకొని మంగలివానిని పనిచేయు మని జెప్పిరి. అంతట మంగలివాఁడు క్షురకర్మ నారంభించెను. గణపతి మంగలివానిని, విద్యార్థులను దిట్టుచు దక్షిణ దేశపు గాయకుడు త్రిప్పినట్టుఁ తల యిట్టట్టుఁ బలుమారు త్రిప్పెను. మంగలివాఁడు ప్రయత్న పూర్వకముగ నాటులు వేయకపోయినను గణపతి శిరము వేమారు త్రిప్పుటచే నాలుగైదు నాటులు పడెను. అంతలో మరి నలుగురు విద్యార్థులు నాలుగు బిందెలు తీసికొనివచ్చిరి. సింగమ్మకూడ వారితో వచ్చెను. ఆ వార్త గ్రామమున బ్రకాశిత మగుటచేత బనిపాటలు లేనివాండ్రు వినోదము చూచుటకై కాలవయొడ్డున జేరిరి. నిమ్మపళ్ళ పులుసుతో మంగలివానిచేత తల రుద్దించి విద్యార్థులు గురుభక్తి తత్పరులై వందలకొలఁది బిందెలనీరు వాని తలపై బోసి "యీ దెబ్బతో మీ పిచ్చి వదులునులెండి!" యనుచు నించుమించుగ సహస్ర ఘటాభిషేకమూ జేసిరి. నడమ నడుమ సింగమ్మ "నాయనా! పిచ్చి పూర్తిగ వదిలినదాక నీళ్ళు పోయండి!" యని వారిని హెచ్చరించుచు వచ్చెను. " నాకు పిచ్చి లేదురోయి! వదలండిరోయి!" యని గణపతి కేకలు వేయజొచ్చెను, "అదే పిచ్చిమాట, నాయనా! పిచ్చి లేదన్నమాటే పిచ్చ" యని సింగమ్మ విద్యార్థులతో బలికెను. గణపతి, తల్లిని పూర్వవిద్యార్థులను యా మహోత్సవసందర్శనార్థ మరుదెంచిన గ్రామీణులను నోటికి వచ్చిన ట్లెల్ల దిట్టి, కాలుచేతులు స్వాధీనము గాకపోవుటచే గొందరం గఱచి, కొందఱం దలతో గ్రుమ్మి, గ్రామము నుండి యుత్సవము జూచుటకై కాలువవరకు నడచివచ్చిన వారి శ్రమ వృథాగాకుండ గావలసినంత వినోదము గలిగించెను. పూర్వవిద్యార్థు లట్లు తన్ను బాధించుచుండ దనకా పీడ దొలఁగింపు మని గణపతి తత్కాలపు విద్యార్థులతో వెన్నుముదిరిన వాండ్రను గొందరను బిలిచిచెప్పెను. కాని వారేమియుఁ చేయలేకపోయిరి. ఈ యభిషేకమైన తరువాత వారు గణపతిని మెల్లగా నిల్లుజేర్చిరి. ఈ పని తల్లియె చేయించిన దని యతఁడు తెలిసికొని, యామె తనకంటికి కనఁబడకూడదని చెప్పెను. అతఁడేదైన దుష్కార్యము చేయునేమో యని యామెను మహాదేవ శాసుల్త్రగారి యింటికి పంపిరి. గురువుగారికి శిష్యులే తమ తమ యిండ్లనుండి పూటకొక్కరుగ వంతులు వేసికొని యన్నము దెచ్చి పెట్టుచుండిరి. తల్లి తనకు గావించిన

పరాభవము తాను తల్లికి గావింపవలె నని యతనికి దృఢసంకల్పము కలిగెను. కలుగుటయు దన కాప్తులైన పదుగురు విద్యార్థులను బిలిచి యొకనా డిట్లనియె. "ఓరీ! నా కొక్క పెద్దచిక్కు సంభవించినదిరా! మా తల్లి వట్టి పిచ్చిముండై పోయినది. దానిపిచ్చి కుదురుతేనే గాని నాకు సుఖము లేదు. చూడు తమాషా ! అని పిచ్చిముండై యెదురు నాకే పిచ్చియని లోకమున వెల్లడిచేసి యినపగుండ్లవంటి బండకుంకలను పదిమందిని పోగుచేసి కాలువరేవున నా బుఱ్ఱ గొరిగించి, నిమ్మపండ్ల పులుసుతో నా తల రుద్దించి, నీళ్ళు పోయించినది. ముందు దాని పిచ్చి మనము కుదుర్చవలెను. అది యిక్కడకు వచ్చుటలేదు. ఒరే! చిదంబరం నీవు వెళ్ళి మా యమ్మను సమాధాన పరచి కోపము దీర్చి మన యింటికి తీసికొనిరా, వచ్చిన తరువాత నాలుగురోజులు చూచి దాని పిచ్చి మనము కుదిర్చివేతుము" అని చెప్ప వెంటనే చిదంబరము తల్లికడకు బోయి సామవాక్యములతో నామె యలుక దీర్చి యింటికి దోడ్కొని వచ్చెను. నాలుగురోజులు జరిగిన తరువాత నొకనాడు తెల్లవారుజాముననే మంగలిని గణపతి పిలుచుకొని వచ్చి నిద్దుర లేవక మునుపే తల్లికి క్షౌరము చేయుమని చెప్పెను. మంగలి మొదట సందేహించెను. కాని "మా యమ్మ పిచ్చిది, మే మిప్పుడు ఆమెకు నీళ్ళు పోయవలెను. గనుక సందేహింపక పనిచేయరా!" యని యతఁడు హెచ్చరింప క్షురకుఁడు వపన మారంభించెను. కత్తి తలకు తగలగానే యామె మేలుకొని కన్నులు తెరచి చూచి 'నీ కిదేమి వినాశ కాలమురా ' యని మంగలిని దిట్టి వానిచేయి బట్టుకొన బోవుచుండగా నంతలో గణపతియు విద్యార్థులు డగ్గరి కాలుచేతులు నొక్కిపెట్టిరి. ఆ నడుమ మంగలి ముండనము సమాప్తము చేసెను. ఆమెయు నిట్టటు గింజుకొనుటచే రెండుమూడు గంటులుపడెను. తరువాత గణపతియు శిష్యులును గలిసి శవమును దీసికొనిపోయి నట్లామెను వీధిలో నున్న పెద్దనూతికడకు దీసికొని పోయి బిందెలతో నీళ్ళుతోడి పోసిరి. ఆమెయు దనకు బిచ్చి లేదని పలుమారులు మొఱ్ఱపెట్టుకొన్నను నవి యెల్ల పిచ్చిమాటలేయని గణపతి 'సరకు సేయక పోయండి నీళ్లు పోయండి ' యని మాతృఋణము దీర్చికొనెను. అంతటితో గణపతికి దల్లిపై నున్న యక్కసు తీరిపోయెను. నాటంగోలె సింగమ్మ తనయుని గృహమువిడిచి గ్రామమున వారింటను వీరింట నేవో పనిపాటలు చేయుచు గాలక్షేపము సేయజొచ్చెను. కొడుకు నలుగురను పోగుచేసి తనకు బిచ్చి యని నీళ్ళుపోయించునని తల్లియు, దల్లి పదుగురను బోగుచేసి తన కున్మాదమని చెప్పి కాలువకడ స్నానము చేయించునని కొడుకును నొండొరులకు భయపడ జొచ్చిరి. పిమ్మట మాతాపుత్రు లెన్నడు గలుసుకొనలేదు. మహాదేవశాస్త్రిగారి తల్లియు మరికొందరు బ్రాహ్మణ వితంతువులు రామేశ్వరయాత్ర వెళ్ళదలచి తమ కేవైన పనిపాటులు చేయుచుండునని సింగమ్మను వెంట రమ్మనిరి. ఆమె భోజనము గడచుటయే గాక యాత్రాఫలముగూడ దక్కునని వారి వెంట బయలుదేరెను. ఆమె తిరుపతి శ్రీరంగము మధుర రామేశ్వరము మొదలైన మహాక్షేత్రములు చూచి తిరిగి వచ్చునపుడు మార్గమధ్యమున శ్రీ కుంభకోణ క్షేత్రమునందు విషూచిజాడ్యముచే మృతినొందెను. ఆమె గోదావరీతీరమునందే మృతినొందవల నని మొదటి నుండియు దలంచెను. కాని భగవంతుడు కావేరీతీరమె యామె నిమిత్తము విధించి యుండెను. ఇప్పటివలె నా కాలమున రైలు బండి లేకపోవుటచే రామేశ్వరయాత్ర నేటివలె సులభముగాక మిక్కిలి కష్టసాధ్యమై యుండుటచే సింగమ్మ మరణవార్త గణపతికి తెలియనే లేదు. మహాదేవశాస్త్రుగారి తల్లి వచ్చి యావార్త చెప్పునప్పటికి గణపతి వానపల్లి విడిచిపోయెను. అందుచేత నతఁడు దల్లినిమిత్తము కన్నీరు గాని నువ్వులనీరు గాని విడువవలసిన యవసరము లేకపోయెను. బ్రతికియుండగా బెట్టిన

పిండమె గాని చచ్చిన తరువాత పిండము పెట్టనవసరము లెకపోయెను. మాతా పుత్రులు వియోగమైనది మొదలుకొని గణపతి కొంతకాలము విద్యార్థుల యిండ్లలో వారములు చేసికొనియు, గొన్నినాళ్ళు వంటచేసి కొనియు, బ్రాహ్మణార్థములకు బోయియు, సంతర్పణముల కరిగియు గాలక్షేపము సేయజొచ్చెను. గాని వివాహము కాలేదని గొప్ప విషాద మతని మనస్సును విడిచిపెట్టలేదు. అంతకు ముందు చేసిన ప్రయత్నమువలన శుల్కము గ్రహింపకుండ దనకు కన్యాదానము చేయువా రెవ్వరు లేరని యతఁడు తెలిసికొని కొన్ని వందల రూపాయ లోలి దానిచ్చి యైన వివాహ మాడవలయు నని నిశ్చయించుకొనెను. కాని ద్రవ్యము లేదు. అందునిమిత్తమై చందాలు సేయు మని గ్రామవాసులను బీడింపఁ జొచ్చెను. ఆ గ్రామవాసులనే గాక చుట్టుప్రక్కల నున్న గ్రామముల కరిగి తద్గ్రామీణులను గూడ యాచింపజొచ్చెను. యాచించి తెచ్చిన సొమ్ము తన దగ్గర నుంచుకొనక తనకు నమ్మకముగల యొక బ్రాహ్మణుని చేతికిచ్చి దాఁచెను. రమారమి నూటయేబది రూపాయలు ప్రోగుపడెను. ఏడెనిమిది వందల రూపాయ లుండినగాని యతనికి వివాహము కాదు. ఎట్లయిన నంతసొమ్ము ప్రోగుచేసి యతడు కృతకృత్యుఁడు కావలెనను యత్నము చేయజొచ్చెను.

ఇట్లుండ నొకనాఁడు మహాదేవశాస్త్రి వర్తమాన మంపి గణపతిని పిలిపించి తన యెదుట గడ్డము పెంచుకొని యున్న యొకానొక బ్రాహ్మణుని జూపి యిట్లనియె. "అబ్బాయీ గణపతీ! ఈ బ్రాహ్మణుఁడు నీకు పిల్ల నియ్యవలెనని వచ్చినాఁడు. ఈయన కాపుర మంతర్వేది. వీరింటిపేరు చింతావారు. ఈయన పేరు భైరవదీక్షితులుగారు. ఈయన స్వాధ్యాయమందు గొప్ప యధికారి. ఈయనయే కాదు, ఈయన తండ్రిగారు, తాతగారు గూడ నేనుబదిరెండు పన్నములు గట్టిగా వల్లించి ఘనాపాఠులైనారు. వారు నీ వంటి వానితో సంబంధము చేయుటే కష్టము. ఇలాటిది నీ పూర్వ పుణ్యముచేత నీకు వారితో సంబంధము గలుగుచున్నది. ఈయన వందలు వేలు పుచ్చుకునేవాఁడు కాఁడు. నలువది వరహాలు మాత్రము నీ విచ్చేపక్షమున పిల్ల నీ యధీనమగును. పిల్లను నేను చూచినాను. గజ్జెలగుఱ్ఱములా గున్నది. ఆరు మాసములలోనే కాపురమునకు రాఁ గలదు. కాఁబట్టి నీవా సొమ్మిచ్చి వీరి పిల్లను చేసికో. పైగా వారు తమ పిల్ల నిక్కడికి తీసికొనివచ్చి మీ యింట్లోనే వివాహము చేయుదురు. వారు పూర్వము గొప్ప సంసారులె కాని వారి పెద్దలు చేసిన క్రతులవల్ల దానధర్మములవల్ల సంసారము చితికిపోయినది. అందుచేత నలువది వరాల సొమ్ము నీదగ్గఱ పుచ్చుకొని మీ యింటికే వచ్చి పెండ్లిచేయవలసి వచ్చినది. కాని లేకపోతే వీథులు కట్టి విస్తళ్ళు వేసి సంతర్పణ చేసి కలియుగవైకుంఠముగ వారు వివాహము చేయగలవారె. సరే, ఆ మాటలెందుకు? ఇప్పుడు పెద్దమనుష్యుల నెవ్వరినైన తీసికొనిరా, తాంబూలములు పుచ్చుకుందము. 'ఏమండీ దీక్షితులుగారు! పిల్ల వానిని మీరు చూచుకొన్నారుగదా' మీ కిష్టమేనా?" అనవుడు సగము తెల్లవెంట్రుకలు సగము నల్ల వెంట్రుకలు గల తన గడ్డము చేతితో నొకసారి దువ్వు గోవింద! గోవింద! యని రెండుసారులు భగవన్నామస్మరణముచేసి దీక్షితు లిట్లనియె. "మా పరువు ప్రతిష్టలు మా తండ్రితాతలతోనే పోయినవి. నేనిప్పుడు మా పెద్దలపేరు చెప్పుకొనక జీవచ్ఛవమునై యున్నాను. మా యాడుపిల్ల లందరిని ఇది వరకు నేను కన్యాదానము చేసినాను. ఇది కడగొట్టు పిల్ల. దీనిని గూడ నొక యయ్య చేతిలో బెట్టి నా భార్యను దీసికొని నేను కాశీ వెళ్ళి యక్కడ నివాసము జేయఁదలఁచుకొన్నాను. ఆ యాత్ర బత్తెకర్చులకే యీ నలువది వరాలు పుచ్చుకొన్నాను. అంతేకాని పిల్ల నమ్ముకొని సుఖించుటకు కాదు. అమ్ముకో దలఁచుకొంటే నలువది వరాలు పుచ్చుకో వలసిన కర్మమేమి? ఏడువందలు పుచ్చుకో, ఎనిమిదివందలు

పుచ్చుకొ, వెయిరూపాయలు పుచ్చుకొ, యని నా యింటిచుట్టు కుక్కలవలె పెండ్లికొడుకులు తిరుగుచున్నారు. వారి కివ్వకపోయినానా? కుఱ్ఱవాఁడు సాంప్రదాయకుఁడు బుద్ధిమంతుడు నైన వానిని జూచి కాశీయాత్ర కెంత సొమ్ము కావలెనో యంతే సొమ్ము పుచ్చుకొని యిచ్చివేయవలె నని యేర్పాటు చేసికొన్నాను. ఈ పిల్లవాఁడు నా కన్ని విధముల నచ్చినాఁడు. కాఁబట్టి తాంబూలము లిప్పించండి. ఐదారు దినములలో నేను వెళ్ళి మా వాళ్లను దీసికొనివచ్చి యిక్కడే వివాహము చేయగలను."

వారిరువురి మాటలు గణపతి కమితానందము గలిగింప నతఁడు "మహాదేవశాస్త్రిగారూ! నే నిప్పుడే వెళ్ళి అచ్చంబొట్లుగారిని, పాపన్న సోమయాజులుగారిని దీసికొని వచ్చెద" నని లేచి వెళ్ళి పూర్వోదాహృతులగువారిని దీసికొని వెళ్ళెను. మహాదేవశాస్త్రి వారిద్దరిని గౌరవించి కూర్చుండబెట్టి, వారిని రావించిన పని తెలియజేసి, తాంబూలము లిప్పించి పంచాంగము చూచి, తాను ముహూర్తము నిర్ణయము చేసెను. భైరవ దీక్షితులుగారు సకుటుంబముగ వచ్చిన తరువాత వారి కియ్యవలసిన నలువది వరహాలు నియ్య నిర్ణయము. అనంతరము భైరవ దీక్షితులు స్వగ్రామమున కరిగి తన కుటుంబము దీసికొని వచ్చెను. కుటుంబముగా దాను భార్యయుఁ బెండ్లికూతురు, తక్కిన కూతుళ్లను జామాతలు వివాహమునకు పంపనందున తాము ముప్వురు మాత్రమే రావలసివచ్చిన దని యతఁడు గ్రామములో చెప్పెను. బ్రాహ్మణునకు వివాహకార్యము వచ్చినపుడు పీటల మీఁది పెండ్లి చెడగొట్టగూడదని గ్రామవాసు లదివర కిచ్చిన చందాగాక మరికొంత ద్రవ్యము సరకులు మొదలైనవి గణపతి కిచ్చిరి. ఒక వైశ్యుఁడు బియ్య మిచ్చెను. మరియొకఁడు నెయ్యి యిచ్చెను. ఒక పాత విద్యార్థి పల్లకి ఖర్చు పెట్టెను. ఒకఁడు భజంత్రీ కర్చు పెట్టెను. వివాహము రేపనగా గణపతి నలువది వరాలసొమ్ము భైరవశాస్త్రి చేతిలో బోసెను. గణపతి పక్షమున రావలసిన చుట్టము లెవ్వరు లేనందున మహాదేవశాస్త్రియే మేటిచుట్టమై మగపెండ్లివారి పక్షమున జేయవలసిన పని యంతయు జేసెను. సుముహూర్తమున గణపతికి యథావిధిగ వివాహ మయ్యెను. కన్నులార జూచి సంతోషించుటకు దల్లి సమయమునకు లేక రామేశ్వరము వెళ్ళినదని చూడవచ్చిన వారందరు విచారించిరి. పసుపులు నలుచుటకు, గౌరికల్యాణము పాటలు పాడుటకు, తగవులు నడపుటకు, మహాదేవశాస్త్రి భార్య మున్నగు పేరంటాండ్రు వచ్చి కార్యము కొనసాగించిరి. ఊరేగింపుటుత్సవ మిదివఱకే వర్ణింపఁబడినది గావున నిప్పుడు వేరుగ వర్ణింప నక్కఱలేదు. ఐదు దినములు సలక్షణముగ జరిగెను. అప్పగింతలు, దండాడింపులు మొదలయినవి జరిగెను. గణపతి మహానందభరితుఁ డయ్యెను. పిల్ల పూర్వజన్మమున నిప్పులు పూజచేసిన దని కొందఱు, జిల్లేడు పువ్వులు పూజించినదని కొందఱు, దాని కేమి యిది మహాలక్ష్మిలా గున్నదియని కొందరు, బలు తెఱంగుల భాషింపజొచ్చిరి. ఇట్లు వివాహానంతరమున నాలుగు దినములు గడిచిన తరువాత నొకడు ముప్పది సంవత్సరముల వయసు గల యొక పడుచు బ్రాహ్మణుఁడు పోలీసు కనిస్టేబు నొకరిని వెంటబెట్టుకొని గణపతి యింటికి వచ్చి 'అతడే ముద్దాయి ' యని భైరవ దీక్షితులును జూపెను. కనిస్టేబులు భైరవదీక్షితులును బట్టుకొని "అయ్యో! నిన్నెఱుస్టు చేసినా" నని చెప్పెను. పోలీసువారు పల్లెటూరు వచ్చినప్పుడు వానివెంట పదుగురుబడి యతఁడు చేయదలఁచిన కార్యము చూడబోదురు. అందుచేత నదివరకు కొందరు జనులక్కడ మూగిరి. వారిని జూచి మరి కొందరు జేరిరి. "నన్నెందులకు పట్టుకున్నా" రని దీక్షితులు రాజభటు నడిగెను. భటుఁడేమో చెప్పబోవుచుండగా వాని నూరకుండుమని నతినితోవచ్చిన పడుచు బ్రాహ్మణు డిట్లనియె. "అతడు కాదు నేను చెప్పుచున్నాను, విను.

అయ్యా! పెద్దమనుష్యులు మిరందరుఁ గూడ చిత్తగించండి. ఈయన బ్రాహ్మణుఁడండి. కాపుర మేయూరో తెలియదు. ఇప్పుడు పెండ్లియైన యీ పిల్ల తన కుమార్తె యని చెప్పి నా దగ్గర యైఁదువందల రూపాయలు పుచ్చుకొని యంతర్వేదిలో శ్రీనృసింహస్వామివారి యాలయములో ఆ పిల్లను నాకిచ్చి పెండ్లి చేసినాఁడు. వివాహమై యేడాది కాలేదు. ఇప్పుడా పిల్లనే తిరిగి యీ పిల్లవానికి వివాహము చేసినాడు. అంతేకా దీయన ప్రభావము వినండి. ఈ పిల్ల యీయన కూతురుగాదు. ఆవిడ యీయన భార్య కాదు. ఆవిడ సాతానిది. ఆమెది వెంకటేశ్వర్లువారి వాడపల్లె కాపురము. సాతాని తిరువెంగళయ్య భార్య, ఈవిడ పేరు నాంచారమ్మ. ఈ దుర్మార్గు డామెను పుత్రికాసహితముగా లేవదీసుకొని వచ్చి యిది తనభార్య యని, యాపిల్ల తన కూతుఁరని చెప్పి మొదట నన్ను మోసపుచ్చి పిమ్మట మిమ్ములను వంచించినాఁడు. అందుచేత నితనిమీఁదను నితని క్రొత్తయల్లుని మీఁదను నేను డెప్యూటీ తహసీలుదారుగారివద్ద క్రొత్తపేటలో ఛార్జీ యిచ్చినాను. క్రొత్తయల్లునికి మామకు వారంటు తెచ్చినాను." వారంటను శబ్దము వినగానే గణపతి దొడ్డిదారిని నెక్కడికో పాఱిపోయెను. నాటికి నేటికి మరల కనఁబడలేదు. భైరవదీక్షితులున కాఱుమాసములు కారాగృహశిక్ష విధింపఁబడెను. తిరువెంగళయ్య తన భార్యను బిడ్డను దీసికొనిపోయెను. శూద్రసంపర్క దోషమునకై వానపల్లి గ్రామవాసులు ప్రాయశ్చిత్తములు చేయించుకొనిరి. చదువరులారా! మీ యదృష్ట మంతవరకె యున్నది. తన కథ యింతవరకు మాత్రమె చెప్పి యదృశ్యుఁడయ్యెను. అతఁడు మరల నగుపడి యనంతర చరిత్రము చెప్పిన పక్షమున నది గూడ నిట్లె లిఖించి మీ కానందము గలిగించెదను. ప్రస్తుత మింతటితో దనివినొందుఁడు. అతడు కనబడక పోయిన పక్షమున నంతకంటె నొక యక్షరమైన లేదని నమ్ముఁడు.

సమాప్తము.

 Author

## చిలకమర్తి లక్ష్మీనరసింహం

(సెప్టెంబరు 26, 1867 – జూన్ 17, 1946)

చిలకమర్తి లక్ష్మీనరసింహం కవి, రచయిత, నాటక కర్త, పాత్రికేయుడు, సంఘ సంస్కరణవాది, విద్యావేత్త. 19వ శతాబ్దం చివర, 20వ శతాబ్దం ఆరంభ కాలంలో తెలుగు సాహిత్యం అభివృద్ధికి, తెలుగు నాట ఆధునిక భావాల వికాసానికి పట్టుకొమ్మలైన వారిలో చిలకమర్తి ఒకడు. మహాకవి, కళాప్రపూర్ణ ఈయన బిరుదులు. ఇరవైరెండేళ్ళ వయస్సప్పుడు ఆయన రచించిన గయోపాఖ్యానం అనే నాటకం ప్రతులు లక్షకి పైబడి అమ్ముడుపోవటమనేది తెలుగు సాహిత్య చరిత్రలో అరుదైన విషయం.

లక్ష్మీనరసింహం 1867 సెప్టెంబర్ 26 న పశ్చిమ గోదావరి జిల్లా, పెరవలి మండలములోని ఖండవల్లి గ్రామములో ఒక బ్రాహ్మణ కుటుంబములో వెంకయ్య, రత్నమ్మ దంపతులకు జన్మించాడు.

ఆయన ప్రాథమిక విద్య వీరవాసరం, నరసాపురం పట్టణాలలో సాగింది. 1889లో రాజమండ్రి హైస్కూలులో పట్టం చేత పట్టుకొన్నాడు. 1889 లో రాజమండ్రి ఆర్య పాఠశాలలో తెలుగు ఉపాధ్యాయునిగా చేరాడు. తరువాత ఇన్నీసు పేట స్కూలులోనూ, మునిసిపల్ హైస్కూలులోనూ విద్యాబోధన సాగించాడు. తరువాత ఒక సంవత్సరం సరస్వతి పత్రిక సంపాదకునిగా పనిచేశాడు. ఆపై ఉద్యోగం విరమించి 1899లో హిందూ లోయర్ సెకండరీ స్కూల్ స్థాపించి 9 సంవత్సరాలు నడిపాడు. తరువాత ఈ పాఠశాల వీరేశలింగం ఉన్నత పాఠశాల గా మార్చబడింది.

30వ ఏటనుండి రేచీకటి వ్యాధికి గురైనా ఆయన శ్రమించి తన కంటిచూపుకున్న అవరోధాన్ని అతిక్రమించి రచనలు కొనసాగించాడు. ఆయన రచనలు 10 సంపుటాలుగా ప్రచురింపబడ్డాయి. 1943లో ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆయనను కళాప్రపూర్ణ పురస్కారంతో సత్కరించింది.

పాఠశాలలో ఉన్నపుడే పద్యాలు వ్రాయడం ప్రారంభించిన లక్ష్మీ నరసింహం ఎన్నో రచనలు చేశాడు. కీచక వధ ఆయన మొదటి నాటకం. తరువాత ద్రౌపదీ పరిణయం, గయోపాఖ్యానం, శ్రీరామ జననం, సీతా కళ్యాణం, పారిజాతాపహరణం వంటి నాటికలు రచించాడు. గయోపాఖ్యానం నాటకంలో టంగుటూరి ప్రకాశం పంతులు అర్జునుడి వేషం వేసేవాడు. ఆయన వ్రాసిన నవలలలో రామచంద్ర విజయం, హేమలత, అహల్యాబాయి, సుధా శరచ్చంద్రము ముఖ్యమైనవి. సరస్వతి పత్రిక సంపాదకునిగా ఉన్నపుడు సౌందర్య తిలక, పార్వతీ పరిణయం వ్రాశాడు. ఇంకా అనేక రచనలు చేశాడు.

1908లో ఒక ప్రెస్ స్థాపించాడు. 1916 లో మనోరమ, పత్రిక అనే పత్రిక స్థాపించాడు. దీని ద్వారా గణపతి, రాజరత్నము, రఘుకుల చరిత్ర (కాళిదాసు రచన రఘువంశానికి అనువాదం), సిద్ధార్థ చరిత్ర వంటివి ప్రచురించాడు.

21 అధ్యాయాల్లో రాసిన స్వీయ చరిత్రములో, ఆయన జీవిత కృషి మొత్తం వివరించబడింది. బాల్యం, నర్సాపురంలో చదువు, రాజమండ్రిలో విద్యాభ్యాసం, ఉద్యోగం. గ్రంథంరచన, నాటకసమాజం, వివాహం, మండలసభల్లో పాల్గొనడం, రామమోహన పాఠశాల ఏర్పాటు, నిర్వహణ, ఉన్నతపాఠశాల ప్రారంభం, కుటుంబ సమస్యలు, కష్టాలు, టంగుటూరి ప్రకాశం ఇంగ్లండ్ యాత్ర, హితకారిణి సమాజస్థాపన, అచ్చు యంత్రాన్ని నెలకొల్పడం, భారత జాతీయ కాంగ్రెస్ సభకు హాజరవడం, పత్రికాసంపాదకత్వం, నిర్వహణ – యివన్నీ సవివరంగా రాశాడు. చిలకమర్తి ఏకసంధాగ్రాహి మాత్రమే కాదు, అద్భుతమైన జ్ఞాపకశక్తి కలిగి, స్వీయచరిత్రలో, తన జీవితకాలంలో జరిగిన ఘటనలను, సూక్ష్మాంశాలతో సహా చిత్రించాడు. చారిత్రక ఘటనలను సమతూకంతోనూ, వ్యక్తుల గూర్చి రాస్తున్నప్పుడు రాగద్వేషాల కతీతంగా, స్పష్టంగా, క్లుప్తంగా రాశాడు. నిత్యనైమిత్తకాల గూర్చి రాస్తున్నా, వాటినొక అంతర్దృష్టితో పరికించాడు.

లక్ష్మీ నరసింహం మొదటి తరం సంఘ సంస్కర్త. 1909 లో సామాజికంగా వెనుకబడిన వర్గాలకోసం ఒక పాఠశాల (రామమోహన పాఠశాల) స్థాపించారు. నిమ్నజాతుల వారి గురించి ప్రత్యేకంగా ఒక పాఠశాలను స్థాపించిన ఘనత ఆంధ్రదేశంలో చిలకమర్తి వారికి దక్కుతుంది. ఎందుకంటే అంతకు మునుపు ప్రభుత్వంచే నడుపబడుతున్న ఒకటి రెండు పాఠశాలలు తప్ప దళితుల కోసం ప్రత్యేకమైన పాఠశాలలను ఎవరూ స్థాపించలేదు. కేవలం తన పుస్తకాలనుండి వచ్చిన రాబడితోనే, తన స్వంత ధనంతో ఆ రామమోహన పాఠశాలను 13 సంవత్సరాలు నడిపి హైయ్యర్ ఎలిమెంటరీ స్కూల్ గా చేసారు. అంధుడైనప్పటికి చిలకమర్తి వారి దళిత జనులకు చేసిన సేవలను అప్పటి మద్రాస్ గవర్నర్ లార్డ్ పెంట్ లాండ్ ఎంతగానో ప్రశంసించారు. బ్రహ్మసమాజం, హితకారిణీ సమాజం వంటి సంస్కరణ దృక్పథం గల సంఘాల కార్యకలాపాలలో పాలు పంచుకొన్నారు. దేశమాత అనే వారపత్రిక ద్వారా బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా వ్యాసాలు వ్రాశారు.

చిలకమర్తి లక్ష్మీనరసింహం రచించిన గణపతి నవల బహుళ ప్రచారం పొందింది. ఆకాశవాణిలో శ్రవ్యనాటికగా పలుమార్లు ప్రసారమైంది. చిలకమర్తి ఆశువుగా చెప్పిన భరతఖండంబు చక్కని పాడియావు పద్యం స్వాతంత్ర్య సమరంలో ప్రముఖ స్థానం పొందింది. గయోపాఖ్యానం నాటకం ప్రతులు లక్షకు పైగా అమ్ముడుపోయి ఆంధ్రదేశంలో అసంఖ్యాకమైన ప్రదర్శనలు పొందింది. ఆత్మకథలోని పలుభాగాలు విద్యార్థులకు తెలుగువాచకంలో పాఠంగా నిర్దేశించారు.

---